# నాడు - నేడు

( అడయాంకో )

అనువాదకుడు:

—రామమోహన్.

విశ్వసాహిత్యమాల,

# యా లుబ్ లూ.

(ఎ. అడయంకో)

ఐ లవ్.

(ఆంథొనీ విగ్లీస్.)

నాడు-నేడు.

-(రామమోహన్.)

శ్రీనివాస ముద్రాలయము, రాజమండ్రి.

వెల ౧-౪-౦.

## మా రెండు మాటలూ.

జూలైనెలతో మాగ్రంథమాలకి మూడేళ్ళు నిండేయి. నాలుగో సంవత్సరపు మొదటికానుకగా అడయంకో వ్రాసిన సుప్రసిద్ధమైన ఈవవ్లని పాఠకుల చేతుల బెడుతున్నాము.

మాయీ క్రొత్తపుస్తకమే మాగ్రంథమాల అవలంబిస్తూన్న నూతనమార్గానికి సూచనగా పాఠకులు గ్రహించియుంటారు. ఇదివరకు విశ్వసాహిత్యమాల సిద్ధాంతగ్రంథాల్నే ఎక్కువగాప్రచురించింది. అందుచేతనే మేము ఎంతప్రయత్నించినా వాటిని జనసామాన్యంయొక్క పరిస్థితులకి అనుగుణంగా తయారుచేయలేకపోయేం.

ఒనాడు క్రొత్తగా సోషలిస్టుసిద్ధాంతాలయెడల అభిమానం చూపుతూన్న— ఇంగ్లీషురాని— ప్రచారకమిత్రులకి సిద్ధాంతవిషయాలుగల పుస్తకాలు స్వభాషలో అందించాలనే ఊహించేము. అంతవరకు మాప్రయత్నం సఫలమేఅయింది. కొన్ని పుస్తకాలు ప్రచారకమిత్రుల ఉపయోగంకి ఈయగలిగేము.

కాని, నేడు రాజకీయవాతావరణం రెండేళ్ళక్రితంకంటె సంపూర్ణంగా మారిపోయింది. ప్రజలలో వ్యాపించియున్న దారిద్ర్యమూ—అసంతృప్తి; ప్రభుత్వమూ—జమీందారులూ అవలంబిస్తూన్న నిరంకుశత్వమూ—దౌర్జన్యవిధానము; కాంగ్రెసుయొక్క ప్రచారము; కాంగ్రెసుమంత్రివర్గాలపరిపాలనము; ప్రజలలో నూతనచైతన్యాన్ని కలిగించేయి. తెలిసో—తెలియకో ప్రజోద్యమం రోజురోజుకీ సోషలిస్టుకార్యక్రమాన్ని స్వీకరిస్తూంది.

ఇటువంటి మహత్తరసమయంలో- ప్రజాసామాన్యం శోష లిస్టుదృక్పథాన్ని తెలుసుకుందుకు ప్రయత్నిస్తూన్న సమయంలో- విశ్వసాహిత్యమాల ప్రచారకులతోటే సంతృప్తిపడడం ఇచ్ఛయిం చదు. ప్రజాసామాన్యంయొక్క హృదయాలని సోషలిజంవైపుకి ఎక్కువగా ఆకర్షించగల నవలలు-నాటకాలు- కథలు మొదల యిన వినోదవాఙ్మయాన్ని ప్రచురించదలచేము. ఆప్రయత్నాలలో మొదటిది ఇది.

ఈక్రొత్తకానుకతో నేడు మేము పాఠకులయెదుటనిలబడ్డాము. ప్రజాసామాన్యానికి చాలా సమీపంలో-అందుబాటులో వుంచేటందుకై మాగ్రంథమాల పుస్తకాలను చాలాస్వల్పధరలలో అందించు తూన్నాము. దానికి ప్రత్యక్షోదాహరణం ఈమా నవలే. ఆంధ్రమహా జనులు మా యీ వుద్యమాన్ని పూర్వంకంటె అధికంగా ఆదరించి ప్రోత్సహించప్రార్థన.

'38. జూలై. 31. సంపాదకుడు.

ముంగండ.

ఒకటో

## ప్రకరణం ౧.

మోచేతులమీద ఆనుకొని 'నికనేర్' సగం వరకూ లేచి తల ఎత్తి చూసేడు. బిరుసు గడ్డంలోంచి వేళ్లు పోనిస్తూ ఒక్క నిముషం శ్రద్ధగా ఆలకించేడు. ఏమి విన్నాడో అదిరిపాటుతో కప్పుకొన్న కంబళీ తన్నిపారేసి, కొయ్యమంచంమీదనుంచి ఉరికి, దూరంగా సావిట్లో ఒకమూల కూర్చుండి కాలికి జోళ్ళు కట్టుకుంటూన్న గూని—'పిట్మన్' దగ్గిరికి పరుగెత్తుకు వెళ్ళి, భుజాలు పట్టుకొని కుదిపి గుంజేడు.

"ఫ్యాక్టరీ చాలాసేపటినుంచి కూస్తూందా ఏమిటి ?"

గూనివాడికి ఇంకా నిద్రమత్తు వదలలేదు. బద్ధకంతో, బరువెక్కిన కనురెప్పలు అతికష్టంమీద ఎత్తి చూసేడు.

"అబ్బే! ఇప్పుడిప్పుడే మొదలుపెట్టింది."

నికనేర్ ప్రాణం కుదుటపడింది. సావిట్లో నొక మూలగా వున్న నీటితొట్టె దగ్గిరికి నెమ్మదిగా నడిచిపోయి ఆ చల్లటినీళ్లు దోసిలితో గడ్డంమీద, కళ్ళమీదా కొట్టుకొన్నాడు 'బ్లౌజు'

కొంగుతో మొగం తడి ఒత్తుకొని, గబగబా కాళ్ళకి జోళ్ళు వేసు కొని, బారక్సులో ఒకమూల వ్రేళ్లాడగట్టిన, నల్లని 'పొగచూరిన' దేవతా విగ్రహంకేసి హడావిడిగా నడిచేడు.

ప్రార్ధన పూర్తి కాగానే నికనేరు చిలకకొయ్యనున్న కాన్వాసు కోటు తొడుక్కొని దానిమీద జందెపుపట్టుగా పనిముట్లసంచీ వేసుకున్నాడు. సంచీలో నున్న నీటిడబ్బాలో నీరు 'డబుకు-డబుకు' మని ధ్వనిచేస్తూంది. పనిముట్లు డబ్బాకి తగిలి 'ఝణ-ఝణ' లాడుతూన్నాయి. మంచంమీద పరచిన చాపక్రిందనుంచి గండ్రి గొడ్డలి తీసి, అరగతీయడంచేత మెరుగెక్కినవాయ నులివెచ్చని అరచేతిలో తుడుచుకొన్నాడు.

బారక్సులో జనం ఇంకా అప్పుడప్పుడే లే స్తూ న్నా రు. దొ ర్లు తూ న్న మ ను ష్యు ల క ద లి క కి కొ య్య మంచాలు 'కిరకిర' లాడడం అప్పుడూ అప్పుడూ వినిపిస్తూంది. ఒకడు ఒళ్లు విరుచుకుంటూ ఆవులిస్తూన్నాడు. రాత్రివేళ తనబూట్లు ఎవరో ఎత్తుకుపోయేరని ఒకడు మూలుగుతూన్నాడు. ఇంకా ఫ్యాక్టరీగొట్టం 'కుంయ్' మ ం టూ నే వుంది. అప్పటి కప్పుడే నికనేర్ పనిలోకి పోవడానికి తయారయ్యేడు. చాపచుట్టక్రింద పాత గుడ్డపేలికలలో చుట్టపెట్టిన రొట్టె విప్పి ఒక్క నిముషం ఆలో చించి దానిని రెండు ముక్కలు చేసేడు. ఒకటి సంచీలో వేసు కొని, రెండోదానిని మళ్ళీ ఆ గుడ్డలలోనే చుట్టపెట్టి ఆ చాప క్రిందకే తోసేడు. ద్వారం కేసి నాలుగడుగులు వేసి, ఏమి

తోచిందో మళ్ళీ మనసు మార్చుకున్నాడు. వెనక్కి తిరిగి వచ్చి చాపకింద మూట మళ్ళీ పైకితీసేడు. మూటలోంచి రెండో ముక్కకూడా తీసి సంచీలో పడేసుకున్నాడు.

"దీన్నికూడా ఎత్తుకుపోతారేమో వీళ్ళని తగిలెయ్య."

భుజంమీది పనిముట్లసంచీ సర్దుకుంటూ రొట్టెలోంచి విరిచి చేతపట్టుకొన్న రెండు చిన్న ముక్కలు నోట్లో వేసుకున్నాడు. వెనక్కి తిరిగి కొడుకు పడుక్కునే మంచంకేసి చూసేడు. కాని, అది అంతకు ముందే ఖాళీగా వుంది. అప్రయత్నంగా నికనేర్ చేయి గడ్డంమీదికి పోయింది.

"ఇంకా మూతి ఆగనేనాలేదే అప్పుడే పనిలోకి పోయేడు! దిట్టమైనవాడు. పాపం కష్టపడుతూన్నాడు."

నికనేర్ మనసులోనే గర్వం–జాలీ పడ్డాడు. ఇంక అక్కడ ఒక్క నిముషం ఆగలేదు. గండ్రిగొడ్డలి ఊపుకుంటూ నాలుగడుగుల్లో బొగ్గుగని చేరేడు. దారిలో అడ్డంవారిన స్నేహితులకి నమస్కారాలు విసురుతూ ఎక్కడా ఒక్క అడుగు కూడా ఆగకుండా సరాసరి నడిచిపోయేడు. అందరికన్నా ముందుగా గనిలోకి దిగాలని ఆతని హడావిడి.

డ్యూటీమీదనున్న ఉద్యోగస్థుడు సంజ్ఞ చేయగానే గనిలోకి మనుష్యులను దింపేబోనుకి తగిలించిన గొలుసులు గంగలలాడేయి. తనకంటె ముందుగా ఎవ్వరూ బోనులో అడుగుపెట్టడానికి వీలు లేకుండా సన్నగానున్న దాని ద్వారానికి రెండుచేతులూ అడ్డం

పెట్టేడు. లోపలికి వెళ్లేక అందరికంటె ముందుగా దిగిపోయే టందుకు వీలుగావుండే మూలకి చేరినిల్చున్నాడు.

తప్పుకూలీ 'కోవల్' వేళాకోళంగా స్నేహితులకి కన్నుగీటి నికనేర్ దగ్గిరికి చేరేడు.

"మప్పు మినహాయించి ఇక్కడ పనిచేసేవాళ్లు లేనే లేరేమోనేః కాని, తాతాః ఈః సంపాదనంతా తినడానికి ఎవళ్ళేనా వున్నారాః"

. అసహ్యం, అసూయ, క్రోధం ఉట్టిపడే ఆ ప్రశ్నకి నికనేరు సమాధానం ఈయలేదు. దట్టమైన కనుబొమ్మలు రెండూ ముడేసి గొడ్డలికామతో బోను అడుగు తాటించేడు. ఎత్తు చాలకపోవడం చేత బోనులో అతడు బాగా వంగి నిల్చున్నాడు. కటకటాలలోంచి వేవేగంగా పైకి జరిగిపోతూన్న గని గోడలకి అమర్చిన టేకుబల్లల కూర్పు కేసి పరకాయించి చూస్తూ మేస్త్రీ ఆరోజున తనని ఏ ప్రాంతంలో పని చేయమని పంపుతాడా యని తెగ ఆలోచిస్తూ న్నాడు.

"కొంచెం సుతిమెత్తని చోటు చూపిస్తే ఇరపై ట్రక్కులేనా తీయొచ్చు."

బోను దిగజారిన కొలదీ గనిగోడలు అతివేగంగా జరిగి అదృశ్యం అయిపోతున్నాయి. గోడలకి అమర్చిన టేకుచెక్కలు చెమర్చి జిలజిలలాడుతూన్నాయి. నీటిలో ఊరి ఊరి వున్న కర్రల నుంచీ-ఎప్పుడూ తడిఆరని చెమ్మనేలనుంచీ బయలుదేరిన వాన

నతో ఆ ప్రదేశం అంతా నిండి వుంది. నేలని సమీపిస్తూన్నాం అనగానే నికనేరు తానున్న చోటునుంచి ముందుకు జరిగేడు. విశాల మైన అతని వెనుపట్టె ఆ సన్నని ద్వారాన్ని మూసేసింది. బోను ఇంకా నేలమీద ఆననేలేదు. అతడప్పుడే ఉరికివేసేడు. నీటిజాలుకి పాకుడుగట్టి జారుడు జారుడుగావున్న చిప్తా చేసిన బాటమీదుగా మేస్త్రీ ఆఫీసుకేసి. గబగబా పరుగెత్తేడు.

మేస్త్రీ ఆజ్ఞలు వినడానికి కూడా అతడు నిలబడలేదు. నడుస్తూనే ఆ మాటలు చెవిని వేసుకొని, తనకు నియమించిన ప్రదేశానికి అడ్డుదారిని బయలుదేరేడు. ఒంగుని, పాకుతూ, పరుగెత్తుతూ, ఉరుకుతూ, పడుతూ, లేస్తూ, ఎంతో బాధపడుతూ పోవడానికైనా అతడు ఒప్పుకున్నాడు. కాని, పరిశుభ్రంగావున్న చుట్టుదారిని నడిచివెళ్ళి అమూల్యమైన తనకాలాన్ని ఒక్కనిముషం వ్యర్థం చేయడానికి అతడు యిష్టపడలేదు.



ఒక ఏడాదిక్రితంనుంచీ ఎప్పుడెప్పుడని కనిపెట్టుకుని ఎదురు చూస్తూన్న శుభసమయం నిన్నసాయంకాలం తటస్థపడింది, ఓస్టపుకి. పనిలోంచి ఇంటికి వచ్చేటప్పుడు ఆఫీసుషరాబును కలుసుకున్నాడు. ముగ్గుబుట్టలా నెరసిన జుట్టూ అతడూ— షరాబు తన దళసరికళ్ళజోడుమీదనుంచి ఓస్టపు మొగంకేసి పరకాయించిచూసి, అతనికి రావలసిన జీతం చేతిలోపెట్టేడు. జీతపురాళ్ళు చేతిలో పడగానే ఓస్టపు ఒకమూల ఏదోపని చేసుకుంటూన్న 'కొంగమెడ'

మేత్రీ—బ్యుటికోకిన్ - దగ్గిరికి నెమ్మదిగా చేరేడు. ఒకనిముషం అమాటా—ఈమాటా చెప్పి—"చూడు! మికోలా! చిన్నతనంలో స్నేహితు లెంతపుంది వుంటే అంత ఆనందంసుమీ! ఈవేళ కాస్త ఆలా అటూ—ఇటూ తిరిగివద్దాం వస్తావా?"...

అని తన పనికి ఉపక్రమించేడు. ఓస్టపుఇచ్చిన ఈ అమాయిక మైన ఆహ్వానానికి మేత్రీ తిరగబడిచూసేడు. కొంగమెడలాంటి పొడుగుపాటిమెడని కాస్త జంకించేడు. ముఖంకేసి చూసేటప్పటి కెల్లా ప్రధానంగా కనిపించే పెద్ద గొంతుముడిని వేళ్లతో తడుము కుంటూ సగర్వంగా ఆ ఆహ్వానాన్ని నిరాకరించేడు.

"ఉహు! షికార్లు కొట్టడానికి తీరుబడి ఏది? ఒక్క క్షణమేనా కాస్త ఖాళీ దొరుకుతుందేమో నని చూస్తాను. అప్పే! ఒక్క క్షణం! నేను రాలేను."

"ఈ ఒక్కరోజుకే? మికోలా! అబ్బ! వద్దూ."

తాను వేసుకున్న అంచనాలన్నీ మేత్రీ అనంగీకారంతో ఒక్క పెట్టున గాలిలో ఎగిరిపోతున్నాయని తోచేటప్పటికి ఓస్టపు ఎంతో బెదిరిపోయేడు. ఏలాగో ఒకలాగ అతడిని తనతో తీసుకుపోవాలని ప్రాధేయపడసాగేడు.

"అప్పే. రాలేను."

"ఎంతోదూరం పోవద్దులే. పోనీ"— అన్నాడు, ఓస్టపు. అటూ ఇటూ చూసేడు ఏదో రహస్యం చెప్పబోతూన్నట్లు.

"నాకంత మర్యాద తెలియదనుకున్నావేమిటి? స్నేహితునితో విందు చేసుకుందామని శుభ్రమైన సారాయి, బీరు, ఎంతో రుచిగా వుండే కూరలు, తయారుచేయించేను."

మేస్త్రీ నోరూరింది. మెత్తపడ్డాడు.

"అబ్బ!–చాలసేపు పడుతుందేమోనోయి! ఒక్క అరగంట కంటె ఆపనంటే వస్తాను."

ఓస్టపు హృదయంలో మళ్లీ ఆశాలత అంకురించింది. ఆతనికి దగ్గరగా జరిగి, చెవిలో, రహస్యంగా అక్కడ తాను తయారు చేయించిన పదార్థాలపేర్లు ఏకరువుపెట్టేడు.

"మికోలా! ఇంకా నువ్వు వస్తావు, పెద్దమనిషివి. ఊరికే వట్టిచేతులతో పంపించకూడదని బహుమతులుకూడా తెచ్చేను. తీరా కొన్నాను. నువ్వురానంటే ఏలాగ చెప్పు."

మేస్త్రీ స్నేహంతో ఓస్టపు భుజంమీద తట్టేడు. ఆతడు వర్ణించిన పదార్థాలస్వభావం తలుచుకొనేటప్పటికి బ్యుటిలోకిను యొక్క పట్టెడుగొంతు ముడి కదలబారింది. బహుమానాల పేరు చెప్పేటప్పటికి ఇంక బెట్టుసరి మానివేసేడు. అయితేనేం?– తాను మేస్త్రీననేవిషయం ప్రతివిషయంలోనూ ప్రదర్శించడం మానదలుచుకో లేదు. మాటలాడేటప్పుడెల్లా, జ్యోతుల్లాంటి కళ్లమీద ఎర్రని కను రెప్పలు అరమోడుస్తున్నాయి.

"నేనెరుగుదునోయి! నాయనా! నీకంటపడ్డవాడు దాటిపోలేడు,

నిజానికి ఒక్క నిముషంకూడా తీరికలేదు. --సరే. కానీ, నువ్వు--. తప్పదు--అన్నాపని రావాలి. అంతే. నడు, మరి పోదాం."

మేస్త్రీ ఎందుకో ఎదురుగా నాలుగుమూలలూ చూసేడు.

"ముందునడు. అన్నీ సిద్ధంచేయించు. నీ వెనక్కాలే వస్తున్నాను."

'అగనెస్సోప్' 'విశ్రాంతిమందిరం' లో ఒకపెద్దసావడిలో ఇతరులతో సంబంధం లేకుండేటందుకు అమర్చిన మస్లిన్ తెర వెనక్కాల ఉభయులూ కలుసుకున్నారు.

గదిమధ్య ఒకటేబిలు. దానికి రెండువైపులా రెండుకుర్చీలు. స్వచ్ఛమైనగుడ్డ మేజామీద పరిపబడియుంది. టేబిలు నడుమన పెద్దలోహపు పళ్లెంలో ఎర్రపీతలు చక్కగా అమర్చేరు. వాటిల్లో ఇంకాజీవం ఉన్నట్లూ, ఎక్కడికో పాకిపోవడానికి సిద్ధంగా వున్నట్లు భ్రమకలిగించేటంత జాగ్రత్తగా అమర్చేరు, వాటిని. దానిచుట్టూ పెట్టిన గాజుప్లేట్లలో వడ్డించిన దోసకాయలు, కాబేజీ కూరలు, మంచులో పెట్టిన మాంసం, ఇంకా ఏవేవో పరిమళాలు వెదచల్లుతూ నోరూరిస్తూన్నాయి. వాటిప్రక్కన స్వచ్ఛములయిన గ్లాసులలో 'వోడ్కా' నురుగులు కక్కుతూంది. మబ్బురంగు సీసాలతో ఆకుపచ్చని బీరు సిద్ధంగా వుంచేరు. ప్రక్కగదిలో 'ఎకార్డియన్' మీద పాడుతూన్న సుందరమైనగీతం మనస్సును కదలించివేస్తూంది. గోడలకు అంటించిన వార్నీషుకాగితాలమీద

బొద్దింక జరజరాపాకింది.

టేబిలుకి ఒకప్రక్కనున్న కుర్చీలో ఓస్టపు తలకాయ వ్రేల వేసుకొని కూర్చున్నాడు. ఇంతకుముందు తన జన్మలో ఎన్నడూ ఈ మాదిరిపదార్థాలు రుచిచూడడంమాట అలాగవుంచి, చూడనైనా చూడలేదు, కళ్లతో. ఇంతరుచియైన తిండి తినడంచేతనో—లేక— మేస్త్రీకి తాను చెప్పబోయే విషయాలు తలుచుకుంటేనో, కాని, అతనితల తిరిగిపోతూంది.

"అబ్బే! అప్పుడే చెప్పకూడదు. మంచి హుషారులో వున్న సమయం చూసి చెప్పా"— లనుకున్నాడు ఓస్టపు మనస్సులోనే.

ఇంకోమారు గ్లాసులలో 'బీరు' పొంగింది. 'వోడ్కా' మెరిసింది. 'మేస్త్రీ' గబ్బున తేన్చేడు. ఓస్టపు అతని నోటికేసి జాగ్రత్తగా చూస్తూనేఉన్నాడు. మేస్త్రీ గ్లాసు ఖాళీచేసి పెదవులు నాకుకుంటున్నాడు. ఓస్టపు 'ఫోర్కు' తో దోసకాయముక్క తీసేడు. పీతడెక్కలు ఊడలాగి, ఎర్రని పైడిప్ప తొలగించి, ఆ మాంసం తీసేడు. రెండూకలిపి ముద్దచేసేడు. అంత మంచి ముద్దని—రుచియైనతిండిని ఒక్కమారుగా గొంతులో గిరాటువేసు కొనడానికి పాపం అతడెంతో మథనపడ్డాడు.

ఒక్కొక్కవస్తువే చెంచాతో నోటపెట్టుకొని, ఒడివేసి నములుతో మేస్త్రీ గొంతుముడి సవరించుకొన్నాడు. నిముష నిముషానికీ అతనికి స్మృతి తప్పిపోతూంది. ముందుకువొంగి ఓస్టపు భుజంమీద చేయివేసి గొణిగేడు.

"అబ్బాయి! పోయి 'సీ–గల్' పాడమను. 'సీ–గల్'."

ఓస్టపు లేచి పక్కగదిలోకి వెళ్లేడు. మేస్త్రీ మరోమారు వణుకుతూన్న చేతులతో సీసా అందుకున్నాడు. పక్కగదిలో 'అకార్డియన్' మీద పాట ఆరంభంఅయింది. సంధ్యాగీతాలు, ఉషోగీతాలు, 'సీ–గల్' పాట, వరసని ఆలాపించబడ్డాయి.

మేస్త్రీబ్యుటిలోకినుకు కాళ్లు తేలిపోతూన్నాయి. కళ్లవెంట నీరు ఓడిపోతూన్నా తుడుచుకోవాలనే దృష్టికూడా లేదు, ఆతనికి.

ఓస్టపు తిరిగివచ్చేడు. ఈ మారు ఆతనిముఖంలో కొత్త తళుకు వచ్చింది. వస్తూనే మేస్త్రీ అవస్థచూసి, నెమ్మదిగా లేవదీసి బల్లకి ఆనించి కూర్చోపెట్టేడు. టేబిలుమీదగుడ్డతో ఆతని కళ్లూ, మొగమూ, తుడిచేడు. అటుతరువాత టేబిలుక్రిందనున్న పెట్టి ఈవలకు లాగి మూతతీసేడు.

తెల్లని మెరుగుకాగితంలో ఎర్రని 'బొఖారా' శిల్కు కండువాలు మిగలముగ్గిన టొమాటోలలాగా మెరిసిపోతున్నాయి. పెట్టెలో ఇంకోమూల చిన్నపిల్లలకి సరిపడే చిన్నచిన్న తోలుబూట్లు సరికొత్తజోళ్లు చక్కగా అమరించియున్నాయి. రెండో–మూడో సిగరెట్టుపెట్టెలు–కొంచెం పుగాకు ఒకవైపున ఉంది. ఓస్టపు సిల్కుకండువా మడతవిప్పి చేతితో నిమురుతూ అమాయికంగా కంటనీరు పెట్టేడు.

"గర్ఫినా–నాగార్ఫినా–కోసం ఇక్కడికి రాగానే, హఠాత్తుగా చూపించి, ఆశ్చర్యంలో ముంచిఎత్తడానికి –ఏడాదిపొడుగునా

కష్టపడి, పొదుపుచేసి కొన్నాను. చిన్ని 'కోమా' కోసం బూట్లు కొన్నాను. పాపం ఎంతో ఉబలాటపడేవాడు. ఇవన్నీ ఎవడో పరాయివాడికి ఇచ్చివేయడమేనా?"

ఓస్టపు మనసులోని విచారంతో ఒక్కనిమిషం కళ్లుమూసుకున్నాడు. మనసులో ఎన్నో ఊహాలు—ఆశలు పరుగులెత్తేయి. నెమ్మదిగా మనసు కుదురుపరుచుకొని పెట్టెలోని సామానంతా పైకితీసి మేస్త్రీ కళ్లదగ్గిర పెట్టేడు. అంత ఉద్రేకంలోనూ కూడా, అతని కంఠస్వరం ఎంతో మృదువుగా, మొగమోట పెడుతూన్నట్లుంది.

"మికోలా! ఇదిగో చూడు. ఇది నీ భార్యకోసం అని కొన్నాను. ఈ జోళ్లు మీపిల్లవాడికి సరిపడవు? వాళ్లకి నా బహుమతీగా ఇస్తావు, కాదు?"

'అకార్డియన్' మీద 'సింగర్' మ్రోగుతూంది.

బ్యుటిలోకిన్ ఆ బహుమతులన్నింటినీ ఒక్కమారు పరీక్షించి, అలక్ష్యంగా నొల్లుకొని, జేబుల్లో కూరుకున్నాడు.

"ఎంతబాగుందో చూడు ఆపాట. ఆహా! చెవులు తరించేయి."

"మికోలా! ఎంతోకాలంనుంచి ఏదైనా వృత్తిపని చూసుకోవాలని ఊహ. ఏదయినా ఒకవృత్తి చూపిద్దూ. బ్రదికి వుండగా నీ ఉపకారం మరిచిపోను."

"ఓహో! అదా? తప్పకుండా చూస్తాను. నీవిషయం తలుచుకున్నప్పుడల్లా నాకడుపు తరుక్కుపోతుంది. మనస్సులో ఎంతో

బాధ పడతాను. కాని, నువ్వేనా మొదటి—"

స్మెల్లరుగా—స్మెల్లరుగా—వుండాలని ఎన్నాళ్లనుంచో ఆశ."

"ఓస్, ఇంతేనా? ఈమాట ఇదివరకే ఎందుకు చెప్పేవుకాదు. మరి. అది ఎంతో పెద్దపనా ఏమన్నానా? నాచేతిలోపని: ఇప్పుడేనా చెప్పేవు: నీవంటే నాకు చాల అభిమానం కలిగింది. చూడు. రేపే నీకాపని ఇప్పించేస్తాను."

ఎంతో కాలంనుంచి ఎదురుచూస్తూన్న శుభసమయం తటస్థ పడింది, ఈనాటికి. మేస్త్రీ చేసిన వాగ్దానం విన్నాక ఇంక ఆతడు అక్కడ నిల్చోలేకపోయేడు. బయటకి వెళ్లిపోవాలి. తనకి కలగబోయే అదృష్టాన్నిగూర్చి ఎవ్వరితోనైనా చెప్పుకోవాలి. అంత వరకు ఈ ఆరాటం తప్పదు. ఓస్టపుకి తనమనస్సులోనిమాట చెప్పు కుందుకు దగ్గరలో స్నేహితుడు ఎవ్వరూ లేకపోయేడు. అందుచేత వడ్డించేవాడినే దగ్గిరికి పిలిచేడు.

ఈగలు తోలుకుంటూన్నట్లు తనషురికి తువ్వాలు ఊచుకుంటూ వడ్డనచేసేవాడు నెమ్మదిగా జరిగివచ్చేడు.

ఇద్దరూ కలిసి వీథిలోకి బయలుదేరేరు.........ఇంటికి బయలు దేరేటప్పుడు టేబిలుమీద దిగవిడచిన పదార్థాలమాట జ్ఞాపకం వచ్చింది.

"ఆ ఒదిలిపెట్టినవి తెచ్చుకుంటే రేపటిరోజంతా తినొచ్చు. ఊరికే వదిలెయ్యడమేం?''

జేబులో మిగిలిన కొద్దికానులూ గలగలలాడించుకుంటూ

ఓస్టపు తనబసకేసి నడిచేడు. తిన్నగా వెళ్లిపోయి 'అరప' మీద కెక్కి ముసుగువిగదన్ని పడుక్కున్నాడు. పడుక్కున్నాడేగాని ఆతనికి ఆనాటిరాత్రి కంటిమీద కునుకులేదు. తెల్లవార్లూ భవిష్యత్తుని గూర్చి ఏవో ఆలోచించుకుంటూనే వున్నాడు. ప్రొద్దుటే ఇంకా ఫ్యాక్టరీ కూతవేయకముందేలేచి పనిలోకి పరుగెత్తి పోయేడు.

  

వర్షాలు కురియడం లేదు..........

రాత్రీ లేదు. పగలూ లేదు. ఒక్కలా వున్నాయి, వేడి గాడ్పులు. ఎక్కడా తడీ—పొడీలేదు. మొగం మాడ్చేస్తున్నాయి. రోడ్లమీది దుమ్మంతా ఎగరకొట్టి చిన్నచిన్న మేఘాలల్లే తయారు చేస్తున్నాయి. ఒక్క పందే అయినా అదీ కొంతసుఖమే. కన్నూ—కన్నూ కనిపించకుండా ఉక్కిరి-బిక్కిరి అయ్యేలాగ ఈ దుమ్ము ఒకటి. తిండీ—తిప్పలూ లేక, త్రాగేటందుకైనా ఇన్ని నీళ్లదొరక్క, పక్షులు గుంపులు—గుంపులుగా చక్రాలు తిరుగుతూ 'అజోవ్' మైదానా లన్నింటినీ తమ దీనస్వరంతో ప్రతిధ్వనింప చేసి వేస్తున్నాయి.

కరువు........

గిర్రున చక్రాలు తిరిగితిరిగి అలసట తీర్చుకుందుకని మాల కాకులు గుంపుగుంపులుగా చర్చిశిఖరాలమీదా, వాటిమీదనున్న పసిడిశిలువలమీదా వాలుతూన్నాయి. ఘంటస్తంభాలూ - దేవాలయప్పటావరణాలూ ఎగురుతూన్న పక్షుల రెక్కల నీడలలో నల్లగా కని

పిస్తున్నాయి. ఆ ప్రాంతాలన్నీ వాటి రెక్కల చప్పుడులకీ, గుప గుపధ్వనులకీ, ప్రతిధ్వనిస్తూన్నాయి.

క్రింద వీధులలో నడిచిపోతూన్న ప్రజలు ఆశుభశంకతో తల యెత్తి వానికేసి చూడడానికికూడా సాహసించడం లేదు. ఆ ప్రాంతాలలో నిలవబడకుండానే ప్రార్థనలు చేస్తున్నారు. 'క్రాస్' వేస్తున్నారు.

ఒక్క చినుకంటూ లేదు............

కొద్దిరోజుల క్రితంవరకూ 'అజోవ్' బీళ్లన్నీ ఎంతో ఉత్సాహ పూరితంగా వుండేవి. పొలముకాపులు తమ మకాములదగ్గర మధురములైన పల్లెపదాలతో వెన్నెలరాత్రిళ్లు ఎంతో ఆనందంగా గడిపేవారు. నేడు రాత్రులందు ఆ గీతాలూ లేవు. ఆ ఆనందమూ లేదు. జనసంచారమే లేనట్లు వీధులన్నీ ఎంతో నిశ్శబ్దంగా వుంటున్నాయి. ఇండ్ల కిటికీలలో ఎక్కడా వెలుతురురేకలే కంటపడడం లేదు. గదులలోని హార్మోనియం రీడ్లు ఎన్నడూ వాడకం లేక పోవడంచేత దుమ్ముకొట్టుకొని పాడరి వున్నాయి. ఆ మైదానాలన్నిచోట్లా కాస్త చైతన్యం గలవల్లా గాలిదుమారాలే. ఎండి చురుగై పోయిన ఇళ్లకప్పులమీది రెల్లుగడ్డిని పొదుంచేసి, జలజలా రాలుస్తూ, అర్ధరాత్రులవేళకూడా హడావిడిగా వుంటున్నాయి, ఇవి.

"నిప్పంటూ బయలుదేరకుండా ఆదేవుడే కాయాలి. ఏ మూలయినా కాస్త నిప్పురవ్వ లేచిందా, మనకొంపలన్నీ దివిటీలవలె వెలిగిపోతాయి."—అంటూ రైతులు అనుక్షణం ఆకాశంకేసి వెర్రి

చూపులు చూస్తూన్నారు.

'అస్త్రాఖన్' ఇసుకఎడారుల మీదనుంచి వేడిగాలుపులు వచ్చి, పొట్టమీదనున్న పరిచేలని ఎంతో ఆప్యాయంగా కాగలించుకున్నాయి. ఆ కౌగిలికోంచి ఒక్క మొక్క కూడా ప్రాణంతో బయట పడలేదు. జీవం ఎగిరిపోయి, పదుళ్లకంటా మాడిపోయేయి. బీళ్లు బిగిసి, నెరియలువారిపోయేయి. ఎన్నడూ నాగలిమొగం ఎరగని పచ్చిక బీళ్లన్నీ, పెద్దపెద్దనెరియలతో గాయాలతో నిండిన మనుష్యుడి ముఖంలా భయం పుట్టిస్తూ వున్నాయి. మనుష్యులు–జంతువులు–చెట్లు-చేమలు అన్నీ ఏదో చెప్పడానికి వీలుకాని భయంతో వాడిపోయి ఉన్నారు.

'అజోవ్' పల్లెటూళ్లూ, పొలంమకాములూ మనుష్యసంచారం లేక చూడడానికికూడా భయంవేసేలాగ వున్నాయి.

కాలమానం సరిగ్గా వున్నరోజుల్లో, నికనేర్ కుటుంబం ఏడాదిలో ఎక్కువభాగం పొలాలలో పనులు చేసుకుంటూ స్వగ్రామం లోనే కాలక్షేపం చేసేవారు. పొలంపనులు లేనిరోజుల్లో తండ్రీ–కొడుకూ బొగ్గుగనుల్లో కూలికి పోయేవారు. ఆడవాళ్లు ఇంటిపట్టునే వుంటూ అడపాదడపా రైతులపొలాల్లో ఏదో పనీ–పాటాచేసుకొని రోజులు గడుపుకొనేవారు. అటువంటి కుటుంబానికి నేటికి కష్ట కాలం దాపరించింది. ఇప్పుడు రైతులకే తిండి లేదాయె. వాళ్లే ఏపూటకాపూట, ఏముద్దకాముద్ద, ఏగింజకాగింజ తడుముకలాడు కుంటూ వుంటే, వీళ్లని చూసేదెవ్వరు? పొలాలలో కూలీల

అవసరమే లేకుండా పోయిందామె. నికనేర్ భార్య కొన్నాళ్లు ఓపికపట్టిచూసింది. ఇంక అక్కడ నిలిచే ఎత్తు కనపడలేదు. ఈ అధ్వాన్నపు అడవిలో పడిచావలేమనీ, తాముకూడా అక్కడికే వచ్చేస్తున్నామనీ, మొగుడికి వ్రాసి పడేసింది.

పనిలోంచి బసకి వచ్చేటప్పటికి భార్య వ్రాసిన బూడిదరంగు కవర నికనేరు చేతులకి అందింది. విప్పబోతూంటే ఆతనిచేతులు వణికిపోయేయి. ఏవో దుర్వార్తలు తెచ్చిందని ఆతని అదటు.

చేతులూ— మొగమూ కడుక్కుందుకుకూడా తోచ లేదు. తిన్నగా గోడనున్న దీపందగ్గిరికి పోయేడు. ప్రక్కనే వున్న కుర్చీపీట దీపందగ్గరగా లాక్కొని, దానిమీద చదికిలపడ్డాడు. ఏదో కారణం తెలియని భయంతో మనసు తహ తహలాడి పోతూంది. గుండెలు దడదడలాడి పోతూన్నాయి. ప్రొద్దుటేలేచి ఎవ్వరిమొగం చూచేడోకాని, ఆతనికారోజున అన్నీ బాధలే తటస్థ పడ్డాయి. బొగ్గుగనిలో గునపానికికూడా మారుమసిలేచోట బొగ్గు తవ్వకి వప్ప జెప్పేరు. పగలెల్లా రెక్కలు ముక్కలు చేసుకొన్నా పదిహేనుట్రక్కులు నింపేటప్పటికి పెద్దలు దిగొచ్చేరు. పనిలో ఉన్నంతసేపూ ఏదోవిచారం మనస్సుని బాధిస్తూనే ఉంది. కడుపులో చేయిపెట్టి కలిపినట్లేవుంది. ఆ ఆపత్తు ఏదో ఇంటికి వచ్చేటప్పటికి పిశాచంలా మీద విరుచుకొనిపడింది.

"ఏం తాతా! విచారంగా కనిపిస్తావేం? ఎంతో బొగ్గు తవ్వ లేకపోయావాయేం? దానికింత విచారించడం యెందుకు?

నిష్కారణం చచ్చిపోతావు. బెంగపెట్టుకో"— కంటూ కట్టెలు మోసే 'డ్రూష్కో' తన భుజం తట్టడం కూడా నికనేరు ఎరగడు.

ఓస్టపు అప్పుడే పనిలోంచి ఇంటికి వచ్చేడు. వచ్చేటప్పటికి గోడని జేరగిలబడిపోయి, మొగం వ్రేలాడవేసుకొని, కూర్చున్న తండ్రి కనిపించేడు. కారణం ఏమిటో తెలుసుకుందామని ఆతడు తండ్రిని ఎన్నోమార్లు పలకరించి చూసేడు. ఉహుః సమాధానం తాలేదు. ఎప్పుడో పదిహేను-పదహారేళ్ళకిత్రితం కాబోలు ఒక్క-మాటుమాత్రమే తన తండ్రిని ఈ స్థితిలో చూచేడు. ఆ రోజున తమ ఆవు చచ్చిపోయింది. ఓస్టపుకి వెనకటిరోజులన్నీ ఒక్క-మారు మనస్సులో మెదిలేయి.—ఆ రోజుల్లో వాళ్ళంతా స్వగ్రామం లోనే వుండేవారు. నికనేరు తన జీవితం ఆంతలోనూ పోషించ గలిగినదీ—పోషించినదీ ఆ ఒక్క ఆవునే. ఆ ఉన్న ఒక్క ఆవూ చచ్చిపోయేటప్పటికి ఆ రోజున అతడు ఏడ్చిన ఏడ్పు అంతా— ఇంతా కాదు. రెండుచేతులతోటీ తలకొట్టుకొని, ఆ రాగిజుట్టు పీకుకొని, నేలబడి వెర్రిఏడ్పులు ఏడ్చేడు. ఆ వినోదం చూడడాని కోసం అని నోరు తెర్రపెట్టుకొని తయారయిన ఇరుగు-పొరుగు జనాన్ని చూసికూడా ఆతడు సిగ్గుపడలేదు. మోర పైకెత్తి, కన్నీరు కారుస్తూ గోలపెట్టేసేడు. "ఇంక మన జన్మలో ఆవు నంటూ సంపాదించలే"మని నిరాశతో ఏడ్చేడు. ఆ రోజు తర్వాత ఇంక ఆతడెన్నడూ కంట నీరు పెట్టవలసిన అవసరమూ లేక పోయింది. కంట నీరు పెట్టనూలేదు. ఇంక పోయేది ఏమైనా

వుంటేకాదూ ?

నేడు భార్యవ్రాసిన జాబు చూచేటప్పటికి అతనికి అంత విచారమూ కలిగింది. తలయెత్తి విచారంచేత ఎఱ్ఱబడ్డ కళ్ళతో గోడని కునుకుతూన్న దీపంకేసి చూసేడు.

"ఇంతేనా ! బ్రతికి ఉన్నన్నాళ్ళూ బొగ్గు తవ్వుకోవలసిందేనా? స్వంత పొలం దున్నుకొనే అదృష్టం నా మొగాన లేదూ ?"

అతనికి హఠాత్తుగా ఏమితోచిందోకాని, గభీమని లేచి, నిటారుగా నిలబడ్డాడు. బలిష్ఠములైన అతని ఎముకలన్నీ కటకటలాడేయి. నీరు పిండుతూన్నట్లుగడ్డం రెండుచేతులతోటీ పట్టుకొని ఒత్తేడు. పళ్ళు బిగించేడు.

"సరే! మరి. ఏంచేస్తాం? నీసంపాదన అంతా నీదగ్గరనే వుందా?"

ఈప్రశ్న అడుగుతూనే ఏదో రహస్యం చెప్పబోయేటట్లు కంఠస్వరం తగ్గించేడు.

"మనవాళ్ళంతా ఒకటిరెండురోజుల్లో వస్తూన్నామని వ్రాసేరులే. ఇకముందు అంతా ఖర్చే కాదు?"

ఈవార్త చెవిని పడేటప్పటికి ఓబ్లపుకల దిమ్మెక్కిపోయింది. నోట ఒకపట్టాన మాటపెగిలిరాలేదు. 'ఉండక ఏమవుతుందిలే'— అంటూ అతడు తాను పడుక్కొనే అరవమీదికి ఎక్కేడు. చాప క్రిందా—తలగడాక్రిందా ఏమిటో తెగ తడిమేడు. పక్కబట్టలు దులిపేడు. బల్లలు బడబడలాడించేడు.

మేరీకన్యవిగ్రహం వ్రేలాడుతూన్నమూల పాతకాన్వెర్టినా మీద ఎవ్వరో ఏదోగీతం ఆలాపిస్తూన్నారు. త్రాగినవాళ్ళ వెర్రి కేకలూ, 'బలాలైకా' సన్ననిధ్వని ఆపాటతో శ్రుతి కలుపుతూ న్నాయి.

నికనేరు ఆక్టేసేపు ఓపిక పట్టలేకపోయేడు. కొడుకుకి ఆవెత కథంలో సాయం చేయడానికని తానూ మంచెమీదికి ఎక్కేడు. ఓస్టపు బల్లమీద వట్టినే చప్పుడు చేస్తూన్నాడు. బొటనవ్రేలినరం ఉబ్బెత్తుగా వాచి, ఎర్రగా, ఉంది. నికనేరు అది చూసి, ఇంక ఆగలేక, కొడుకుజబ్బ లంకించుకొని గట్టిగా గుంజేడు.

"డబ్బు అంతా ఏంచేసేవు? దొంగవెధవా! మాట్లాడవేం?"

ఒక్కొక్క ప్రశ్నతో తనలోని మంచితనంఅంతా కరిగిపో తూన్నట్లు ఆతనికే తట్టింది. కోపం కంఠానికి ఎగతన్నుతూన్నట్లు మైమరుపు కలుగుతూన్నట్లూ తోచింది. ఏడిపించడానికి మనిషి అంటూ దొరికేడనే ఆనందంతో ఆతని హృదయం ఉరకలు వేసింది. తన ఒక్కకోపం — తాపం చూపించేటందుకు ఆఖరుకి ఏదో మార్గం దొరికింది.

ఓస్టపు తన పాతికేళ్ళ వయస్సునీ—బలాన్నీ పూర్తిగా మరచి పోయి పిల్లిలా అయిపోయేడు. అరచేతితో ముక్కు కుదుపు కుంటూ తన స్థితిని సమర్థించుకోడానికి ప్రయత్నం చేసేడు.

"దేవుడి తోడు! అంతా ఎప్పటిదప్పుడే ఈ తలగడా క్రింద పెట్టుతూవచ్చేను. ఎవడో దొంగవెధవ కొట్టేసేడు."

నికనేర్ కోపం పట్టలేకపోయేడు. చొక్కా చిరుగు తప్పించి జబ్బ దొరకపుచ్చుకొన్నాడు. కొడుకుని ఈడ్చుకుంటూ గబగబా అరపదిగేడు.

"డబ్బంతా ఎక్కడ తగలేసేవు ?"

ఈమాటలంటూనే ఆతడు కొడుకును వెల్లకిలాక్రింద పడ తోసి, గుండెలమీద కూర్చున్నాడు.

" దొంగవెధవలు ఎవరో ఎత్తుకుపోయేరు. నాన్నా! నిజంగా."

నికనేరు పిడికిలి బిగించి ఎత్తేడు. చచ్చేముందు గొడ్డు అర్చి నట్లు ఓస్టపు వెర్రికేకలు వేసేడు. 'కాన్సెర్టినా'మీద పాడుతూన్న పాట; 'బలాలైకా'సన్ననిద్రాప్యగీతం; ఓస్టపు పెడుతూన్న కేకలలో అంతరించి పోయేయి.

చెడత్రాగి పళ్ళు ఇగిలిస్తూ, 'పిట్మన్' వగైరా కూలీలంతా మల్ల యుద్ధానికి తలపడ్డ ఆ తండ్రికొడుకుల చుట్టూ మూగి వాక్యోప వాక్యాలతో రంగాన్ని రసవంతం చేసేరు.

"రాండరోర్రియ్ ! నికనేరు చెడత్రాగి అల్లరి చేస్తున్నాడు."

"తాతా ! ఏమిటి ? నీ మొహం అల్లా చూస్తావు ? సాగదీసి దవడమీద ఒక్క జెల్లకాయ పుచ్చుకోక !"

"ఏమిటో తెగ అరుస్తున్నాడు, నోరు నొక్కవోయి."

"ఒరేయి ! ఓస్టపు ! చూస్తావేమిటి ? చవటమొహం ! మెడ గుళ్ల విరిగేలా ఒక్కటి పుచ్చుకో. ఊ. ఎత్తి విసిరేయి, చేతుల మీద, దూరంగా, అబ్బే !"

"ముసిలివాడిని ఇవతలికి లాగేయక చూస్తారేమిట్రా. కుక్కల్లా కాట్లాడుకుంటూంటే విడిపించడానికి బదులు ఎగదోస్తున్నారా?

మంద్ర—మధ్యమ—తారస్థాయిలలో—అనేకవిధాల గొంతుల నుంచి బయలుపడ్డ ధ్వనులన్నీ కలిసి మర్మరధ్వనిగా మారినాయి. ఆ హోరులో ఈ ఆఖరువాని కీచుగొంతుక ఎవ్వరికీ వినపడలేదు.

నికనేరు ఒక్క నిముషం ఆగి ఆయాసం తీర్చుకున్నాడు. తరువాత రెట్టింపు ఆవేశంతో, క్రిందపడి గొడ్డులా మూలుగుతూన్న కొడుకు చెవిదగ్గరగా నోరుపెట్టి, చెవులు గింగురుమనేలా గావుకేక పెట్టేడు.

"ఏం చేసేవు? ఆ డబ్బంతా."

ఓస్టపు బండబారిన పెదవులు నాలికతో తడుపుకుంటూ వెర్రి చూపులు చూసేడు. ఏం చెప్పడానికీ తోచక డొక్కా-చెవులు ఒక్కమారు అదుముకున్నాడు. ఆఖరికి నెమ్మదిగా—

"మేస్త్రీకి విందిచ్చేసు. ఆతడు నాకో ఉద్యోగం ఇచ్చేడు. అందుకోసం ఖర్చయిపోయింది, అంతా."

అవి నిజం చెప్పక తప్పిందికాదు. నికనేరు స్తంభించిపోయేడు. కొడుకు చెప్పిన మాటలే అప్రయత్నంగా ఆతనినోట వెలువడ్డాయి.

"ఉద్యోగం! ఉద్యోగం!!"

కొడుకు మొగంమీదికంటా వంగేడు, ఆనందం పట్టలేక కొత్త వెలుగుతో ప్రకాశిస్తూన్న తండ్రి కనుపాపల్లో తన నీడ చూసుకొని

ఓస్టపు విచారం మరిచేడు.

నికనేరు లేచాడు. కొడుకు తలపట్టుకొని లేవదీసి కూర్చో పెట్టేడు. చెదిరిన జుట్టు వేళ్లతో దువ్వుతూ, తాను చేసిన పొరపాటు పనికి క్షమార్పణ కోరుతూన్నట్లు నెమ్మదిగా గొణిగేడు.

"ఆ మాట మొదటే చెప్పితేనేమి? అయ్యో వెర్రిమొగమా ....సరే!....సరే!!.

## రెండో ప్రకరణం

వాళ్ళిద్దరూ వచ్చేటప్పటికి తండ్రీ- కొడుకూకూడా ఇంటిదగ్గర లేరు. ఎక్కడికో పనిలోకి పోయేరు. ఇరుగు-పొరుగుజనం ఎవ్వళ్లో- వాళ్లు నిత్యమూ పడుక్కుంటూ వుండే ప్రదేశం చూపించేరు. అక్కడే తమ సరుకులమూటలు దింపుకొని వాళ్లిద్దరూ కను చీకటి పడేదాకా వాటిమీదనే కూర్చుండిపోయేరు.

ఎవ్వరితోటీ వాళ్లు ఒక్కమాట ఆడలేదు. దీర్ఘప్రయాణంవలన దుమ్ముకొట్టుకొని, మాసిపోయిన పైగుడ్డలేనా మార్చుకోలేదు. ఓస్టపుని గూర్చిన మధురభావాలు మనస్సులో బయలుదేరినపుడల్లా గార్పినా ఎర్రవిపెదవులూ, నల్లనికళ్లూ, కొద్దిగా కంపిస్తున్నాయి.

తనకోసం అని, కొని, జాగ్రత్తపెట్టేనని వ్రాసిన ఆ బహుమతులన్నీ ఏమూలదాచేదోనని ఓరచూపులతో ఆతడు పడుక్కుంటాడని చెప్పిన అరపకేసి చూస్తూంది.

వయసు వడిమళ్లిన 'మేరీనా' నీరసంగా మూటలమీద చదికిల బడిపోయింది. ఒడిలి వత్తులై పోయిన తెల్లని చేతులలో తల ఆన్చుకొని, తావింక గడపబోయే జీవితశేషాన్నిగురించి ఊహించు కుంటూవుంది. పగలంతా చిన్నపొలంలో పనిపాటలు చేసుకుం టూనూ; బలియమేసిన ఆవులపాలనుంచి వెన్నతీస్తూ సాయంకా లాలూ; సుఖంగా- సంతృప్తితో గడపాలని ఈనలబై ఏళ్ళనుంచీ ఊహించుకొన్న ఊహలన్నీ కలలై పోయి ఊరుకున్నాయి.

'మేరీనా' హృదయవేదనతో కళ్ళుమూసుకొని, నిద్రపోతూ న్నట్లు చాలాసేపటిదాకా అలాగే వుండిపోయింది.

ఈ వచ్చినవాళ్ళలోకల్లా విచారం అంటే ఏమిటో ఎరగనివాడు కోమా ఒక్కడే. సన్నగా- నల్లగా- పెద్దపెద్దకళ్లూ-వాడూ ఎప్పుడూ నవ్వుతూనేవుంటాడు. వచ్చిందిమొదలుకొని ఒక్కలా అలుపూ- ఆయాసం లేకుండా ఆపొడుగ్గాటి బారక్కులో ఆమూలనుంచి ఈమూలకీ, ఈమూలనుంచి ఆమూలకీ, తెగ పరుగులెడుతున్నాడు. అరపమీదికి ఎక్కి- గభీ- గుభీమని ఉరుకుతూన్నాడు. ఊః అల్లరి చేసేస్తున్నాడు. ఈమధ్యలో ఎవ్వరయినా కాస్తరొట్టె చేతులో రాలుస్తే, తిన్నగా తల్లీ—నాయనమ్మా కూర్చున్న చోటికి పరుగెత్తి రావటం, వాళ్ళిద్దరికీ చెరకాస్తా పెట్టి, మిగిలింది నోట్లో వేసుకొని

ఇంకోమూలకి పరుగెత్తడం. ఇదేపని.

ఎంతోసేపుదాకా చూడగా చూడగా, బాగా చీకటి పడ్డాక, మగవాళ్ళిద్దరూ వచ్చేరు. ఇంటికి వస్తూనే ఓస్టపు ముందుగా తల్లి దగ్గిరికి పరుగెత్తి కౌగలించుకున్నాడు. ఆ మొక్కుబడి కాస్తా పూర్తికాగానే భార్యదగ్గిరికి తిరిగేడు. జుట్టంతా చెదరిపోయేటట్లు మోటుగా పైన కప్పుకొన్న దుప్పటీ లాగిపారవేశాడు. గార్పినా చిరునవ్వుతో భర్త ఆవేశానికి సమాధానం ఇచ్చింది. చెదిరిపోయిన జుట్టు రెండు చేతులతోటీ దులుపుకొంది. పొడుగుపాటి ఆమె బంగరురంగు జుట్టు విరియబడి భుజాన్ని పూర్తిగా కప్పుకుంది. ఇంకో నిముషానికి వారిద్దరూ ఒకరిపక్క ఒకరు కూర్చుండి తమ గ్రామంలోని కథలన్నీ పేరుపేరువరసల్నీ చెప్పుకుంటూ కనపడ్డారు.

నికనేరు పెదవులు బిగించి పరాధ్యానంగా, నీరసంగా, నెమ్మదిగా, తాను పడుకుండే మంచంకేసి అడుగులు పెట్టేడు. మంచానికి ప్రక్కనే పడవేసిన మూటలమీద కూర్చున్న భార్యని తలవూపులతోనే పలకరించి, తనకేసి ఉరకలు వేసుకుంటూ పరుగెత్తివచ్చిన మనుమని చంకకెత్తుకొని, వానితో ఆటలాడుకుంటూన్నట్లు నటించసాగేడు. గాలిలోనికి ఎగరవేసి పట్టుకున్నాడు. బిరుసుగడ్డంతో కిచకిచలు పెట్టి వాని ఒళ్ళంతా బొగ్గుముమ్ము పట్టించేడు.

కుర్రాడు ఆనందంతో కిలకిల లాడేడు. తాత విచారం ఒలికే చూపులతో, వానిని ముద్దులాడేడు. గార్పినా విశాలమైన కళ్ళు

సంతోషాతిరేకంచేత చెమర్చేయి. ఒస్టవు సంతృప్తితో– ఉల్లా సంతో–ఎగిరిపడ్డాడు. ఒక్క మేరీనామాత్రం, విచారంతో – చిట్లి తెల్లబారిన పెదవులు నాలుకతో తడుపుకుంటూ–శోకరసాధిదేవతలా కూలబడి అలాగే కూర్చుండిపోయింది.

ఒక్కనిముషం పిల్లవాడితో ఆటలాడి, నికనేరు నీటితొట్టె దగ్గిరికి వెళ్ళి కాళ్లు–చేతులూ–మొగము కడుక్కొని వచ్చి, భార్య పక్కనే ఇంకో మూటమీద తానూ చదికిలబడ్డాడు. తన చేయి మేరీనా మోకాలిమీద ఆనించి, తెచ్చికోలు సంతోషంతో పలక రించేడు.

"ఏమిటి–ముసిలీ !–కథ ఈలాగ అడ్డం తిరిగిందేమిటి ? ఈ వేళనుంచి కొత్తగా, కొత్తచోట్లో కొత్తజీవితం మళ్ళీ ఆరంభించే మన్నక్లైనా ?"

మేరీనా దుఃఖభారంతో వణికిపోతూ భర్త భుజంమీద తల వాల్చింది.

బారక్సులో అడ్డంగా గుడ్డతెరలుకట్టి, ఒకగదిలా తయారు చేసి, ఆ కుటుంబం దాంట్లో తమ నూతన జీవితాన్ని ఆరంభిం చేరు. తెల్లవారేటప్పటికల్లా తండ్రీ–కొడుకూ తమతమ పనుల్లోకి పోతారు. అత్తా–కోడలూ చాకలిపని ప్రారంభం చేసి, బారక్సులో వాళ్ళందరిబట్టలూ ఉతుకుతూండేవారు. మగవాళ్ళమాట ఏలాగున్నా పాపం ఆడవాళ్ళిద్దరూ చాకిబల్లలదగ్గిర తమ భవిష్యత్తును గూర్చి ఏవేవో కలలుకంటూ వుండేవారు.

రాత్రిళ్లు చాలా పొద్దుపోయేదాకా మగలతో ఏవేవో రహస్యాలు చెప్పుకుంటూ గడిపేవారు.

పడుచువాళ్ళిద్దరిదీ భవిష్యత్తుని గూర్చిన ఆలోచనలు. ఒత్తుగిలి పరుండి భార్యను దగ్గరగా లాక్కొని, తన దండమీద తల ఆనించి పడుక్కొన్న గార్బినా చెవిలో ఓస్టపు ఎన్నో ఆశలు, సుఖ వార్తలు ఊదేవాడు. తాను మేస్త్రీ కాగలననీ, అటు తర్వాత తమ జీవితం చాలా సుఖమయం కాగలదనీ తెగ వర్ణించేవాడు. గార్బినా సంతుష్టితో ఒక్క నిట్టూర్పు తీసుకొని, ముసుగు బిగతన్నేది.

ఇంక ముసిలివాళ్ళిద్దరూ ఎప్పుడూ వర్తమానాన్ని గురించే ఆలోచిస్తూండేవారు.

"అంతా ఇరకాటం. కదిలేటందుకూ-మెదిలేటందుకూ కూడా లేదు. ఊపిరి తీయడానికి కూడా చోటులేదు."

"ఆఖరికి మనది అనుకోతగిన కొంప-ఆఖరికి చిన్న గుడిసె అయినా- వుంటే, ...."

'మేరీనా' విచారభారంతో ముందుమాట చెప్పలేకపోయింది.

"డబ్బేదీ ? ఎక్కడినుంచి వస్తుంది ?"

ముసిలికూలీ విచారంతో తల దిండులో పెట్టుకొన్నాడు.

"డబ్బుమాటా ? యజమానిని అడుగుతే ఆపాటి సాయం చేయడు?"

"య—జ—మా—నే—?"

ఈ సంభాషణ జరిగిన కొద్దిరోజులకే ఆ కుటుంబం నలు

గురూ గవియజమాని ఆఫీసుగదిలో ప్రవేశించేరు. అడుగు చప్పుడు కాకుండా లోనికి వచ్చి, తలుపులు నెమ్మదిగా మూసేరు. మిగిలిన వాళ్ళనందరినీ దూరంగానే ఉండమని నికనేరు తానొక్కడే యజమాని కూర్చున్నచోటికి నడిచేరు. మేజా తుడిచి, దానిమీది వస్తువులన్నీ సరిగ్గా పెట్టేడు. కాళ్ళు దగ్గిరిగా చేర్చి నిలబడి, ఎన్నో వారాలనుంచి ఆ బారక్సులో గుడ్డతెరల వెనక్కాల ఊహించుకొన్న విషయాలనన్నింటినీ మాటలరూపంలోకి తేవడానికి ప్రయత్నిస్తున్నట్లు, నెత్తిమీదనున్న గొర్రెతోలుటోపీ సర్దుకున్నాడు.

" 'కారల్ ఫ్రాన్జివిచ్ ' ! మేము నలుగురము, మీ సహాయం కోరి వచ్చేము. నేను తమ బొగ్గుగనిలో చాలాకాలంనుంచి ఎంతో శ్రమపడి ఒళ్లు వొంచుకొని పనిచేస్తూన్నాను. అందుచేతనే ఏదో ఒకమూల ఒక గుడిసె వేసుకుందుకు ఇంతచోటు చూపించక పోరనే ఆశతో మీ దగ్గిరికి వచ్చేను. నా కొడుకు—కోడలు—మనుమడు—భార్య అందరు గనికి దగ్గిరిలోనే ఎక్కడయినా కాపురం ఉందామంటున్నారు.''

కారల్ ఫ్రాంజివిచ్ మందహాసంతో మీసాలు మెలివేసేడు. తాను కాలుస్తూన్న ఖరీదైన సిగరెట్టుపొగ ముక్కుల గుండా వదిలి పరిమళవంతములయిన చిన్నచిన్న మేఘాలు కల్పించేడు. నీలిగుడ్లమీద ఎర్రని కనురెప్పలు అరమోడ్చి, అచి-అచి-సమాధానం ఇచ్చేడు.

''నిజం. మన జనానికి సరిపడేటన్ని ఇళ్ళు లేనిమాటసత్యమే.

కాని, ఏంచేస్తాం? జనం ఎక్కువ;ప్రదేశం కుశలమూనాయె."

"సరిపడేటన్ని ఇళ్ళు లేవ"నే మాటలో ఇంకా ఆశకి అవకాశం వున్నట్లే నికనేరు నిశ్చయించేడు. కొంచెంసేపు కాళ్ళా-వేళ్ళాపడి బ్రతిమలాడితే ఆ జర్మనీవాడు కరుణించకపోడని గ్రహించేడు. తాను కోరుతూన్న దానివల్ల యజమానికి కలిగేనష్టం ఏమీలేదు. కాని తనకీ, తన కుటుంబానికీ ఎంతో వుపకారం కలుగుతుంది. అంతా ఆనందిస్తారు.

. నికనేరు యజమానితో మాటలాడడానికి భయపడ్డాడు. అతని గొంతులో ఏవో గురగురలాడింది. డీలావడిపోయి, రోగిష్ఠితనంగా మందకొడిగా, వున్నట్లు కనుపించేడు. అంతలో కఱువుతో మండిపోతూన్న లజోవ్ మైదానాలు, తన కుటుంబంయొక్క పరిస్థితులు ఒక్కమారు జ్ఞాపకం తెచ్చుకొని మనసు గట్టిపరచుకున్నాడు. యజమానిముందర మోకరిలబడి, నున్నగా అద్దంవలెనే యున్న ఆ ఆఫీసునేలమీద సాగిలబడి నమస్కరించేడు.

"ఫ్రెడ్రిచ్ ! కొంచెంచోటు, ఇన్ని రాళ్లూ, చాలు. ఏదో చిన్న గుడిసె వేసుకుంటాను."

'బ్రిట్' తన ముందర సాగిలపడియున్న ఆ దీర్ఘకాయుణ్ణి సమీపించి, జబ్బలు పట్టుకొని, లేవదీసేడు. ఎంతో సానుభూతి ఉట్టిపడేటట్లు ఊరడించేడు.

"ఎందుకోయ్" అంత బెంబేలు పడిపోతావు? మీ రష్యను లంతా ఇదే వాలకం. చిన్న పనికి ఎంతో నీచత్వం చూపిస్తారు.

అప్పు నీకు తప్పకుండా సాయంచేస్తాను."

'సెటిల్మెంటు'కీ ఆవలనున్న 'బురదగుంట'లో ఒక చిన్న గుడిసె వేసుకొనేటందుకు నికనేరుకి అనుమతి దొరికింది.

ఆ రోజున అతని నడుము నిటారుగా లేచి నిలబడింది. సగర్వంగా తలయెత్తి, రొమ్మువిరిచి, సెటిల్మెంటులో ఆమూల నుంచి, ఈ మూలకి విసవిసా నడిచేడు. అతడు ఆఫీసునుంచి సరాసరి 'బురదగుంట' దగ్గిరికి వెళ్ళేడు. ఏటవాలుగానున్న పోత గట్టు వెంబడినే రెండుమూడుసార్లు పచారు చేసేడు. గట్టుమీద నిలబడియున్న నికనేరు నీడ ఎక్కడో లోతుగానున్న ఆ బురద గుంటలోని చెమ్మనేలమీద పడి కదులుతూంది. చేతిలోని గునపం దృఢంగా పట్టుకొని, అతడు పెద్దపెద్ద అంగలతో ముందుకు నడిచి ఆ ప్రదేశాన్నంతనీ కలియచూసేడు. అతని ఎర్రని బిరుసు గడ్డం ఆనందంతో కదులుతూంది.

ఓస్టఫు ఒకపెద్దపార చేతపట్టుకొని తండ్రివెనక్కాలే వచ్చేడు. ఆతనివెనక్కాల మేరీనా ఒకపెద్దమూట భుజానా, కాపేజీడీరుగా యతోనిండిన పిడత చేతిలోనూ, పట్టుకొని నెమ్మదిగా వంగివంగి నడుస్తూవచ్చింది.

పొడుగ్గాటి నగరవీధులన్నింటినీ అనుకొని, వాటికి ఒక కొసన వుంది, ఈ 'బురదగుంట.' ఇటాలీయావాళ్లూ, అక్కడయున్న కొందవాళ్ళల్లో మట్టితోటీ-కర్రలతోటీ-గుడిసెలుకట్టుకొని కాపురాలు చేస్తూన్నారు. కొండచరియలమీద ఫ్రెంచివర్తకులవీ-బెల్జి

యన్ యజమానులవీ—డైరెక్టర్లవీ— మేనేజర్లు, అసిస్టెంటుమేనే జర్లు, ఇంజనీర్లు, టెక్నీషియన్లు, మొదలయిన పెద్దపెద్దఉద్యోగస్థులవీ భవంతులున్నాయి. చుట్టూపువ్వులతోటలతో, బాగా ఎండతగిలేచోట శుభ్రంగా సుందరంగా ఉండడంచేత ఆ భాగాన్ని జనం అంతా 'సన్నీ–సైడ్' (Sunny Side) అంటూ పిలుస్తారు.

ఈప్రదేశానికి ఒకవైపున గుమాస్తాలు, ఇంకా ఇతరఉద్యోగులూ వుండే వీధి ఉంది. దానికి బాగా క్రిందుగా కొండవాళ్లల్లోనూ, గుట్టల మొదళ్లల్లోనూ, ఫిట్టరులు ఫోర్మనులు కాపురాలుండే ఇళ్లు ఉన్నాయి. ఈ ఇళ్లకి ఆవరణలు విశాలంగానే వున్నాయి. కాని, గడ్డిమొలిచిపోయి, చీకాకుగా వున్నాయి. కిటికీలకి మస్లినుతెరలున్నాయి. కాని, బూడిదకొట్టుకొని, రంగుమాసి వెలవెలపోతున్నాయి. సెటిల్మెంటులో అందరికంటే ముందురావడంచేత, వీళ్లకి ఈ పెద్ద ఇళ్లు దొరికేయి.

కాని, నికనేరు అందరికంటేనూ ఆఖర్ని వచ్చేడు. అందుచేతనే అతగాడికి సెటిల్మెంటులో ఎక్కడాకూర్చుందుకుకూడా చోటు లేకపోయింది.

'బ్రట్' తెలివైనవాడు. బ్రదుకనేర్చినవాడూ కూడాను. రష్యాలో అడుగుపెట్టిననాటికి అతనివద్ద ఎంతో పెద్దపెట్టుబడిలేదు. గుర్రాలచేత లాగించే చిన్నయంత్రం ఒకటికొని, బొగ్గు తీయడం ఆరంభించేడు. బొగ్గుగొయ్యిఉన్న ప్రాంతాల్ని, 'మూలదిబ్బ' అనీ కూలీలంతా కాపురం వుంటూన్న సెటిల్మెంటును బొగ్గుగని అనీ

వ్రిజలు వ్యవహరించినా నిజానికి బొగ్గుగని 'మూలదిబ్బ' మీదే వుంది. అటుతరువాత క్రమంగా ఈ 'బురదగుంట' కూడా ఆతని స్వాధీనంలోకే వచ్చింది. పదేళ్లుగడిచేటప్పటికి ఆచిన్న సెటిల్మెంటు పెద్దపట్టణం అయిపోయింది. అక్కడవుండే చిన్న ఇనపయంత్రా లయం రష్యాలోకెల్లా పెద్దకర్మాగారం అయిపోయింది. వెనుకటి బొగ్గుగనులు అంతకంతకు పెద్దవి చేయబడి ఏటేటా ఎంతో బొగ్గును సప్లైచేస్తున్నాయి. జర్మనీదేశీయుని ఆచిన్న బొగ్గుగనికి ఎంతో ప్రాముఖ్యత వచ్చింది. దాని వైశాల్యం బాగా పెరిగి అటు సెటిల్మెంటునీ— ఇటు 'బురదగుంట' నీ దాటింది. ఈ రెంటి మధ్యాగల నేల ప్రతిఅంగుళం ఆక్రమించబడిపోయింది. ఇంక మిగిలినదల్లా చితచితలాడుతూవుండే ఆ 'బురదగుంట' ఒక్కటే.

ఆరోజున నికనేరు వచ్చేటప్పటికి ఈ 'బురదగుంట' ని ఏవిధంగా ఉపయోగంలోకి తీసుకువద్దామా—యనే ఆలోచిస్తున్నాడు; ఫ్రెజ్నివిచ్. ఇంతలో నికనేరు వచ్చేడు. ట్రస్ట్‌కి ఉచితంగా మంచి వాడనే గౌరవం దక్కింది. నికనేరుకి కొద్దికాలం—కొంచెంచోటు— దొరికింది.

ఆ ప్రదేశం పట్టి రోగాలపుట్ట. అయితేనేం, పాలివాడికి ఆ ప్రదేశం దొరకడమే గగనం. నికనేరు ఎన్నో ఊహాసౌధాలు నిర్మిస్తూ, సగర్వంగా తలఎత్తి, గంభీరంగా పెద్దపెద్ద అంగలు వేస్తూ, ఆ 'గుంట' గట్టే కొంచెందూరం నడిచేడు. బాగా ఎండ తగిలేచోటు ఒకటి చూసుకొని, పది చదరపుగజాలనేల కొలుచు

కొన్నాడు. తర్వాత ముఖంమీదికంటా వ్రేలాడిపోతూన్న గొర్రె చర్మపుటోపీ తీసి ఆ బురదలో మోకాళ్లబడ్డాడు. మేరీనా—కొడుకు—కోడలు— అతనిని అనుకరించేరు. మరుక్షణంలో సులిపెచ్చని నాలుగుజతల పెదవులు ఎంతో ఆప్యాయంగా ఆ బురదనేలని స్పృశించేయి.

"ప్రభూ ! మమ్మల్ని దీవించు."

ఆ బురదనేలని పెదవులతో ముట్టుకొనడానికి వాళ్లు ఎంత మాత్రం అసహ్యించుకోలేదు. ఆ చుట్టుప్రక్కల పారవేసిన చెత్త-చెదారాల కుళ్లుకంపు వారి ముక్కులకి తట్టలేదు. ప్రార్థనానంతరం నలుగురూ పసుగుడిసె కట్టేటందుకు మన్ను తవ్వడం ఆరంభించేరు.

కోమా—నికనోరు మనుమడు—ఒక్కడే ఆ కుటుంబంలోకెల్లా ఏమాత్రమూ పనిచేయనివాడు. వానివయస్సంతా పోగుచేస్తే అయిదేళ్లకి హెచ్చులేదు. ఇన్నాళ్లూ ఎప్పుడూ చీపురుకట్ట మొగం ఎరగని ఆ వాంటిన్సులో చపుడు ఉరికిన కిటికీలలో కూర్చుండి, బొగ్గుగనిగుట్టమీదనించి నిండుబరువుతో గబగబా దొర్లివచ్చే ట్రక్కులకేసి చూసి—చూసి ప్రాణం విసిగియున్నాడు. ఒకవేళ ఆరుబయట హోరుగాలిలో, ఆడుకోవడంకి అవకాశం చిక్కింది అనేపట్టుటికి ఎగిరెగిరి గంతులు వేసేడు.

ఇక్కడ వానికి సంపూర్ణమైన స్వేచ్ఛ దొరికింది. ఏమూలకి పరుగులుపెట్టినా పద్దనేవాడు లేడు. గట్టువెంబడినే చెడపరుగులు పెట్టేడు. గట్టుమీదినుంచి గుంటలోకి జరజరా జారేడు. మళ్లీ

పైకి వచ్చేసు. ఆ ఉత్సాహంలో ఎంతోతీవ్రంగాయున్న ఎండవేడిమి కూడా చాలచల్లగా వున్నట్లే తోచింది.

ఆ బురదగుంటవేసి తిరిగిచూడడానికి బహుశా సూర్యుడుకూడా సిగ్గుపడుతూవుండవచ్చును.

వచ్చిన ఒకనిముషందాకా రోమూ ఉత్సాహంగా ఆడుకున్నాడు. కాని, తరవాత అక్కడినుంచి లేచిపోవడానికి హడావిడిపడసాగేడు. అక్కడ నిలవబడడానికి కూడా అంగీకరించక లేచిపోదాం రమ్మని నాయనమ్మని వేధించసాగేడు. కాని, ఆమెకు వీనితో అటూ—ఇటూ తిరగడానికి ఖాళీయేదీ?—

నిరుత్సాహంఅంతా ఆప్రదేశంలోనే కాపురమున్నట్లు తోస్తూంది. రోమూ నెమ్మదిగా మన్నుతవ్వుతూన్న తాత దగ్గిరికి చేరి ఒక్కనిముషం శ్రద్ధగా పరిశీలించిచూసేడు.

ఎవ్వరికోసం తాతయ్యా! అంత పెద్దగొయ్యి తవ్వుతూన్నావు?

నికనేరు అదిరిపడ్డాడు. చేతిలోని పార వదిలిపెట్టి నిటారుగా లేచి నిలువబడ్డాడు. కోపంతోటీ— భయంతోటీ—ఆకుర్రవాడి నోరు నొక్కేడు, రాళ్ళలావున్న వేళ్ళతో.

"వెధవా! నోరుముయ్యి."

ఆరోజుమొదలు నికనేరు నిద్రమాటకూడా తలపెట్టడంలేదు. తాను బ్రదికియుండగా తనకుటుంబం సుఖపడాలనే వాంఛతో ఊరిఖే తవ్వి పోస్తున్నాడు. అర్ధరాత్రివేళకూడా ఆతడూ—ఆతని కుటుంబమూ— ఆ'బురదగుంట'ని వదిలిపెట్టడంలేదు. నిప్పుదగ్గిర

కాస్త సేపు కాచుకొని, కొంకర్లుపోయిన వేళ్లు సరిచేసుకోవడం, మళ్ళీ తవ్వుపని ఆరంభించడం, ఇదేపని.

ఒక్కళ్ళూ వినుకోర్కారు.

పని చాలవరకు పూర్తి కావచ్చింది. ఒకరోజున నికనేరు మన మడిని మోకాళ్ళమీద కూర్చుండపెట్టుకొని, బిరుసుగడ్డంతో బుగ్గల మీదా, గడ్డంక్రిందా కిచకిచలు పెడుతూ, తనమనసులోని కోరిక లన్నీ వాడి ముందర వెళ్ళబోసేడు.

"కోమా! త్వరలోనే మన కొత్త ఇంట్లోకి వెళ్ళిపోతాం. కాదూ?"

"ఛా! వెధవది. కుళ్లుకంపు. అక్కడికి పోవద్దు. ఇక్కడనే వుండిపోదాం. తాతయ్యా!"

నికనేరు ఒళ్ళుమండింది. మోటతనంగా వాడిని గెంటివేసేడు. చంపివేసేటంత కోపంతో కొరకొరా చూసేడు.

"చూస్తున్నా కాదు? వాలకం! వట్టి పెంకిఘటంలా తయారు అవుతూన్నాడు. మాఅందరి మోస్తరూ కాదు. వీడిని కొంచెం జాగ్రత్త పెట్టవలసిందే."

నికనేరు కాపురం వుంటూన్న బారకప్పకి దగ్గరనుంచే రైలుబాట పోతూవుంది. ఆబాటవెంబడిని రాత్రీ-పగలూ అనకుండా; ఎర్రని పెట్టెబళ్ళు విధీ-విరామం లేకుండా వస్తూ పోతూవున్నాయి. నున్నగా గొరిగించిన ముఖాలూ వీళ్ళూ కొత్త సైనికులు బండికిటికీ లలోనుంచి తలలు ఈవలకి పెట్టి ఆప్రాంతాలన్నీ పరిశీలిస్తూన్నారు.

జపానుతో-రష్యాప్రభుత్వం యుద్ధం తలపెట్టింది. ఈదురదృష్ట వంతులంతా ఆయుద్ధంలో బలిచేసివేయబడడానికై దూరప్రాచ్యదేశాలకి పంపివేయబడుతూన్నారు.

రాత్రిం-బగళ్ళు ఆచిన్న స్టేషను ఏడ్పులతోటీ పెడబొబ్బల తోటీ ప్రతిధ్వనించి పోతూంది. కొడుకుల్ని విడిచిపెట్టలేక తల్లులు ఏడుస్తూన్నారు. భర్తలభవిష్యత్తు తలుచుకొని స్త్రీలు ఏడుస్తూన్నారు. తండ్రులకోసం ఏడుస్తూన్న తల్లుల్ని చూసి చిన్నబిడ్డలు వెక్కి-వెక్కి-ఏడుస్తూ స్టేషనుమీది కప్పు ఎగరకొడుతూన్నారు.

ఇనుముయంత్రాలయంలో కూలీలు సమ్మె చేసేరు. 'రోలింగ్ మిల్లు' మూతబడింది. 'పైపులమిల్లూ' అంతే. ముడిఇనుము కరిగించే పెద్దపెద్దకొలిములు ఇంచుమించుగా మూతబడిపోయే స్థితికి వచ్చేయి. నికనేరు వగైరాలు కాపురం వుంటూన్న బ్యారక్సు రాత్రీ-పగలూ ఒక్కలాగ వున్నాయి. అక్కడివాళ్ళకి విశ్రాంతి అనే మాట దొరకడంలేదు.

ఆరోజున రోజూలాగే రాగిజుట్టూ అతడూ-నికనేరు అందరి కంటేముందే ఫ్యాక్టరీకూత ఆగకముందే గనిలో ప్రవేశించేడు. అందరికంటేనూ ముందు పనిలోకి వెళ్ళిపోవాలని హడావిడిగా ఫోర్మన్ దగ్గిరికి పరుగెత్తేడు. తానుకట్టుకుంటూన్న మట్టిగుడిసెను గూర్చి మనసులో ఎన్నో ఊహలు అల్లుకుంటూ మేస్త్రీని ఒక వక్కకి పిలిచేడు,

"గారిల్ గార్విచ్! ఈవేళనైనా కాస్త నన్నొక కంట చూడ

వయ్యా! కొంచెం సుతిమెత్తని భాగం చూపించు నీఉపకారం మర చిపోను. బాబువుకాదు?"

మేస్త్రీ కంగారుపడి, కాళ్లు యీడ్చించి, భుజాలు కుదుపుకొని, మనస్సులో ఇంత కుళ్లపెట్టుకొని మాటలాడేడు.

"అబ్బే ! చంపేసేవు. అల్లాంటి పని చేసేనని తెలుస్తే యజ మానిదగ్గరికి మళ్ళీ వెళ్ళగలనా? అభిమానం—పక్షపాతం—అన్నమా టలు చెవిని పడ్డాయంటే 'కారల్ ఫ్రాన్జివిచ్' యముడులా మీదపడ తాడు. చేసేవాడివి నువ్వూ బాగానే వుంటావు. చేయించుకొనేవాడు ఆతడూ సుఖంగానే వుంటాడు. మధ్యను నాకు వస్తుంది, ఈనక్క చావు. అయితేనేం అడక్క-అడక్క అడిగేవు. నీకుపదిహేనో నెంబరు బ్లాకు ఇస్తాను. ఇవ్వగలను. కాని,....చూసేవూ.... అక్కడ ఇంకా కప్పు సరిచేయలేదు. దూలాలూ, స్తంభాలూ, చాలాచోట్ల అమర్చాలనుకుంటాను, మరి."

"పరవాలేదు. ఆసంగతి నేను చూసుకుంటాను కాదూ. అక్క డికి బళ్ళవాళ్ళనికూడా పంపించనక్కరలేదు.

ఆ పదిహేనో నెంబరుబ్లాకును గూర్చి నిన్నరాత్రి జరిగిన గంద్రగోళం పాపం నికనేరుకి ఏమీ తెలియదు. అక్కడ బొగ్గు త్రవ్వడానికంటూ వెళ్ళిన 'కోవల్' కొద్దిసేపటిలోనే ఆఫీసుకి తిరిగి వచ్చేసి తనని ఇంకోచోటికి పంపించమని చెప్పేడు.

" ఫోర్మన్! నేనక్కడ ఇంక ఒక్క-క్షణంకూడా పనిచేయ లేను. గునపం వేసినప్పుడల్లా కప్పంతా అదిరిపోతూంది. ఏదో

వింతగా చప్పుడు అవుతూంది. ఇప్పుడో- అనకో అన్నట్లు కూలి పోవడానికి సిద్ధంగా వుంది. దూలాలూ-స్తంభాలూ బాగా పెట్టి, కప్పు గట్టిపరుస్తేగాని, అక్కడికి ఎవ్వరినీ పంపించవద్దు."

"ఏమిటిదంతా నీఒక్కడికే వచ్చిందా ఏమిటి? ఎంతమంది పనిచేయడంలేదు?"

"చేసేవాళ్ళని చేయనీయండి. నన్ను మాత్రం అక్కడికి పంపించవద్దు. మరోచోటు చూపించండి."

"అక్కడికి పోయి పనిచేస్తేచేయి. లేదా వెళ్ళిపో. సోమరి పోతులతో మాకేమీ పనిలేదు"

"మీకంత కోపం రావడానికి నేనేమీ అనలేదు. అక్కడపని చాలా అపాయకరం అని చెప్పుతూన్నాను."

'ఫోర్మన్' మండిపడ్డాడు.

"చాలులే. ఇంక నోరుమూయి."

'ఫోర్మన్' తమరిని ఎక్కడికి వెళ్ళమంటాడో తెలుసుకుం దుకు వచ్చిన కూలీలంతా పైసంభాషణ నంతనీ వింటూ నిల్చు న్నారు. 'కోవల్' ని గద్దించి ఫోర్మన్ వాళ్లకేసి తిరిగేడు.

"పదిహేనో నెంబరు బ్లాకులోకి ఎవ్వరు వెడతారు పనికి?"

కూలీలంతా మొగమొగాలు చూసుకొని గొణుక్కుంటూ వెను కతగ్గేరు. 'కోవల్' చెప్పినదాంట్లో అబద్ధంలేదని వాళ్ళందరికీ తెలు సును. ఎన్నోరోజులు కాలేదు కూడా, 'బ్రోకిన్' అనేవాడిమీద పద హారుటన్నులు బరువుగల పెద్దఅండ విరిగిపడింది. ఆతడిని పైకి

తీసేటప్పటికి పాపం నాలుకకరుచుకొని- నోరుతెరుచుకొని- చచ్చి పడియున్నాడు.

"పదిహేనోనెంబరుబ్లాకులో పనిచేయడానికి ఎవ్వరూ అంగీకరించలేదు. కాని, నికనేరు జంకూ—కొంకూ లేకుండా అక్కడి పనికి సిద్ధం అయ్యేడు. కప్పు ప్రమాదకరంగా వుందని అతనికి తెలుసు. కాని, నేలను తవ్వినంత సులువుగానూ బొగ్గు తవ్వవచ్చును. కప్పు ప్రమాదకరంగా వుంటే నష్టంఏమిటి? ఒక్కమారుగా విరుచుకు పడదుకదా? చెవులు దోరపెట్టుకొని వింటూ జాగ్రత్తగా ఉండి అపాయం కలుగుతుందని తోచేటప్పటికల్లా పారిపోయి వచ్చేద్దాం. అనుకున్నాడు.

తనకు సంభవించిన విషమావస్థ చులకనగా ఒకరిమీదికి తుడుచుకు పోయినందుకు 'ఫోర్మన్' ఎంతో సంతోషించేడు. పదిహేనో నెంబరుబ్లాకులో పనిచేయడానికి మంచి దిట్టమైనవాడిని పంపించేనని వెంటనే యజమానికి 'ఫోన్' చేసేడు.

నికనేరు పనిలోకి వెళ్ళిన వార్త వినగానే కూలీలంతా తల పంకించేరు.

"జింజరు నికనేరు పదిహేనో బ్లాకులో పనిచేయడానికి వెళ్ళేడుట. విన్నారా."

"దురాశ. ముసిలిపీనుగుకి."

"వాడికీ రోజులు దగ్గిరపడ్డాయి." అంతా తలో మాటా అన్నారు.

నికనేరుకి విపరీతంగా దాహంఅవుతూంది. పళ్లుగిట్టకరుచుకు పోతూన్నాయి. నాలిక పిడచకట్టుకుపోతూంది. గొంతుక వాచివట్ల యింది. కాని, తాగ్రిగడానికి నీరు కావాలంటే ఎంతోదూరం పోవాలి. పోవడానికి- రావడానికీ అధమం అరగంటయినా పడు తుంది. కాలంఅంతా వ్యర్థం అయిపోయినట్లే. ఎంతోవిలువైన సమయాన్ని వ్యర్థం చేయడానికి ఆతడికి ఏ మాత్రిమూ ఇష్టం లేదు. నికనేరు ఇంకఆగలేకపోయాడు. అటూఇటూచూసి కొంచెం తడిగా వున్నచోటికి జరిగి, చెమరుస్తూన్న గోడలనుంచి బొట్లు బొట్లుగా పడుతూన్న ఊటనీటిని తడిఆరిన పెదవులతో చప్పరిం చేడు. తుపాకీమందు వాసనగాని, వెగటుదనంగాని, ఆతడికి తెలి యలేదు.

'వెంటిలేటరు'కి బయట ఈలలు వేస్తూ ఈదురుగాలి గందరి గోళం చేస్తూంది. జారడానికి సిద్ధంగావున్న ఒకపెద్ద బొగ్గుఅండకి అవతల బలికిపోయిన చెట్టుమొదట్లో ఎలకలు చప్పుడు చేస్తూ న్నాయి. దూరంగా ఎక్కడో బొగ్గుగుట్టలమధ్య ప్రవహిస్తూన్న నీటిఊటల జలజలధ్వని కొద్దికొద్దిగా వినిపిస్తూంది.

నికనేరు తాను తవ్విన బొగ్గును బళ్లకెత్తి లాక్కుని వెళ్ళ డానికి తయారయ్యేడు. గుండెలపైన కట్టుకొన్న కాన్వాసుపట్టాకీ, ఆసన్నని స్లెడ్జిబండీకీ,బలమైన తాటితో బిగించికట్టి లాగుతూన్నాడు.

బళ్లు ఎంతో బరువుగా వున్నాయేమో నికనేరు పట్టుకోసం ఇంచుమించుగా మోకాళ్లకంటా వంగి లాగుతున్నాడు. కాన్వాసు

పట్టా ఒరుసుకొని, మెడచుట్టూ ఎర్రగా కందిపోయింది. గాజుకంటే నూగూడా పదునుగావున్న బొగ్గుముక్కలకి తగిలి, తెగి చేతులూ- కాళ్ళూ రక్తం చిమ్ముతూన్నాయి.

ఏమయినా సరే నికనేరు పట్టు వదలతలుచుకోలేదు. ఎంతో ఓర్పుతో పని చేస్తూన్నాడు. బండిలాగించేటందుకు మనుష్యుల్ని కూడా పెట్టనక్కర లేకపోయినందుకు ఆతడెంతో సంతోషించేడు. ఒక్కొక్క తోవకి నలభై కోపెక్కులు ఇచ్చుకోవాలి. మాటలా? తనసంపాదనలో అధికభాగం బళ్లవాళ్ళకే ఇస్తే తన ఇంటి సంగ తేమరి.

లిఫ్టు నికనేరును బయటకి తెచ్చి ప్రపంచంముందు నిలవబె ట్టేటప్పటికి బాగా చీకటి పడిపోయింది. నక్షత్రాలు స్పష్టంగా కని పిస్తూన్నాయి.

ఒక్కక్షణంకూడా ఆతడు ఎక్కడా నిలవబడలేదు. సరాసరి 'బురదగుంట' కేసి నడిచేడు. మేరీనా ప్రొద్దుటినుంచీ వంచిన నడ్డి ఎత్తకుండా ఒక్కవిధంగా తవ్వివోస్తూంది, మన్ను.

నికనేరు త్వరగా కాళ్ళూచేతులూ మొగం తొలుచుకున్నాడు. ఆదరా- బాదరా రెండుముక్కలు నమిలి, ఇన్ని నీళ్ళుతాగి మళ్ళీ పనికి అడ్డపడ్డాడు.

కొంతలోతుదాకా గునపంతో తవ్వి పారపుచ్చుకొని ఆమ న్నంతా ఎగకొట్టేడు. తర్వాత కావిడిబద్దకి రెండుపెద్దబొక్కెనలు తగిలించి, మురుగుకాలవకేసివెళ్ళేడు. నీరుపోసి రెండుమూడు

మార్లు మన్ను పారతో ఎగకొట్టి కలియతొక్కడానికని పాజామా బాగా పైకి ఎగదుట్టేడు. కొంతసేపు కలియతొక్కి చిన్నచిన్న ముద్దలు చేసేటందుకు దిగతొక్కుతూ గుమ్మందగ్గిరకి ఎన్నిముద్దలు కావాలో ద్వారబంధం పైన ఎన్నిముద్దలు కావాలో ఆలోచించ సాగేడు.

తొలికోడి కూసేవేళకి పనిచాలించి రాత్రిభోజనానికి లేచేడు. పెళ్లాం చేతికిచ్చిన రొట్టె నములుతూ మిలమిలా మెరుస్తూన్న నక్షత్రాలవంక చూసి, నికనేరు కొడుక్కి బుద్ధిచెప్పసాగేడు.

"ఓస్టపు! ఎప్పుడూ సమ్మోగాంద్రతో కలియబోకేం. పెళ్లాం—పిల్లలున్నవాడివి. త్వరలోనే ఇంకోపిల్లాడు కలగడానికి సిద్ధంగా వున్నాడనే సంగతి మరిచిపోకు."

★ ★ ★ ★

ఫ్యాక్టోరీగొట్టం ఇంకా కూత ఆపివేయకముందే, ఓస్టపు ఉక్కుకొలిమి దగ్గిరికి చేరుకున్నాడు. ఏ ఇంజనీరో—ఏ మేస్త్రీయో తన్నుచూసి మెచ్చుకోవాలని ఆతని ఊహ. అందుకోసం వస్తూనే మేస్త్రీ బ్యూటిలోకినుని వెదకడానికంటూ బయలుదేరేడు.

"మికోలా నికోలేవిచ్! అంతా క్షేమమా?"

'ఫోర్మన్' మొగంకేసి గుచ్చిగుచ్చి చూస్తూ ఆతనితో చేయి కలిపేడు.

"మంచి దిట్టమైన వాడివోయి" అంటూ బ్యూటిలోకిణ ఓస్టపుభుజం తట్టేడు.

ఆ కాస్త్రమాటా అనిపించుకొని ఆతడు అతివేగంగా 'ఫౌండ్రీ' కేసి పరుగెత్తేడు. ఓస్టపు ప్రతీపనికీ అడ్డపడే స్వభావం. సహజంగా చురుకైనవాడు, తెలివైనవాడు, బలమైనవాడూ, కూడాను. ప్రతి పనిలోనూ ఆతడు చూపించే చురుకుదనంచూసి కూలీలంతా అత గాడికి 'రేచు' అని పేరెట్టేరు. ఓస్టపు ఆట్టేకాలం 'స్మెల్టరు' గా వుండిపోలేదు. రెండోవాడి సాయమేనా అక్కరలేకుండా తాను ఒక్కడూ దిమ్మలకి దిమ్మలు ఇనుము కరిగించి పోస్తూంటే, కదుములుగట్టి కదులుతూన్న కండరాలూ తీర్చిదిద్దినట్లున్న శరీరపు పొంకమూ చూసి, మేస్త్రీ దంగైపోయేడు. సామాన్యంగా ఎంతో మంది సాయంపడితేగాని తెమిలేపనికాదది. అందుచేత త్వరలోనే ఆతణ్ని కొలిమిగానికి సహాయకునిగా నియమించేరు.

ఓస్టపుని తనకి సహాయంగా నియమించిన రోజున బోసి 'గార్బజ్' ఎంతోసంతోషించేడు. చేతిలోని గునపం, చేతినున్న గ్లోవులూ, క్రిందపడేసి ఎంతో ఆప్యాయంగా దగ్గిరకిచేరి చేయి పట్టుకున్నాడు. ఆతని మొగాన ఉత్సాహశూన్యమైన మందహాసం వెలిసింది.

"బాగుందోయి! నాయనా!"

'గార్బజ్' ఓస్టపు దండలునొక్కి గుండెలమీద శట్టేడు.

"రాయిలాంటి వొళ్లు. ఇనపదుక్కల్లా వున్నాయి దండలు. అయితేనేం? యజమానులు నీబలాన్నంతా పీల్చేస్తారు. విన్ను తినేస్తారు, నీశరీరసౌఖ్యంకూడా చూసుకుంటూవుండు. సరే–కాని,

రేపు సెలవు కాదు? ఒక కప్పు టీ త్రాగుదాం. మాయింటికేసి రా. మరిచిపోకు."

ఆరోజునే సాయంకాలంపూట పనిలోంచి ఇంటికి పోయే సమయంచూసి మేస్త్రీ ఓస్టపుని పట్టుకున్నాడు.

"ఈవేళ నువ్వు పెద్దపనిలోకి వెళ్లేవుకాదు? ఆ విషయం నీతో ముందుగానే చెప్పుదాం అనుకున్నాను. నువ్వు ఇంత త్వరగా పైకి రాగలిగినందుకు నాకెంత సంతోషంగా వుందను కున్నావు ? నేను చేసిన పని ఉపకరించినందుకు ఆనందం అవుతూంది."

బ్యుటిలోకిన్ అభిప్రాయం ఏమిటో అర్థంకాక ఓస్టపు మౌనం వహించేడు. 'ఫోర్మన్' ఎంతోశాంతంగా తాను వచ్చిన విషయం తెలియపరిచేడు.

" ఈ సంతోషసమయంలో స్నేహితుల్ని మరచిపోకేం. ఈవేళ కాస్త ఆలా షికారుపోయివద్దాం. రా, ఈవేళ తీరుబడిగానే వున్నానులే."

"ఇప్పుడు నాదగ్గిర ఒక్కకానీకూడా లేదోయి. జీతాలు రాలేదనే సంగతి నువ్వెరగవూ?"

బ్యుటిలోకినుకి ఎంతేనా కోపం వచ్చింది.

"అంతే? నీదగ్గిరలేదు కాదూ ? లేదూ?—సరే. జ్ఞాపకం వుంచుకో. రేపు నీవెక్కడ ఉంటావో ఆలోచించుకో."

మేస్త్రీ విసురుకు లేచిపోయేడు.

"మికోలా ! మికోలా !"

ఓస్టపు హడిలిపోతూ ఆతనిని అనునయించడానికి వెంట పడ్డాడు.

ఆరోజురాత్రి వాళ్లిద్దరూ మళ్లీ ఆ 'అగనెస్కోవ్' 'విశ్రాంతి భవనం' లో అదేగదిలో ఆమస్లినుతెరలవెనకనే కలుసుకున్నారు. 'కాన్సర్టినా' మీద అదే 'సీ—గల్' పాడబడుతూంది. వెనకటిలాగే బ్యుటిలోకినుచెదత్రాగి ఓస్టపుమీదికి ఒరిగి మూలుగుతూన్నాడు. గోడలకి అంటించిన వార్షికకాగితాలమీద బొద్దింకలు జరజరా పాకుతున్నాయి. తెల్లనికళ్లతో నిర్జీవంగా చూస్తూ ఎర్రపీతలు వెనకటిలాగే లోహపుపళ్లెంలో అమర్చివున్నాయి.

మనసులోని నిరాశనూ—దుఃఖాన్నీ అణుచుకుందుకు ఓస్టపు చెదత్రాగేడు. ఆతని బుగ్గమీద ఈగ ఒకటి వ్రాలింది. ఓస్టపు దానిని తోలివేసేడు. అది ఒక్కక్షణం అటూ—ఇటూ తిరిగి మళ్లీ ఆ ఓస్టపుబుగ్గమీదనే వాలింది. తెగత్రాగి వున్నాడేమో ఆతడు ఈ అవమానాన్ని భరించలేకపోయేడు. ఎంతోకోపం—చిరాకూ—విసుకూ— కలిగి, ఆవేశంతో ఈగని తరిమికొట్టడానికి టేబిలుమీది గుడ్డ లాగేడు. ఆ విసురుకి దానిమీదనున్న పళ్లేలూ, పళ్లేలలో నున్న పీతలూ, దడదడా క్రిందబడి పెద్దధ్వని కలగచేసేయి. తినబోయే—తినబోయే పదార్థాలు క్రిందపడగానే ఓస్టపు కోపం మరీ రెచ్చిపోయింది. కోపం పట్టలేక పళ్లుబిగించి, సత్తువకొద్దీ బల్లమీద ఒక్కగుద్దు గుద్దేడు. ఆ అదురుకి బల్లమీదనుంచి ఇదివరకు

పడగామిగిలిన వేమయినాఉంచే దొర్లి బద్దలై నాలుగుమూలలకీ చెదిరేయి. మత్తులోనున్న బ్యూటిలోకినుకి ఆచప్పుడుకి తెలివి వచ్చింది. ఓస్టపు జబ్బపట్టి గుంజుతూ దబాయించసాగేడు.

"ఏమిటోయి! మతి పోయిందా యేం! అంత గోల చేస్తా వెందుకు?"

ఓస్టపు తలఎత్తి చూసేడు. చూచేటప్పటికల్లా మేస్త్రీయొక్క పట్టెడు గొంతుముడీ కంటబడింది. త్రాగి—విసుగుతో—కోపంతో—చిరాకుగావున్న ఓస్టపు అప్రయత్నంగా మేస్త్రీ మెడమీద ఒక్క దెబ్బ కొట్టేడు.

ఆదెబ్బతో మేస్త్రీకి మత్తు పూర్తిగా వదలిపోయింది.

"ఓరి! మొండిపీనుగా! నన్నేనుటా్రి, కొట్టడం? మాటలాడ వేం? నేను చేసిన ఉపకారానికి ఇదిట్రా ఫలం? పశువులు కాచుకొనే వెధవవి తీసుకుపోయి పని ఇప్పిస్తే కొట్టక ఏంచేస్తావు? నీముండ మోయా! కొడతావా?—కాచుకో. నీఅవస్థ కుక్కలకి కూడా లేకుండా చేస్తాను."

ఓస్టపు మత్తుకూడా వొదిలిపోయింది. మేస్త్రీ మాటలతో ఆతవి బుర్ర తిరగడం ఆరంభించింది. హఠాత్తుగా ఏడ్పు వచ్చింది. "ఇంతదబ్బూ తగలేసి ఆఖరుకి ఈలాగ చేసేనేమిటి?" అని కళ్ళ నీరు కార్చేడు. ఇంక ఆప్రదేశంలో ఒక్కక్షణం నిల్చుండలేకపో యేడు. కళ్లుమూసుకొని, తూలిపోతూ, దారిలో అడ్డంగా వున్న కుర్చీలు—తలుపులు—ద్వారబంధాలు—పట్టుకొని వీధిలోనికి వచ్చేసేడు.

చల్లనిగాలి మొగంమీద పడుతూన్న జుట్టును రేపింది. గుండీలులేవి చొక్కాలోంచి, విచారంచేత మండిపోతూన్న గుండెలమీదికి గాలి పోసుకుంది. కాని వొళ్లు చల్లబడేటప్పటికి వోడ్కా మత్తు కూడా పూర్తిగా వదిలిపోయింది.

ఓస్టపు కొంచెంసేపు వీధిలో అటూ-ఇటూతిరిగేడు. తిరిగి తిరిగి కాళ్లుపీకేక పక్కనున్న ఒకయింటి ప్రహరీగోడనానుకొని చదికిలబడిపోయేడు.

"మేస్త్రీ ఈవిషయం మరచిపోతాడా? నాకపకారం చేయ కుండా వుంటాడా?"

అతని ప్రశ్నకి సమాధానం ఇచ్చేటందుకు ఎవ్వరున్నారు? నిరాశతో మొగం కప్పుకొని, ఓస్టపు తనకితానే సమాధానం ఇచ్చుకున్నాడు.

"వాడి దుంపతెగ: మరిచిపోడు. రాసేస్తాడు. నన్ను నలిపే స్తాడు. తప్పదు."

తూర్పున తెలిరేకలు కనపడేదాకా ఓస్టపు ఆమంచులో వీధు లన్నీ చెదతిరిగేడు. బెర్జియనుతోపుల వెనక్కాల నల్లని ఆకాశంలో నీలిచ్ఛాయలు ప్రకటం అవుతూన్నాయి. అప్పుడు బయలుదేరేడు, బ్యుటిలోకిను ఇంటికేసి.

గుమ్మం దగ్గిరికి వెళ్ళి, మునివేళ్ళతో నెమ్మదిగా తలుపులు తట్టేడు. లోపలనుంచి నిద్రతో జోగుతూన్నవాడి స్వరం విన పడింది.

"ఎవరు వారు?"

తాను వచ్చిన పని ప్రారంభించవలసిన విధానం తెలియక ఓస్టపు బుర్రగోక్కుంటూ నోరుమూసుకొని ఊరుకున్నాడు.

"ఎవరు వారు?"

అని మళ్లీ లోనుంచి కేక. ఈమారు ధ్వనిలో ఆతురత—భయమూ వ్యక్తం అవుతూన్నాయి.

"మికోలా! మికోలా! నన్ను క్షమించు. అప్పుడు నాకేమీ ఒళ్లు తెలియదు. నేను చెడతాగి ఉన్నసంగతి నీకూ తెలుసును. మికోలా! ఈమారుకు నన్ను క్షమించు."

ఒక్కగుక్కలో ఓస్టపు తనఆవేదననంతా వెళ్ళగక్కేడు.

ఈమారు తలుపువెనకనుంచి సమాధానం ఏమీ రాలేదు. ఎవ్వరో మెట్లెక్కిపోతూ వినపడీ వినపడనట్లుగా గొణుగుతూన్నట్లు చెవిని పడింది.

"రేపు చూద్దు గానిలే. నామజారుచి చూపిస్తా."

మర్నాడు వుదయం బారక్సులోంచి పనిలోకిపోతూ గార్బజ్ నికనేరు గదిముందు ఆగేడు. ఒకప్రక్క బల్లమీద ఓస్టపూ—భార్యా కూర్చుండి ఉన్నారు. ఇద్దరిముఖాలు విచారపూరితంగా వున్నాయి. గార్బినా ఎందుకో వెక్కివెక్కి ఏడుస్తూంది. ఓస్టపు మోకాళ్ళమీద తలపెట్టుకొని ఏమిటో ఆలోచిస్తూన్నాడు. గార్బజ్ బల్లదగ్గిరికి వెళ్ళి ఓస్టపు భుజం తట్టేడు.

ఆతడు తలఎత్తిచూసేడు. తన విచారాన్నంతనీ ఎవ్వరితో

నైనా చెప్పుకోవాలి. అప్పుడు హృదయభారం తగ్గాలి. వెంటనే గార్బజ్‌కి బల్లమీద చోటుఇచ్చి ఓస్టపు గతరాత్రి జరిగిన విషయాలన్నీ ఆతనితో ఏకరువు పెట్టేడు. అంతా విని ఆఖరున గార్బజ్ ఒక్కనిట్టూర్పువిడిచేడు.

"ఈలాగ జరగడానికి ఇదే మొదటిమారు కాదు. నువ్వే మొదటి వాడివీ కావు. వాళ్ళ రోజువారీ పనే ఇది. కొత్తకుర్రాళ్లని దరికి చేరతీయడం, వాళ్ళని పీకుకొని తినడం."

ఈసంఘటనం జరిగి మూడురోజులు అయిపోయింది. ఆ మరునాడే ఓస్టపు పూర్వపు ఉద్యోగంలోకే—స్మెల్టరుగానే—చేరవలసి వచ్చింది. ఈవిషయంలో మాట లాడడానికీ, నిజం నిరూపించడానికీ, ఆతడు డైరక్టరును కలుసుకోవాలని ఈమూడురోజులలోనూ ఎంతేనా ప్రయత్నం చేసేడు. మాటవినడం— ఉద్యోగం ఈయడం, విషయం ఏలాగున్నా ఆఖరుకి డైరక్టరుగారి దర్శనలాభం కూడా లభించలేదు.

ఓస్టపు కళ్లనీళ్ళు కుక్కుకుంటూ మిత్రులకేసి తిరిగేడు.

"వీళ్ళ ఉద్దేశ్యం ఏమిటి?"

గార్బజ్ వెనకనుంచి ఆతని భుజాలమీదికి వొంగి— "మరేమీ లేదు. నిన్ను నమిలివేయడమే వాళ్ల ఉద్దేశ్యం. అంతకంటె మరేం కాదు."—అన్నాడు.

ఈవిధంగా గార్బజ్-ఓస్టపును తనకలుపుగోలుతనంచేత ఆకర్షించేడు. ఆతని భావాలలోనికి ఎక్కేడు. ఆతని జీవితరంగంలోకి

ప్రవేశించేరు.

'రోలింగ్‌మిల్లు'లో సమ్మె ఆరంభం అయింది. సమ్మెదార్ల ప్రతినిధులు, కొలిములదగ్గరికి వచ్చి వారిని కూడా తమతోపాటు సమ్మెచేసి సానుభూతి చూపమని అడిగేరు. గార్బజ్ వెంటనే తన పనిముట్లు నేల బార వేసేడు. అందరికంటేనూ ముందు ఓస్టపు దగ్గిరికి పరుగెత్తేడు.

"తక్షణం పని మానేసెయ్యి." అంటూనే గార్బజ్— మౌల్డర్లనీ- రోలర్లనీ- గాస్‌ఫిట్టర్లనీ- బోధించి సమ్మెలోకి తీసుకురావాలని ఆమూలకి పరుగెత్తిపోయేడు.

"పని మానేయడమే!"

ఓస్టపు ఆలోచన ఆరంభించేడు. వెంటనే తండ్రిచేసిన హితోపదేశం జ్ఞాపకానికి వచ్చింది.

"కోమా-, గార్పినాల తిండి మాటేమిటి? వీళ్ళకేం చెప్పుతారు. నేను మాత్రం పని మానను."

గార్బజ్ వెనుతిరిగివచ్చేడు. మారుమాట లేకుండా ఓస్టపు చేతిలోవి పట్టుకారు లాక్కొని దూరంగా విసిరేసేడు. వెంటనే అతని రెక్క దొరకపుచ్చుకొని, కొలిములలో పనిచేస్తూన్న కూలీలంతా పోగుపడుతూన్న చోటికి బరబరా ఈడ్చుకుపోయేడు.

ఆకూలీలంతా బారులుగాతీరి ఏవిధమైన పాటలూ- కేకలూ లేకుండా నిశ్శబ్దంగా కార్ఖానాలోంచి బయటికి వచ్చేసేరు. బయటికి వచ్చి తిన్నగా బారక్సుదగ్గిరికి చేరేరు. గార్బజ్ బారక్సులో ఉన్న

జనాన్నికూడా పోగుచేసి ఉపన్యాసం ఆరంభించేడు.

"కామ్రేడ్స్!

"మనం అందరం సమ్మె ప్రారంభించితీరాలి. యజమానులు మనల్ని పశువులకంటేనూ హీనంగా చూస్తున్నారు. ఓస్టపుని మింగేసినట్లు మనల్ని అందర్నీ నమిలేస్తున్నారు. ఈ దౌర్జన్యం ఆగిపోయేదాకా మనం ఒక్కకట్టుమీద వుండి పనిలోకి వెళ్లడం మానాలి."

★ ★ ★ ★

ఎన్నో రోజులనుంచి నికనేరు నిద్ర పోవడంలేదు. తనమట్టి గుడిసె సాధ్యమైనంత తొందరలో పూర్తి చేసివేయాలని ఆతని ఊహ. అందుకోసమే నిద్రమానుకుని కూడా ఆ చీకట్లో తెల్లవార్లూ పనిచేస్తున్నాడు. మళ్ళీ సూర్యోదయం కాకపూర్వమే గనిలోకి దిగి అక్కడిచీకట్లో రెక్కలు విరుచుకుంటున్నాడు.

జింజరు నికనేరు శరీరానికి ఎన్నడూ అలపు అనేమాటే సోకలేదు. ఇంత కష్టం చేయవలసివస్తూందనేనా ఎన్నడూ గొణగ లేదు. తిండి సరిపడటం లేదని మూలగలేదు. బహుశా ఆతడు ఈమాదిరి కష్టజీవితానికే అలవాటు పడియుంటాడు. ప్రస్తుత స్థితికి భిన్నమైన జీవితం ఎన్నడేనా గడిపివుంటాడని తోచదు. అధమం అలాగంటి ఆశేనా వున్నట్లు కనపడదు. స్వగ్రామంలో నికనేరుయొక్క బలదార్ఢ్యాలకీ— ఓర్పుకీ మంచిపేరు వుంది.

పదిహేనో నెంబరు బ్లాకులోనేతనకి పని ఈయమని ఆతడు

మేస్త్రీని ప్రార్థించేడు. ఏమంటే అంతమెత్తగా తెగే ప్రదేశం ఇంత వరకెన్నడూ ఆతనికి ఈయబడలేదు. ముట్టుకుంటే చాలు, అండలకి అండలు ఊడి వస్తూన్నాయి. బళ్లవాళ్ళు వట్టిబళ్ళు తెచ్చి అందీయలేక కాళ్లు విరగతొక్కుకుంటూన్నారు.

ఒక్కతోపతో ఎన్నోగజాల మేరదాకా బొగ్గు ఖాళీ అయిపోతూంది. బొగ్గుత్రవ్వడంలో శ్రమ ఏమాత్రమూ కలగనప్పుడు, మళ్ళీ బోట్లు పెట్టడం, దూలాలు ఎత్తడం, మొదలయిన చిల్లర పనులకికాలం వ్యర్థం చేయడం మంచిపని కాదని నికనేరు అబాధకి అంగీకరించలేదు. ముట్టుకుంటే చాలు. బొగ్గు కూలిపడుతూంది. ఇంక అతడు శిపం ఎత్తినట్లే పనిచేసేడు.

'ఫోర్మన్' పరీక్షకివచ్చి సాధ్యమైనంత దూరంలో, 'బాధ కలగదు' అని తోచినంత దూరంలో, నిలబడి నికనేరు పనిని పరీక్షించేడు. తాను నిలవబడ్డచోటునుంచి ఒక్క అడుగు ముందుకువేయడానికి అతడు హడిలిపోయేడు. ఆదూరాన్నుంచే—"తాతా! బోట్లు పెట్టాలిసుమా, జాగ్రత్త.—" అని ఒక్కకేకపెట్టి తనపని పూర్తి అయినట్లే వెనుతిరిగేడు. గనిపనివాండ్రుపయోగించే లాంతరు ఇచ్చే గుడ్డివెలుతురు క్రమంగా అదృశ్యం అయిపోయింది. ఆతడు వెళ్ళిపోయేడు.

మాటిమాటికీ ఎవ్వడోవచ్చి, తనని పీక్కుతినకుండా ఉండేటందుకు అక్కడా— అక్కడా నాలుగైదుచోట్ల దూలాలూ—స్తంభాలూ— పెట్టి నికనేరు తన వాలాయిత తీర్చుకున్నాడు. నిజా

నికి ఆబోట్లు ఏమూలకీ చాలవు. కాని, ఆవిషయం ఎవ్వరికి పట్టింది? ఆరోజునే సాయంకాలంవేళ అంతా పనిలోంచి బయటికి వచ్చేవేళ, ఎన్నోరోజులనుంచి ఎదురుచూస్తూన్న ఆప్రమాదం తటస్థించింది.

బండివాడు ఖాళీట్రక్కులు లాగుకొనివచ్చి ఇంకా గుర్రాల్ని పూర్తిగా విప్పనేనా విప్పలేదు. దూరాన ఎక్కడో ఉండి— ఉండి ఒక్కొక్కమారు 'ఫెళఫెళ'మంటూవినిపించసాగింది. అంతకంతకి ఆధ్వని తొందరతొందరగా వినిపించసాగింది. కొలదినిముషాలలో మరీప్రబలమైపోయి, మరతుపాకీ కాలుస్తూన్నట్లు ఫెళా— ఫెళా అంటూఅవిరామంగా వినిపించసాగేయి. బరువుకి ఆగలేక దూలాలూ— స్తంభాలూ, విరిగిపోతున్నాయనీ, కప్పు కూలిమీద పడిపోతూందనీ, ఆకుర్రాడు ఒక్కక్షణంలో గ్రహించి లగాములు తెంపేసి గుర్రాల్ని తోలేడు.

ఆకుర్రాడు ఇంకా పది అడుగులు కూడా పెట్టలేదు. పెద్దగాలి విసురువచ్చి, కాళ్ళు తేలిపోయి, నేలమీద పడిపోయేడు. పడిపోతూన్నప్పుడు— ఆఫెళఫెళలమధ్య ఆగాలిహోరులో— నికనేరు పెట్టిన వెర్రికేక స్పష్టంగా ఆతని చెవినిపడి క్రమంగా ఆధ్వనులలో మునిగిపోయింది.

నికనేరును తవ్వి బయటికి తీసేటప్పటికి పూర్తిగా రెండు రోజులు గడిచింది. దళసరిపాటి గోనుగుడ్డలో చుట్టపెట్టి అతనిశరీరాన్ని కూలీలు మోసితెచ్చి వెలుగులో పడవేసేరు. గుగ్గిలపువాసన వేస్తూ పరిమళిస్తూన్న దేవదారుబల్లల గుట్టమీద నెమ్మదిగా అతనిని

పడుకో పెట్టేరు.

నికనేరు ఆబల్లలమీద నిలువునా చైతన్యం లేకుండా పడియున్నాడు. అతని ఎర్రని బిరుసుగడ్డం బొగ్గుదుమ్ముతో అట్టకట్టుకుపోయి, పాతచీపురుకట్టలా కనిపిస్తూంది. గుండెలు నల్లగా కమిలిపోయి వాచి, ఉన్నాయి. గుండెలమీద దట్టంగా– పొడుగ్గా– పెరిగిన వెంద్రుకలనిండా తడిమన్నూ–బొగ్గుదుమ్మూ–పేరుకునివుంది. బహుశా పరుగెత్తుతూ పడిపోయినాడేమో, ఒకచేతితో లాగు పైకి ఎగలాగి పట్టుకున్నాడు. ఆచేతిమీద నన్నీ గాయాలే.

కూలీలంతా ఆతనిచుట్టూ మూగి, ఒకరిభుజాలమీద ఒకరు వొంగి చూస్తూన్నారు. ఆ ం బ్యు లె న్సు మనిషి వాళ్లనందరినీ దూరంగా నిలపపెట్టడానికి ప్రయత్నిస్తూన్నాడు.

"అద్దం లేవండి. అల్లా దూరంగా వెళ్లండి. అతని కేమీ ప్రమాదం లేదు. కొంచెం కముకు దెబ్బలు తగిలేయి. అంతే! కొంచెం గాలి తగలనీయండి. ఇళ్లకి వెళ్ళిపోండి."

మనస్సులో ఇష్టంలేకపోయినా కూలీలు ప్రక్కకి సర్దుకున్నారు. భుజాలమీద కప్పుకున్న చిన్న తుండుగుడ్డ గాలిపాటుకి ఎగిరిపోకుండా కొసలు నొక్కిపెట్టి, ముసిలి 'మేరీనా' కుంటుకుంటూ పరుగెత్తుకొని వచ్చింది.

గాలి తగిలేటప్పటికి నికనేరు కొద్దిసేపటిలోనే తేరుకున్నాడు. ఒక్కమారుకూడా ఆతడు మూలగలేదు. తనంతతానే ఒక ప్రక్కకి ఒత్తిగిల్లేడు. నోటమాటరాకపోవడంచేత పొట్టమీద కొట్టు

కొని ఆకలివేస్తున్నట్లు సంజ్ఞచేసేడు. నెమ్మదిగా చేతులమీద ఆను కొని లేచి, కూర్చుని, దగ్గుకుంటూ తుబుకూ— తుబుకూ ఉమ్ము లువేసేడు. మనిషి పాలిపోయి వున్నాడు. చెప్పిదవుడలు పడ్డాయి. కళ్ళులోతుకు పోయినాయి. ముఖం దోక్కుపోయి కళాహీనంగా వుంది. ముఖంమీద అట్టకట్టిపోయిన ఆవ్రనిగడ్డం ఒక్కటే కొస్త నిండుగా కనిపిస్తూంది.

అంబులెన్సుమనిషి పాలుపోసిన రేకు 'గోర్ణం' మూతికి ఆనిం చేడు. కంఠంఎముకలు కదిలేటట్లు ఎంతో ఆప్యాయంతో నికనేరు ఆపాలన్నీ గడగడా త్రాగేసేడు. చేతులు వెనక్కి ఆనుకొని, ఒక్క క్షణం విశ్రాంతి తీసుకున్నాడు. తరువాత తనని పడిపోకుండా పట్టు కొన్న అంబులెన్సుమనిషి చేయి భుజంమీదనుంచి తోసేసి, తనం తటతానే లేచి నిలబడ్డాడు.

"మేరీనా! ఇక్కడెందుకు? పోదాం రా" అని నెమ్మదిగా భార్యను పిలిచి, తూలనైనా తూలకుండా ఇంటికేసి నడిచేడు.

కూలీలంతా ఆతనికి అల్లంతదూరంలో స్థాణువులల్లే నిలబడి పోయేరు. తాము చెప్పుకొనేమాటలు ఆతని చెవిని పడనంతదూరం వెళ్లిపోయేదాకా ఒక్కడూ నోరు విప్పలేదు.

"ఆలావుండాలి, మనిషంటే"

అందరి నాలుకలమీదా అదేమాట.

బారక్సులోనికి రాగానే సమ్మెదారులంతా ఆతని చుట్టువాలా మూగేరు. నికనేరు దగ్గుతూ-ఒగరుస్తూ, మంచం దగ్గిరికి సరాసరి

పోయి వెల్లకితలా పడుక్కున్నాడు. గొంతులో ఏదో అడ్డుపడి నట్లుంది ఉక్కిరిబిక్కిరి చేసేస్తూంది. పెదవులు రెండూ చేతితో మూసివేసుకొని బరువుగా ఎగరొప్పుతూ పడుకున్నాడు.

గార్బజ్ నికనేరును సమీపించేడు. ఆతని భుజాలమీద, గుండె లమీద చొక్కాకి అంటుకొన్న సల్లటిపదార్థాలు ఏమిటో జాగ్రత్తగా వరీక్షించేడు. వానిని తీసి నోటవేసుకొని, మొగం చిట్లించి, ఒక్క నిముషం ఆలోచించి ఉమ్మి వేసేడు.

"చూడండి. పిడుగులాంటివాడిని యజమానులు ఏస్థితికి తీసుకువచ్చేరో. పాపం."

"యజమానులు ఏంచేసేరు. వాడిదురాశే వాడి నెత్తికొట్టింది."

వెనక్కాలనుండి ఎవ్వడో కోపంతో గదమాయించేడు. గార్బజ్‌కి కోపం వచ్చింది.

"ఆతనికి అంత దురాశ కలగడానికి కారణం ఏమిటి? మాట లాడవేం?— చెప్పలేవు?— నోరుమూసుకొని ఊరుకో. ఊరికే వాగక."

ఒక్క నిముషం తర్వాత నికనేరు తసంతతానే లేచికూర్చుని పీరసంగా—"గోలచేయకండోయ్" అన్నాడు.

కాని, గార్బజ్ ఆతనిని వదలలేదు.

"ఔనయ్యా! మరి. కోపపడతావెందుకు? కళ్ళుమూసుకొని, ముక్కుకి సూటిగా పోతూన్నా ననుకుంటూన్నావు. కనకనే వాళ్ళంత ఘోరంగా పీక్కుని తినగలుగుతూన్నారు. ఎన్నాళ్ళనుంచి

కడుతూన్నావు చెప్పు అగుడిసె. ఎప్పటికైనా దాంట్లో కాపురం చేయగలవా?—మాట్లాడవేం?"—

"చాలించు. నోరుముయ్యి." నికనేరు ఆవేశంతో పిడికిలి బిగించి ఉరిమేడు.

ఇంతలో బారక్సు ఆవరణద్వారం తలుపులు ఛళ్ళున తెరుచు కున్నాయి. డి.ఎస్.పి. మీసాలు మెలివేసుకుంటూ సగర్వంగా గంభీ రంగా లోపలకు వచ్చేడు. అతని వెనక్కాలే ముగ్గురు పోలీసులు, ఆవెనక్కాల బ్యుటిలోకినూ, గబగబావచ్చేరు.

బారిక్సులోని గచ్చునేలమీద నాలుగుజతల బూట్లు టకాటకా చప్పుడుచేసేయి. అయిదుగురూ సరాసరి ఈజనంఅంతా కూడిన చోటుకి వచ్చేరు. వస్తూనే మేస్త్రీబ్యుటిలోకిను గొంతుబద్దలు చేసు కొని అరవడం ఆరంభించేడు.

"ఓ—కుర్రాళ్ళంతా సెలవు తీసుకున్నట్లున్నారే?—చాలా బాగుంది. బాబుల్లారా!— చాలా బాగుంది. శుభ్రంగా విశ్రాంతి తీసుకోండి. విశ్రాంతి తీసుకున్నదల్లా వంటికి మంచిది. కాని, కార్ఖానా మాటేమిటి?— మీ అమ్మ మొగుడు ఎవడుచేస్తాడుపని? మాట్లాడరేం?—కొలిముల సంగతేమిటి?—ఉ."

కోపంతో ఫోర్మన్ ఆపాదమస్తకం వణికిపోతూన్నాడు.

"సరే!—బాగానేవుంది.— ఫ్యాక్టొరీయజమానులు— అబెల్జి యనుపెద్దమనుష్యులు—మీరంతా పనిలోకి వస్తారో రారో కను క్కొని రమ్మని పంపించేరు."

"మేము రాదలుచుకోలేదని పోయి చెప్పవోయి."—అందరి బదులూ గార్బజ్ సమాధానం ఇచ్చేరు.

"ఏమిటోయి. తెగనీలుగు ఎక్కువయిందే. నిన్నేమీ అడగ లేదు. నీకు సమాధానం చెప్పవలసిన పనేమీలేదు. ఏమోయ్! ఓస్టపు! నీమాట ఏమిటి? నువ్వు ఇంతవరకు స్మెల్టరుగానే ఉండిపో యేవు. రేపుగనక పనిలోకివస్తే కొలిమిగానికి అసిస్టెంటునుగా వేస్తామని యజమానులు అంటూన్నారు."

"ఓహో! లంచాలుకూడా పట్టుకువచ్చేవూ? ఆశపెట్టి పనిచేయించుకొని వెనకటిలాగే ఏడిపిస్తావుకాబోలు. చాలు. చాలు. నడు. ఓస్టపు పనిలోకి రావడంలేదు."

అని గార్బజ్ మేస్త్రీని దబాయించేరు. నికనేరు ఆశ్చర్యంతో అదిరిపడ్డారు. కోపంతో వణికిపోతూ కొడుకుమీద కేకలు పెట్ట సాగేరు.

"ఏమిటిది? ఈవేళ పనిలోనికి ఎందుకు పోలేదు?"

సమాధానం లేదు. నికనేరు కొడుకుమీద విరుచుకుపడడం తోచే బ్యుటిలోకి ఊరుకున్నారు.

"సమ్మెచేస్తూన్నావటరా? చవటా! ఈద్రోహులతో చేరిపోతు న్నావా?"

నికనేరు వెర్రిఆవేశంతో లేచి, మంచంక్రిందనుంచి 'కాన్వాస్–ట్రవరాల్' లాగి కొడుకుమీదికి గిరాటువేసేరు.

"తొడుక్కో ముందు. త్వరగా పనిలోకినడు."

దగ్గుతెర ఒకటివచ్చి ఉక్కిరిబిక్కిరి అయి, నికనేరు మంచంమీద వెల్లకిలా పడిపోయి రొప్పడం ఆరంభించేడు.

గార్బజ్ నికనేరు విసిరిన గుడ్డల్ని కాలితో మళ్ళీ మంచం క్రిందికే తన్నేసేడు.

"ఓస్టపు ఇక్కడినుంచి ఒక్కఅడుగు కూడా పెట్టడు. ఇది వరకు జరిగినది అప్పుడే మరచిపోలేదు."

వ్యవహారాలు ఏలాగ పరిణమిస్తున్నాయో శ్రద్ధగా పరిశీలించి చూస్తూన్న పోలీసులకేసి మేస్త్రీ కన్నెగరేసి, తాను గార్బజ్‌మీదికి పరుగెత్తేడు.

"ఏమిటోయి. నీఉద్దేశం. నాకు తెలియక అడుగుతాను. వీళ్ళందర్నీ రెచ్చగొట్టి పాడుచేద్దా మనుకున్నావా?"

గార్బజ్ ఏమీ కదలలేదు. మెదలలేదు. నెమ్మదిగా చొక్కాబొత్తాలు ఊడదీసుకుంటూ శాంతంగా సమాధానం ఇచ్చేడు,

"నన్ను ముట్టుకోకు. ముట్టుకోవద్దని చెప్పుతూన్నాను. అంతే తరువాత విచారపడవలసి వస్తుంది, సుమీ."

బ్యుటిలోకిఞ ఆబెదిరింపుని లెక్కచేయలేదు.

"నేను అడిగినమాటకి సమాధానం చెప్పు: ముసిలిపీనుగా: లేకుంటే చర్మం వొలిపించేస్తాను."

'ఫోర్మన్' ఎగిరి ముసిలిగార్బజ్ గొంతుక పట్టుకున్నాడు.

తన్ను కానట్లు గార్బజ్ పెడమొగంపెట్టి మోచేయి గుండెల్ల కానించి మేస్త్రీని ఒక్కపోటుపొడిచేడు. దానితో ఆతడు పట్టు

తప్పి నిలువునా నేలకూలిపోయేడు. ట్యూటిలోకిన్ తనమీద పడతా దేమోనని ఆతని వెనకాల నిలుచున్న గూని 'కోవల్' చటుక్కున వొంగేడు. 'ఫోర్మన్' వాని నడ్డిమీదపడి మొగ్గవేసినట్లయి రెండు కాళ్ళూ బల్లకు వేసి కొట్టుకొని, భయంతో కెవ్వుమని అర్చి, గార్బజ్ కాళ్లదగ్గిర బోర్లా పడిపోయేడు.

నికనేరు మంచం మీదనుంచే ఎంతభయమూ– అసహ్యమూ ప్రకటిస్తూ గావుకేకలు వేయసాగేడు.

"ఓరి, మీమొహం మండా! ఏమిటర్రా అది ?–"

ఓగోడకి చేరి పొందికగా కూర్చుని, పరిస్థితులన్నీ పరిశీలిస్తూన్న మీసాలరాయుడు నెమ్మదిగా లేచేడు. ట్యూటిలోకినుకి ధైర్యం చిక్కింది. ఒక్క గంతువేసి నిలపడి గార్బజ్‌కేసి వేలుచూపిస్తూ పోలీసుల్ని పిలిచేడు.

"పట్టుకోండి. ఈదొంగపీనుగుని వాళ్లకి తగినట్లు బుద్ధిచెప్ప గలవాళ్లు మీరొక్కరే."

పోలీసుసూపరింటెండెంటు గార్బజ్‌కేసి నెమ్మదిగా కదిలినడిచేడు. అతడు, నాలుగడుగులు పెట్టేటప్పటికి తప్పతాగిన డూబ్నిక్ దారి అడ్డగించుకున్నాడు.

"తమరు అక్కడ ఆగండి, మరి."

జనం అంతా గొల్లుమని పకపకబడి నవ్వేరు సూపరింటెండెంటు మొగమూ-ముక్కూ కోపోద్రేకంచేత ఎర్రబడ్డాయి. డూబ్నిక్‌కు ఎదురుగా టక్కుమని మడమల్ని రెండూ కలిపి అటెన్షన్‌లో

నిలబడిపోయాడు.

"త్రాగుబోతా! దారి తొలగవేం? ఎవరోయ్! వీడిని వెంటనే రెక్కలువిరిచి కట్టండి."

డి. ఎస్. పి. ప్రతిఅక్షరంలోను అసహ్యం ప్రకటమయ్యే టట్లు తన అనుచరులకి ఆజ్ఞల నిచ్చేడు.

అక్కడనుంచి దారిలో అడ్డంగావున్న జనాన్ని రెండుపా యలుగా విడగొట్టివేస్తూ, డి. ఎస్. పి. గార్బట్‌కేసి నడిచేడు. జనసమూహం కొంతదూరందాకా అతనికి దారి ఇచ్చింది. అతడూ తమమధ్యకిరాగానే కూలీలంతా నాలుగుమూలలా చుట్టుముట్టేరు. 'కోవల్' తనమిత్రులందరికీ కన్నెగరేసి, పికికిలిబిగించి, సూపరిం టెండెంటు వెన్నులో ఒక్కపోటుపొడిచి నాందీపూజ చేసేడు. ఒకడు దారితీయగానే డజన్లకొద్దీ చేతులు ముందుకు ఉరికేయి. ఆచెంపమీదా- ఈచెంపమీదా- వెన్నులోను- డొక్కలోను- దబ దబా పిడికిలిపోట్లు అణుపులు- లెంపకాయలు కురిసిపోయేయి. పాపం సుకుమారియైన, సూపరింటెండెంటుయొక్క ఊబకాయ వంటి శరీరం ఆచేతులమధ్య బంతిలా అటూ- ఇటూ- దొర్లిపో యింది.

హఠాత్తుగా వీధి తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. ఎరుపు రంగుపట్టీ వేసిన నీలిటోపీ, ఉంగరాలజుట్టుమీద ఒకప్రక్కగా పెట్టి, కోసక్కుసిపాయీఒకడు గుర్రాన్ని ఉరికించుకుంటూ ఆపెద్దద్వా రంలోంచి లోపలికి వచ్చేడు. వస్తూనే లోపల జరుగుతూన్నవిషయం

ఒక్క-చూపులో గ్రహించేడు. గబగబా గుర్రాన్ని ముందుకి పోనిచ్చి అందుబాటులోవున్న 'డూబ్నిక్' మెడమీదా- చేతులమీదా కొరడాతో ఎంతోనేర్పుతో కొట్టేడు. చ ర్రు మ ని దెబ్బతగలగానే 'డూ బ్నిక్' కెవ్వుమన్నాడు. ఆదెబ్బలకి గిజగిజలాడిపోయి, రెండు చేతులతోటీ మొగం కప్పుకున్నాడు మళ్ళీ కొరడా. ఈమారు కొరడాకొసలు మెడతిరిగివచ్చి చేతికణుపులకి కొట్టుకొన్నాయి. 'డూబ్నికి' బాధతో రెండుచేతులూ నలుపుకొనసాగేడు. సిపాయీ విజయసూచకంగా హుంకారంచేసి కొరడా అతనికళ్ళమీద ప్రయోగించేడు.

ఈమారు 'డూబ్నికి'కి కాళ్ళపట్టు సడలిపోయింది. అతని మీద అడుగులువేసి గుర్రం ముందుకు ఉరికింది. దాని సెలివల మంచి తెల్లనినురుగు నేలబడింది.

సిపాయీ హఠాత్తుగా గుర్రాన్ని వెనక్కి తిప్పేడు. జనం మీదికి ముంగాళ్లు ఎత్తి ఉరకలువేసినప్పుడల్లా దానిడెక్కల తాకిడికి గుల్లబారిపోయిన బారక్కుచప్టా విచ్చిపోయి గోతులు పడిపోయింది.

ఈసిపాయీకి వెనకాలే మరికొంతమంది గుర్రాల్ని ఉరికించుకుంటూ బారక్సులో ప్రవేశించి కూలీలమీదికి ఛార్జిచేసేరు. కిటికీలబయట ఇంకా కొంతమంది సిద్ధంగా వున్నట్లు నీలిటోపీలమీద ఎర్రపట్టీలూ- తళతళామెరుస్తూన్న ఈటెలూ- తెలుపుతూన్నాయి. వారు ఎక్కియున్న గుర్రాలు ఆతురతతో సకిలిస్తూ పట్టికక్యం

గాకుండా వున్నాయి.

★ ★ ★ ★

పూర్తిగా ఒంట్లో జవసత్తువలు చేరకుండానే, మరునాడే నికనేరు పనిలోకి బయలుదేరేడు. అతని నరాలన్నీ గాయాలు బిగపట్టి సలుపుతూన్నాయి. కాని, తన బాధను గురించికాని, కోసక్కులు చేసిన దాడిని గురించిగాని, అతడు పల్లెత్తుమాటకూడా అనలేదు. మామూలుగా ప్రతిదినమూ పనిలోకి పోతూనే వున్నాడు. రాత్రిళ్లూ, ప్రతిఆదివారమూ, గుడిసె పని చేసుకుంటూన్నాడు. గుడిసెకి కప్పు ఏర్పడింది. గుమ్మందరినుంచి 'బురదగుంట' గట్టుదాకా యున్న ఏడుగజాలమేరా మెరకపోసి, చదునుచేసి, దిమ్మిసా వేసేడు. అంతవరకు అతడు ఒక్కనిముషం కూడా విశ్రాంతి తీసుకోలేదు.

పని అంతా పూర్తిఅయినాక నికనేరు తన ఆస్తిని చూసుకొని మురిసిపోతూ ఆకుటీరంముందు అటూ-ఇటూ పచారుచేస్తూ అన్నిమూలలనుంచీ తనఇల్లు ఏలాగ కనిపిస్తూందో పరీక్షించి చూసుకున్నాడు.

కట్టుబడి పూర్తికాగానే ఆకుటుంబం బారక్సులోంచి మకాం ఎత్తివేసి, స్వంతగృహంలో ప్రవేశించేరు. లోపల ఎంతోచెమ్మగా-చీకటిగా- మురికికంపు కొడుతూ అసహ్యంగా వుంది. కిటికీతలుపులన్నీ మూసివేసియున్నా, చలివదలలేదు.

"అమ్మా! చలేస్తూందే"- అన్నాడు, కోమా. నికనేరు మను

మనికేసి కొరకొరాచూసి సణిగేడు.

"అంతా వెధవలక్షణం. మాకుటుంబంలో కెల్లా చెడపుట్టేడు."

....ఈవిధంగా ఆ 'బురదగుంట'లో మొదటికుటుంబం కాపరం చేయడం అరంభించింది.

★ ★ ★ ★

కొద్దికాలం గడిచేటప్పటికి 'బురదగుంట'లో ఒక్క-అంగుళం మేరకూడా మిగలలేదు బారక్సులో ఇరికి– ఇరికి బాధపడుతున్న కూలీలంతా అక్కడికి చేరుకున్నారు వారి వెనక్కాల బెల్జియన్ కర్మాగారాలలోని కూలీలంతా వచ్చేసేరు. పట్టణంలో నిలువనీడ లేని, వ్యభిచారిణులు, ముష్టివాళ్లు, దొంగలు, మొదలయిన అనగా జనంఅంతా ఒకరి తర్వాత ఒకరుగా వచ్చి తలొక గుడిసె వేసుకొని, రోజులు వెళ్లదీయసాగేరు.

వీరందర్నీ అదుపు– ఆజ్ఞలలో వుంచడానికి రేకులకప్పుతో పోలీసుస్టేషనుకూడా ఒకటివెలిసింది. వారికి సహాయంగా వుంటూ వుండడానికి 'బురదగుంట' కి సరిగ్గా ప్రక్కనే కోసక్కుసైన్యాలకి బారక్సు కట్టబడ్డాయి. 'అగనెస్సోవు' కూడా తన 'విశ్రాంతి మందిరాన్ని' ఈప్రదేశంకి దగ్గరలోనికే మార్చేడు.

దిక్కూ– మొక్కూలేని జనం అంతా అక్కడికి చేరడం చేతనూ, అక్కడనున్న ఇళ్లు, మనుష్యులు నివసించేటట్లుగాక, పందులగుడిసెలలా వుండడం చేతనూ 'బురదగుంట'కి— 'పందులదొడ్డి' అనేమారుపేరు అసలులోకివచ్చింది.

## మూడో

## ప్రకరణం.

ఇన్ని ఏళ్ళు గడిచేయి. మహారణ్యాలు నగరాలు అయినాయి. చిన్నమరలు గొప్పయంత్రాలయాలు అయినాయి. కాని, నికనేరు అవస్థలో మాత్రం ఏమీ భేదం కలగలేదు. నికనేరు నేటికీ బొగ్గు కూలీయే. ముగ్గురు కూలివాళ్ళుకూడా తవ్వలేనంత బొగ్గు తవ్వి రోజూ బళ్ళకి ఎత్తుతునే వున్నాడు. కాని, ఆకుటీరం నిర్మించుకుంటూ మనసులోనే ఊహించుకొన్న ఊహలేవీ కార్యరూపంలోకిమాత్రం రాలేదు. నికనేరు ఓరిమి విడువలేదు. అతని విశ్వాసం అంతరించ లేదు. ఒక్కొక్కతోవకి రూబులు— డెబ్బైకోపెక్కులూ (ఇంచు మించు రెండురూపాయల పదకొండుఅణాలు) చేతికి వస్తుంది. కనుక జీవితం కొంతవరకూ సుఖకరంగా వుంది. మట్టిదే అయితేనేం? స్వంతం అంటూ ఇల్లొకటి అమరింది బల్లలకి బదులు పడుక్కొందుకు కొయ్యమంచాలు అమిరేయి. వెనుకటిలా ఏముల్ల తోటకూరపులుసోగాక, బంగాళాదుంపలు, ఒక్కొక్కప్పుడు ఉప్పుచేపలూకూడా, భోజనంలోకి అమరుతూన్నాయి.

కుటుంబసంఖ్య గుణకారంలో వుంది. మా అందరిలోకీ పెద్ద వాడు కోమా. వాడికి యిప్పుడు గరిసరిగా ఇరవైయేళ్లు ఉంటాయి. అందరిలోకీ చిన్నవాడిని నేను. మేము నివసించే చోటును

'పందులదొడ్డి' అని ఎందుకు పిలుస్తున్నారో కూడా తెలియనంత చిన్నవయస్సు.

పందులదొడ్డిలో నివసించే కుటుంబాలన్నింటికంటే మా కుటుంబంపనే బాగుంది. తాతయ్యకి బొగ్గుగనిలో పని. నాన్న బెల్జియన్ కర్మాగారంలో కొలిమిపనివాడు. పెద్దన్నయ్య 'రోలింగ్ మిల్లు' లో ఆయిలరు. పెద్దక్కయ్యవార్కాకి ఫౌండ్రీలోపని. ఇంక మిటాక్క-న్యూర్కాలూ-నేనూ - చిట్టపుగుట్టలలో ఇనప ముక్కలు ఏరి తెస్తూంటాం. ప్రతిరోజూ సాయంకాలం బజారుకి తీసుకొనిపోయి నాన్న అవి అమ్మితెస్తూంటాడు. అందరం ఏదో కొద్దో-గొప్పో సంపాదిస్తూండడంచేత విలాసాలమాట ఏలాగవున్నా తిండికి తడుముకోకుండా గడిచిపోయేది.

చేతినిండా పట్టెడురొట్టె తీసుకొని, 'బురదగుంట' వీధులలో ఊరేగుతూ, అక్కడిపిల్లల నందర్నీ ఊరిస్తూవుండేవాడిని. నేను వీధిలో కనపడేటప్పటికి ఎక్కడెక్కడిపిల్లలూ బురదగుంటల లోనూ-మురికికాలవలలోనూ ఆడుకోనే పెద్దా-చిన్నా రకం కుర్ర వాళ్లంతా గట్టెక్కి నాచుట్టూ చేరేవారు. రొట్టెనముల్లుతూంటే నాపళ్లూ-పెదవులూ-కళ్లూ మొదలయిన వానియొక్క కదలికలను ఎంతో శ్రద్ధగా పరిశీలిస్తూ కూర్చుండేవారు. వాళ్లందరికీ తలొక కాస్తముక్కా రాల్చేవాడిని. దానినే ఎంతో ఆప్యాయంతో, నోరు తెరిస్తే కిందపడిపోతుందేమోనని భయపడుతూన్నట్లు నిశ్శబ్దంగా నమిలేవాళ్లు. బహుశా ఇందుచేతనే అయివుంటుంది; ఆ పిల్లకాయ

తెప్పుడూ ననుకొట్టనూలేదు. జగడమాడనూ లేదు.

అసలు నామీద ఎవ్వడూ చేయివేయకపోవడానికిగల ముఖ్య కారణం మాతాతయ్య. 'పందులదొడ్డి' లో ఆతడికి చాలా పలుకుబడి యుండేది. ఆతని బలానికి సెటిల్మెంటులోని వారంతా ఎంతో అసూయపడేవారు. పెళ్లాన్నీ, పిల్లల్నీ, తిండిపెట్టలేక చంపకుండా వున్నందుకు ఆతడిని ఎంతయినా గౌరవించేవారు.

వయస్సు పైబడుతూన్నా ఎప్పటిలాగే దృఢంగావున్నాడు. ఆ 'పందులదొడ్డి' వీధులలో గంభీరంగా వెన్నువిరిచి నడుస్తూంటే బాటకి అటూ-ఇటూఉన్న గుడిసెలు ఆతని మోకాలెత్తుకూడా ఉండవేమోననిపిస్తూండేది.

సెటిల్మెంటులోని కాపురాలన్నీ ఇంచుమించుగా ప్రతిరోజూ ఏదో ఒకవేళ మాయింటికివచ్చి మాక్షేమం కనుక్కొని వెళ్లుతూండే వారు. ఏ మంచి వచ్చినా-ఏ చెడ్డవచ్చినా, తాతయ్యదగ్గరికి పరుగెత్తుకు వచ్చేవారు. బిడ్డపుడితే బారసాలకి ఆతడు రావాలి. ఎవరైనా చనిపోతే తాతయ్య సాయంచేయాలి. ఆ రెండు సమయాల్లోనూకూడా జనం తాగి తందనాలాడుతూంటే తాతయ్య తనబలాన్నీ-దయాస్వభావాన్నీ ప్రకటిస్తూండేవాడు.

జీతాలరోజు వచ్చిందంటే పెద్దగోలా-గంద్రగోళమూను. జీతపురాళ్ళు చేతుల్లోవేసుకొని కూలీలంతా కల్లుపాకలకీ-సారా అంగళ్లకీ పరుగెత్తి మస్తుగా నిషాచేసేవారు. ఆ తాగినమత్తుమీద రెండు-మూడు గంటలు శరీరకష్టాన్నీ-మానసికకష్టాన్నీ మరిచి

పోయేవారు. తెల్లవార్లూ తిట్టుకుంటూ—కొట్టుకుంటూ, రణగుణ ధ్వని చేసేవారు. అరుణోదయం అయ్యేటప్పటికి మళ్లీ అంతా నిశ్శబ్దం. తలలు వ్రేలవేసుకొని కాళ్ళీడ్చుకుంటూ ఎవరిపనుల్లోకి వాళ్లు పోయేవారు. తినిపారేసిన ఎముకలకోసం కాట్లాడుకొనే కుక్కలమొరుగులు మినహాయిస్తే వీధులన్నీ ఎంతో నిశ్శబ్దంగా వుండేవి.

కొలిమిపనివాడయిన గార్బిజ్ ప్రతిదినం సాయంకాలపువేళ తప్పకుండా మాయింటికేసి వచ్చేవాడు. ఆరావడం మాతాతయ్య కోసం కాదు. ఒక్కరోజునకూడా ఆతడు నాకీ కష్టం వుందనికాని, నాకిది కావాలనికాని, అడగలేదు. ఇంట్లోకి సరాసరివచ్చి దీపంబుడ్డి దగ్గరగావున్న బల్లమీద కూర్చుండేవాడు. ఆదీపం వెలుతురులో ఒక్కపన్నుకూడా అడ్డంలేని ఆబోసినోటిలోని ప్రతిభాగమూ కని పించేది. ఒకరోజున ఎప్పుడో కొలిమిదగ్గర పనిచేస్తూంటే ఒక ఇనుపసీల ఎగిరివచ్చి ఒక్కపన్నుకూడా మిగలకుండా అన్నిటినీ విరుగగొట్టి పారేసింది. అందుచేతనే గార్బిజ్‌కి వయస్సు అట్టే లేకపోయినా ఏళ్ళుగడిచినవాడిలాగే కనపడేవాడు. ఆతడు మాయిం టికి వచ్చేటప్పుడు రోజూ ఏదోఒక కొత్తపత్రిక చేతపట్టుకు వచ్చే వాడు. ఇంటిల్లిపాదినీ ఒకచోట కూర్చోపెట్టి పత్రిక చదివి వినిపిం చేవాడు. ఏవేవో పరస్పర సహాయకనిధుల్ని గురించీ, ట్రేడ్-యూని యన్లవిగురించీ, చాలావ్యాసాలు ఉండేవి వాటిలో. పత్రిక చదవ డం పూర్తి అయ్యేక, ఇంటికి పోయేముందు ఏవేవో మాళ్ళకాగితాలు

తాతయ్యకి చూపించేవాడు. ఆతడు ఎకసక్కెంగా నవ్వివేసేవాడు.

"చందాల మాటా? మీయూనియనుతో నాకు పనేమిటోయి? యూనియను లేనిరోజుల్లోనూ, ఉన్నా చేరకపోయిన రోజుల్లోనూ, కూడా నేను బ్రదుకుతూన్నాను. శుభ్రంగా పనిచేసి ఇంత తెచ్చుకుం టున్నాను. జీవితం వెళ్లిపోతూంది."

ఈమాటలు అనేటప్పటికి గార్బజ్‌కి ఎంతకోపం అయినా వచ్చేది.

"ఎప్పుడూ ఈబలమే వుంటుందనుకోకు. ఈవేళ తవ్వినంత బొగ్గు తవ్వలేకపోయేరోజులు రావచ్చును. పోనీ–మాటవరసకి ఎన్నటికీ ఇంతబలంగానూ వుంటావనే అను. ఉంటేమాత్రం? ఏంఎక్కువ ఒరుగుతూంది? ఇంతపని చేస్తూన్నా నీకడుపు నిండు తూందా? నువ్వునాతో చెప్పకపోయినా ఇంట్లో విస్తట్లోకి ఏవోకొన్ని ఉడికించిన బంగాళాదుంపలుతప్ప మారువస్తువు లేదని నేనెరగను? చూడు: తాతా చేయి కాలేక ఆకులు పట్టుకుంటే ప్రయోజనం లేదు. అన్నీ మించిపోయేక విచారపడతావు."

గార్బజ్ పలుకులకి తాత ఎన్నడూ భయపడలేదు. వానిని గూర్చి ఎన్నడైనా ఆలోచించేదనికూడా అనుకోను. మామూలుగానే జీవితం నడిచిపోతూంది. అందరితోటీ ఎంతో కలిసిగట్టుతనంగా వుండేవాడు. 'విశ్రాంతి-మందిర' యజమానియైన 'అగనెసోవ్వు'కి కూడా తాతయ్య ఎంతోసాయం చేసేవాడు. తన ఇంటికి బేరానికి వచ్చినజనం తాగి అల్లరిప్రారంభించి నప్పుడల్లా ఆతడు మాతాతయ్య

కోసం పరుగెత్తుకొనివచ్చేవాడు.

వెంటనే తాతయ్య చిలకకొయ్యనున్న కాన్వాసుకోటు తగిలించుకొని, మూలనున్న దుడ్డుకర్ర ఒకటి చేతబుచ్చుకొని, ఆతనివెనుకనే బయలుదేరేవాడు. అక్కడికిపోయి జాగ్రత్తగా ఆలోచించి, బుద్ధిచెప్పి, అల్లరిచేసేవాళ్లని పంపేవాడు. ఇంకా వినకపోయేరా—చావకొట్టి తరిమివేసేవాడు.

తాతయ్య ప్రతిపనిలోనూ చాలా నిష్పాక్షికంగా ప్రవర్తించేవాడు. ఎంతో ఉత్సాహంతో హృదయంఇచ్చి సాయపడేవాడు. ఆతడు ఎప్పుడూ ఎవ్వరినీ అనవసరంగా కొట్టలేదు. ఎవ్వడిదగ్గరా ప్రగల్భాలుకొట్టి శపథాలు చేయలేదు. ఇంటిదగ్గరకూడా అంతే. పరస్పరసహాయనిధికీ—ట్రేడ్‌యూనియనుకీ తనజీతంలో కొంతభాగం ఇస్తున్నాననీ, ప్రతీనెలా ఇస్తాననీ, చెప్పినప్పుడు కూడా ఆతడు కోమాని ఏమీ అనలేదు. కోమా చెప్పుతూన్నంతసేపూ నిశ్శబ్దంగా విన్నాడు అన్నీవిని ఒక్కనిట్టూర్పువిడిచి తల వంచుకున్నాడు. ఒకనిముషం పోయేక ఏంతట్టిందో గభీమని లేచి నిలబడి బల్లమీదనున్న రొట్టెఅందుకొని ఆతనికళ్ళముందు తిప్పేడు.

"కోమా! మనం తింటూన్న ఈరొట్టె ఎవరిదో నీకు తెలుసునా?"

అంతే ఆతడన్న మాట.

తాతయ్య ఎన్నడూ నాన్నని పల్లెత్తుమాట అనేవాడుకాదు. పనిలోమంచి వచ్చినదిమొదలు మళ్ళీ పోయేదాకా పిల్లలతో ఆడు

కొనేవాడు. వాళ్ళకి పేలుచూసేవాడు. తలలు దువ్వేవాడు. స్నానం చేయించేవాడు, ముళ్లలావుండే బిరుసుగడ్డంతో పొట్టమీద-బుగ్గల మీద కిచకిచలుపెట్టి నవ్విస్తూండేవాడు.

గుణకారంలోవున్న తనకుటుంబాన్ని చూసుకొని ఆతడు ఎంతో మురిసిపోయేవాడు. అందరిలోనూ చిన్నవాడని అవడంచేత నేనంటే ఆతనికి ముద్దు. అస్తమానంనన్ను ఎత్తుకొనేవాడు. మోకాళ్ల మీద కూర్చుండబెట్టుకొని, గుండెలు–దండలు నొక్కిచూసేవాడు.

"ఒరేయి! సన్యా నువ్వు ఈడుకు తగినట్లు పెరగడం లేదురా. త్వరగా పెద్దవాడివి కా. మీతాతయ్యకి కాస్త ఆసరా అవుదువు గాని."

మాఅందరిలోకీ 'వార్కా' అంటే ఆతనికి ప్రాణం. ప్రతి నెలా జీతాలు ముట్టినరోజున దానికి తప్పకుండా ఏదోఒక బహుమతీ తెచ్చేవాడు. ఒకనెలలో అందమైన దంతపుదువ్వెన్న తెచ్చి పెట్టేడు.

అమట్టిగుడిసెలో మాకుటుంబం ఎంతో శాంతంగా జీవిస్తూన్నాం. కాని, ఎన్నడో ఇంతకంటేనూ సుఖంగా బ్రదికేరోజు రాకపోదని తాతయ్య ఆశ,

★ ★ ★ ★

ఆరోజున తాతయ్య తలపుకు వచ్చినపుడల్లా మనస్సుకి ఏదో కలతగానేవుంది. ఆతనికోసం రొట్టెమూటకట్టి నేనే గనిలోకి తీసుకు వెళ్లేను. నన్నుచూసి ఆతడు ఎంతో సంతోషించేడు. తిండితినే

టప్పుడు నన్ను ఒకపక్క కూర్చోపెట్టుకొని గిన్నెలోది చాలవరకు నాకే పెట్టేసేడు. అతిన్నదయినా పట్టేస్తూ-పట్టేస్తూ తిన్నాడు. దాహం విపరీతంగా అయింది అనుకుంటాను. తెచ్చిననీళ్లన్నీ ఒక్కమారుగా గొంతుకలో దిమ్మరించుకొన్నాడు. ముఖాన్నుంచి చెమటలు కారిపోతూన్నాయి. శ్వాసలు ఎంతో బరువుగా తీసు కుంటూన్నాడు.

అతను తిండితిని లేచేడు. మాఅమ్మ నెత్తికిచుట్టుకొనే రుమా లులో పట్టిగిన్నె మూటగట్టుకొని, నెత్తికి ఎత్తుకొని బయలుదేరేను. కాని, తాతయ్య నన్నుపోనీలేదు. కౌగలించుకొని, కళ్లనీళ్ళుపెట్టు కొన్నాడు.

"నన్యా! వెడుదువు గానిలే. తొందరేమిటి? అల్లాగ కూర్చో ఒకనిముషం"

నేను కూర్చున్నాను. నాతోపాటు తానుకూడా బరువుకి జవ జవలాడిపోతూన్న దూలాల కిరకిరలు విరిగిపడుతూన్న బొగ్గు గుట్టల గలగలలు వింటూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

"ఒరేయి. పనూ! ఎందుకోగాని గుండెలు దడదడలాడి పో తూన్నాయిరా, రాళ్లెత్తినట్లు గుండెల్లో బరువుగావుంది. తల తిరు గుతూంది, వెన్నులో చురుకూ- చురుకూ పోట్లు పొడుస్తూంది."

ఆతోవ పూర్తి అయ్యేదాకా నన్ను అక్కడనే కూర్చుండపెట్టు కున్నాడు. తరువాత నేను లేచివచ్చేను. సాయంకాలం పనిలోంచి ఇంటికి వచ్చేటప్పుడు ఎంతో మందకొడిగా కాళ్లీడ్చుకుంటూ

వచ్చేడు.

ఆరోజున శనివారం. కోమా-వార్కాలు ఇంకా పనిలోంచి రాలేదు. తాతయ్య ఇంటికి వస్తూనే మొగమూ-వొళ్లూ-శుభ్రంగా కడు క్కొని, బల్లమీద చదికిలబడి కూనిరాగాలు తీస్తూ, నాయనమ్మకి క్రీస్తుబోధ వినిపిస్తూన్నాడు.

పుస్తకం చదువుతూ తలతిప్పుతూంటే గోడమీద ఆతని నీడ బొమ్మయొక్క గడ్డం చమత్కారంగా కదులుతూంది. ఆనీడని చూస్తూ స్తంభానికి జేరగిలబడి కూర్చుండి నాయనమ్మ గ్లోవులు అల్లుతూకూర్చుంది. ముడుతలు బడి యున్నా ఆమె ముఖంలో శాంతము-గాంభీర్యము, తొణుకొతూన్నాయి.

మానాయనమ్మ చాలా మంచిది. మమ్మల్ని ఎంతో ప్రేమతో సూసేది. చిట్టపుగుట్టలనుంచి, ఇనుపముక్కలు వేసిన సంచి భుజాన తగిలించుకొని హోరునవీచే చలిగాలికి కాళ్ళూ-చేతులూ కొంకరించుకొనిపోతూ ఇంటికి వచ్చేటప్పటికల్లా ఎంతో ప్రేమతో గుమ్మంలోకి ఎదురువచ్చేది. మాభుజాల్ని కుంగదీస్తూన్న మూటలు అందుకొని ఒకమూలపడేసి మమ్మల్ని జేరదీసి ముద్దులాడేది. కాళ్ళకి 'స్టాకింగ్సు'లేని లోటుదీరేటట్లు ఆగుడ్డలూ ఈ గుడ్డలూ చేర్చి కుట్టిచ్చేది. చలికి బిగిసిపోయిన పాదాలకి నూనెరాసి కాచేది. బాధకి గిజగిజలాడిపోతూంటే పడుకోబెట్టి మామీదికి ఒరిగి జోకొట్టేది. ఆ ముసిలికళ్లలో ఏనాడోఇంకిపోయిన కన్నీటిని ఒత్తుకుంటూ మా విచారంలో సానుభూతి చూపేది.

తాను తినేరొొట్టెలో మిగిల్చివుంచిన ముక్క చేతిలోపెట్టి బుజ్జగించి తనతోకూడా తనపక్కమీదికి తీసుకొనిపోయి పడుకోపెట్టుకొనేది. పడుకునూలుతో నేసిన దళసరిదుప్పటీ నిలువునా కప్పి, మీదికివొరిగి జోకొడుతూ ఏపాటలో- ఏపద్యాలో పాడేది.

ఆరోజున తాతా- నాయనమ్మా ఒకరికొకరెదురుగా కూర్చుండియున్నారు. నేనుకూడావెళ్ళి వాళ్ళతో కలుద్దామనుకున్నాను. కాని, వీలుపడిందికాదు. మాకు తలంటినీళ్లు పోయడంకోసం ఒంటినిండా కొవ్వుపట్టించి, పడుకోపెట్టి చాపకప్పి, అమ్మ మరోపని చూసుకుంటూంది. మాసిపోయిన గుడ్డలన్నిటికీ సబ్బుపట్టించి ఉతుకుతూంది. అందుచేత ఖైదీలలాగ కదలడానికీ- మెదలడానికీలేకపోయింది. స్తబ్ధులవలె పడివున్నాం.

నాన్న దొడ్డిలో కూర్చుండి ఒకదేవదారుదుంగకోసి, కొలిమిదగ్గర వాడుకుందుకు 'బూటు'కి మడమలు తయారుచేస్తున్నాడు.

ఇల్లంతా వెచ్చగా వుంది. తాతయ్య మెడమీది తామరకి రాసుకున్నమందు పట్టుకొన్నదేమో, ఆతడు పనిలోకి వెళ్ళేటప్పుడు వేసుకొనేగుడ్డలనుంచి కార్బాలిక్ వాసన గదిఅంతా వ్యాపించింది. అటకమీద చీకటి దట్టంగా వ్యాపించింది. అక్కడా అక్కడా ఏర్పడ్డ సందులగుండా ప్రవేశించిన వెలుతురురేకలు అటకమీది చీకటిని మరింత దట్టంచేస్తూన్నాయి.

ఎటుచూసినా నిరుత్సాహం తాండవిస్తూంది. నాకు కళ్ళు మూతలు పడుతూన్నాయి. మిట్కా అప్పుడే గుర్రుపడుతూన్నాడు.

నాజాగ్రదవస్థమీద నెమ్మదినెమ్మదిగా తెరజారుతూన్నట్లు తోచింది. ఆకళ్లలో ఆఖరుపర్యాయం ప్రార్థనాగీతాలు పాడుతూన్న తాతయ్య మెదిలేడు.

ఇంతలో ఆతడి పాట ఆగింది. ఏదో ఆలోచిస్తూన్నట్లు తల వొంచుకొని, అరచేతితో నుదురు రుద్దుకుంటూ, తమాషాగా జుట్టు పీకుకుంటూన్నాడు. ఉండి- ఉండి హఠాత్తుగా లేచి నిలువబడ్డాడు. అటక ఆతని ఎత్తుకు సరిపడకపోవడంచేత కొంచెం ముందుకు వొంగేడు. కళ్ళముందు ఏదో ఎగురుతూవున్నట్లు భావించుకుంటూ దానిని తోలుతూన్నట్లు రెండుచేతులూ తిప్పడం ఆరంభించేడు.

నాయనమ్మ కుట్టుపని ఆపేసి తాతయ్యకేసి చూస్తూంది. అమ్మకీ- నాన్నకీ అసలు ఈగొడవ ఏమీతెలియదు. వాళ్లపనులలో వాళ్ళు మునిగియున్నారు.

తాతయ్యకి అంతకంతకి ఆరాటం ఎక్కువ అయిపోతూంది. నిలవబడ్డవాడు నిలుచున్నట్లే 'ధమ్మ'మని మంచంమీద పడిపోయి కొనలు దేరినగడ్డం తలగడాలో దాచుకుంటూ గట్టిగా మూలిగేడు.

నేను కళ్ళు తెరిచేను. ఆమూలుగువిని అమ్మా- నాన్నా చేతుల్లో పనులు వదిలేసి పరుగెత్తివచ్చేరు. నాయనమ్మ ఎంతో కష్టంమీద మనసు కుదురుపరచుకొని, జరిగినసంగతిని క్లుప్తంగా రెండుమాటలలో చెప్పేసింది.

నాన్న గబగబావెళ్లి మంచంమీదికి వొంగి తాతయ్యని తట్టేడు.

"ఏమిటి, నాన్నా! ఎందుకు మూలుగుతూనావ్?"

తాతయ్య ఏమీ సమాధానం ఈయలేదు. మళ్ళీ ఇందాకటికం టేనూ గట్టిగా మూలిగేడు. చేతిప్రేళ్ల వికారంగా గాలిలోకి జాపి, ఏదోపట్టుకోబోతూన్నట్లు అల్లల్లాడించేడు. హఠాత్తుగా లేచి గదిలో చుట్టూతిరిగివచ్చి, నాన్నని ఒక్కటి తన్నేడు. నాయనమ్మని ఒక్కటి అణిచేడు. అక్కడినుంచి వీధిలోకి పరుగెత్తిబోయి గుమ్మానికి అడ్డంగా బోర్లపడి తలనేలబెట్టి కొట్టుకొని మూలగడం ఆరంభించేడు.

'ఇంతలో ఏంవొచ్చిందిరా నాయనా'— అంటూ నాయనమ్మ కళ్లు ఒత్తుకుంది.

న్యూర్కా— మిట్కా లు కలతనిద్రలో లేవడంచేత గొల్లుమని ఏడవడం లంకించుకొన్నారు. కొద్దిసేపట్లో ఆచిన్నకొంప ఏడుపులతో ప్రతిధ్వనించిపోయింది.

తాతయ్యకి బహుశా ఇవేమీ తెలుస్తూ ఉండియుండవు. నెమ్మదిగా దొర్లివెళ్ళి బల్లదగ్గరగానున్న దీపాన్ని పట్టుకుందుకు తన పొడుగుపాటివేళ్ళు జాపేడు. దీపం వెలుతురులో ఆతనిముఖం చూసేను. దానిలో వెనుకటి శాంతభావం లేదు. కళ్లు నీరుక్రమ్ముతూన్నాయి. గట్టున పారవేసిన చేపకిమల్లే ఆతనికళ్లు ఎక్కడికో లోతుకుపోయేయి. దవుడఎముకలు పైకి పొడుచుకువచ్చేయి. ముక్కు ఎర్రబడిపోయింది.

దీపంకోసం చేయిజాపినప్పుడు ఆతనిపెదవులమీద ఒకవింత

నవ్వు వెలిసింది. పిడికిలిబిగించి దీపపుచిమ్నీమీద ఒక్కగుద్దు గుద్దేడు.ఆదెబ్బతో కోడిగుడ్డు గుల్లలా బద్దలై ముక్కలు-ముక్కలయిపోయి గాజుపెంకులు గదిఅంతా చెదిరిపడ్డాయి. దీపం ఆరి పోయింది.

తాతయ్యలేచి గదంతా తప్పటడుగులు వేసి, వేసి, క్రిందపడి పోయినట్లు చప్పుడువలన గ్రహించేను. అంతలో నాయనమ్మ కెవ్వుమని కేకపెట్టింది. అంతకంతకి ఆమె గొంతుకధ్వని మంద గించి క్రమంగా క్షీణించి పోయింది.

గార్బజ్ పరుగెత్తి వచ్చేడు.

మేమంతా హడిలిపోయి వీధితలుపుతీసివుంచే, పారిపోవ డానికని ఆమూలకి పరుగెత్తేం. మాఅమ్మ ఏడ్పుకి 'పందులదొడ్డి' వీధులన్నీ మారుమోగేయి.

ఊరు అశేషం మాఇంటిముందు పోగుపడ్డారు. వారిమొగాల ఉత్సాహమూ- ఆనందమూ వ్యక్తం అవుతూన్నట్లు తోచింది. ఇంతకాలమూ కంటబడినప్పుడల్లా తమగతజీవితాన్ని జ్ఞాపకానికి తెచ్చి మనస్సును బాధపెడుతూన్న ఆభీమబలం బ్రద్దలయిపోయింది. వారికి ఆనందం కాదు? వారుకూడా ఒకప్పుడు మాతాత అంత బల వంతులే. కాని నేటి అవస్థవేరు.

చీకటిమూలంగా ఇంట్లో ఏమీ కనిపించడంలేదు. తాత మాట కూడా ఎక్కడా వినిపించదు. అమ్మా నాన్నా ముందు మాకుర్ర వాళ్లనందరినీ మంచాలమీద పారేసి కంబళీలు కప్పేసేరు. అమ్మ

నాయనమ్మ ఎక్కడుందోనని తడుములాడింది. నాన్న నిప్పుపుల్ల గీసేడు. ఆవెలుతురులో ఏమి చూసేదోకాని రెండుచేతులూ పైకి ఎత్తేసి, నిప్పుపుల్లా పెట్టే వదిలేసి పెర్రికేక పెట్టేడు. పక్కనున్న వాళ్ళెవరో అగ్గిపుల్లగీసి దీపంవెలిగించేరు.

గోడపక్క మెలికలుతిరిగిపోయి పడివుంది, నాయనమ్మ. ఆమెకణతలమీదనుంచి పెదవులవరకూ ఎర్రని రిబ్బను ఒకటి వ్రేలాడుతూవుంది. ఆమెకి దగ్గరలోనే బల్లకోడుని కౌగలించుకొని తాతయ్య పడివున్నాడు. కణతలమీది రక్తనాళం ఉబ్బిదూరానికి నీలిరంగుగా కనిపించుతూవుంది. తెరచివున్న నోటినుంచి చొంగ కారుతూంది.

వచ్చినవారంతా ఆదృశ్యాన్ని నిశ్శబ్దంగా తిలకించేరు. ఆనిశ్శబ్దవాతావరణాన్ని మొట్టమొదట కలతబరచినది తవ్వకూలీ అయిన 'కోరల్'.

"ఏమి జరిగిందేమిటి?"

ఆ 'పందులదొడ్డి' యందంతటా మంత్రకత్తెగా పేరుపొందిన 'బందూరా' అతనికి సమాధానం ఇచ్చింది.

"నికనేరుకి గాలి తగిలింది. కాని అది లోపల ఇముడలేకపోయింది. అదయ్యం బయటికి పోవడానికి చేసే ప్రయత్నంలో నికనేరు ఉక్కిరి- బిక్కిరి అయిపోయేడు."

ఈగందరగోళం అంతా విని చూడడానికి పిచ్చేసిన 'విశ్రాంతి-పాన' గృహాధిపతి 'అగనెస్సోవ్' వచ్చిందిమొదలు వెళ్ళిపోయే

దాకా— "ఎంత మంచివాడు!— ఎంత మంచివాడు"— అని తెగ పలవరించేడు.

మానాన్న స్నేహితుడయిన గార్బట్ ఒకరితోటి చెప్పినట్లుగా కాకుండా మాటలాడేడు. అతని గొంతులో విచారమూ—సానుభూతీ-కొట్లాడేయి.

"నికనేర్! నీరోజులు గడిచేయా? నీపొట్ట నిండిందా?"

నాకు ఏడ్పు రానే లేదు. స్తంభించిపోయినట్లు గుడ్లప్పగించి చూస్తూ అలాగే వుండిపోయేను. నాయనమ్మ పెంచుతూన్న చారల పిల్లి పిల్లలు ఎక్కడనుంచి వచ్చినాయో ఆవిడ మీదపడి ఆడు కుంటూన్నాయి. ఆమె చేతిలోనుంచి జారిన నూలుబంతిని కాళ్లతో దొర్లించి; చిక్కుపరచి వెనుతిరిగిచూసేయి. తాము అల్లాటి తప్పుపని చేసినా ఆవిడ ఇంకా గద్దించకపోవడం గమనించి ఆశ్చర్యపడు తూన్నాయి అనుకుంటాను. ఏమయినా—ఆమె మాటలాడలేదు. ఆమె చేతులు ఏమీపట్టు లేనట్లుగా వేలబడిపోయేయి. ఏనాడో పొడిఆరి పోయినా కనుగొలుకుల్లోంచి బయలుదేరి ముఖం ముడతలలో నిలిచిపోయి, గడ్డకట్టిన కన్నీటిచుక్కను కూడా ఆమె ఒత్తుకోలేదు.

........మరునాడు ఉదయం. ఆనాటివరకూ ఆచిన్నకుటీరాన్ని ప్రకాశింపచేసిన రెండుజ్యోతులలో ఒకటి మటమటలాడింది. రెం డోది కొడిగట్టి ఆరిపోయింది.

నాలుగో

## ప్రకరణం.

తాతయ్యని పిచ్చి ఆసుపత్రికి తీసుకుపోయారు. ఆతడు అక్కడనే ఎన్నోనెలలపాటు ఉండిపోయాడు. 'పందులదొడ్డి' ప్రజలకి ఇప్పుడు అతని జ్ఞాపకమే లేదు. కాని ఎప్పుడు వచ్చేడో-ఏలాగ వచ్చేదో ఒకరోజున ఆతడు సెటిల్మెంటులో ప్రవేసించేడు. గడ్డంపెండ్రుకలు చాలభాగం తెల్లబడిపోయాయి. అతని పెద్దపెద్ద కళ్ళు శోకరసాన్నిప్రదర్శిస్తున్నాయి. ఎంతోకాలంనుంచి ఖాయిలాగా ఉన్నవాడిమల్లే నెమ్మదిగా కాళ్లు ఈడ్చుకుంటూ లోపలికి వచ్చేడు.

గుమ్మంలో నిలబడి నన్నూ మిటాక్-న్యూర్కాలనీ ఎంతో సేపు తదేకదృష్టిగా చూసేడు. అతని వాలకంచూస్తే లోపల ఎవరి కోసమో వెతుకుతూన్నట్లుగా తోచింది. నెమ్మదిగా లోపలికి వచ్చేడు. మంచం మీదనుంచి మమ్మల్నీ లాగేసేడు. నిల్చున్నవాడు విఱ్ఱి నట్లే ధమ్ముమని ఆమంచంమీద వెల్లకిలా బడిపోయి రెప్పవాల్చ కుండా మిద్దెకేసి చూడసాగేడు. తెరచివున్న ఆఎఱ్ఱనికళ్ళు చూస్తే ఆముఖంమీద రెండురాగికానులు తాపడం చేసేరేమో ననిపించేట ట్లున్నాయి.

గార్బజ్ సాయంకాలం మాయింటికి వచ్చేడు. తాతమంచం మీధ అతని తలగట్ల నెమ్మదిగా కూడ్చుండి ఒక్కనిముషం

ఆదీర్ఘకాయునివంక చూసి, ఒక్కనిట్టూర్పు విడిచేడు. తాతయ్య దృష్టి తిప్పలేదు. మాటలాడలేదు. కొత్తవాడొకడు వచ్చి తన ప్రక్కని కూర్చున్నట్లుగా కూడా ఆతడు గుర్తించలేదేమో. ఆఖరికి గార్పజే పలకరించేడు.

"ఆఖరికి ఏలాగంటివాడివి ఏలాగ అయిపోయేవో చూసు కున్నావా?"

బోసివాని స్వరంలో ఎగతాళి లేదు. ఎంతో సానుభూతి చూపుతూ వుంది, ఆప్రశ్న.

తాతయ్య ఈపలకరింపుకి కూడా ఏమీ సమాధానం ఈయలేదు. ఆచూపు మార్చలేదు. ఆలాగే రెప్పకూడా వాల్చకుండా మిద్దెకేసి చూస్తూ పడుకున్నాడు.

ఈవిధంగా నికనేరు జీవితంలో నూతనాధ్యాయం ఆరంభం అయింది. ఆతడు ఎవ్వరితోటీ మాటలాడడు. రాత్రిళ్లకూడా నిద్ర పోడు, పొదికళ్లు వేసుకొని అటకకేసి చూస్తూ ఆలాగే పడుకుం టాడు.

ఇప్పుడు తాతయ్యపేరు చెప్పుతే కాళ్ళలోనుంచీ వణుకు పుడు తూంది. ఎప్పుడూ మూతపడని, ఆఎర్రగా చింతనిప్పులవలె ఉన్న కళ్ళుచూడకుండేటందుకు నెత్తిమీదకంటా ముసుగులాగుకొని పండుకొనేవాడిని. మాఅమ్మకూడా రాత్రింబగళ్లు మమ్మల్ని దగ్గరికి జేరదీసుకొనిభయం పోగొడుతూ వుండేది. తాతయ్య ఇంట్లో వున్నంతసేపు'మిటాక్'నవ్వేవాడుకాదు.'న్యూరాక్'నోరెత్తేదికాదు.

వీధిలోవి పిల్లలంతా నాకు—'పిచ్చి నికనేరుగారి సన్నా'-అని పేరు పెట్టేరు. వెనుకటిలాగ నాకు ి ట్టై దొరకడమూ వేదు. పిల్లలు నాతో ఆడుకోవడానికి రావడమూలేదు.

తవ్వుకూలీలకి ఇప్పుడు తాతయ్యమీద అసహ్యంలేదు. గౌరవం అసలేలేదు. పనిలోంచి తూలిపోతూ ఇంటికి పస్తాడు. వస్తూనే ఒంటిని పట్టుకున్న బొగ్గుదుమ్మైనా కడుక్కోకుండా, తిండికూడా తినకుండా, మంచంమీద వెల్లకితలా వాలుతాడు.

ఆకురాలుకాలంలో మళ్లీ వచ్చింది, వెనుకటిలాగే రోగం. ఈమారు నాన్న వెంటనే తాతయ్యని మంచంమీద పడుకోబెట్టి కాళ్లూ—చేతులూ అంటదీసి కట్టేసేడు, పట్టెలకి. తెల్లవార్లూ అతని తలాపిని కూర్చుండి కనిపెట్టి ఉపచారాలు చేసేడు.

మరునాడు పొద్దుటే నికనేరు పనికి వెళ్ళలేదు. స్మృతి వుండగా పనిలోనికి పోకుండడానికి అదే మొదటిమాట.

ప్రొద్దుటే లేచేక నాన్నని కళ్ళతోటే దగ్గిరికి పిలిచేడు. నీర సంగా, ప్రార్థించుతూన్నట్లు,— "ఒరేః అబ్బాయిః తాళ్ళు విప్పరా నాయనాః నీ ముసిలితండ్రిని ఏడిపించకురా " అని పీకుకొని తిని, కట్లువిప్పించుకున్నాడు.

నాన్న ఇంట్లో వున్నంతసేపూ అక్కడే మంచంమీద చేతులు తిప్పుతూ కూర్చున్నాడు. ఆతడూ ఆలాగ పనిలోకి పోగాచూసి, అమ్మ వెంటబడ్డాడు.

"అమ్మాయి ఒక్క పావలాఇయ్యి తల్లీ. మళ్లీ ఇంక ఎప్పుడూ

అడగను. ఒక్క పావలా. ఒక్కటంటే ఒక్కటే."

తాత బాధ పడలేక అమ్మ ఒకపావలా ఇచ్చింది. అదిచేతులో పడగానే తూలితూలిపడుతూ 'అగనెసొప్పు' పానశాలకేసి పరుగెత్తేడు. సాయంకాలం నేను చిట్టపుగుట్టలనుంచి తిరిగివచ్చేటప్పటికి తాతయ్య వీధిగుమ్మంలో కూర్చుండి పాటలు దంచుతూన్నాడు.

అతివిశాల, మతిగంభీరమునౌ
నీపరుమూలిగి- ఘోషిస్తూంది—
తుపానుగాలీ, హుంకృతిచేస్తూ—

'పందులదొడ్డి'లో కాపురాలున్న వారంతా పనుల్లోంచి ఇళ్లకి పోతూ, ఆవినోదం చూస్తూ నిలవబడ్డారు. కొందరి ముఖాలలో తృప్తి-ఆనందమూ, కొందరి ముఖాలలో విచారము-సానుభూతీ, స్పష్టంగా ప్రకటన అవుతూన్నాయి.

వినోదం చూడడానికై జనంఅంతా మా ఇంటిముందు పోగు పడ్డారు. తాతయ్య వీరిని చూసి, తాను కూర్చున్నచోటినుంచి లేచి తూలితూలిపడుతూ లేచినిలబడి నాలుగు అడుగులు వేసేడు. కాని కాళ్లు నిలుబడలేదు. కాళ్లు తడబడి, కాళ్ళతొక్కిడికి పచ్చగా తయారయిన మంచులో ధమ్మున పడిపోయేడు. నేలని అంటి పెట్టు కొని, ఆలాగే పడివుండి, రాగాలాపనచేసి, పాట అందుకున్నాడు.

నావలెనే ఎటనైనా వేరొక
కష్టజీవియగువా డున్నాడా?—
అనాథశిశువొక డున్నాడా?—

హఠాత్తుగా లేచి మోకాళ్లమీద కూర్చుని చుట్టువారా చేరిన జనంకేసి తిరిగేడు.

"మీకేం కావాలి? ఏమిటి చూస్తూన్నారు?"

అతడు వాళ్ల సమాధానం ఇచ్చేదాకా ఆగలేదు. తడిసిన గడ్డాన్నయినా దులుపుకోలేదు. మూతి ముడుచుకొని నిబ్బరంగా గుడిసెలోకి బయలుదేరేడు.

ద్వారం దగ్గిరికి వెళ్లి మొలనున్న బెల్టుతీసి, మంచంమీదికి గిరాటు వేసేడు.

"ఓస్టపు! ఒరేయి ఓస్టపు! నీతల పగల."

ద్వారబంధపుకమ్మికి జేరబడి లోపలికిచూస్తూ తిట్టడం ఆరంభించేడు.

మానాన్న అప్పుడే పనిలోనుంచి వచ్చేడు. కాళ్ళూ—మొగమూ కడుక్కుని పళ్ళెం దగ్గిర కూర్చోబోతూన్నాడు. వెంటనే విస్తరి వద్దనుంచిలేచి గుమ్మాన్ని ఆనుకొని నిలబడియున్న తాతయ్యని భుజాలు పట్టుకొని ప్రేమతో మంచంకేసి నడిపించి పడుకోబెట్టడానికి ప్రయత్నించేడు. కాని, అతడు లొంగలేదు. పైగా తనని పడుకోబెట్టబోతూన్న కొడుకుగొంతుక పట్టుకొని నులమడం ఆరంభించేడు.

"ఓరిపశువా! కావలసివస్తే నువ్వేపోయి పడుకో—. ఎంతో ఆప్యాయంగానూ, ప్రేమగానూ, వున్నట్లు కనిపిస్తూ నేనెప్పుడు చస్తానాయని కనిపెట్టుకొని కూర్చున్నావటరా? నాగొంతుక నులిమి

వేయాలనేనా నీయూహ? నలుము........చూస్తావేం? ........కానీ మరి........"

'నాగొంతుక పిసుకుతావట్రా—' అంటూనే వున్నాడు. తాను నాన్న గొంతుకపిసుకుతూనే వున్నాడు.

లోగుమ్మంలో నిలుచుని చూస్తూంది, అమ్మ. ఇంక ఊరు కుంటే లాభంలేదనుకుని, నాన్నకి సహాయం వచ్చింది. మూలనున్న ఓకుకర్రబండ అందుకొని, తాతయ్య వేళ్లికణుపులమీద ఒక్కటి కొట్టింది.

కటుక్కుమని దెబ్బతగలగానే తాతయ్య పట్టువదిలేసి, బాధకి గిలగిలలాడిపోయేడు. ఆశ్చర్యంతో కళ్ళువిప్పి అమ్మకేసి చూసేడు.

"నువ్వూనా?— నువ్వూనా?—ఈముసలివాడిమీద నీకూ కోప మేనా?"

ఎంతో ఆవేశంతో, వ్రేళ్లు వణికి పోతూంటే, చొక్కా పర్రువ చింపివేసుకున్నాడు. దట్టంగా పెరిగిన వెండ్రుకలతో జీబూతంలాగ వున్న గుండెలు విరిచి నిలబడ్డాడు.

"కానీయండి. ఆలోచనెందుకు? ఆలస్యం ఎందుకు? ఈగుం డెలు లాగివేయండి. ఈవేడిరక్తం కడుపునిండా తాగండి."

నిలుచున్నవాడు నిలుచున్నట్లే తాతయ్య మోకాళ్ళమీదికి కుంగి పోయేడు. ఒక్క నిముషం విపరీతమైనబాధ పడ్డాడు. క్రమంగా స్తంభించిపోయేడు.

ఆరోజుకి ఆరోజుకి నికనేరు కృంగి కృశించి క్షీణించిపోతూ

న్నాడు. గనిలోనికి పోతూనేవున్నాడు కాని, దబ్బెత్తుపనికూడా చేయ లేకుండా వున్నాడు. తనపరిచితులనుంచి మొగం తప్పించడానికి మారుమూలగానున్న బ్లాకుకి బయలుదేరేవాడు. చల్లని బొగ్గుగుట్టల మీద పడివుండి ఊపిరి అందక బాధపడుతూ గంటలతరబడి ఉండి పోయేవాడు.

అతడు బుట్టెడుబొగ్గుకూడా తవ్వలేకపోయిన రోజులుకూడా ఉన్నాయి. వ్రేళ్ళు పట్టులేక గునపం చేతులునుంచి జారిపోయేది. చెమటపోసి జుట్టంతా తడిసి ముద్ద అయ్యేది. అలాగంటి రోజున పట్టుకువెళ్ళిన తిండికూడా ముట్టుకొనేవాడుకాడు.

'పందులదొడ్డి'లో నికనేరుకిగల గౌరవం పూర్తిగా నశించింది. అందరిలాంటివాడే అతడూను. కట్టెలమ్ముకొనే 'డ్రూకో'లాగ కుళ్ళు దగ్గు దగ్గేవాడు. తవ్వకూలీ 'కోవల్' లాగ తెగతాగేవాడు. కనిపిం చినదల్లా తనకి కావాలనేవాడు. సరే, ఇంక సెటిల్మెంటులోని కూలీ లందరకి వలెనే అతడిఇంట్లోనూ తిండీ-గుడ్డాకూడా కరువుగానే వుంది. ఇంక అతనిని ఎవరయినా ఎందుకు గౌరవిస్తారు?

ఇంతకాలంనుంచీ తాతయ్య దేనికి భయపడుతూవుండేవాడో అదే-అతిండిసమస్యే ప్రత్యక్షం అయింది. కనుక వెంటనే మరొక పని ఏదయినా ఆరంభించి దానికిపరిష్కారోపాయం ఆలోచించా లని నిశ్చయించేడు.

★ ★ ★ ★

మార్కెట్టులోని జనం అంతా తాతయ్యని బాగా ఎరుగుదురు మోకాళ్ళదాకా వేళ్ళాడేషర్టూ అతడూ అప్పమానమూ అక్కడే

అగల-బగళ్ళని తిరుగుతూండేవాడు. సీలమండలు దిగని ఒకలాగు తొడిగేవాడు. మడమలులేని జోళ్లు తాళ్ళతో బిగించి కాళ్ళకి కట్టుకొనేవాడు. ఆజోళ్లు కాళ్లని పూర్తిగా కప్పకపోవడంచేత జివ్వుమని లాగుకొనిపోయే మంచుపదునుకి బిగిసి, బీటలువారి, బాధపెడుతూండేవి.

తలకి ఎప్పుడూ నూనె వ్రాసేవాడు కాదు. దువ్వెన ఉపయోగించలేదు. తలమీద తెల్లని వెండ్రుకలు దొక్కపీచులా బిర్రబిగిసి నిలువునా నిలబడియుండేవి. బురదలోనాని, ఎండలోఎండి, కొయ్యలావుండే ఆటోపీ ముళ్లకంచెమీద వేసినట్లు తలకి రెండు అంగుళాల ఎత్తున నిలబడియుండేది. దానిని అణిచిపెట్టిసరిగా అమర్చుకోనేటందుకుకూడా ఆతడు ఎన్నడూ ప్రయత్నించలేదు. గడ్డం కత్తిరించకపోవడంచేత అసహ్యంగా పెరిగి గిజిగాని గూడులావుండేది. ఆతడు అక్కడా—అక్కడా తిన్న బీటురూటుముక్కలు—దోసకాయబద్దలు—వెన్నపిసరులూ దాంట్లో చిక్కుకొని చాలా అసహ్యంగా వుండేది.

బజారులో నడిచిపోతూ రోడ్డుకి ఆమూలా-ఈమూలా పరచిన దుకాణాలలోని పదార్థాలు చూసి ఎంతో అసూయపడేవాడు. సామాన్యంగా ఊరేసిన ఏపిలుపండ్లూ—ద్రాక్షలూ మొదలయిన పళ్ల దుకాణాలు గ్రీకువాళ్లు తెచ్చేవారు. వాళ్ళమొగాలలో దయాదాక్షిణ్యాలు కనపడేవికావు. ఇంక వాళ్లు కనపడ్డారా తాతయ్య మొగం ముటముటలాడిపోయేది. తప్పకుండా వాడి దుకాణం

దగ్గిరికి పోయి, ఆగేవాడు. ఒక్క క్షణం ఆలోచించి శల్యావశిష్టంగా వున్న తనచేయి చాపేవాడు. దుకాణాదారుడు కర్రఅటకతో ఏదో ఇంత చేతిలో పడవేస్తే దానిని అక్కడనే నోట్లో పడవేసుకొని, ముందుకు సాగిపోయేవాడు.

పసిమిరంగుతో మిసమిసలాడిపోయే నిమ్మపళ్లు చూస్తే ఆతడినోట సెలయేళ్లు పుట్టేవి. నిమ్మపళ్ల దుకాణం కంటపడిందంటే కదిలేవాడుకాదు. చేయిచాపుకొని ఏంతసేపయినా ఆలాగే నిలబడి యుండేవాడు. ఎముకలూ, నరాలూ, బయటపడి, కండ ఏకోశానా లేని ఆ పొడుగుపాటివ్రేళ్ళు కదిలిపోతూంటే చూసికూడా దుకాణపు మనిషి చూడనట్లు నటించిందా దానిరోగం చప్పగా కుదిరింది అన్నమాటే. లోపల ఎంత ఉక్రోషం వున్నా ఆతడు పైకి ఏమీ మాటలాడేవాడు కాదు. కీగంట అటూ—ఇటూచూసి, దగ్గరలో పొడిగాఉన్న నేల చూసుకొని, మూర్ఛవచ్చినట్లు, ధమ్ముమని క్రిందపడేవాడు. కాళ్ళూ—చేతులూ యూడించేవాడు. గురిచూసి, పళ్ళతోనున్న బుట్టల్ని తనపొడుగుపాటి కాళ్ళతో తన్ని పారవేసే వాడు. నిమ్మపళ్ళు బజారంతా దొర్లిపోయేవి. బజారులోని జనం అంతా పరుగెత్తుకొనివచ్చేవారు. రావడం నికనేరుని చూడడానికే అయినా వెళ్లేటప్పుడు తప్పకుండా ప్రతివాడూ అందినంతవరకు నిమ్మపళ్ళు జేబులలో వేసుకొనిపోయేవారు. నికనేరుయొక్క మూర్ఛ తమకి ఏదోకాస్త కిట్టిస్తూ వుండడంచేత ఎక్కడెక్కడిజనం ఆతడిని చూడడానికి తప్పకుండా పరుగెత్తివచ్చేవారు. దుకాణంలో ఇంక

తన్ని వేయవలసిన తట్టలేవీ లేవని కీగంట కనిపెట్టినాక తాతయ్య నెమ్మదిగా రేచేవాడు. ఒడలయినా దులుపుకోకుండా తూలితూలి పడుతూ కోపావేశంతో పెదవులు బిగించి, ముందు దుకాణానికి వెళ్లేవాడు.

తాను ఈ జీవితంలో పడుతూన్న బాధలకి మరొకళ్లమీద అసహ్యపడుతూ–విషంగ్రక్కుతూ సంతృప్తిపడేవాడు.

సాయంకాలంపూట చౌకతిండిఅమ్మే దుకాణాలదగ్గర జేబులో నున్న పైసలు లెక్కచూసుకుంటూ నిలబడియుండే ముష్టికుర్ర వాళ్లని చూసి తాతయ్య ఎంతేనా మండిపడేవాడు.

"ఒరి ! మీ బ్రదుకుమండ ! ముష్టియటరా ఎత్తుకొనడం ! పోతుల్లావున్నారు? వెధవబ్రదుకు బ్రదికేరురా"–అంటూ తెగతిట్టి వాళ్ళచేతులలోని కర్రాచిప్పా లాగుకొని దూరంగా పారవేసేవాడు.

గోధుమపిండిదుకాణాల దగ్గరా, చేపలబజార్లలోనూ, చిల్లర దుకాణాల ప్రాంతాల్నీ, నిలువబడి, రోడ్లమీద నిండుబరువుతోవున్న సరుకులబండ్లని చేతులమీద లాగుకొని వస్తూండే కూలివాళ్లకేసి జాలిగాచూస్తూ, గంటల తరబడీ ఆలాగే నిల్చుండిపోయేవాడు. నెమ్మదిగా కాళ్ళు ఈడ్చుకుంటూ వాళ్ల దగ్గిరికి పోయి ఎంతో జాలిగా కుశలప్రశ్నలు వేసేవాడు.— "పని చేసుకుంటూన్నారా నాయనా!"— అంటూ ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడు. ఈలోపున ఏకూలివాడి చేతిలోనైనా డబ్బులు కనిపించినాయా గభీమని ఉరికి ఆవికాస్తా లాగుకొనేవాడు.—"రా, రెండుచుక్కలు

వేసివద్దాం"— అంటూ మరోమాట చెవిని పెట్టకుండాపరుగెత్తేవాడు.

ఎప్పుడయినా కాస్తహుషారు పుడితే వెనుకటి దుస్తులు తగిలించుకొని గనిలోకి పనికి బయలుదేరేవాడు. సామాన్యంగా ఒకటి-రెండు రోజులదాకా వెనుకటియంత చురుసుగానూ, దార్ఢ్యంగా పనిచేసేవాడు. ఏదో తిక్క-తిరిగేది ఇంతలో. మేనేజర్లతోనూ—మేస్త్రీలతోనూ ఏవో మాటపట్టింపులు పెట్టుకొని, కయ్యానికి దిగి, పనిమానుకొనేవాడు. మళ్ళీమామూలుగా బజారులో తిరుగుతూండేవాడు.

తాతయ్య వెనుకటిరోజులలో తనకుటుంబంమీద ఎంతప్రేమ చూపించేవాడో నేడంత అసహ్యం చూపిస్తూన్నాడు. హఠాత్తుగా ఎప్పుడో ఒకప్పుడు ఇంటికి వచ్చేవాడు. బజార్లలో పడి దొర్లిన ఆ గుడ్డలతోనే, అపాళంగానే, అమ్మమంచంమీద విరుచుకుపడి, మూల్గుతూ—మూలుగుతూ, పిగరెట్లు తెగకాల్చేవాడు.

అతని ఈ వ్యవహారం చూసి అమ్మకళ్ళనీరు పెట్టుకునేది.

"పిల్లలు జడుసుకుంటారని అయినా సంకోచించవేమయ్యా? ఇదేంప్రారబ్ధం!"—అంటూ విచారించేది. నాన్న ఏమీ మాటలాడేవాడు కాదు. కిటికీలో కూర్చుండి బయటకు చూస్తూ, ఏదో ఆలోచించేవాడు.

ఇంక మాపెద్దఅన్నయ్య 'కోమాని' చూస్తే తాతయ్యకి కలిగే కోపం ఇంతా—అంతాకాదు. నిజంగా 'అగ్గి' అయిపోయేవాడు. దీనికి కారణాలు ఒకటీ-రెండూ కాదు. సవాలక్ష ఉన్నాయి. వాడు

ఎప్పుడూ సారా ముట్టుకొనేవాడుకాదు. గుడ్డలూ, వొళ్ళూ, ఎంతో పరిశుభ్రంగా వుంచుకొనేవాడు. జుట్టుకి నూనెరాసి, దువ్వెంతో సంరక్షణ చేసేవాడు. పనిలోంచి వస్తూనే ఏవో పెద్దపెద్దపుస్తకాలు చదువుతూ కూర్చుని వుండేవాడు. 'గార్బజ్' తో కలిసి తరుచుగా మీటింగులకి పోతూండేవాడు. తరుచుగా తాతయ్యా జీవితపద్ధతిని విమర్శిస్తూ, ఆతనిచేత చీవాట్లు పడుతూండేవాడు.

కోమా ఇప్పుడు మేము అందరం వున్న యింట్లో వుండడం లేదు. తాను పనిచేసే యంత్రాలయంలోని కూలీలంతా ఉండే బారక్సులో పెట్టేడు మకాం. మనిషి చాలా పట్టుదల అయినవాడు. ఎప్పుడూ పరిశుభ్రంగా వుండేవాడు. వెకవెకలు లేవు. తొణకడు. బెణకడు. చాలాగంభీరంగా వుండేవాడు. తాతయ్యా తటస్థపడి నప్పుడల్లా ఆతనితో వాదనపెట్టుకొని ఆతనిని ఒప్పించడానికి ఎన్నో విధాల ప్రయత్నించి విఫలుడు అయ్యేడు. ఆఖరుకి ఒక్కుమండి— "మనం అందరం రక్తసంబంధం ఉన్నవాళ్ళమే. అయితేనేం? నువ్వు కూలివాళ్ళకి పరమశతృవువి. నువ్వుచెప్పే మార్గాలన్నీ వాళ్ళ నాశనానికే తోడ్పడుతూన్నాయి."— అని కేకలుబెట్టి లేచి పోయేవాడు.

తాతయ్యా పడకమీద విసుగుపుడితే తిన్నగా మిఠాయిదుకాణాల కేసి బయలుదేరేవాడు. అక్కడినుంచి, ముష్టివాళ్లు, దొంగలు, లంజలు, కాపురాలుండే బజార్లలో సంచారం ఆరంభించేవాడు.

ఒకరోజున ఆతఁడు 'ఆగనెనోప్పు' పానమందిరంలో 'రెండు

చుక్కలు' పట్టించి. వీధులలో సంచారం సాగించేడు. అల్లా తిరుగుతూ-తిరుగుతూ 'గాస్పర్డ్' ఆకులగుడిసెదగ్గిరికి వచ్చేడు. ఇంతలో ఏమితోచిందో ఒక్క ఎగురున ఇంటిమీదికి ఎక్కి, కప్పు కంటా ఎగబ్రాకేడు. అక్కడ స్తిమితంగా కూర్చుంది కప్పుమీది ఆకులు పీకడం ఆరంభించేడు. ఈ వార్తవిని ఎక్కడికో పెత్త నాలకి వెళ్ళిన 'ఉలోకియా-గాస్పర్డ్' గుండెలు దముకుకుంటూ పరుగెత్తుకొని వచ్చింది. గాలికి చెదిరిపోయి పొడుగుపాటి, ఆమె గోధుమరంగుజుట్టు మొగం అంతటా కప్పుకుంది.

తాతయ్య తెగసణుగుతూన్నాడు-"ఈ వెధవకొంపలో ఏలాగ కాపురం చేస్తూన్నావు? శుభ్రమైనగాలివచ్చేటందుకు ఆఖరికి ఒక్క కిటికీకూడా లేదు."-అంటూ ఏమిటేమిటో సాధిస్తూన్నాడు. వట వటా వాగుతూనే ఇంకోమూల తనపని తాను చేసుకుంటూన్నాడు. ఇంటికప్పుదిండుగా అలుముకొన్న తలంటుతీగల్ని, ఇతరపుష్పాల తీగల్ని, తెంపి-తెంపి క్రిందికి దొర్లించేసేడు.

"తలదాచుకుందుకు ఒక్క వెంకటి కొంపలయినా కట్టుకో కుండా మగడు చేస్తూన్న నిలవాకం ఏమిటి? ఆఫ్రెంచివాడిదగ్గిరికి పోయి నాకిది కావాలని ముక్కుమీద గుద్ది ఎందుకు అడగడు? ఊరికే కూర్చుంది కబుర్లు చెప్పమంటేమాత్రం తరుముకోడు-"

ఎక్కడనుంచోవచ్చి, కొద్దిసేపటినుంచి అక్కడే నిల్చుంది. తాతయ్యమాటలువింటూన్న 'గాస్పర్డ్' ఎంతో శాంతంగా తాతయ్యని పిలిచేడు.

"తాతా! పాపం నాకోసం నీవు శ్రమపడుతూన్నావా? నేనూ ఇల్లు లాగివేయాలనే అనుకుంటున్నాను. కాని, తీరుబడిచిక్కింది కాదు. సరే నాకాపనికష్టం లేకుండా చేస్తూన్నావు. కానీ, నీపని పూర్తిచేయి ఇదిగో. ఇల్లా చూడు.ఇంతవరకు నీవంటూన్న మాటలు ఎవరిని గురించో తెలుసునా, ఎవరికో బుద్ధులు చెప్పుతూన్నావు, కాని-నీ జర్మనుయజమాని దగ్గరకి నువ్వే ఎందుకుపోకూడదు? ముక్కుమీద గుద్ది నువ్వే ఎందుకు అడగవు?"-

గాస్పజ్ మాటలకి తాతయ్య ఉలికిపడ్డాడు. చేతులోని పనిఆపి, కనుబొమ్మలు చిట్లించి, ఒక్కనిముషం ఆలోచించేడు.

"ఎవరిని? ఆజర్మనీవాడినా? కారల్-ఫ్రెజ్జివిచ్‌నా?"

నికనేరు ఇంక ఒక్కనిముషంకూడా కప్పుమీద నిలువబడ లేకపోయేడు. చేతులు వణికిపోతూవుంటే ఇల్లుదిగి ఎవ్వరితోటీ మాటలాడకుండా ఎక్కడికో వెళ్ళిపోయేడు.

ఆరోజున తాతయ్య బజారులో తిరుగుతూ కోద్దేపోతూన్న అందమైనగుఱ్ఱానికి పూన్చిన నల్లని కోచిబండిని చూసేడు. తెల్లని కాళ్లూ, నిగనిగలాడుతూన్న ఒళ్లూ, కలిగి గుర్రం పిక్కబలసివుంది. ఎంతో గర్వంతో కాళ్ళు ఎత్తి ఎత్తి వేస్తూంది. రబ్బరుటైర్లువేసిన కోచిబండిచక్రాలు చకచకా దొర్లుతూన్నాయి. బండికి తాపటంచేసిన ఇత్తడిరేకులు మెరుగుపెట్టబడి ఎండలో మిలమిలలాడిపో తూన్నాయి.

ఆబండిసౌందర్యంచూసి ముగ్ధులై ప్రజలంతా వెర్రిమొగాలు

వేసుకొని, దిక్కులుచూస్తూ, నిలబడి పోయేరు. నికనేరు వారిని రెండుచేతులతోటీ, ఆమూలకీ-ఈమూలకీ గెంటివేసి, గబగబావచ్చి బండిముందునిలువబడ్డాడు. కమ్మిప్రక్క నిలువబడి కళ్ళెం పట్టుకొని గుర్రాన్ని నిలిపేడు. ఏదయినా దభాయించబోయాడు కాబోలు, 'సైస్'-వాడిని కాళ్లురెండూ పుచ్చుకొని రోడ్డుమీదికి ఈడ్చివేసేడు. హఠాత్తుగా సంభవించిన ఈఉప్పెనకి బండిలోని జర్మన్‌వాడు దంగయిపోయేడు. నికనేరు బండి ప్రక్కకువెళ్ళి, వానిమొగంమీదికంటా వొంగి, గట్టిగా ఉద్రేకంతో మాటలాడసాగేడు.

ఫ్రెన్జివిచ్! నీగనిలో ముప్పై అయిదు ఏళ్ళపాటు బొగ్గు తవ్వేను. ఎన్నోవేలటన్నులు బళ్లకెత్తేను. ఆబొగ్గు తవ్వేటప్పుడు, బళ్ళకి ఎత్తేటప్పుడు, నాకడుపులోకి పోయినబూడిదని ఒకచోట పేర్చగలిగుతే ఒకమహాపర్వతం అంత అవుతుంది. చెమటతో బొగ్గుబూడిద బయటపడుతూంది. దగ్గుతే బొగ్గుదుమ్ము ఉమ్ములోకి వస్తూంది. నాశరీరంనుంచి వెలువడేదంతా బొగ్గే. నేను మింగిన బొగ్గు ఈవిధంగా బయటపడాలంటే ఈజీవితం కాదుకదా. మరి నూరేళ్లు బ్రదికినా చాలదు.

ఏదోచిత్రం జరుగుతూందని బజారుబజారంతా బండిచుట్టూ మూగేరు. అంతకంతకి ఒత్తుకునివచ్చే జనంయొక్క వేడిఊర్పులు నికనేరు, మొగంకి సోకుతూన్నాయి.

"బొగ్గుబూడిద నాశల్యాన్ని పట్టిపోయింది. రక్తంలో కలిసిపోయింది. బొగ్గుబూడిదలోనే నాభార్య బిడ్డల్ని కంది. నాబిడ్డలు.

నామనములు—తరతరాలదాకా ఈబోగ్గుఘాటును మరచిపోలేదు. వింటూన్నావా? ఫ్రెంజివిచ్—"

జర్మనీవాడు కొయ్య అయిపోయేడు. కదులుతే ఎక్కడ మీద షడికొడతాడోనని ఊపిరి గట్టిగా పీల్చడానికికూడా భయపడ్డాడు.

"నాముప్పైఅయిదేళ్ల సేవకీ నువ్వు ఇచ్చేది ఏమిటి? ఏమిటి ఇస్తావు?"

జర్మనీవాడు నోరెత్తలేదు. కదలలేదు. స్థాణువులా గుడ్లు అప్పగించి చూస్తూ కూర్చుండిపోయేడు. దూరాన గుర్రపురౌతుల నీలిటోపీలమీద ఎర్రిపట్టీలు కనిపించేదాకా అతని ప్రాణాలు కుదుట పడలేదు. కొద్దిసేపటిలో రౌతులు గుర్రాల్ని ఉరికించి, ప్రజలమీద దాడిచేసేరు. వాళ్ళ ఒత్తిడికి ఆగలేక ప్రజలు నికనేరును పడ ద్రోసి మీదనుంచి పరుగెత్తిపోయేరు. పోలీసువాళ్ళు తాతయ్యని చేతులుకట్టేసి స్టేషనుకి తీసుకుపోయేరు.

తరువాత చాలరోజులదాకా ఆతడు బజార్లలో కనపడలేదు. "నికనేరుని సైబీరియాకి పంపివేసేర"ని— 'పందులదొడ్డి' ప్రజలు ఏకగ్రీవంగా నిర్ణయించేరు. ఈ వార్త విన్నప్పుడు మాఅమ్మ ఎంతో సంతోషపడింది. ఆ రోజుమొదలు మాయందు ఎంతో దయగా ఉండసాగింది. కాని, ఆవిడ ఆశలు నిరాశలయ్యేటట్లు ఒకరోజున తాతయ్యమాగుమ్మంలో ప్రత్యక్షం అయ్యేడు. ఈమారు అతనికి చెవులు వినబడడంలేదు. కళ్ళు దృష్టితగ్గింది. పోలీసుస్టేష నులో తనని చాలా బాధపెట్టేరనీ, తలకాయ గోడనిపెట్టి కొట్టేరనీ,

ముసిలివాడు కావడంచేత దయదలచి వదిలిపెట్టేరనీ, చెప్పేడు.

★ ★ ★ ★

ఒకరోజున సాయంకాలంపూట పగలెల్లా ఏరిన ఇనుపముక్కలమూట భుజాన పెట్టుకొని, వస్తూంటే తాతయ్య బజార్లో ఎదుర పడ్డాడు. నన్ను చూడగానే గుడ్లు మిటకరించి, తల గోకుకుంటూ, బజారంతా మారుమ్రోగేలాగ పిలిచేడు.

"ఏమిరోయ్! కూలివెధవా! వస్తూన్నావూ? రా. బాగున్నావా?"

తాతయ్య గబగబా నాదగ్గిరికి వచ్చి, భుజానవున్న మూట అందుకొని, ఆ ఇనుపముక్కలన్నీ అటూ—ఇటూ చిమ్మేసేడు. తరువాత నన్ను రెక్క దొరకపుచ్చుకొని మిఠాయిదుకాణాలకేసి ఈడ్చుకుపోయి, ఒకదుకాణంలో బల్లమీద కూర్చోబెట్టి మంచులో పెట్టిన మాంసం, దోసకాయలు, వోడ్కా, మొదలయిన వన్నీ తెప్పించేడు.

"తినరా, నాయనా! తిను, బ్రదికిఉన్నందుకు ఒక్కపూట అయినా కడుపుకి ఇంత తినవద్దూ."

తాతయ్య బుజ్జగించి, బలవంతపెట్టి, కడుపునిండా పెట్టించి అప్పుడు నాభుజంమీద ఆనుకొని బజార్లన్నీ తిప్పించేడు. దారిలో కనిపించిన వారందరితో టీ,— 'ఈముసిలితనంలో వీడొకడు ఆసరా దొరికేడు'— అంటూచెప్పుకొని ఆనందించసాగేడు.

చీకటిపడ్డాక నన్ను తనబసకి తీసుకొనిపోయి, మంచంమీద పడుకోపెట్టి, ఇంట్లోనున్న చింకిరిగుడ్డలన్నీ మీదకప్పేడు. తరువాత

పక్కలో కూర్చుని సోదె ఆరంభించేడు. ఒకనిమిషం బుజ్జగించడం. ఒకనిమిషం ముద్దులాడడం.

"వాడెక్కడ తండ్రి దొరికేడురా నీకు వాడు తండ్రా?—దయ్యం కాని. లేకుంటే ఇంతచిన్నతనంలో చిట్టపుగుట్టలలో ఇనపముక్కలు ఏరమని పంపిస్తాడా? దౌర్భాగ్యుడు. రేపుపొద్దుటే వెళ్ళు. వెళ్ళి మొగానఉమ్మివేసి లేచిరా. నేనున్నాను. ఇద్దరం ఇక్కడనే వుందాం. నువ్వు ఇనపముక్కలికీ వెళ్ళొద్దు. ఏమీవొద్దు."

ఆగదంతా దుర్వాసన. మనిషి దగ్గిరికివస్తే గౌలుకంపు. మంచంనిండా ఉన్నాయి నల్లులు. ఒళ్లంతాపాకి కుట్టిచంపుతూన్నాయి. గదిలో ఎక్కడా గాలి అన్నమాట లేదు. దీపం కొడిగట్టి మఠ మటలాడుతూంది.

ఈవ్యవహారం అంతా చూసేటప్పటికి నాగుండెలు జారిపోయినాయి. ఏడుపొచ్చింది. ఇంకేముంది? పక్కగదులలో వారంతా తిట్టిపోయడం ఆరంభించేరు. దానితో నేను మరింతబెదిరి ఏడుపు ఎక్కువ చేసేను.

"పోతాను. అమ్మదగ్గిరికి పోతాను"— అన్నమాట వదలకుండా గోలసాగించేటప్పటికి తాతయ్యకి ప్రాణం విసికింది. కోపంతో మంచంమీదినుంచి లేచేడు. మెడమీద చేతులు పెట్టుకొని ఆలోచించేడు. నేను ఏడుస్తూనేవున్నాను. ఆతడు చేయిజాపి చెవిపట్టుకొని మంచంమీదనుంచి క్రిందకీడ్చేడు. "పో— వెధవా! ఎక్కడికిపోతావో. పో"— అంటూచెడతిట్టి బయటికినెట్టి తలుపు వేసుకున్నాడు.

బయట కన్నూ- కాలూ కనపడడం లేదు. బొగ్గుగనిలో వున్నట్లే నాలుగుమూలలా కారుచీకటి. వీధులలో ఎక్కడా దీపాలు లేవు. ఇంటికి పోవాలంటే ఎన్నోవీధులు దాటాలి. మెరకలూ-పల్లాలూ దారంతా కష్టంగా వుంటుంది. దారిలో కుక్కలు ఎక్కడ కరుస్తాయోనని గుండెలు పీచుపీచుమంటున్నాయి. ఏమయితేనేం? బందిఖానాలోంచి బయటపడ్డామనే సంతోషంతో, ప్రాణాలు గుప్పిట పెట్టుకొని, భయంతో వొణికిపోతూ, బెదిరిబెదిరి దిక్కులు చూస్తూ, ఆపాదునందులగుండా ఇంటికి పరుగెత్తేను.

ఇదే కారణమో, మరి ఇంకా ఇతరకారణాలు ఏమయినా వున్నాయోగాని, ఆరోజుమొదలు తాతయ్య నేను కంట పడితేచాలు పళ్లు కొరికేవాడు.

ఇంట్లోకి అడుగుపెడుతూనే తినేసేలాగ గుడ్లురిమి చూసే వాడు. రెండు చేతులూ నడ్డివెనక కట్టుకొని నిలబడి తెగతిట్టేవాడు.

"వెలితక్కువపీనుగ! చవటవెధవ! ఇంకా ఇనుప్పు ఏరుతూనే వున్నావా? నీకు అట్టేరోజులు బ్రదికేయోగం లేదు. ఇంతచిన్న తనంలో పనిపాటలకి ఏడిసేదౌర్భాగ్యుణ్ణి ఇంతవరకు నిన్నుదప్ప ఇంకెవ్వరినీ చూడలేదు."

ఇదే వరస. బహుశా నన్ను ఏడిపించకపోతే ఆతడికి తోచేదే కాదనుకుంటాను. అందుచేత ఆతడు వస్తున్నాడంటేనే నాప్రాణాలు ఎగిరిపోయేవి. ఏటల్లక్రిందనో ఏమంచం వెనకనో దాగున్నానే వాడిని.

ఒకరోజున బాగా త్రాగివచ్చేడు, ఇంటికి. అతడిని అంత దూరాన చూడగానే మంచంక్రింద దూరేను. ఆతడు నావెనక్కాలే వచ్చి, మంచంక్రింద తొంగిచూసి, బోర్లా పడుక్కొని, ఏడుస్తూన్నా లెక్కచేయకుండా కాళ్ళు రెండూ పుచ్చుకొని ఇవతలికి లాగేడు.

నాన్న అప్పుడే పనిలోంచివచ్చి మొగం కడుక్కుంటూ న్నాడు. నాఏడుపు వినగానే సబ్బుపట్టించుకొన్న మొగమేనా కడు క్కోకుండా పరుగెత్తివచ్చేడు.

"వాడిని ఎందుకు ఏడిపిస్తావు? వొదులు నాన్నా!"

తాతయ్య వెనక్కి తిరిగిచూసేడు. కాని, నన్నుమాత్రం వొద లలేదు. నాకాళ్లు పుచ్చుకొని ఈడుస్తూనే నెమ్మదిగా లేచేడు. లేచేక కాళ్లువదలి చెవి పట్టుకున్నాడు.

"ఎక్కడికిరా కుర్రికుంకా! పారిపోతావు?"

నేను నొప్పికి పెద్దఏడ్పు ఏడ్చేను. వెంటనే నాన్నవచ్చి తాతయ్యభుజాలు రెండూపుచ్చుకొని, దూరంగా గెంటేసి, నన్ను దగ్గిరికితీసి తలనిమిరి ఊరుకోపెట్టేడు.

తాతయ్య నెమ్మదిగా నాన్నని సమీపించేడు. అయినా ఏం చేస్తాడో చూద్దాం అన్నట్లు నాన్న నిర్లక్ష్యంగా గదిమధ్యన నిలువ బడ్డాడు. బహుశా, తాతయ్యకి నాన్న శక్తి తెలుసుకొనడానికి ఇదే మొదటిమారు అనుకుంటాను. కాని, ఆతడు ముఖంలో అటు వంటి చిన్నెలేవీ కనపరచలేదు. దగ్గరగా వచ్చినట్లేవచ్చి చేయి సాచి నాన్న గూబగుంయ్ మనేటట్లు ఒక్కటి కొట్టేడు.

ఆరోజు తర్వాత వారెన్నడూ సఖ్యంతో కలుసుకోలేదు. తాతయ్య చలంపట్టి 'బురదగుంట'– వీధుల్లో, ఫ్యాక్టొరీగేట్లదగ్గిర, బజారులో దుకాణాలవద్ద, నాన్నకోసం కనిపెట్టుకొని కూర్చుండి అతనిమీద ఉరికేవాడు. ఇద్దరూ జుట్టూ– జుట్టూ పట్టుకొని హోరా హోరి పోరాడేవారు.

వారిద్దరూ మల్లయుద్ధం చేస్తూంటే జనం అంతా చూడడానికి పరుగెత్తుకొని వచ్చేవారు. ఏమూలనుంచి వచ్చేవాడో గార్బజ్ ఆజనం మధ్యనుంచి–"చూడండి. యజమానులు కూలివారిని ఏస్థితిలోకి తెచ్చేరో. వాళ్లతమలాభాలకోసం మనహృదయాలలో వుండే ప్రేమనీ– దయనీ– మంచితనాన్నీ– ఇంకించివేసేరు. మనలో మనకి 'ప్రేమ' అనేది లేకుండా చేసేరు"– అంటూ ఉపన్యసించేవాడు.

తాతయ్యకి భయపడి మేము నాన్న ఇంట్లో లేనిసమయాలలో వీధితలుపులకి తాళాలు తగిలించేవాళ్లం. కాని, ఒకనాడు తాతయ్య రెండుగుద్దులతో తలుపులు విరగకొట్టి లోపలికి ప్రవేశించి యుద్ధం ఆరంభించేడు. ఆఖరుకి అమ్మకికూడా ప్రాణం విసిగిపోయింది. ఒకరోజున గుమ్మం పొదిగట్ల చీకటిలో దాగియుండి, తాతయ్య లోపలికి రాగానే పెద్దపట్టకారుతో నడినెత్తిమీద ఒక్కటి కొట్టింది. హదలు! ఇంక ఆరోజుమొదలు తాతయ్య మేమున్న ఛాయలకి కూడా రాలేదు.

అయిదో

ప్రకరణం.

ఒకరోజున తెల్లవారి ఇట్టేచూసేటప్పటికి మాగుడిసెవెలుపల వంటయింటి కిటికీక్రింద తాతయ్య ఒళ్ళెరగకుండా పడియున్నాడు. ఒళ్ళంతా దెబ్బలతో కమికిపోయివుంది. ఆనాటికి వారంరోజులు పైగా అయింది, ఆయన మాయింటికి వచ్చి. వెంటనే నాన్నా—అమ్మా సాయంపట్టితెచ్చి ఇంట్లో మంచంమీద పరుండపెట్టేరు. స్పృహలో లేడు. ఊపిరితిత్తులకీ — కాలేయానికీ బాగా దెబ్బ తగిలింది. ఒకటో—రెండో పక్కఎముకలు విరిగేయి. కుడికాలు తొడదగ్గిరికి విరిగిపోయింది. జ్వరం చాలా హెచ్చుగా వుంది. జ్వరంచేత ఒళ్ళుతెలియక మంచంమీద పరచిన చాపాగుడ్డలూ చింపివేసేడు.

బజారులోని బళ్ళవాళ్ళంతా తాతయ్యబాధపడలేక ఒకనాటి సాయంకాలం ఆతనిని చేజిక్కించుకొని నెమ్మదిగా ఒకమూరు మూలగదికి తీసుకుపోయేరు. ఆతడు ఆ గదిలోకి రాగానే ఒక గోనుపట్టా నెత్తినకప్పి, క్రింద పడతోసేరు. ఆతడూ క్రింద పడగానే వారంతా తమకసితీరేటట్లు చచ్చేదీ—చావనిదీకూడా తెలియకుండా పిడికిళ్లతో పొడిచి ప్రాణావశిష్టుణ్ని చేసేరు; తమపని పూర్తిఅయినాక గ్రామం కొంచెం మాటుమణగగా చూసి, ఘోసు

కొనివచ్చి మాకిటికీదగ్గిర పాంవేసి, తమదారినిపోయేరు.

ఎన్నో ఉపచారాలు చేసినమీదట తాతయ్యకి తెలివివచ్చింది. కొంతసేపటికి నెమ్మదిగా కళ్లు తెరచి అస్పష్టంగా ఏమిటో అన్నాడు. కొలదిదూరంలో ఆతడిని కనిపెట్టుకు కూర్చున్న మాయమ్మ వెంటనే నన్నుపిలిచి ఝారీతో ఆతనికి దాహం పట్టమని చెప్పింది. నేను వెళ్లి ఝారీకొమ్ము ఆతని పెదవులకి తగిలించేను. ఆతడు దాహం త్రాగుతూన్నంతసేపూ నామొగంకేసి చూస్తూనేయున్నాడు. మొట్ట మొదట్లో ఆతడు నన్ను గుర్తించలేకపోయేడు. కాని, కొలదిసేప టిలోనే గుర్తించి, అసహ్యం వెలిగ్రక్కే చూపుతో— ఎడిచేత ఝారీదూరంగా పడిపోయేలాగ తోసేసేడు.— 'ఎందురెయ్యాలా, దౌర్భాగ్యుడా'— అనితిట్టి కళ్లుమూసుకొని, గోడకేసితిరిగి పడు కున్నాడు.

తాతయ్యకి నామీద అంతకోపం ఎందుకు? ఆతడన్నట్లుగా నేనంత సన్నపాటివాడినా? నాకాళ్ళుమెలిపెట్టిన ఇజారువాళ్లలా సన్నంగా తీములవలెయున్నా వాటికో పట్టువకి లోపంలేదు. ఇంక మనిషివి ఆట్టే సన్నమైన వాడిని కాను. బలహీనంగానూ వుండను. ఎనభై పౌనుల బరువువరకూ భుజానవేసుకొని మూడు మైళ్లయినా సరే, అవలీలగా నడవగలను. నీళ్లు పోసినప్పుడల్లా మాయమ్మ—'సన్నా తాతయ్యలాగే ఎముకపుష్టిగలవాడు అవుతాడు. పెద్దవాడయితే మంచిబలంగా తయారవుతాడు.'— అంటూ నాన్నతో చెప్పేది. ఇంక నామీద ఈకోపం ఎందుకు మరి?

కాళ్ళూ చేతులూ కదలించలేని ఆరోజులలోకూడా తాతయ్యకి ఇల్లన్నా- ఇంట్లో వాళ్ళన్నా అసహ్యమూ- కోపమూ తగ్గలేదు. మానాన్నకనిపిస్తేసరి నమిలి మింగివేసేలాగ గుడ్లురిమి చూసేవాడు.

మాకుటుంబంలోకల్లా 'వార్కా' ఒక్కతెమీదనే అతడు అభిమానంగా వుండేవాడు. ఆవిడే అతనికి కట్లుకట్టీ, కాపడం కాచీ, తిండి పెట్టీ, దాహం ఇచ్చీ, పరిచర్యలు చేస్తూంటుంది. ఆవిడ పనిలోంచి రాగానే జాలిగొలిపే చూపులతో మంచంలో పడివున్న తాతయ్యదగ్గిరికి పరుగెత్తుకువెళ్ళి- 'ఏంకావాలి తాతయ్యా!'- అని అడిగేది,

"షర్బత్తు కావాలే. చిట్టీ! ఒక్క నిమ్మషర్బత్తు తెచ్చిపెట్టవూ?"

అక్కయ్య ఏలాగో ఒకలాగు తంటాలుపడి తెచ్చి ఇస్తూం దేది.

ఒకరోజున సాయంకాలంపూట మాయింటికి వచ్చినప్పుడు 'గార్బజ్' తాతయ్య దీనావస్థను చూచి చాలా విచారించేడు.

"ఎవ్వడయినా మంచిడాక్టర్ని పిలిచినా, లేకుంటే మంచిఆసుపత్రికి తీసుకుపోయినా, తాతయ్యబ్రదుకవచ్చును."

నాన్న ఎంతో విసుక్కున్నాడు.

"బాగానే వుంటుంది. కాని, డబ్బు ఎక్కడినుంచి తీసుకురాను?"

నాన్నదగ్గిర డబ్బులేకపోవడంచేత తాతయ్య ఆలాగే మంచం మీద వుండిపోవలసివచ్చింది. చాలాకాలం మంచంపట్టడంచేత

ప్రక్క పుళ్ళు (Bed-sore) బయలుదేరేయి. పుళ్ళు బిగబట్టి సలిపినా, విరిగిన ఎముకలు బాధించినా, అతడెన్నడూ 'ఆ' అనలేదు. 'ఊ' అనలేదు. మంచంమీద ఉండగానే గడ్డం క్రమంగా తెల్లబడిపోయింది. ఒళ్లంతా ముడుదలు బడిపోయి ఎండుటాకులా ఊగులాడుతూంది.

గడచిపోయినజీవితం జ్ఞాపకం వచ్చేటప్పటికి తాతయ్యా ఎంతో బాధపడేవాడు. పడుచుదనంనాటి బలం-ఆశక్తి లేకపోతే పోయింది. అధమం బజారులలోనూ-దుకాణాలలోనూ, అడుక్కోనేటందుకైనా తగిన ఓపిక వుంటే చాలుసని అతడు ఆలోచించేవాడు.

ఒకరోజున పగటిపూట నాన్న ఎక్కడికో వెళ్ళేడు. అమ్మ ఒక్కర్తే ఇంట్లో పనిపాటలు చేసుకుంటూంది. తాతయ్యా నెమ్మదిగా క్షీణస్వరంతో పలుకరించేడు.

"అమ్మాయీ! గార్పినా!"

ఏదో కొంప మునిగిందని అమ్మతన జాగ్రత్తలో తానుండి, తాతకేసి తిరిగింది. అతనికేసి చూసేటప్పటికి ఇంతకాలంనుంచీ ఎదురుచూస్తూన్న శుభసమయం- అతని మరణసమయం-సమీపించిందని ఆవిడ తలచింది. ఆచిన్నకుటీరంలో అందరూ తాతయ్యా చావుకోసం ఎదురుచూస్తూన్నవారే.

అమ్మ రెండడుగుల్లో తాతయ్యా మంచందగ్గిరికి వెళ్లింది. అతడు ఎంతో ఆకలిగానూ-దాహంగానూ, వున్నట్లు కళ్ళలో ప్రాణాలు పెట్టుకొని చూస్తూన్నాడు. ఆ కళ్ళలో ఒక వింత తేజస్సు తొణుకు

తూంది. చిన్నపిల్లవాడొకడు ఆకలికి తల్లడిల్లుతూ తల్లికేసి ఎంతో ఆప్యాయంతోటీ-ఆశతోటీ చూస్తూంటే ఏలాగవుంటాడో ఆలాగే కనిపించేడు,ముసిలితాతయ్య. ఏదో అనిర్వచనీయమైన సుఖవిశ్రాంతి కోసం ఎదురుచూస్తూన్నట్లే వున్నాయి, ఆకళ్లు.

అమ్మ కంగారుపడింది. తాతయ్య తనపొడుగుపాటి సన్నని చేయి జాపి, ఏదో అడుగుతూన్నట్లు వ్రేళ్ళు గాలిలో అల్లలా డించేడు.

మీసాలలోనుంచి చొంగ బుగ్గలమీదికి ప్రవహిస్తూంది.

"గార్పినా! ఇంక ఎంతోసేపు బ్రదుకను. గుండెలలో ఏదో బాధగావుంది. కొంచెం 'వోడ్కా' తెచ్చిపెడుదూ. నీఉపకారం మరిచిపోను. ఇదే నా ఆఖరుకోరిక. చచ్చిపోయినాకకూడ నీ ఉపకారం మరిచిపోను."

కన్నీరు—నిజంగా కన్నీరు కళ్ళవెంబడి జాలువారింది. గుంటలుబడిపోయిన కళ్లలోనుంచి పైకి పొంగలేక, పెద్దపెద్ద కన్నీటిచుక్కలు అక్కడనే కనుగొలుకులలో నిలిచిపోయినాయి. ఎంతో జాలిపుట్టేటట్లు చేతులు ఆడించేడు. మృత్యుసమయం సమీపించింది అనే ఆనందం ఆతని పలుకులలో స్పష్టంగా ప్రకటం అవుతూంది.

అమ్మ ఒక్కనిముషం ఆలోచించింది. రొండివి వున్న డబ్బులుతీసి లెక్కచూసుకొని, వెంటనే బజారుకేసి పరుగెత్తి పోయింది.

సాయంకాలం నాన్న పనిలోనుంచి వచ్చేటప్పటికి తాతయ్యకి 'వోడ్కా' పట్టుఇచ్చింది. అతనిని గుమ్మంలో చూడగానే తాతయ్య త్రాచుపాములా బుసలుకొడుతూ, మీద ఉరకడానికి ఉంకించేడు. కాని, నడుం పట్టులేకపోవడంచేత ఆ ఊపుకి మంచంమీదినుంచి క్రిందపడిపోయేడు. అతనిని లేవనెత్తడానికి దగ్గిరికి పోగానే, నాన్న 'వోడ్కా' వాసన పసికట్టేడు.

"గార్పినా! ఈయనగారు ఏమయినా త్రాగేడా?"

అమ్మ హడలిపోయింది. కంగారుపడుతూ, చొక్కాకొంగు వ్రేలికి చుట్టుకుంటూ, ఆరోజున జరిగినసంగతి నంతనీ చెప్పేసింది.

"చచ్చిపోతున్నాననీ, ఆఖరికోరికగా కొంచెం 'వోడ్కా' తెచ్చిపెట్టమని ప్రాధేయపడితే నేనే తెచ్చి ఇచ్చినాను."

నాన్నకి ఎంతైనా కోపంవచ్చింది. పిడికిలిబిగించి అమ్మగూబ మీద ఒక్కటికొట్టేడు. ఆమె మళ్లీ మాటా—మంతీ లేకుండా నేలకి జారిపోయింది. నాన్న ఆమెమీద వొంగి ఒక్కనిముషం ఆలోచించేడు. కొద్దిసేపటికి అమ్మ మూలిగింది. దానితో మళ్లీనాన్నకోపం విజృంభించింది. బూటుకాలితో తన్ని, తొక్కి, మళ్ళీమాటలేకుండా చేసేడు.

నాన్న అమ్మని కొట్టనిరోజు లేనేలేదని చెప్పవచ్చును. ఆకొట్టడానికి ప్రతిరోజూ ఏదో ఒకకారణం దొరుకుతూనే వుండేది. తాతయ్యకి 'వోడ్కా' ఇచ్చినందుకు; తాను పన్నెండుగంటలసేపు వంచిన నడ్డి ఎత్తకుండా పనిచేయవలసివచ్చినందుకు; అంత సేపు పనిచేసినా

కడుపునిండా తిండి దొరకనందుకు; మిట్కాకీ- స్యూర్కాకీ కలిసి ఒక్కగౌనుకూడా కొనిఈయలేనందుకు; ముందెప్పుడైనా సుఖపడ గలమనే ఆశ ఏకోశానా లేనందుకు; అతడు ఆమెని బాదుతూ వుండేవాడు. ప్రతిరోజూ తెల్లవారేటప్పటికి మళ్లీ అరాక్షసికొలుములు వద్దకు పోవాలనే విషయం జ్ఞాపకం వచ్చేటప్పటికి విసుగుతో అమ్మ మీదపడి కొట్టేవాడు.

ఆరోజున కొట్టికొట్టి ఆవిడకి స్మృతి లేకుండాచేసి, అప్పుడు వదిలినిలువబడ్డాడు. చెమటకి తడిసిన చొక్కాకొంగుతో నుదురు తుడుచుకున్నాడు. తలఅంతా కాఔక్కి వుంది. ఎక్కడినుంచో అప్పుడే దిగివచ్చినట్లు; గాఢనిద్రలోనుంచి అప్పుడే లేచినట్లు గది అంతా కలియచూసి, గుమ్మంకేసి నడిచేడు. వీధిగుమ్మంలోకి వెళ్ళేక పరుగు అందుకున్నాడు. అక్కడినుంచి 'అగనెసోవ్' మందిరం వరకూ ఒకటే పరుగు.

మాకష్టాలన్నీ 'అగనెసోవ్' మందిరంనుంచే ప్రారంభం అయ్యేవి. కోమా మిత్రులంతా ఆరోజున రాత్రివంతు పూర్తిచేసు కొని, వచ్చి, బాగా సారా పట్టిస్తున్నారు. అందరిముఖాలు వదిలి పోయిఉన్నాయి. చప్పిదౌడల గుంటలలో రేఖామాత్రంగా నీడలు కని పిస్తున్నాయి. ఏకారణంచేతనో కాని, ఎవ్వరూ నోరువిప్పరు. రాత్రి రోలింగ్‌మిల్లులో జరిగినదుర్ఘటనవి మాయింటికి జేరవేయ డం ఎవ్వరాయని వాళ్ల ఆలోచన.

కాని, ఆఆలోచన తెగనేలేదు. ఏటక్కడూ వచ్చి ఆవార్త

చెప్పడానికి అంగీకరించకపోవడంచేత విధిలేక అందుయీ బయలు దేరేరు. ఒకరినొకరు గెంటుకొంటూ అంతా మాయింటిగుమ్మంలోకి వచ్చేరు. అందరూ ఒకేమారు తలుపుతట్టి అందరూ ఒకే మారు ఘల్లున కేకపెట్టేరు.

"ఏమమ్మోయి! పిన్నీ! వెంటనే కోమాగుడ్డలూ-అవీ తీసుకొని ఆసుపత్రికి పరుగెత్తు."

అంతే. ఇట్టేచూస్తే ఎవ్వరూ కనపడలేదు. ఇంకేప్రశ్నలూ— ఏడ్పులూ- మొత్తుకోళ్లూ— చెవిని పడకుండా తలొకమూలకీ ఎగిరి పోయేరు.



ఆరోజున ఆదివారం. ఇంకా బాగా తెల్లవారలేదు. 'వార్కా' అప్పుడే లేచింది. తిన్నగావచ్చి 'అవము'మీద పడుక్కున్న నామొగం మీదికి అంటా వొంగింది. ఆమె వుంగరాలజుట్టు నాబుగ్గలమీద పడి కిచకిచలు పెట్టింది. నాకు వెంటనే తెలివివచ్చింది.

"ఒరేయి! నన్యా త్వరగా లేవరా. మళ్లీ తెల్లవారిపోతుంది. ఎండ ఎక్కకుండా వెళ్లివద్దాం, మరి."

నేను ఉలికపడిలేచేను. మొగమయినా కడుక్కోకుండా, అమ్మని అడిగితీసుకున్న రొట్టె చేతబట్టుకొని, అక్కయ్యవెనకాలే బయలుదేరేను.

అప్పటికి ఇంకా జనం ఎవ్వరూ లేవలేదు. వీధులన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. ఇద్దరం ఒకరిప్రక్క ఒకరంనడిచి ఊరివెలుపలికి

వచ్చేము. అక్కడికి వచ్చేక 'వార్కా' నేలని కూర్చుంది తనకాళ్లని ఉన్న కాన్వాసుబూట్లు లాగేసింది. జుట్టుముడి వదులుచేసింది. ఇరక అక్కడినుంచి, చల్లని మంచుబిందువులతో తడిసివున్న ఆవచ్చిక బీడులో పరుగుఆరంభించింది.

"—'సై'. నన్ను పట్టుకోచూద్దాం."

ఇజారుకాళ్లు పైకి ఎగతిప్పి ఆమె వెంటపడ్డాను. ఆ 'తందుల హోష్టే'లోని కుర్రవాళ్లు ఎవ్వరూ నాపరుగు పట్టుకోలేకపోయేవారు. ఎంతదూరం పరుగెత్తినా ఆమె దొరకలేదు. ఆతెల్లటికాళ్లు, గాలిలో ఎగురుతూన్నట్లే అతివేగంగా ఆమెని తీసుకుపోతున్నాయి.

నేనూ పరుగువేటుదూరంలోకి వచ్చేటప్పటికి హఠాత్తుగా ఏగడ్డిలో దాగుకొందో- ఏపల్లంలో కూర్చుందో ఇట్టేకనుమరుగు అయిపోయింది. ఆచోటికి వెళ్లి నేను అటూ–ఇటూ చూస్తూన్నాను, ఇంతలో ఒకమూలనుంచి ఏపల్లంలోనో కూర్చుని పెదవులు అణచి పెట్టి 'కూయ్' అని అరచింది.

ధ్వనినిపట్టి నేను అక్కయ్య దాగినచోటికి వెళ్ళేను. ఒక్క గంతులో ఆవిడ నాదగ్గరకివచ్చి చేయిపట్టుకొని, నన్ను ఈడ్చు కుంటూ పరుగుఆరంభించింది. చాలాదూరందాకా ఇద్దరం కలిసి పరు గెత్తేం. మాకాళ్లక్రింద గడ్డి గలగలలాడింది. మాతాకిడికి రెల్లు పువ్వులు ఊగులాడేయి. ఎండురెల్లు విరిగిపడింది. కొంతదూరం పోయేటప్పటికి కాళ్లకి దగ్గరిలో ఏవో వింతకూతలు వినబడ్డాయి. ఆధ్వనికి 'వార్కా' అదిరిపడి ఆగిపోయింది. నెమ్మదిగా బొటన

ప్రేళ్లమీద నడుస్తూ, చప్పుడుకాకుండా గడ్డి అటూ–ఇటూ తొల గించి వెదకడం ఆరంభించింది.

"నన్యా! ఇంకా ఈకలుకూరా రాలేదురా. పాపం చిన్నపిల్లలు. చూడు. ఏలాగ కిచకిచలాడుతూన్నాయో."

నేనూ నెమ్మదిగా వెళ్లి వొంగి చూసేను. ఒకచిన్నపల్లంలో మెత్తని గడ్డిపరుపుమీద పూరేడుపిట్టపిల్లలు మాహాకకి కంగారుపడి, ఒకదానిమీద ఒకటిదొర్లుతూ, వచ్చీ–రానిరెక్కలు ఆడిస్తూ, కిచకిచ లాడుతూ, కనిపించేయి.

'వార్కా' చుట్టుప్రక్కల మొలచిన గడ్డికొసలు, గూటిమీదికి డేరాలాగ వంచింది.

"నన్యా! చిన్నపిల్లలు, వీటిని ముట్టుకోనకేం? పాపం. వాళ్ళ అమ్మ ఏడుస్తుంది."

ఇద్దరం మళ్లీ చేయీ చేయీ పట్టుకొని పరుగు ఆరంభించేం. ఎత్తుగా పెరిగిన పచ్చికలో కాళ్ళు దిగబడిపోతూన్నాయి. గడ్డికొసల్ని నిలచిన మంచునీటికి పాదాలు తడిసిపోయేయి. కాళ్ళనిండా ముళ్లు గుచ్చుకున్నాయి. ఏవేవో పురుగులు కాళ్ళకి ఎగబాకుతూన్నాయి. కాని, మేము పరుగుమానలేదు.

కొంతసేపటికి 'వార్కా' పూర్తిగా అలిసిపోయింది. ముందుకి ఒక్కఅడుగుకూడా వేయలేక నిలబడిపోయింది. కళ్లుమూసుకుంది. తల వెనుకకి విరగవేసి, రెండుచేతులతోటీ గుండెలు అదుముకొని 'అయ్యబాబోయ్'– అంది.

అయాసపడియున్నా మేమో మాటా-మంతీ లేకుండా, నెమ్మదిగా 'సారింకా'నది గట్టుకంటా నడిచేం. దట్టంగా అలుముకొన్న అడవి తీగల గుబురులలోనుంచి, మెలికలుతిరిగి సారింకా పైరుగాలికి చిరుఅలలు కొడుతూ, నెమ్మదిగా ప్రవహిస్తూంది.

ఇద్దరం పైబట్టలు తీసివేసేం. 'వార్కా'తాను తొడుక్కొన్న ఆకుపచ్చని ప్రాకు నెమ్మదిగావిప్పి ముడతలు సరిచేసి, ఒకచెట్టు కొమ్మకి తగిలించి, గంతులువేస్తూ నదిలోకి పరుగెత్తింది.

నేనుమాత్రం అక్కయ్యకోసం ఎదురుచూస్తూ అక్కడే గట్టు మీద కూర్చున్నాను. నాకు నీళ్ళుఅంటే మహాచెడ్డభయం. 'వార్కా' బాగా ఈదుతుంది.నీటిమీద వెల్లకితలా పడుక్కొని, కాళ్ళతో నీరు కొడుతూ కొంతసేపు ఈదింది. తరువాత కొంచెంసేపు, మెరక నీటిలో పాకి కొంతదూరమూ- ఇసకలో దున్నుకుంటూ కొంత దూరమూ నాకేసి పరుగెత్తుకొనివచ్చింది. సన్నని నడుముమీద తెల్లని తుంటిమీదా నీటిబిందువులు మెరుస్తూన్నాయి. నాదగ్గిరికివచ్చి, ఆవిడ పకపకా నవ్వింది. గభీమని రెండుచేతులూ పట్టుకుంది, ఇంక ఎంతగోలపెట్టి ఈడిగిలబడ్డా వదలకుండా, నీళ్ళలోకి ఈడ్చు కుపోయింది. దారిపొడుగునా కేకలు పెడుతూనే వున్నాను. అక్క య్య బుద్ధి చెప్పుతూనేవుంది.

"నోరుమూయరా! చవటా!"

నీళ్ళలోకి ఒకమారు ఈడ్చుకుపోయేక నాకుభయం తగ్గిపో యింది. అక్కయ్యభుజాలు పట్టుకొని, కాళ్ళుకొడుతూ లోతునీటి

లోకంటాపోయి, ఈత నేర్చుకున్నాను. నాకేమీ భయం వేయలేదు.

ఒకరిమీద ఒకరం చేతులతో నీళ్ల చిమ్ముకున్నాం. నీటిలో ఇసకమీద తేలునడకలు నడిచేం. సూర్యుడు బాగాపైకిఎక్కి-వచ్చే వరకూ నీటిలో చెరలాడేం. అడవుల వెనుకనుంచి సూర్యుడు బాగా పైకి వచ్చేడు. వెంటనే మేము ఇద్దరమూ నీటిలోనుంచి పైకివచ్చేసి, నదిగట్టున గడ్డిమీద చదికిలబడి, ఒళ్ళు ఆరపెట్టుకున్నాం. 'వార్కా' జుట్టు నీరు ఓడుతూంది దానిని మెలిపెట్టి నీరుపిండి, దులుపుకొని ఎండకి నడ్డితిప్పి కూర్చుని ఆరబెట్టుకుంది. పొడుగుపాటి బంగరు రంగుజుట్టు భుజాలనుంచి జారి, నేలకంటా జీరాడింది.

ఒళ్ళు ఆరేక బట్టలు వేసుకొని, అడవులలోకి బయలుదేరేం. అక్క-య్య ఫ్రాకుతొడిగింది. కాని, గుండీలు పెట్టుకోకపోవడం చేత మెడపట్టీలోంచి తెల్లగా దంతంలావున్న మెడభాగం కనిపిస్తూంది. ఇద్దరం నెమ్మదిగా ఒకలోయలోపడి, దిక్కు-లుచూస్తూ నడుస్తూన్నాం. ఇంతలో ఉన్నట్టే-ఉండి వార్కా ఎటుపోయిందో ఇట్టే తుర్రుమంది. నేనింకా దానికోసం అటూ-ఇటూ చూస్తూనే వున్నాను. ఇంతలో దోసిలి నిండా పువ్వులుకోసుకొని పరుగెత్తు కొనివచ్చింది. గసగసాచెట్లపువ్వులు- సీమబంతిపువ్వులు- ఇంకా ఏవేవో ఇతరఅడివిపువ్వులు, ఆమెదోసిలినిండా వున్నాయి.

"ఎక్క-డివే ఇవన్నీని"- అనేనామాట మాటగానేవుంది, ఆ పువ్వులన్నీ నానెత్తినపోసి పకపకా నవ్వింది. రెండుచేతులూ పట్టుకొని అడవిలోకంటా లాగుకొనిపోయింది. ప్రతిక్షణం-ప్రతిఅడుగు

లోనూ కొత్తి కొత్త పుష్పాలు కనిపిస్తున్నాయి. కొత్తిపువ్వులు కని పించినప్పుడెల్లా ఆమె ఉత్సాహంతో కేకలు పెడుతూంది. రెండు చేతులూ నెత్తిమీదికి ఎత్తుకొని, పొదలమధ్య దూరిపోతూంది. ఆ పొదలమధ్య ఆమెతలకూడా కనపడడంలేదు. ఇంకాముందుకు వెడు తూంది. నేను ఆమెని వెంబడిస్తూన్నాను. ఆపొదనుంచీ ఈపొద నుంచీ ఎడతెగ కుండా పువ్వులు కోస్తూంది. అడ్డంవచ్చిన కొండవా గులలో నీరు దున్నుకుంటూ పుక్కిలించి ఉమ్మివేస్తూ, రుచిచూస్తూ ముందుకి పోతూనేవుంది.

నేను బాగా అలిసిపోయేను. పొద్దుట ఏటివొడ్డున తిన్న కాస్త రొట్టీ అరిగిపోయింది. బాగా ఆకలివేస్తూంది.

"అక్కయ్యా! ఇంటికి పోదామే." అన్నాను. కడుపుకేసి చూసుకుంటూ పొదలమధ్య పూగుత్తుల నడిమినుంచి 'వార్కా' మెడసాచి చూసింది. నెత్తిమీదికి ఎత్తివున్న చేతుల వ్రేళ్ళ మధ్య నుంచి, పువ్వులు జారిపోతూన్నాయి. పెదవులు కంపిస్తూన్నాయి. కండ్లు నీరునిండివున్నాయి.

"ఒద్దు. ఇప్పటినుంచీ తొందరేం?"

సూర్యుడు అస్తమించేదాకా మేము ఇంటికి పోనేలేదు. 'వార్కా' తెల్లని ఒడలు కమిలిపోయి గులాబిరంగులోకి మారింది. బెట్టునుంచి సీమబంతి పూగుత్తులు వ్రేలాడుతూన్నాయి. గాలికి అటూ-ఇటూ కొట్టుకొని, చిక్కపడినజుట్టులో వెన్నెలపుర్గుగులు చిక్కుకొని, మిలమిల మెరిసిపోతున్నాయి.

ఇంటికి వచ్చేక ఒకగిన్నెనిండా నీరుపోసి పువ్వులు దాంట్లో వేసింది.

"అమ్మా! చూడవే. ఎంత బాగుందో—" నంటూ ఒక పూగుత్తి అమ్మకిచ్చింది. అరణ్యాల పరిమళం- నదీప్రవాహాల సౌందర్యం- సూర్యకిరణాల స్వచ్ఛత, ఏకీభవించినట్లు ఒక్క క్షణకాలం మాచిన్న గుడిసె కలకలలాడింది. ఒకమూల చిరునవ్వునవ్వుతూ అదృశ్యం చూసి స్తంభించిపోయేడా అన్నట్లు తాతయ్య కదలకుండా పడి యున్నాడు.

" నాన్నకి ఇచ్చినలాంటి పువ్వు- ఎర్రటిది- ఒక్కటి ఈయవూటే అక్కయ్యా!"- అంటూ మిట్కా-న్యార్కాలు పరుగెత్తు కొని వచ్చేరు. తాతయ్య కదిలేడు. సంజ్ఞచేసి 'వార్కాని' దగ్గిరకి పిలిచేడు. వెంటనే అక్కయ్య పరుగెత్తుకొనివెళ్లి నిస్సహాయంగా మంచంలో పడివున్నతాతయ్యమెడ కౌగలించుకంది.

"అందర్నీ ఒక్కమారు ఈలాగ రమ్మను తల్లీ!"

అందరం తాతయ్యచుట్టూ చేరి ఏంచెప్పుతాడో విందామని సద్దుచేయకుండా కూర్చున్నాం. కనుచీకట్లు పడుతూన్నాయి. తాత చెప్పేమాటలు వినడం ఎక్కడ చెడిపోతుందోనని ఎవ్వరూ దీపం వెలిగించడానికికూడా లేవలేదు.

తాతయ్య ఒండిగిలా పడుకొని ఒకమోచేయిమీద అనుకొని సగంవరకు లేచేడు. పొడుగుగా పెరిగిపోయిన గడ్డం ఊగులాడింది. ఊపిరి ఎంతోబరువుగా తీసుకుంటున్నాడు.

"నాకు తెలిసినకథ ఒకటుంది. అది జరిగి చాలరోజులే అయినా మీరందరూ వినవలసిందే. చెప్తాను. దగ్గిరగా రండి."- ఈమాటలు అన్నమీదట కలిగిన ఆయాసంతో తూలిపోయి తాతయ్య వెల్లకితలా తలగడామీదికి పడిపోయేడు. ఊపిరి తీసుకుంటూవుంటే ఇగుళ్లలోంచి ఈలలు పుడుతూన్నాయి.

ఒక్కనిముషం కళ్లుమూసుకొని పండుకొని, తాతయ్య తన కథ ఆరంభించేడు. మధ్యమధ్య దగ్గుతెరలు వచ్చినపుడు ఒక్కొక్క క్షణం ఆగి మళ్ళీ ముందుకు సాగుతూ తనకథ పూర్తిచేసేడు.

"మరి, ఇంక వినండి—అనగాఅనగా ఒకఊరు. అవూళ్ళో ఒకమనిషి వుండేవాడు. ఆతడు ఎంతో మంచివాడు. చాలా బలమైనవాడు. శక్తివంతుడు.ఆశక్తికూడా అంతా—ఇంతాశక్తికాదు.రాక్షసి బలం. రెండు చేతులుమధ్యా నొక్కేసి, నల్లరాళ్లనికూడా గుండ-పిండి చేసిపారవేసేవాడు. వట్టిఇనుము అనుకోండి. మరెందుకు?— కాని, ఆతనికి ఉన్నదల్లా ఆబలమే. ఏదేవుడుగాని, ఏదయ్యంగాని, ఆతనికి అంతకంటే వేరేమీ ఈయలేదు. ఎంతబలం వుంటేనేం? వట్టిదరిద్రుడుః అభాగ్యుడుః పాపం ఎప్పుడూ సుఖపడాలని అనుకొనేవాడు. సుఖం కోసం ఎంతబరువు పనికైనా సిద్ధం అయ్యేవాడు. ఎంతశ్రమపడి అయినాసరే ఆసుఖంకోసం దానివెంటబడి పరుగులెత్తేవాడు. కాళ్లు నొప్పులు పుట్టేయి. పరుగు ఆపలేదు. ఒగర్పుపుట్టింది. ఊహు. ఆగలేదు. ఆఖరుకి ఆసుఖదేవతకే దయపుట్టి తనంతతాను ఆతని కౌగిటికి దొరికింది."—

ఈమాటలు చెప్పుతూంటే ఆతని గొంతుక అపహాస్యం చేస్తూన్నట్లు వెక్కిరింతగా వినిపించింది.

"-కాని సుఖదేవత ఆతనిని సుఖపెట్టడానికి దగ్గిరచేరలేదు. హేళనచేయడానికి- ఏడిపించడానికి- నాశనంచేయడానికి- వాడి జీవితాన్ని నాశనంచేయడానికి- మాత్రమే అది వాడిదగ్గిరికి వచ్చింది.

మిట్కా—న్యూర్కాలు భయంతో అమ్మని చెరొకప్రక్కనీ కౌగలించుకున్నారు. నాఒళ్లంతా భయంతో ముచ్చెమటలు పోసేయి. తాతయ్యతల తలగడామీద సరిగ్గా అమర్చడానికి వార్కా ప్రయత్నించింది. కాని, ఆతడు ఆచేతుల్ని తోసేసి పెద్దగొంతుకతో తనకథని మళ్ళీ ఆరంభించేడు.

" వద్దు. వద్దు— ఇంక కథఆట్టేలేదు. అల్లరిచేయకుండా వినండి.— అప్పుడు ఆకథలోని మనిషి చేయవలసింది ఏమిటి? అంతకష్టమూ పడి చేతజిక్కించుకొన్న ఆసుఖస్వప్నం ఇట్టేచూసేటప్పటికి కరిగిపోయి ఊరుకుంది. ఆకౌగలింతలో మిగిలినది కేవలమూ బొగ్గులూ- బూడిదా మాత్రమే. ఇప్పుడు ఆలోచించండి ఆతడు ఎంతబాధపడతాడో, తల నేలబెట్టి కొట్టుకున్నాడు. పళ్ళు విరుగకొట్టుకున్నాడు. జుట్టు పీకుకున్నాడు. కళ్ళు పొడుచుకున్నాడు.—

"అబ్బ! ఇంక ఆపవోయి. చెప్పకు—" అంటూ 'వార్కా' దుఃఖంతో ఏడ్చింది.

తాతయ్య ఉద్రేకంతో తనంతతానే లేచి మంచంమీద కూర్చు

న్నాడు. నడుము వంగిపోయినా మిద్దెమన్ను నెత్తికి తగులుతూ న్నట్లే అనిపించింది. అలాగ కూర్చుండే ఆతడు తనకథని పూర్తి చేసేడు.

"ఆరోజు మొదలుకొని ఆదురదృష్టవంతుడు వీధులు పట్టిపో యేడు. ఆతనికి ఎక్కడా శాంతిగాని, సంతోషంగాని, దొరకలేదు. ఇంకచచ్చిపోయేక, గోరీలో పడుక్కొని, అక్కడపెరిగిన రేగు చెట్ల ఆకులధ్వనులు వింటూ ఉంటే, ఏమైనా శాంతిలభిస్తుందేమో మరి."

తన ఈకథ పూర్తిచేసి తాతయ్య వెనక్కిపడిపోయేడు. ఆబరు వుకి మంచం ఊగిపోయింది. బల్లలు కిరకిరలాడేయి. పెదవుల మధ్య రెండు నల్లనిరక్తపుచుక్కలు నిలచేయి.

'వార్కా' తాతయ్య మొగంమీదికి వొంగింది. ఆమెజుట్టు భుజాలమీదుగా ఆతనితలగడాలను కప్పింది. అల్లావొంగి తనపచ్చని ప్రాకుతో తాత పెదపులమధ్య త్రుళ్ళిపడ్డ రక్తబిందువుల్ని తుడిచింది. కళ్ళ నీళ్లపెట్టు కుంటూ ఆతనిగడ్డం పట్టుకొని బ్రతిమలాడింది.

"తాతయ్యా! నెమ్మదిగా పడుకోవూ? రేపు పొద్దుటే నిమ్మ షర్బత్తు తెచ్చిపెడతానులే. పడుకో మరి........"

ఆ 5గో

ప్రకరణం.

నెమ్మదిగా అడుగులో అడుగువేసుకుంటూ కోమా గుడిసె లోనికి ప్రవేసించేడు. బాగా చిక్కి ఒరుగైపోయేడు. ఎక్కడా పడుచునేవళికం లేదు. మనిషి తెల్లగా పాలిపోయేడు. హాస్పటలు వాళ్ళు ఇచ్చిన తెల్లని నారచొక్కామినహాగా పైన మరొకదుస్తు లేదు. ఆఒక్కగుడ్డతోటే ఈవీధులన్నీ గడిచివచ్చేడు. హోరున వీస్తూన్న చలిగాలికి శూన్యంగావున్న చొక్కాచేయి తటతటా కొట్టుకుంటూవుంది. దానిని అణచిపెట్టడానికైనా ఆతడు ప్రయత్నించలేదు. గడియారంలో 'పెండ్యులం'లా అది ఆలాగ వూగుతూనే వుంది.

లోహపు పనివాళ్ల బారక్సు- గనులపనివాళ్ళ ఇళ్లు-వద్రంగుల ఇళ్ళు ఉన్న వీధులన్నింటినీదాటి ఏదో వెతుకుతూన్నట్లు తలబాగా వంచుకొని ఇంట్లోకి వచ్చేడు.

కాళ్లుఈడ్చుకుంటూ వచ్చి గుడిసె మధ్యనున్న పీటమీద చదికిలబడి 'ఉస్సురు'న్నాడు. ఆతని నాలిక ఉదారంగులో, చేపదవడలా వాచి వుంది. ఉన్న ఒక్కచేతినీ నీరసంగా జాప్పడంచేత క్రింది కూటా వ్రేలాడుతూ ఎంతోపొడుగుగా వున్నట్లు కనబడుతూంది.

ఇంట్లో అందరూ నోటమాటలేక చేష్టఋదక్కి, ఆతనిమొగం కేసి చూస్తూ కూర్చున్నారు. దాహం తీసుకుందుకు నీటిదబ్బా

పెదవులదాకా వెళ్లకుండానే తాతయ్యచేతిలో మధ్యమార్గంలోనే నిలవబడిపోయింది. అమ్మచేతిలోని సూది ఆమె కుడుతూన్న గుడ్డకి అతుక్కొనిపోయింది. స్యూర్కా—మిట్కాలూ— నేనూ మొగమొగాలు చూసుకున్నాం. వేడిపొయ్యిమీద పోసిన ధాన్యపు గింజలు చిటపటాపేలి పేలాలు దూరంగా చెదురుతూన్నాయి. వాటిని ఏరుకొనడానికి కూడా మాలో ఎవ్వరూ కదలలేదు.

కోమా ఆబల్లమీదనే ఒక్కక్షణం కాలుసాచుకొని పడుకొని విశ్రాంతితీసుకున్నాడు. ఎంతోసేపు బరువుపని చేసిచేసి ఇంకభరించలేక పారిపోయివచ్చినవాడల్లే కంట నీరుపెట్టుకున్నాడు.

"అమ్మా! కొంచెం దాహం ఇయ్యవే"— ఆఖరుకి వాడే నోరు మెదిపి ఆనిశ్శబ్దాన్ని భంగించేడు. విచారభారంచేత చేయివణకి తాతయ్యచేతిలోని నీటిడబ్బా నేలబడిపోయి గణగణలాడింది. అమ్మ లేచి చేతిలోని సామాను సర్దుతూంది. మాకూకాస్త ధైర్యంచిక్కి 'అవమ' దిగేము మాలోకల్లా స్యూర్కా ధైర్యవంతురాలు. అది సరాసరి అన్నయ్య ప్రక్కకిచేరి బల్లమీదనుంచి అస్తవ్యస్తంగా వ్రేలాడుతూన్నవట్టిదొక్కచేయి తడిమింది.

"కోమా! చేయి ఏదిరా?"

అన్నయ్య అదిరిపడ్డాడు. వాడివాలకం చూస్తే తాను మరిచిపోవాలనుకుంటూన్న దారుణవిషయాన్ని జ్ఞాపకం దెచ్చినందుకు ఆచిన్నపిల్లని 'ధమ్మ' మని అణుస్తాడేమో ననిపించింది. కాని, అతడు అలాగంటి అఘాయిత్యం ఏమీ చేయలేదు. రెండో చేత్తో

దానిని దగ్గిరికి లాగుకొని తన చెమ్మగిలిన కళ్ళని ఆమె జుట్టులో దాచుకున్నాడు.

తాతయ్య తనంతతానే మంచంమీదనే కూర్చున్నాడు. బిగియబట్టిన ఆపెదవులలో ఏవోమాటలు కదులుతూన్నాయి. ఆతడు మాటలాడడానికి తనశక్తినంతనీ వినియోగించేడు. గడ్డం దువ్వుకున్నాడు. కాని, ఎంతప్రయత్నించినా మాట పెగిలిరాలేదు.

ఆలోచిస్తే కోమాకంటె నేనే కొంతవరకు సుఖపడ్డానని చెప్పవచ్చును. చిట్టపుగుట్టలనుంచి ఇనపముక్కలు ఏరి తెచ్చేనాటికి నాకు ఏడేళ్ళయినా వున్నాయి. కాని, కోమాకి అయిదేళ్ళు వెళ్ళకుండానే వాడిని వెంటబెట్టుకొని కసాయిదుకాణాల దగ్గరనుంచి 'కోకి' తీసుకురావడానికి నాన్న బయలుదేరేవాడు. పన్నెండేళ్లు వెండకుండానే నాన్న ఒక రోజున వాడిని వెంటబెట్టుకొని మేస్త్రీ ఇంటికి వెళ్ళేడు. ఏవేవో బహుమతులు వాడి మొగాన బెట్టేడు. పొగడి దువ్వేడు. ఈప్రయత్నాల ఫలితంగా మర్నాడే అన్నయ్యని 'రోలింగ్‌మిల్లు' లో 'ఆయలరు' గా తీసుకున్నారు.

ఆయంత్రాలయంలో పెద్దపెద్ద ఇనపదూలాలు, పైపులు, పట్టాలు, పోతపోసి తయారుచేస్తారు. ఆపనికి తగినట్లు 280. అడుగులపొడుగైన పెద్దయంత్రాలగది. దానిలో మరలకి నూనెపోసి, వేడిపుట్టి బేరింగ్‌లు అరిగిపోకుండా చూస్తూండడం అన్నయ్యపని.

అయిదేళ్లపాటు కోమా ఆపనిలోనే వుండిపోయేడు. ఈమధ్యకాలంలో– జీతముగాని, ఉద్యోగముకాని ఎంతమాత్రమూ హెచ్చు

దల చూపలేదు. నిరంతరం బేరింగులలో పోస్తూండే 'క్రూడాయిల్' జిడ్డుతో జారిపోతూవుండే అచప్టామీద గుచ్చిగుచ్చి కాళ్లమోపుతూ నడుస్తూండేవాడు.

'పందులదొడ్డి' సెటిల్మెంటులోని ఇతరపిల్లలందరికిమల్లెనే 'కోమా' కూడా నిరక్షరకుక్షిగానే పెరిగేడు. కొలిమలవద్ద పనిచేసే గార్బజ్ ప్రయత్నంవలన గాకుంటే ఎప్పటికీ అలాగే వుండిపోయే వాడు. అక్షరాలు రానివాళ్లకోసం ఏర్పాటుచేసిన 'స్టడీ–సర్కిలుకి' తనతోకూడా తీసుకుపోతూండేవాడు కోమాని. రోలింగ్‌మిల్లులో ఏదోపని నేర్చుకుందుకువచ్చిన ఒకవిద్యార్థి అపాఠశాల నడుపు తూండేవాడు. ఆమనిషిపేరూ– అవీ జ్ఞాపకంలేవుగాని, అదళసరి యైన ముక్కు–అద్దాలు– ఎర్రనిచెవులు– బలిష్ఠములయిన చేతులు– బాగా జ్ఞాపకం వున్నాయి. అతడు ఎంతో చమత్కారంగా కనిపించే వాడు.

సరిగా ఇదేరోజులలో కోమాకి చేయితెగిపోవడానికి అవకా శం ఇచ్చిన ఉద్యోగం దొరికింది.

ఒకరోజున........................

అప్పుడే మిల్లు కూసింది. రాత్రివంతుకూలీలు తమస్థానాలు వదలి పైపులదగ్గిర కాళ్ళూ–చేతులూ కడుక్కుంటున్నారు. పగటి వంతుకూలీలు భగభగామండుతూన్న కొలిమిమంటలు మొగానికి తగలకుండా గ్లోవులుతొడిగిన చేతులు అడ్డంపెట్టుకొని, తమస్థా నాలకి చేరుకుంటున్నారు.

యంత్రాలగదికి కొంచెం అవతలగా పనివాళ్ళు తమపనిముట్లూ, బట్టలూ దాచుకొనేటందుకు ఒకగది వుంది. ఆగదిలో 'ఆయిలర్లు' అంతా సమావేశమై నిశ్చింతగా ఒకపెద్దదూలంమీద కూర్చుండి చుట్టలు కాల్చుకుంటూన్నారు. వారంతా నిశ్శబ్దంగా వున్నారన్న మాటేగాని, అందరిముఖాల్నీ ఏదో భయం ఆవేశించివుంది. వాళ్ల వరసచూసి కోమా ఆజ్ఞాపిస్తూన్నట్లూ– బుజ్జగిస్తూన్నట్లూ మాట లాడుతూన్నాడు.

"ఇదిగో ఎవ్వరూ లేవవద్దు.అడుగో! వస్తున్నాడు. కదలకండి."

పెద్దమేస్త్రీ రొప్పుకుంటూ, పెద్దచేతిరుమాలుతో నుదుటిచెమటలు తుడుచుకుంటూ పరుగెత్తివచ్చేడు. మనిషి పొట్టి. దానికి తగ్గట్టు మెడకూడా పొట్టికావడంచేత ఆలంబోదరంమీద ఆ తలకాయ, సీసాకి బిరడా బిగించినట్లే కనిపిస్తుంది.

"ఏమిటోయ్! ఇది? అంతా పనీ–పాటా మాని ఇక్కడికి వచ్చి కూర్చున్నారేం? నూనెలేక మరలు వేడెక్కి పోతూన్నాయి. నడవండి. ఊ."

కోమా కత్తెరకాళ్లువేసి వెనుకటి కంటేనూ స్తిమితంగా కూర్చున్నాడు. వెనుకనున్నవాడు ఒకడు ఖాండ్రించి ఉమ్మివేసి, కర్రబూటుతో రాసేసేడు.

ఎప్పుడూ మొగాలు ఎరగనట్లుగా మేస్త్రీ వాళ్ళ మొగంమీదకంటా వొంగి– 'ఆయిలర్స్'– అని పొలికేక ఒకటిపెట్టేడు.

ఎవ్వరూ పలకలేదు. కదలలేదు. ఇంక ఊరుకోలేక చేయిచేసు

కున్నాడు. ఎదురుగావున్న కోమాని రెక్కపుచ్చుకొని ఈవలికి ఈడ్చి యంత్రాలగదికేసి త్రోసివేసేడు.

"నడవ్వేం? లంజకొడక! త్వరగా నీచోటికి నడు. పని అయిన తర్వాత తీరబడిగా కూర్చుని ఎవ్వరి కొంప తీయడమో ఆలో చింతువుగాని, లే."

మేస్త్రీ నోరూ-చేయీ చేసుకున్నాక కూర్చున్న కుర్రవాళ్ళ మొండ్యం పూర్తిగా వదిలిపోయింది. పది-పదిహేనుమంది కుర్రాళ్ళు ఒక్కమారుగా తమస్నేహితుని సహాయంకోసం లేచేరు. కుంటి 'కోల్కా' కూర్చునివుండే మేస్త్రీ కాళ్లుపుచ్చుకు లాగేడు. 'పెట్కాకోవల్' భుజాలు పట్టుకొని వెనక్కి త్రోసేసేడు. మిగిలిన వాళ్ళంతా తలొకగుద్దూ-గుద్ది గుడ్డలు చింపి, తుండులావున్న మేస్త్రీని కుళ్లపొడిచి ఇనపరేకుల చప్టామీద పడత్రోసేరు.

ఈవార్త కారుచిచ్చులా మిల్లు అంతటా వ్యాపించింది. ఆనోటా-ఆనోటా కొలిములదగ్గిరకీ గొదాములలోకీ- ఉప్పు అందింది.

"పిల్లలంతా సమ్మె చేసేరు."

"నూనెపోసే పిల్లలు?"

"పెద్దమేస్త్రీని చావగొట్టి చెవులు మూసేరుట!"

"హహ్హహ్హ!"

"వాడిగుడ్డలు చింపేసేరు."

"మిల్లుకూలీలంతా కళ్లెగరేస్తూ పళ్లు ఇగిలిస్తూ, చేతులు

తిప్పుతూ వాక్యోపవాక్యాలు ఆడుతున్నారు. అక్కడ పనిముట్ల బీరువాల వెనుక 'ఆయిలర్లు' బారులుతీరి నిలువబడుతూన్నారు. పెదవులు బిగించి కోమా వారిముందర నిలబడ్డాడు.

"పాటలు పాడండి."

"డైరెక్టరుదగ్గిరికి పోదాం."

"డైరక్టరుఆఫీసుకి."

యంత్రాలయంలో నేలకి బిగించిన ఇనపరేకులమీద కూలి కుర్రివాళ్ళ కర్రబూట్లు సమవిరామంలో 'టకా-టకా' మన్నాయి.

రోలింగ్‌మిల్లులోని కూలీలు ఈవార్త వినగానే ఎర్రగాకాలిన పట్టాలనీ-చేతిపట్టకార్లనీ-ఆపళంగానే జారవిడిచేరు. అవి క్రమంగా నీలిరంగులోకిమారి చప్పగా చల్లబడిపోయాయి. 'వెల్డర్లు' పొయ్యిలమధ్యనున్న తలుపులు మూసేసేరు. శుద్ధిచేసిన ఇనుము చల్లబడి పాలనురగలా తెల్లబడిపోయింది.

దారితొలగి హుషారీ చెప్పుతూన్న తండ్రులు-అన్నయ-ఇతర బంధువులమధ్యనుంచి ఆయిలర్లు బారులుతీరి పాటలు పాడుకుంటూ నడిచిపోయేరు. మధ్యమధ్య తమవారు ఇస్తూన్న సలహాలని మందహాసంతో వింటున్నారు.

"లొంగవద్దురోయి."

"ఆఫీసులోకి వెళ్ళేముందు చీదుకుని మరీపోండి."

"తీరా వెళ్ళి మీ 'అమ్మ' ల కోసం ఏడ్చేరుగనక జాగ్రత్త."

మిల్లులో పని ఆగింది. అప్పుడే కొంత ఆయాసం తీర్చుకున్న

మేస్త్రీ—ఇంజనీరూ ఈవార్త వినగానే 'ఆయిలర్ల' ని పిలుస్తూ కూలీలు నిలబడ్డచోటికి పరుగెత్తేరు.

ఎదురుగా 'రోలర్లు' కనపడ్డారు.

"నూనె. నూనె. డబ్బాలు తీయండి."

రోలర్లు వెక్కిరించి, వేళాకోళంచేసి, తాళేకులు కట్టేరు.

"నూనెడబ్బాలు తీయండి. నూనె. నూనె."— అంటూ ఈమారు మేస్త్రీ 'వెల్డర్ల' వెంట పడ్డాడు.

ఆమాటలు వినబడనట్లుగా నటిస్తూ వారు కొలిముల తలుపులు ఛళ్లున బిగించేరు. అధికార్ల మొగాలుకూడా చూడటం ఇష్టంలేనట్లు 'గాగుల్సు' తగిలించుకొని తలొకవైపుకీ నడిచేరు.

"ఓహోయ్! నూనె. నూనె."

ఈపర్యాయం అసిస్టెంట్లని ఉద్దేశించిపిలిచేరు, మేస్త్రీ. వాళ్లు మాత్రం తక్కువవాళ్లా. తమరిని కానట్లుగా తలలువంచుకొని కుళాయీల దగ్గిరకిచేరి మొగాలు కడుక్కొనీ, రేకుడబ్బాలతో గడగడలాడిస్తూ దాహంత్రాగీ, కాలక్షేపం చేయసాగేరు.

"ఓహోయ్!"

ప్రార్థనలు కూతలలోకి పరిణమించేయి. ఇంక కూలీలలో తమ మాట వినిపించుకొనేవారు ఎవ్వరూ లేనట్లు స్పష్టం కాగానే ఆ ఉద్యోగులు తమంతతామే 'ఆయిల్' డబ్బాలు చేతబట్టేరు.

ఆయిలర్లు మిల్లుగుండా నడిచేరు.

మిల్లునుంచి కార్యాలయంవరకూగల రోడ్డుమీద అక్కడక్కడ

చెట్లక్రిందనిలువబడి ప్రజలు సైన్యంలా నడిచిపోతూన్న కుర్రవాళ్ళ కేసి వింతగా చూస్తూన్నారు. వాళ్ళ బూట్ల చప్పుడుకి ఆ వీధిఅంతా ప్రతిధ్వనించిపోతూంది. ఆచప్పుడూ—పాటలూవిని వీధులలో ఆడు కుంటూన్న పిల్లలంతా పరుగెత్తివచ్చి ఆ పంక్తులలో చేరిపోయేరు.

ఈ పటాలం అంతా పాటలు పాడుకుంటూ డైరెక్టరు ఆఫీసుకి చేరుకుంది.

పిల్లలంతా బయటనిలబడిపోయేరు, కూలీలంతా లోపలికి చొర బడ్డారు. విశాలమైనగది. నేలని చలువరాళ్ల చప్టా. అందమైన కుర్చీలు, నున్నని మేజా, విలువయిన సిగరెట్లునుంచి బయలు దేరిన పరిమళవంతమైనపొగ, ఇవన్నీ చూసేటప్పటికి కూలి కుర్రవాళ్ళు ఉక్కిరి—బిక్కిరి అయిపోయి భయంతో వెనుక చూచేరు.

కోమా చేయెత్తి అందరినీ నిలువరించేడు. తాను స్వయంగా ముందుకు నడిచి ఎడంకాలు ముందుకుసాచి, వణకకుండా నేలని గుచ్చిపెట్టి నిలుచున్నాడు.

"మేమంతా ఎన్నో ఏళ్ళనుంచి మీమిల్లులో పనిచేస్తూన్నాం."

కోమా మాటలాడడం ఆరంభించగానే కూలీలకి ప్రాణాలు కుదుటపడ్డాయి. ఇంక ఆవేశంతో ఒకరినొకరు నెట్టుకుంటూ, ఒకరి భుజాలమీదినుంచి ఒకరు వొంగిచూస్తూ, అరవడం ఆరంభించేరు.

"నేను రోలింగ్‌మిల్లులో మూడేళ్ళనుంచి పనిచేస్తూన్నాను. ఇంతవరకు ఉద్యోగంగాని—జీతంగాని పెంచబడలేదు."

"నాకూ అంతే."

"నేనూ అంతే."

"నేనిక్కడ నాలుగేళ్లనుంచి వున్నాను."

అందరూ ఒకేమారు గోలపెట్టి అరవడం ఆరంభించేరు. ఆధ్వనికి మేనేజరు రెండుచెవులలోనూ వ్రేళ్ళుపెట్టుకున్నాడు.

మేనేజరొక మీసాలపోతు. కట్టుడుపళ్ళు. బానంత బొజ్జ. గంజిబాగా పట్టించడంచేత కొయ్యలాగవున్న కాలరూ—ఆతడూ చింతపండుబుట్టలాగ కుర్చీలో అతుక్కుపోయి కూర్చుంది. ఆశ్చర్యంతో ఈగంద్రగోళం అంతా ఎంతో శ్రద్ధగా చూస్తూన్నాడు.

"అబ్బ! అంత గోలా—గంద్రగోళం ఎందుకోయి!"

"మాకు జీతం పెరగాలి."

"ఉద్యోగం హెచ్చాలి."

"నాకు 'వెల్డరు' పని ఈయండి."

"నన్ను 'రోలరు' నుగా వేయండి."

"మాకు న్యాయంగా రావలసిన జీతాలలో మూడోవంతుకూడ ముట్టడంలేదు."

"బాగానేవుంది. నాకూ సంతోషమే. మీకోరికలు నెరవేర్చే టందుకు నాశక్తివంచన లేకుండా పనిచేస్తాను."

సమ్మె ఎన్నో రోజులవరకు సాగింది. ఎవ్వళ్ళూ 'ఆయిలర్లు' దొరకకపోడవంచేతనూ, ఈకుర్రవాళ్ళకోరికలు ఎంతో సాధారణంగా వుండడంచేతను, యజమానులు లొంగకతీరిందికాదు. కాని,

ఒక్కటి. ఇంతకాలమూ కూలీలకి, చదువనూ—వ్రాయనూ, నేర్పిన ఆవిద్యార్థి సమ్మెనెగ్గిన మరునాడు పనిలోకిరాలేదు.

పదిహేడు ఏళ్ళ కోమా పట్టుకార్లు చేతబట్టుకొని, తన కొత్త ఉద్యోగంలో చేరేడు. ఆనాడు మొదలుకొని ఆరేళ్లపాటు కాలుతూన్న ఇనుపతుండ్లు యంత్రాలకి అందిస్తూ గడిపేడు. ఆ ఆరేళ్ళూకూడా వయసుగడచినవారికంటె ఎక్కువగా పాటుపడ్డాడు. కాని, ఆతనికి పుట్టేది అల్లా పెద్దకూలీకి ఇచ్చేదాంట్లో మూడో వంతుకూడా ఉండేదికాదు.

కోమాకి డబ్బు అవసరం ఎక్కువగా వుండేది. కొంపకి దూరంగా వుంటూన్నా సంసారపరిస్థితులు ఆతడు ఎరుగనివికావు. చిన్నపిల్లలకికూడా కడుపునిండా తిండి దొరకడంలేదని ఆతనికి తెలుసును. అందుచేత తనసంపాదనలోనుంచి కొంచెమో—గొప్పో ఇంటికి ఈయాలి. తాను స్కూలుకి పోతూన్నాడు కదా? జీతం లేకపోయినా పుస్తకాలకి కావాలి. తిండి—గుడ్డ; చాకలి—మంగలి; ఇంటిఅద్దె; ఇవన్నీ ఇచ్చుకోవలసిందే! కొంచెం పొగాకుఖర్చు ట్రేడ్—యూనియనుకీ, పార్టీనడిపిస్తూన్న పరస్పరసహాయకనిధికీ కొన్నినెలల చందాలు బాకీపడుతూన్నాడు.

'స్కూ—రిళ్ళు' మొదలయిన చిన్నచిన్న సంతనాపనులు చేసే శాఖలో వస్తువుల ఆకారం తేల్చే ఒకయంత్రంవుంది. అందులోపని చిక్కుపని కాదుకాని, చాలాబాధకరమైనది మాత్రం ఔను. అందు చేత దానిలో ఎంతబలమైనవాడూ నిలవబడలేదు. ఏనుగవంటి

మనిషి కొద్దినెలలలో పీనుగ అయిపూరుకుంటాడు. అందులో మేస్త్రీ ఎప్పుడూ పిండశక్తి ఉన్నవాళ్ళనే నియమిస్తాడు. అందులో జీతం కూడా హెచ్చుగావుంటుంది. అయినా అందులోకి వచ్చేవాళ్ళు తక్కువ. రాత్రిపూట వంతుమారడం అనేది ఉండనే ఉండేదికాదు.

కొలిమిపనివాడు గార్పజ్ కూడా డబ్బుచిక్కులో వున్నాడు. అతనికీ కుటుంబం పెద్దది. రాబడి తక్కువ. చాలావరకు అతడు దాన-ధర్మాలమీదనే పోషింపబడుతూన్నాడు. ఇద్దరూ డబ్బుకి చిక్కుపడుతూన్నవారేగనుక ఆయంత్రంలో పనిచేయడానికి నిశ్చయించుకొని కుదిరేరు.

పగలెల్లా కొలిములదగ్గర పనిచేయడం. సాయంకాలం ఆమిల్లులోకి బయలదేరడమూ. గార్పజ్‌కి ఒక అరగంటఅయినా కాలవ్యవధి ఉండేది. కాని, కోమాకి మొగం కడుగుకుందుకుకూడా వ్యవధి ఉండేదికాదు.

ఒకరోజున............ ...

ఇద్దరూ మిల్లులో ఒకరిపక్క ఒకరు నిలువబడ్డారు. చేతులలో పెద్దపెద్దకక్కులూ- ముక్కులూ ఉన్న పట్టకార్లు ఉన్నాయి. పగలెల్లా పనిచేసి వుండడం, ఇంతరాత్రైయేనా నమలకుండా మళ్లీ పనికి తలపెట్టడం మూలంగా 'కాన్వాసుట్టవరాలు'లలో కాళ్లు వణకిపోతూన్నాయి. పళ్లూ- ఇగుళ్ళూ ఆహారపదార్థములు తగలకపోవడంచేత బెరడుకట్టి సలుపుతూన్నాయి.

గంట ఇంకా మోగ్రిగలేదు. సమయం కావస్తూంది. కాస్త

విశ్రాంతితీసుకొనడానికి ఉన్నఅవకాశం అదే. దృఢంగా నిలువబడ డానికి ఓపికలేకపోవడంచేత ఒకరిభుజాలకి ఒకరిభుజాలు పోటీపెట్టి నేలని ఆనించిన నిలువుడేసి పట్టకార్లమీద గడ్డం ఆనించి ఒక్క క్షణం విశ్రాంతి తీసుకున్నారు. మిల్లు కూసింది.

"ఇంక ప్రారంభించుదామా?"

"ఊఁ"

రెండుచేతులతోటీ పట్టకార్లుగట్టిగా పట్టుకొని, అడుగులు నేల దొక్కి, కోమా సిద్ధంఅయ్యేడు.

చాలా ఎత్తున కప్పువేసిన ఇనుపచట్రంలో పావురాలు రెక్కలు తటతటలాడించేయి.

తెల్లగా పాలనురుగులా కాలితయారయిన లోహపుముక్కను కొలిమిలోనుంచి తీసి, వెల్డర్లు, రోలరుకొక్కీలలోకి నిర్లక్ష్యంగా విసిరేసేరు. కొక్కీలుదానిని యంత్రానికి అందించేయి. ఆమెత్తని లోహపు ముక్కని యంత్రాలు లాక్కున్నాయి. ఖాళీగాయున్న కొక్కీలు స్వస్థానం చేరేయి. 'వెల్డర్లు' మరొకముక్క అందించేరు. మొదటిముక్క మిల్లు చక్రాలలోంచి రాగానే గార్బిక్- కోమాలు కాయలు కాచిన చేతులలో దృఢంగా పట్టుకొన్న పట్టుకార్లతో అందుకొని గేజుల కందించేరు.

'జాగ్రత్త'-అన్నాడు యువకుడు.

'కాచుకో'-అన్నాడు బోసివాడు.

ఉభయులు నల్లనినీడలు పారిన యంత్రపుగోతిమీదికి వొంగి

యున్నారు. వారివెన్నులు ఆరిపోయి గొరకొములవరె గరిగరిగా వున్నాయి. గుండెల అదటుకి కట్టుకున్నగుడ్డలుకూడా కదిలిపోతున్నాయి. కక్కులతోవున్న పట్టుకార్లుచేతపట్టుకొని, యంత్రంలోంచి అతివేగంగా తాచుపాములా పాకివస్తూన్న కాలిన యినపముక్కని అందుకుంటూంటే చేతులు వొణికిపోతూన్నాయి. గార్బజ్ హడావిడిగా ఆమూలకీ ఈమూలకీ పురుకుతూన్నాడు. గిర్రున తిరుగుతూన్నాడు. యంత్రాల మధ్యనుంచి ఉరకలువేసుకుంటూ వస్తూన్నా లోహపుకడ్డీల్ని అందుకుందుకు అటూ—ఇటూ ఒరుగుతూన్నాడు. అంతశ్రమపడి- అతివేగంగా పనిచేస్తూన్నా ముక్కల్ని అందుకోవడం- అందించడం బ్రహ్మాండం అయిపోతూంది. ఇంక నడుము ఎత్తడానికి ఖాళీయేది?

'వెల్డర్లు' ఊరిఖే కొలిములనుంచి, లోహపుముక్కల్ని తీస్తున్నారు. కొక్కీలలో విసురుతూన్నారు.

గార్బజ్‌కీ—కోమాకీ—నాలుక పిడచకట్టిపోతూంది. ఎంతో బద్ధకంగా వున్నారు. కోమా తెగ ఆవులిస్తూన్నాడు. ఆసమయంలో వారిద్దరికీ తాము ఈపనిలో ప్రవేశించడానికి కారణం అయిన దారిద్ర్యబాధగాని, ధనావశ్యకతగాని, జ్ఞాపకానికి రావడం లేదు. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు ఇంటికి పోతామాయని పనిలోకి వచ్చింది మొదలు ఒకటే ధ్యాస.

చేతిలో పట్టుకార్లు పారేసి కుళాయిదగ్గిర వెల్లకితలాపడుక్కొని ఆచల్లని ధారలో స్నానం చేసి, ఇంత దాహం పుచ్చుకొనాలని

కోమా వాంఛపడుతూన్నాడు.

కాని, ఆలవకాశం లేదు. గంట ఇంకా మోగలేదు. కోమా ఏదో వొళ్ళు తెలియని అవస్థలో పనిచేస్తూన్నాడు. లోహపుము క్కల్ని పట్టుకార్లతో టక్కుటక్కుమని పట్టుకుంటూన్నాడు. మడ మలమీద గిర్రునతిరుగుతూ వాటిని గేజులకి అందిస్తూన్నాడు. ఒక దానివెనుక ఒకటిగా లోహపుముక్కలు వచ్చిపడుతూన్నాయి. ఎన్ని? ఆతడు లెక్క ఆరంభించేడు. కాని, కొలదిసేపటిలోనే లెక్క వందలూ- వేలూ మించింది. దానికి అంతూ-పొంతూ లేదు. అతడు ఆఖరికి ఆ లెక్క మరిచిపోయేడు.

ఈమారు ముక్క రావడం ఆలస్యం అయింది. కాలియున్న ఆ భయంకరసర్పంకోసం కోమా పట్టుకార్లతో సిద్ధంగా నోరు తెరు చుకొని కూర్చున్నాడు.

ఒక్క గంటా?- రెండు గంటలా? ..రాత్రికి రాత్రి అంతా తనగాఢాంధకారంలో ప్రపంచాన్ని అంతనీ కప్పేసి, విశ్రాంతినిచ్చే ఒక్కరాత్రికి-రాత్రంతా ఆలాగే కూర్చున్నాడాయె.

చూస్తూన్నాడు!............

ఆతని చేతులు వణికి పోతూన్నాయి. చేతిపట్టు జారి పట్టకార్లు నేలవిడాపిన ఇనుప రేకులమీదపడి ఘల్లుమన్నాయి. కోమా ఇంకా చూస్తూనే ఉన్నాడు.

మిల్లుచక్రాల నీడలుపాకి నల్లగా కనిపిస్తూన్న 'గేజు' ఖాళీగా వుంది, 'కోమా' నాలుకతో పెదవులు తడుపుకున్నాడు. వానిలో

తడి అనేమాటలేదు. బెరడుకట్టి గాజుపారిపోయి వున్నాయి.

అలాగే నిల్చున్నాడు.

ఒకచేతిలోని పట్టుకారు జారిపోయింది. బోసివానికేక వినిపించుకుందుకు తగినంత వ్యవధి కూడాలేదు. పట్టుకారులేని చేయి నుదుటికి లేచింది. కేవలం చెమట తుడుచుకుందుకు మాత్రమే; వంచినతల కొంచెం ఎత్తేడు. అంతే. ఆవ్యవధిలో ఆదుస్సంఘటన తటస్థపడింది. కోమా ఎగిరివస్తూన్న ఇనుపసీలని చూసి హడలిపోయి దానిని పట్టుకుందుకు బదులు చేతులుఎత్తేడు. ఒకచేతిలో ఇంకా పట్టుకారు వుంది. దానిని గట్టిగా పట్టుకొని ఆఅపాయం తప్పించుకుందుకు ప్రయత్నం చేసేడు కాని, అప్పటికే వేళ మీరింది. యంత్రంలోనుంచి ఉరికిన ఇనుపసీల తనగతిని నియమించే సాధనం ఎదురుగుండా లేకపోవడంతోనే కోమా మీదికి ఎగిరి, ఆతని చేతిలోని పట్టుకారునూ, చేతినీ, ఎగరకొట్టేసి, కాళ్లమధ్యపడి గుడ్డలు తగులబెట్టింది. చేయి జబ్బలోకి ఎగిరిపోయింది. క్రిందపడిన సీల యొక్క వేగానికి కాళ్లమధతలు పడిపోయేయి. గుడ్డలు అంటుకొని పొగబయలుదేరింది.

నేలకి జారిపోతూన్న 'కోమా' క్షీణస్వరంతో మూలుగుతూ పట్టుకోసం రెండోచేయి మిల్లుకేసి చూసేడు.

బోసిగార్బజ్ వెర్రికేక బెట్టి మిల్లుచక్రాలలో పడిపోతూన్న ఆచేతిని పట్టకారుతోకొట్టి గెంటివేసేడు. కాలినపట్టకారుకి తగలడం చేత కమలి మంటబుట్టిన చేతివ్రేళ్ళని అప్రయత్నంగానే తడియారి

పోయిన పెదవులతో ఊదుకున్నాడు, కోమా.

కూలీలంతా మిల్లుకేసి పరుగెత్తివచ్చేరు. యంత్రం ఆపివేయ బడింది. 'వెల్డర్లు' తమకళ్ళనున్న గాగుల్సు తీసివేసేరు. 'రోలర్లు' తమచేతిలోని పట్టకార్లుని వదిలివేసేరు. పరుగెత్తివస్తూన్న పెద్ద మేస్త్రీని గెంటుకుంటూ కూలీలంతా వచ్చిపడ్డారు. గంట గణ-గణ లాడింది.

కోమా చేతులువిరిగి, ముద్ద అయిపోయి, మెలికలుతిరిగి పడి పోయేడు. గార్బజ్ అమాయికంగా చూస్తూ అతనిమీద వొంగేడు.

"ఇంకా ప్రాణం వుందా?"

"ఆ! బ్రదికేవున్నాడు."— అని జనం అంతా తలలు ఊపేరు.

గార్బజ్ నిటారుగా నిలబడి, నిలబెట్టిన పట్టుకారుమీద గడ్డం ఆనించి, నిట్టూర్పు విడిచేడు.

"లేదు— అయిపోయింది."

అందరూ అతనికేసి తిరిగేరు.

"చేయి జబ్బలోకంటా పూర్తిగా ఎగిరిపోయింది."— అని దీనంగా చూసేడు.

వెల్డర్లు—రోలర్లు—అసిస్టెంటులు ఏదోచెప్పమన్నట్లు కళ్ళతో చెప్పుతూ గార్బజ్ మొగాన్ని గుచ్చిగుచ్చిచూసేరు. అతడూ ఒక్క నిమిషం కోమా వంకా, కూలీలవంకా, శ్రద్ధగా చూచి, చేతిలోని పట్టకార్లు గణగణలాడించేడు.

"ఇరవైనాలుగు గంటలనుంచి అతడు నడుము ఎత్తలేదు.

ఏదయినా తిండి తినాలనుకుంటున్నాడు. తిండికి బదులుగా అతనికి దొరికినవి ఈచావుదెబ్బలే."

పెద్దమేస్త్రీ—టెక్నీషియను—ఇంజనీరు— మొదలయినవారు ఆ వాక్యాలు విననూవినరు. వారికి రుచించనూ రుచించవు. ఒక పెద్దగంట గణగణలాడించుకుంటూ, దారిలోమూగిన జనాన్ని అటూ—ఇటూ తోసివేస్తూ కోమాను సమీపించబోయేరు.

బోసిగార్బజ్ చేయి పట్టకార్లతోసహా గాలిలోకి లేచింది.

"వాళ్ళని రానీయకండి."

"పచ్చడిక్రింద కొట్టండి, తొత్తుకొడుకుల్ని."

సమ్మె ఆరంభం అయింది. కూలీలకోరిక లన్నింటినీ అంగీకరించి, అమలులో పెట్టినాకనే మళ్ళీ మిల్లు కదిలింది. ఈమారు కూలీలక్షేమం కోసం యంత్రాలవద్ద ఇనపవలలు అమర్చేరు. పనివాళ్ళజీతాలు హెచ్చింపబడ్డాయి. రాత్రివంతు కూలీలకి పాలు అందించబడుతూన్నాయి.

గాయాలుమానేక 'కోమా' కి 'రోలింగ్‌మిల్లు' లో తుడవడం పని ఇచ్చేరు.

రోజులు గడిచినకొలదీ కోమా శరీరం ఆకాన్వాసుకోట్లలో కృంగిపోయింది. తలమీదిటోపీ దవడఎముకలకంటా జారిపోయింది. అతడెన్నడూ ఇంక పెదవికదపగా ఎవ్వరూ చూడలేదు

ఏ డో

ప్రకరణం.

నాన్నతోటే నిద్రలేచింది, వార్కా. అప్పటికి ఇంకా తెల్లవార లేదు. బయటఅంతటా కారుచీకట్లు కమ్ముకొనివున్నాయి. ఆకాశం అంతా నల్లటిమేఘాలు ఆవరించేయి. ఉండిఉండి ఒక్కొక్క వానజడి వచ్చి కిటికీతలుపులమీద మోదిపోతూంది. ఇంటిచూరుల నుంచి వర్షపునీరు ధారలుకడుతూంది. గాలితాకుడుకి తుప్పుపట్టిన తలుపుగ్రంధులు కిరకిరలాడుతూన్నాయి.

అక్కయ్య తిన్నగా నీటితొట్టెదగ్గిరికిపోయి చల్లనినీటితో ఒళ్లు కడుక్కుంది. తెల్లనిఒడలు కంది గులాబీరంగులోకి మారే దాకా బాగారుద్దుకుని షాడితువ్వాలుతో తడిఒత్తుకుంది. తరువాత గోడనున్న అద్దానికి ఎదురుగా నిలబడి తలదువ్వుకోనారంభించింది. ఇంతలో నాన్న పనిలోకి పోవడానికి సిద్ధం అయ్యేడు.

తడిసిన కిటికీఅద్దాలలో వెలుతురురేకలు రంగులీనుతూన్నాయి. గాలిహోరు అణిగింది. వర్షంమాత్రం ఎక్కువ అవుతూనేవుంది. ఏదో ఆలోచిస్తూన్నట్లు వార్కా కిటికీదగ్గర నిలచి బయట తొంగి చూసింది.

"వర్షంలో.........ఏలాగ.........వెళ్ల డమబ్బా!"

వార్కా కిటికీకి దగ్గరగా కుర్చీపీట లాగుకొనికూర్చుంది కాళ్ళకి జోళ్లు వేసుకోసాగింది. తెల్లవార్లూ ఆవముమీద పెట్టడం

చేత వేడెక్కి గడ్డిజోళ్ల కమ్మనివాసనలు వెదజల్లుతూన్నాయి. అమ్మనిద్రకళ్ళతో తూగుతూ రెండు ఎఱ్ఱనిరుమాళ్లలో వాళ్ళిద్దరికీ మధ్యాహ్నంతినడానికి ఇంతరొట్టె, రెండుదుంపలు, పేల్చినపంది మాంసం కాస్తకాస్త, మూటకట్టి చేతికిచ్చింది.

చిట్టపుగుట్టలకి పోయేటందుకు నాకూ వేళఅయింది. నెమ్మదిగా లేచేను. మెలకువవచ్చి చాలసేపేఅయినా ఏదో బద్ధకంగా పడుకొనియున్నాను.

అప్పటికప్పుడే తాతయ్యకూడా లేచేడు. ఏదో తాపంతో పక్కమీద అటూ—ఇటూ తెగదొర్లుతూన్నాడు.

తలతడియకుండా నెత్తిమీద వేసుకొన్న గోనుసంచీ సరీగా పర్దుకుంటూ అక్కయ్య వీధిగుమ్మంకేసి బయలుదేరింది. ఆమె బయలుదేరడం చూసి తాతయ్య హడావిడిగా పిలిచేడు.

"వార్కా! నిన్నను ఏమన్నావో జ్ఞాపకంవుంది. నిమ్మషరబత్తు తెచ్చిపెడతానన్నావు. గుండెల్లో మంటపుట్టినప్పుడెల్లా ఏదయినా పుల్లటివస్తువు తింటే తగ్గినట్లుంటుంది, తల్లీ! మరచిపోకుండా తెస్తావా?"

"తప్పకుండా తెస్తాను, తాతయ్యా!"

వార్కా వీధినపడి నాన్నప్రక్కనే నడుస్తూ ఫ్యాక్టొరీకి బయలుదేరింది. బురద—నీరు బూటుమడమలలోనుంచి లోనికిప్రవేశించి కాలివ్రేళ్ళు కొంకర్లుపోతూన్నాయి.

ఏదో పరాధ్యానంగా ఆలోచించుకుంటూ వార్కా వీధిన

నడిచిపోతూంది.

"నిమ్మశరబత్తు ..........డబ్బుల మాట ఏమిటి?......... ...
'నాస్తెంకా' బదులుఇస్తుందేమో? .... .. ....దానిదగ్గర ఎప్పుడూ
డబ్బు వుంటుంది! ......"

'నాస్తెంకా' కార్ఖానాలో పనికివచ్చేటప్పుడుకూడా మంచి
విలువయిన గుడ్డలే వేసుకుంటుంది. ఆమె తొడుక్కునే బూట్లు
మెత్తని తోలుతో చేయబడియుంటాయి. సిరిరంగు పూవులు అద్దిన
తువ్వాలు భుజాలమీద కప్పుకుంటుంది ఎప్పుడూ కొద్దో—గొప్పో
డబ్బు జేబురుమాలాలో ముడిచి జాకెట్టులో దాచిపుంచుకుంటుంది.

"నాస్తెంకాకి ఈడబ్బు ఎక్కడిది?....తనకిపలెనే దానికీ
వంతుకు ఇచ్చేది ఏమైకోపెక్కులు ఇస్తారు."

ఇందులోని రహస్యం వార్కాకిబోధపడనేలేదు.

'పౌండ్రీ'కి వెళ్లగానే తిండిమూట ఒకచోట దాచింది. ఆపా
రం కొంగులు ఎగరకుండా ఒకతువ్వాలు నడుముకి బిగించింది.

కార్ఖానాసావికిలో అగుడుపెడుతూనే సావడికి ఆవలిమూల
నున్న తోడికూలీల్ని 'కూ' యని పిలిచి చేయివిసిరింది.

ఆమెను చూడగానే అతిఉత్సాహంతో కూలీలంతా నాలుగు
మూలలనుంచీ పరుగెత్తివచ్చేరు.

"ఓహో! వార్కా! వచ్చేవూ?"

అందరూ ఆమెచుట్టూ చేరి భుజంమీద చేతులు వేసేరు.
మిల్లులో పని అరంభం కావడానికి ఇంకా వేళ ఉంది.

ఇటికలగుట్టమీద గొంతుకూర్చుని. గారపట్టిన పళ్ళలో పొగాకు గొట్టం కరిచిపెట్టి మేస్త్రీ గొంతుచించుకుంటున్నాడు.

"అదీ! అదీ! కానీండి. త్వరగా..........."

వార్కా ఎడంగాపెట్టిన కాళ్ళమధ్యనుంచి, ఇసకను యంత్రం లోకి విసురుతూనే వుంది. ఆమెకు నడ్డినిలపడానికికూడా అవకాశం లేదు. తలతిప్పుకుందుకు ఖాళీలేదు. తడిఇసక ఎంతోబరువుగా వుండడంచేత పార ఒకపట్టాన లేవడం లేదు.

ఇసక ఎగిరి సుడితిరిగి పడుతూంది. తెల్లగా బలంగా వుండే వార్కాచేతులు 'మిక్శ్చరు' కీ ఇసుకదిమ్మకీమధ్యని ఎడతెగకుండా ఊగుతూన్నాయి. ఆమెయొక్క ముంజేతినరాలు ఉబికి నీలిచారల వలె కనిపిస్తూన్నాయి.

అప్పటికింకా చల్దివేళకూడా కాలేదు. అప్పుడప్పుడే ఉద యిస్తూన్న సూర్యుని లేయెండలు ఆకిటికీలోంచి వచ్చి ఆచెమ్మ నేలని పాకులాడుతూన్నాయి.

మామూలుధోరణిలో మేస్త్రీ బొంగురుగొంతుక చెవులలో గింగురుమంటూనేవుంది.

"అదీ! అదీ! కానీండీ... త్వరగా...."

'నాస్త్యా' పెట్టెబండితో పరుగెత్తుంది. ఆబండీకిషన్న కర్ర చక్రం మన్నుబరువుకి కిరకిరలాడుతూంది. తడి-ఇసకా- మన్నూ పోసిన ఆబండీ చాలాబరువుగావుంది. బండికమ్మల్లని తొడలతో అదిమి బలంగొలదీ తోసుకొని వస్తూంది. పరుగెత్తుతూంటే బంగారు

నడిచిపోతూంది.

"నిమ్మషరబత్తు ...........డబ్బుల మాట ఏమిటి?........ ...
'నాస్తెంకా' బదులుఇస్తుందేమో? .... .. ....దానిదగ్గర ఎప్పుడూ
డబ్బు వుంటుంది!......"

'నాస్తెంకా' కార్ఖానాలో పనికివచ్చేటప్పుడుకూడా మంచి విలువయిన గుడ్డలే వేసుకుంటుంది. ఆమె తొడుక్కునే బూట్లు మెత్తని తోలుతో చేయబడియుంటాయి. నీలిరంగు పూవులు అద్దిన తువ్వాలు భుజాలమీద కప్పుకుంటుంది ఎప్పుడూ కొద్దో-గొప్పో డబ్బు జేబురుమాలాలో ముడిచి జాకెట్టులో దాచిపుంచుకుంటుంది.

"నాస్తెంకాకి ఈడబ్బు ఎక్కడిది?....తనకివలెనే దానికీ వంతుకు ఇచ్చేది ఏభైకోపెక్కులు ఇస్తారు."

ఇందులోని రహస్యం వార్కాకిబోధపడనేలేదు.

'ఫౌండ్రీ'కి వెళ్లగానే తిండిమూట ఒకచోట దాచుకొని, ఆపారం కొంగులు ఎగరకుండా ఒకతువ్వాలు నడుముకి బిగించింది.

కార్ఖానాసావిడిలో అగుడుపెడుతూనే సావడికి ఆవలిమూల నున్న తోడికూలీల్ని 'కూ' యని పిలిచి చేయివిసిరింది.

ఆమెను చూడగానే అతిఉత్సాహంతో కూలీలంతా నాలుగు మూలలనుంచీ పరుగెత్తివచ్చేరు.

"ఓహో! వార్కా! వచ్చేవా?"

అందరూ ఆమెచుట్టూ చేరి భుజంమీద చేతులు వేసేరు. మిల్లులో పని ఆరంభం కావడానికి ఇంకా వేళ ఉంది.

ఇటికలగుట్టమీద గొంతుకూర్చుని. గారపట్టిన పళ్ళలో పొగాకు గొట్టం కరిచిపెట్టి మేస్త్రీ గొంతుచించుకుంటున్నాడు.

"అదీ! అదీ! కానీండి. త్వరగా............"

వార్కా ఎడంగాపెట్టిన కాళ్ళమధ్యనుంచి, ఇసకను యంత్రం లోకి విసురుతూనే వుంది. ఆమెకు నడ్డినిలపడానికికూడా అవకాశం లేదు. తలతిప్పుకుందుకు ఖాళీలేదు. తడిఇసక ఎంతోబరువుగా వుండడంచేత పార ఒకపట్టాన లేవడం లేదు.

ఇసక ఎగిరి సుడితిరిగి పడుతూంది. తెల్లగా బలంగా వుండే వార్కాచేతులు 'మిక్చరు' కీ ఇసుకదిమ్మకీమధ్యని ఎడతెగకుండా ఊగుతూన్నాయి. ఆమెయొక్క ముంజేతినరాలు ఉబికి నీలిచారల వలె కనిపిస్తూన్నాయి.

అప్పటికింకా చలివేళకూడా కాలేదు. అప్పుడప్పుడే ఉద యిస్తూన్న సూర్యుని లేయెండలు ఆకిటికీలోంచి వచ్చి ఆచెమ్మ నేలని పాకులాడుతూన్నాయి.

మామూలుధోరణిలో మేస్త్రీ బొంగురుగొంతుక చెవులలో గింగురుమంటూనేవుంది.

"అదీ! అదీ! కానీండి... త్వరగా...."

'నాస్త్యా' పెట్టెబండితో పరుగెత్తుంది. ఆబండీకివున్న కర్ర చక్రం మన్నుబరువుకి కిరకిరలాడుతూంది. తడి-ఇసకా- మన్నూ పోసిన ఆబండీ చాలాబరువుగావుంది. బండికమాన్లని తొడలతో అదిమి బలంగొలదీ తోసుకొని వస్తూంది. పరుగెత్తుతూంటే బంగారు

నడిచిపోతూంది.

"నిమ్మశరబత్తు ..........డబ్బుల మాట ఏమిటి?........ ...
'నాస్తెంకా' బదులుఇస్తుందేమో? .... .. ....దానిదగ్గర ఎప్పుడూ
డబ్బు వుంటుంది:......"

'నాస్తెంకా' కార్ఖానాలో పనికివచ్చేటప్పుడుకూడా మంచి
విలువయిన గుడ్డలే వేసుకుంటుంది. ఆమె తొడుక్కునే బూట్లు
మెత్తని తోలుతో చేయబడియుంటాయి. నీలిరంగు పూవులు లద్దిన
తువ్వాలు భుజాలమీద కప్పుకుంటుంది ఎప్పుడూ కొద్దో—గొప్పో
డబ్బు జేబురుమాలాలో ముడిచి జాకెట్టులో దాచిపుంచుకుంటుంది.

"నాస్తెంకాకి ఈడబ్బు ఎక్కడిది?....తనకినలెనే దానికీ
వంతుకు ఇచ్చేది ఏభైకోపెక్కులు ఇస్తారు."

ఇందులోని రహస్యం వార్కాకిబోధపడనేలేదు.

'ఫౌంగ్రీ'కి వెళ్లగానే తిండిమూట ఒకచోట దాచుకొని, ఆఫా
రం కొంగులు ఎగరకుండా ఒకతువ్వాలు నడుముకి బిగించింది.

కార్ఖానాసావిడిలో అగుడుపెడుతూనే సావడికి అవలిమూల
నున్న తోడికూలీల్ని 'కూ' యని పిలిచి చేయివిసిరింది.

ఆమెను చూడగానే అతిఉత్సాహంతో కూలీలంతా నాలుగు
మూలలనుంచీ పరుగెత్తివచ్చేరు.

"ఓహో! వార్కా! వచ్చేవూ?"

అందరూ ఆమెచుట్టూ చేరి భుజంమీద చేతులు వేసేరు.
మిల్లులో పని ఆరంభం కావడానికి ఇంకా వేళ ఉంది.

ఇటికలగుట్టమీద గొంతుకూర్చుని, గారపట్టిన పళ్ళలో పొగాకు గొట్టం కరిచిపెట్టి మేస్త్రీ గొంతుచించుకుంటున్నాడు.

"అదీః అదీః కానీండి. త్వరగా............"

వార్కా ఎడంగాపెట్టిన కాళ్ళమధ్యనుంచి, ఇసకను యంత్రం లోకి విసురుతూనే వుంది. ఆమెకు నడ్డినిలపడానికికూడా అవకాశం లేదు. తలతిప్పుకుందుకు ఖాళీలేదు. తడిఇసక ఎంతోబరువుగా వుండడంచేత పార ఒకపట్టాన లేవడం లేదు.

ఇసక ఎగిరి సుడితిరిగి పడుతూంది. తెల్లగా బలంగా వుండే వార్కాచేతులు 'మిక్శ్చరు' కీ ఇసుకదిమ్మకీమధ్యని ఎడతెగకుండా ఊగుతూన్నాయి. ఆమెయొక్క ముంజేతినరాలు ఉబికి నీలిచారల వలె కనిపిస్తూన్నాయి.

అప్పటికింకా చల్దివేళకూడా కాలేదు. అప్పుడప్పుడే ఉద యిస్తూన్న సూర్యుని లేయెండలు ఆకిటికీలోంచి వచ్చి ఆచెమ్మ నేలని పాకులాడుతూన్నాయి.

మామూలుధోరణిలో మేస్త్రీ బొంగురుగొంతుక చెవులలో గింగురుమంటూనేవుంది.

"అదీః అదీః కానీండీ....త్వరగా...."

'నాస్త్యా' పెట్టెబండితో పరుగెత్తింది. ఆబండీకివున్న కర్రి చక్రం మన్నుబరువుకి కిరకిరలాడుతూంది. తడి-ఇసకా- మన్నూ పోసిన ఆబండీ చాలాబరువుగావుంది. బండికమాన్లని తొడలతో అదిమి బలంగొలదీ తోసుకొని వస్తూంది. పరుగెత్తుతూంటే బంగారు

జలతారుపువ్వులు వేసిన ఫ్రాకుకొసలు గాలికి తటతటలాడుతూ న్నాయి. ఆమెబండీని ఇసుకగుట్టదగ్గిరికి తోసుకొనివచ్చి కమాన్లు ఎత్తేసి బండి తలక్రిందులుచేసి ఇసకదులుపుతూంది.

ఒకటివెనుక ఒకటిగా ఇసుకబళ్ళు వచ్చేస్తూన్నాయి. నూనె వేసిన కర్రచక్రాలవెనక నాస్త్యా పరుగెత్తుతూనేవుంది. ఆమె ఎర్రని చెక్కిళ్లు తెల్లబడిపోయినాయి. నెత్తిన చుట్టుకొన్న తుండుగుడ్డ వదులయి భుజంమీదికి జారిపోతూంది. విలువయైన ఎర్రని ఫ్రాకుకి బురదపట్టుకుంది. అందంగా, నున్నగా, వుండే ఆబూట్లు గీరులతో నిండిపోయినాయి.

వెనుకనుంచి మేస్త్రీ అరుస్తూనే వున్నాడు.

"అదీ! అదీ! కానీండి.........త్వరగా........"

ఆఖరుకి భోజనాలకి వేళ అయింది. గంటమోగ్రిగగానే ఆడా లికలముఖాలు కొన్త తెరిపినబడ్డాయి. తమతమ మూటలతో తెచ్చు కున్న బంగాళాదుంపలు కాల్చుకుందుకు వారంతా పొడిప్రదేశం వెదుకసాగేరు. దుంపలు ఉడికినాక దానిలో కొంచెం ఉప్పుకలిపి తిని, వాచవి తీరక పెదవులు నాకుకున్నారు. దోరగా కాలి బంగా రురంగులో మెరుస్తూన్న రొట్టె నమిలి, ఎండపెట్టిన కోరిందకాయ లతో కాచిన 'కాఫీ' త్రాగేరు.

తిండితిన్నాక ఇంక వార్కి పని చేయలేకపోయింది. ఆమె చేతిలోనిపార బరువుఎక్కువై నేలవదలలేకపోయేది. నడుము పీకుకొనిపోయింది.

"అక్కడ నిమ్మషరబత్తు దొరుకుతుందా?"

"ఏమిటి?- నిమ్మషర్బతా? ఎప్పుడూ చూసిన జ్ఞాపకంలేదు. కాని, ఉండకపోదు. తప్పకుండా దొరుకుతుంది. రా."

వార్కా మారుమాట లేకుండా లేచి నిలబడి 'నాస్త్యా' వెంట బడింది. ఇద్దరూ పట్టణవీధులలో సాగిపోతూన్నారు. అగనెస్పోవ విలాసమందిరంయొక్క పెద్దప్రహరీగోడముందు నిలుచబడేదాకా వార్కాకి తాను ఎక్కడికి వచ్చినదీ తెలియనేలేదు. తెలుసుకున్నాక నిలబడి ఆలోచించడానికికూడా వ్యవధి లేకపోయింది. ఆప్రదేశంతో బాగా పరిచయం ఉన్నదానిమల్లేనే నాస్త్యా అరాతిమెట్లు గబగబా ఎక్కి తలుపుతోసుకొని చీకటిగావున్న 'కారిడరు'లోకి వార్కా చేయిపట్టుకొని లాగుకొని పోయింది.

★ ★ ★ ★

గదిలో మూంచి వెలుతురుగా వుంది. కిటికీతలుపులు గట్టిగా బిడాయించబడివున్నాయి. వానికి లోపైపున నల్లని దళసరితెరలు క్రిందికి జార్చబడివాయి. నేలమీద మెత్తని తివాచీ పరచివుంది. మిద్దెకి ఒకరాగి కొక్కెవుంది. దానినుంచి పెద్దళస్తరు- దీపాలగుత్తి వ్రేలాడుతూంది. ఆవెలుతురులో మేజామీది ప్రతివస్తువూ- ఖాళీ చేయబడిన సీసాలు- మేజాగుడ్డమీద పడిన ఎర్రని సారామరక- బల్లమీదనున్న రొట్టెముక్కమీద అంకితములయివున్న పన్నుగాటు, స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆగదిలో ఒకమంచం. మంచంమీద పక్క మునిగిపోయి

జలతారుపువ్వులు వేసిన ప్రాకుకొసలు గాలికి తటతటలాడుతూన్నాయి. ఆమెబండీని ఇసుకగుట్టదగ్గిరికి తోసుకొనివచ్చి కమాన్లు ఎత్తేసి బండి తలక్రిందులుచేసి ఇసకదులుపుతూంది.

ఒకటివెనుక ఒకటిగా ఇసుకబళ్ళు వచ్చేస్తున్నాయి. నూనె వేసిన కర్రచక్రాలవెనక నాస్త్యా పరుగెత్తుతూనేవుంది. ఆమె ఎర్రని చెక్కిళ్లు తెల్లబడిపోయినాయి. నెత్తిన చుట్టుకొన్న తుండుగుడ్డ వదులయి భుజంమీదికి జారిపోతూంది. విలువయైన ఎర్రని ప్రాకుకి బురదపట్టుకుంది. అందంగా, సన్నగా, వుండే ఆబూట్లు గీరులతో నిండిపోయినాయి.

వెనుకనుంచి మేస్త్రీ అరుస్తూనే వున్నాడు.

"అదీ! అదీ! కానీండి.........త్వరగా........"

ఆఖరుకి భోజనాలకి వేళ అయింది. గంటమ్రోగగానే ఆదాలికలముఖాలు కాస్త తెరిపినబడ్డాయి. తమతమ మూటలతో తెచ్చుకున్న బంగాళాదుంపలు కాల్చుకుందుకు వారంతా పొడిప్రదేశం వెతకసాగేరు. దుంపలు ఉడికినాక దానిలో కొంచెం ఉప్పుకలిపి తిని, వాచవి తీరక పెదవులు నాకుకున్నారు. దోరగా కాలి బంగారురంగులో మెరుస్తూన్న రొట్టె నమిలి, ఎండపెట్టిన కోరిందకాయలతో కాచిన 'కాఫీ' త్రాగేరు.

తిండితిన్నాక ఇంక వార్కా పని చేయలేకపోయింది. ఆమె చేతిలోనిపార బరువుఎక్కువై నేలవదలలేకపోయేది. నడుము పీకుకొనిపోయింది.

"అక్కడ నిమ్మషరబత్తు దొరుకుతుందా?"

"ఏమిటి?- నిమ్మషర్బతా? ఎప్పుడూ చూసిన జ్ఞాపకంలేదు. కాని, ఉండకపోదు. తప్పకుండా దొరుకుతుంది. రా."

వార్కా మారుమాట లేకుండా లేచి నిలబడి 'నాస్త్యా' వెంట బడింది. ఇద్దరూ పట్టణవీధులలో సాగిపోతూన్నారు. అగనెస్సోవు విలాసమందిరంయొక్క పెద్దప్రహరీగోడముందు నిలువబడేదాకా వార్కాకి తాను ఎక్కడికి వచ్చినదీ తెలియనేలేదు. తెలుసుకున్నాక నిలబడి ఆలోచించడానికికూడా వ్యవధి లేకపోయింది. ఆప్రదేశంతో బాగా పరిచయం ఉన్నదానిమల్లేనే నాస్త్యా ఆరాతిమెట్లు గబగబా ఎక్కి తలుపుతోసుకొని చీకటిగావున్న 'కారిడరు'లోకి వార్కా చేయిపట్టుకొని లాగుకొని పోయింది.

★ ★ ★ ★

గదిలో మాంచి వెలుతురుగా వుంది. కిటికీతలుపులు గట్టిగా బిడాయించబడివున్నాయి. వానికి లోపైపున నల్లని ఠళసరితెరలు కిందికి జార్చబడినాయి. నేలమీద మెత్తని తివాచీ పరచివుంది. మిద్దెకి ఒకరాగి కొక్కెవుంది. దానినుంచి పెద్దలస్తరు- దీపాలగుత్తి వేళ్లాడుతూంది. ఆవెలుతురులో మేజామీది ప్రతివస్తువూ— ఖాళీ చేయబడిన సీసాలు— మేజాగుడ్డమీద పడిన ఎర్రని సారామరక- బల్లమీదనున్న రొట్టెముక్కమీద అంకితములయివున్న పన్నుకాటు, స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆగదిలో ఒకమంచం. మంచంమీది పక్క మునిగిపోయి

ముడతలుబడివుంది. దానిమీద ఒకప్రక్క వార్కా కూర్చుండివుంది. వార్కా భుజంమీదిగుడ్డ జారిపోయింది. మెడక్రిందనుంచి గుండెల దాకా ఎర్రగా రక్తం చిమ్ముతూన్న ఒకగోటిగీరు కనిపిస్తూంది. అక్కడక్కడ ఆగాయంలో రక్తపుమక్కలు గురివిందగింజలలా కరడుకట్టి వున్నాయి. పట్టుకుచ్చులాంటి మెత్తనిజుట్టు చెదరి కళ్లూ- పెదవులూ- కప్పుతూంది.

ఎవడో ఆమెకాళ్లదగ్గిర మోకారిలి ఆమెచల్లనికాళ్ళు కాగలించు కొని పాకులాడుతూన్నాడు. ఆమెకాళ్ళు ముద్దు పెట్టుకుంటూన్నాడు. అతని బొద్దింకమీసాలూ అస్ట్రాఖన్‌టోపీ, చూసి అతనిని ఎక్కడ చూచినామాయని వార్కా ఆలోచిస్తూంది.

అకార్డియన్ పాటపాడుతూంటే తాను నాట్యమాడిన గదిని ఎప్పుడు ఏలాగ వదిలిపెట్టినదీ ఎంత ఆలోచించినా ఆమెకి జ్ఞాపకం రావడం లేదు. ఒక్కగుక్కలో సీసాడు వోడ్కానీ త్రాగేసి, తన్ను అక్కడపెట్టిన పిండివంటలు రుచిచూడమని నాస్త్యా బలవంతపెట్ట డం ఒక్కటే ఆమెకి జ్ఞాపకం వుంది.

ఆమీసాలవోతు వార్కాచేతిని అందుకొని జేబులోంచి ఒక ఉంగరంతీసి తొడగడానికి ప్రయత్నించేడు. కాని, వేలిచర్మం మొరటుగా, గరుకుగా, వుండడంచేత వుంగరం ఎక్కిందికాదు. ఆమెచేతిని మోకాళ్ళమధ్య నొక్కిపట్టి బలవంతంగా ఎక్కించడా నికి ప్రయత్నించేడు. వార్కా నెప్పికి మూల్గింది. వ్రేలికి ఉంగరం ఎక్కలేదు. అంతట వాడు బల్లకేసి వంగి గ్లాసునిండా

సోడ్కా ఎత్తుకొని ఆమెవ్రేలిమీద పోసేడు. వుంగరం సులభంగా ఎక్కింది.

ఆమీసాలరాయని సంతోషం చెప్పనలవికాదు. ఉత్సాహంతో ఎగిరిగంతేసి, చేతిలోని ఏడురంగుల జేబురుమాలుతో వార్కా మొగంచెమటలు తుడిచేడు.

రుమాలు కొత్తవాసనలు చల్లుతూంది. రెండోచేతిలోవున్న బ్యాంకునోట్లమాదిరిగా కరకరలాడుతూంది.

వార్కా నోట్లకేసి చేయిజాపింది. నరాలన్నీ కృంగిపోతూన్న ట్లుతోచి నీరసంగా తలగడామీదికి వొరిగింది. ఆమెకాళ్లు పైకి మణి గిపోయినాయి. గొంతుక సవరించుకుందుకు ప్రయత్నిస్తూ దగ్గింది.

ఆమె మెదడూ- గుండెలూ మండిపోతూన్నాయి. కాని, చేతి వ్రేళ్లమాత్రం మంచుగడ్డలా చల్లగా వున్నాయి. తడిఆరిపోయిన పెదవులు తడుపుకుంటూ వార్కా క్షీణస్వరంతో పలవరిస్తూన్నట్లు— 'నిమ్మషర్బత్తు' కావాలి 'అంది.

మీసాలవాడు హడావిడిగా ద్వారంకేసి నడిచి తలుపుతట్టి బయట వరండాలో కనిపెట్టుకొనియున్న 'పైటర్ని' పిలిచేడు.

"లెమన్! లెమన్"

"ని—మ్మ—ష—ర్బ—తు"

పైటరు తనప్రక్కనున్న వారికి కన్నుగీటుతూ—"యజమాని షర్బతు తెమ్మంటూన్నాడు. ఆయన కొత్త స్నేహితురాలికి తలతిరు గుతూ వుందనుకుంటాను."—అంటూ గబగబా పరుగెత్తేడు.

ఆగదిలోయున్నవాడు మళ్ళీమంచంకేసి వెళ్ళి వార్కా భుజాల మీద చేయివేసేడు.. అవి ఎంతో చల్లగా, నున్నగా, జారిపోతూ న్నట్లున్నాయి.

"కొంచెం జలుబుచేసిందనుకుంటాను. ఏదో గొణుగుతూంది. ఈవేళకి ఇంక పడుకోనిస్తే నిద్రలో అన్నీ అవే సర్దుకుంటాయి.

ఆతడు పైటరు తెచ్చిఇచ్చిన షర్బతుసీసా మేజామీద పది లంగా పెట్టేడు. ఒళ్లు విరుచుకుంటూ ఆవలించి, మంచం దగ్గిరికి పోయి ముసిచివున్న ఆమెతెల్లని తొడలకేసి ఒక్కనిముషంచూసి, తనలో తానే నవ్వుకుంటూ నెమ్మదిగా గది విడిచిపోయేడు.

ఎనిమిదో.....

ప్రకరణం.

అదొక కల.

నేనొక పెద్దఅడివిగుండా పోతూన్నానట. పెద్దపెద్ద టేకుచెట్ల గుబురులమీద నీలాకాశం వాలియుంది. తెగిపోయిన పక్షిరెక్క లలాగ కారుమేఘాలు ఎత్తయిన చెట్టుకొమ్మలలో చిక్కుకొని వున్నాయి. సిందూరపుపువ్వులు నక్షత్రాలల్లే రాలుతూన్నాయి. ఆకులు రాలిపోయిన ఒకపెద్ద అడవిబొట్లుచెట్టు నల్లనిమేఘాలకేసి తన

వోడ్కా ఎత్తుకొని ఆమెవ్రేలిమీద పోసేడు. వుంగరం సులభంగా ఎక్కింది.

ఆమీసాలరాయని సంతోషం చెప్పనలవికాదు. ఉత్సాహంతో ఎగిరిగంతేసి, చేతిలోని ఏడురంగుల జేబురుమాలుతో వార్కా మొగంచెమటలు తుడిచేడు.

రుమాలు కొత్తవాసనలు చల్లుతూంది. రెండోచేతిలోవున్న బ్యాంకునోట్లమాదిరిగా కరకరలాడుతూంది.

వార్కా నోట్లకేసి చేయిజాపింది. నరాలన్నీ కృంగిపోతూన్న ట్లుతోచి నీరసంగా తలగడామీదికి వొరిగింది. ఆమెకాళ్లు పైకి మణి గిపోయినాయి. గొంతుక సవరించుకుందుకు ప్రయత్నిస్తూ దగ్గింది.

ఆమె మెదడూ- గుండెలూ మండిపోతూన్నాయి. కాని, చేతి వ్రేళ్లమాత్రం మంచుగడ్డలా చల్లగా వున్నాయి. తడిఆరిపోయిన పెదవులు తడుపుకుంటూ వార్కా క్షీణస్వరంతో పలవరిస్తూన్నట్లు— 'నిమ్మషర్బత్తు' కావాలి 'అంది.

మీసాలవాడు హడావిడిగా ద్వారంకేసి నడిచి తలుపుతట్టి బయట వరండాలో కనిపెట్టుకొనియున్న 'వైటర్ని' పిలిచేడు.

"లెమన్! లెమన్"

"ని—మ్మ—ష—ర్బ—తు"

వైటరు తనప్రక్కనున్న వారికి కన్నుగీటుతూ—"యజమాని షర్బతు తెమ్మంటూన్నాడు. ఆయన కొత్త స్నేహితురాలికి తలతిరుగుతూ వుందనుకుంటాను."—అంటూ గబగబా పరుగెత్తేడు.

ఆగదిలోయున్నవాడు మళ్ళీమంచంకేసి వెళ్ళి వార్కా భుజాల మీద చేయివేసేడు.. అవి ఎంతో చల్లగా, సన్నగా, జారిపోతూ న్నట్లున్నాయి.

"కొంచెం జలుబుచేసిందనుకుంటాను. ఏదో గొణుగుతూంది. ఈవేళకి ఇంక పడుకోనిస్తే నిద్రలో అన్నీ అవే సర్దుకుంటాయి.

ఆతడు పైటరు తెచ్చిఇచ్చిన షర్బతుసీసా మేజామీద పదిలంగా పెట్టేడు. ఒళ్లు విరుచుకుంటూ ఆవలించి, మంచం దగ్గిరికి పోయి మకచివున్న ఆమెతెల్లని తొడలకేసి ఒక్కనిముషంచూసి, తనలో తానే నవ్వుకుంటూ నెమ్మదిగా గది విడిచిపోయేడు.

## ఎనిమిదో.....
## ప్రకరణం.

అదొక కల.

నేనొక పెద్దఅడివిగుండా పోతూన్నానట. పెద్దపెద్ద టేకుచెట్ల గుబురులమీద నీలాకాశం వాలియుంది. తెగిపోయిన పక్షిరెక్కలలాగ కారుమేఘాలు ఎత్తయిన చెట్టుకొమ్మలలో చిక్కుకొని వున్నాయి. సిందూరపుపువ్వులు నక్షత్రాలల్లే రాలుతూన్నాయి. ఆకులు రాలిపోయిన ఒకపెద్ద అడవిటేకుచెట్టు నల్లనిమేఘాలకేసి తన

కొమ్మలు సాచి, నిలబడి వానిని ఆహ్వానిస్తూంది.

దట్టంగా అలుముకొన్న పొదల నడిమినుంచి నడుస్తూన్నాను. ప్రకృతి ఎంతో నిశ్శబ్దంగా వుంది. ఆనిశ్శబ్దతకి గుండెలు జలదరించి పోతూన్నాయి. గుబురుల్లా పెరిగివున్న ఆచెట్టుకొమ్మల వెనక్కాల ఏదో అడివిజంతువు నాకోసం కనిపెట్టుకుని కూర్చుంది. ఆకలి తోవున్న ఆజంతువుయొక్క చూపులు నన్ను దహించివేస్తూన్నట్లు- వాడియైన దానిగోళ్లు నన్ను చీరుతూన్నట్లు- దాని వేడిఊర్పులు నా మొగానికి తగులుతూన్నట్లు- అనిపించింది. ఆ అడివిజంతువు నారక్తాన్ని త్రాగివేయడానికి కనిపెట్టుకొని కూర్చుంది. నేను ప్రాణం రక్షించుకుందుకు పరుగు ఆరంభించేను. ఒకచెట్టు నామీద పువ్వుల వర్షం కురిపించేయి. అరణ్యం అంతా చల్లగా వుంది.

నాకు తెలివివచ్చి చూసేటప్పటికి ఎదురుకుండా తాతయ్యకళ్లు కనపడ్డాయి. ఆతని దళసరి కనుబొమ్మలనీడ గుంటలుపడ్డకళ్లని దాటిపోయి, దవుడ ఎముకలమీదికంటా వ్యాపించింది. ఆతని తెల్లని కనుగుడ్లనుంచి నల్లని కిటికీదాకా ఒకతెల్లని కాంతిరేఖ ప్రసరిస్తూంది.

నాకు మహాచెడ్డ భయం వేసింది. నెమ్మదిగా అమ్మ దుప్పటీలోదూరి గట్టిగా కౌగలించుకున్నాను. ఆమె తన నులివెచ్చని చేతితో నాతలనిమిరి దగ్గిరికి తీసుకుంది. తాతయ్యకళ్లకేసి చూస్తూంటే ఆమెకికూడా నిద్ర పట్టదు. ఆతడాకళ్లని ఎప్పుడూ మూయనైనా మూయడు. నాన్న ఎప్పుడు పనిలోకి పోతాడా— అమ్మని ఏదోవిధంగా ఏడిపించి 'వోడ్కా' ఎప్పుడు తెప్పించడమా

యని ఒకధ్యానం చేస్తూంటాడు.

తెల్లవారింది. క్రమంగా చీకట్లు అంతరించిపోతున్నాయి. అప్పుడు లేపింది, అమ్మ.

నాన్న లేచినప్పుడే నేనూ లేవాలి. ఎందుకంటే మాయింట్లో నున్నది ఒక్కజత బూట్లు మాత్రమే. అవే మాయమ్మా—నాన్నా కూడా ఉపయోగించుకుంటారు.

నేను నాన్నతోకలిసి కార్ఖానాదాకా వెడతాను. అతడు అక్కడ బూట్లువిడిచి నాచేతికిచ్చి తాను కర్రజోళ్లు వేసుకుంటాడు. ఆబూట్లు తెచ్చి నేను అమ్మకి ఈయాలి. అప్పుడు వెడుతుంది, ఆమె బజారుకు. నేను తెచ్చి ఈయకపోతే గడ్డకట్టిపోయే ఆమంచులో కాలికి జోడయినా లేకుండా బజారుకి పోవలసిందే. మళ్లీ సాయంకాలం బూట్లు పట్టుకువెళ్ళి నాన్నకివ్వాలి. అతను ఇంటికి రావాలి.

నాన్న బూట్లు తొడుక్కుంటాడు. ఇంట్లోవున్న ఆగుడ్డపీలికా- ఈగుడ్డపీలికా— జతచేసి కాలికి కట్టుకొని, తాళ్ళతో బిగించుతాను. ఇంక వీధినబడి ఆపొగమంచులో, చలిగాలిలో, కార్ఖానాకేసి బయలు దేరుతాం.

నాన్న చాలా వేగంగా నడుస్తాడు. అతనివెంట ఉండాలంటే నేను పరుగెత్తవలసిందే. కాలికి కట్టుకున్న తాళ్లువదులయిపోయి, గుడ్డపీలికలు కాళ్ళకు అడ్డుపడుతూన్నా ఆగడానికి లేదు. అవన్నీ కట్టుకొనేదాకా నిలబడడానికి నాన్నకి వేళయేదీ? ఇంక నేను అలాగే పరుగెత్తవలసిందే. కత్తుల వలెనున్న మంచుముక్కలు

తగిలి మడమలు చీరుకుపోతూండేవి.

నాన్న పనిలోకి పోగానే తాతయ్యముఖం తెరిపిన బడుతుంది. ఏదోవిధంగా మాయచేసి, అమ్మని ఏడిపించి, ఏదో ఇంత తినడానికో, తాగ్రిగడానికో, సంపాదించవచ్చును.

ఒకరోజున నేను అతని మంచం దగ్గిరనుంచి వెడుతున్నాను. అతడు ఉన్నట్టుండి గభీమని మెడపట్టుకొని మంచంమీద పడేసుకున్నాడు. తన వాడిగోళ్ళతో మొగంబరికేడు. జుట్టు పీకేడు. ఎంత ఏడ్చినా వదలడు.— "మీఅమ్మతో చెప్పి అరసీసా వోడ్కా తెప్పించుతే వదులుతాను."— అంటాడు.

అమ్మ ఎన్నో చెప్పింది. తిట్టింది. తిట్టుకుంది. ఏడ్చింది. మొత్తుకుంది. కాని, అతడేమాత్రమూ లక్ష్యపెట్టలేదు. ఆఖరుకి వోడ్కా తెచ్చి యిచ్చి నన్ను విడిపించింది.ఇదే మాదిరిగా ఏదో ఉపాయంపన్ని తరుచుగా వోడ్కా సంపాదించేవాడు.

అమ్మ అతని దుష్టతనానికి లొంగిపోయింది. అతని వోడ్కా కోసం తనచొక్కాలు— బట్టలు అన్నీ అమ్మేసింది. నాన్న జేబులలోని డబ్బులు తరుచుగా దొంగిలించేది. ఇంతా చేస్తే తాతయ్య రోజురోజుకీ బలుస్తున్నాడేగాని, అతడు ఇంతలో చచ్చిపోయే సూచనలు ఏవీ కనపడటంలేదు. అతడెంతబాధ పెట్టినా అమ్మ ఇప్పుడు మాటలాడదు. ఆకళ్లలో కన్నీరే ఇంకిపోయింది. బాధ విపరీతం అయినప్పుడుమాత్రం గుడ్లు మిటకరిస్తూ, ఆచిన్నగుడిసెలోకి మృత్యుదేవతని ఆహ్వానిస్తున్నట్లు, ఆకాశంవంక చూస్తూ

పెదవులు కదిపేది.........కొద్ది రోజులు పోయాక తాతయ్య చూడకుండా ఆతనికోసం తెచ్చిన వోడ్కా కొంత దాచుకొని మిగిలిన దాంట్లో నీరు కలిపి ఆతనికి ఇచ్చేది. ఆదాచుకున్నది తాను త్రాగేసేది........తాతయ్య ఆతేడా కనిపెట్టలేకపోయేవాడు. ఎంతో మొగంవాచినట్లుగా ఒక్కమారుగా సీసాలోనిదంతా గొంతులో వొంపుకొనేవాడు.

ఇప్పుడు తనంతతానే అమ్మ వోడ్కా తీసుకొనివచ్చి తాతయ్య చేతికి ఇస్తూంది. ఇంక ఆతనికి నన్ను ఏడిపించవలసిన పని ఏముంది? ఆతనికోసం తెచ్చినదాంట్లో అమ్మ తాను వాటా పుచ్చుకొనేది.

అమ్మకి త్రాగుడు బాగా అలవాటయిపోయింది. ఆఖరుకి అదిలేకుండా నిలబడలేని స్థితిలోకి వచ్చింది. నాన్న ఎన్నికొట్టినా ఆమె మూసలేదు. కదల-మెదలలేకుండా పడిపోయేది. పెదవులు నల్లబడిపోయేవి. ఊపిరి ఎంతోబరువుగా తీసుకొనేది. ఆస్థితిలోనికి వస్తేగాని నాన్న ఆమెని కొట్టడం మానేవాడు కాదు. కాస్త తెలివిరాగానే తూలిపడిపోతూ తిన్నగా బజారుకి పరుగెత్తేది. ఆవిడ కళ్లు గుంటలు పట్టిపోయేయి. చప్పిదవుడలు పడ్డాయి. పెదవులు తడిఆరి బద్దలయిపోయినాయి. ఒక్కక్షణంకూడా నిలవలేదు త్రాగకుండా....వోడ్కా తీసుకొని ఇంటికి వచ్చి తాతయ్య మంచంమీద చదికిలబడి ఆతనికి ఇంత ఇచ్చి తానింత త్రాగేది. సరి. అక్కడనుంచి ఉభయులూ పాటలు ఆరంభించేవారు.

నావరెనే ఎటనైనా వేరొక
కష్టజీవియగువా డున్నాడా?-
అనాథశిశువొక డున్నాడా?—

మానాన్న చాలారోజుల వరకూ త్రాగుడు మీద యుద్ధం ప్రకటించేడు ఎప్పుడో తప్పిజారికాని, దుకాణంకేసి పోయేవాడేకాదు. అమ్మ ఈస్థితిలోనికి వచ్చేక అతడే మాసంరక్షణ చూసేవాడు. ప్రతి ఆదివారం మాఅందరికీ తలలు దువ్వేవాడు. నీళ్లు పోసేవాడు. బట్ట లకి సబ్బు పట్టించి, ఉతికి, ఇచ్చేవాడు. ఆఖరుకి ఆలాగంటి వాడు కూడా లొంగిపోయేడు.

ఆరోజులలో గార్బజ్ మాకు చాలా సహాయం చేసేవాడు. నాన్నకి జీతాలు అందే లోపున పరస్పరసహాయనిధిలోనుంచి డబ్బు తెచ్చి సర్దుతూండేవాడు.

అతడు మాఇంటికి వచ్చినప్పుడల్లా ప్రతీమారూ తాతయ్యని చూపించి నాన్నని హెచ్చరించేవాడు.—"జాగ్రత్త పడు. లేకుంటే అతనిలాగే అయిపోతావు!"—

నాన్నకూడా అతడేమి చెప్పినా నిశ్శబ్దంగా వినేవాడు. అప్పు డప్పుడు అతనితో కలిసి ఎక్కడికో పోయేవాడు. అలాగ వెళ్లిన రోజున అతడెంతో శాంతంగా వుండేవాడు. మమ్మల్ని ఎంతో ప్రేమగా పిలిచేవాడు. కాని, ఇంక ఒకరోజున తట్టుకోలేకపోయే వాడు. అమ్మా—తాతా కలిసి ఇంటిలో యున్నవన్నీ అమ్ముకొని తాగే స్తేరు, జీతాలింకా వచ్చేరోజు కాదు. ఉన్న ఒక్క బూట్లుజతనీ

అమ్మ తీసుకొనిపోయి కాకట్టు పెట్టేసింది. ఆరోజున సాయం కాలం నాన్న వట్టికాళ్ళతో ఆమంచులో అంతదూరం నడిచిరావల సివచ్చింది. వస్తూనే కోపం ఆపుకోలేక అమ్మని బాదడం ఆరంభిం చేడు. కొట్టికొట్టి ఆవిడిని ప్రాణావశిష్టను చేసి, అగనెన్నోవు మంది రంకేసి పరుగెత్తిపోయేడు.

ఈమారుమాత్రం అమ్మ మళ్ళీ లేవలేదు. నల్లబడిపోయి, చల్ల బడిపోయి, నేలని అంటిపెట్టుకొనిపోయింది.

ఆరోజురాత్రి తాతయ్యకు కూడా జబ్బుచేసింది. తెల్లవార్లూ తాపంతో మంచంమీద అటూ– ఇటూ కొట్టుకొని, తెల్లవారేముం దర కొంచెం స్తిమితపడ్డాడు.

ఓస్టపుభార్య తెగత్రాగి చచ్చిందనీ,నికనేరుకి మళ్ళీ మూర్ఛ వచ్చిందనీ, తెల్లవారేటంతకి 'పందులదొడ్డి' వీధులన్నిటా ప్రాకిపో యింది.

జీవితసుఖంకోసం ఎంతోతాపత్రయపడ్డ ఆవృద్ధుడు ఈసంఘ టన జరిగిన కొద్దిరోజులకే చచ్చిపోయేడు. చచ్చిపోయేముందు నన్ను దగ్గిరికి పిలిచి ఏదో రహస్యం చెప్పుతూన్నట్లు పెదవులు కదిలించేడు.

"నిన్నెప్పుడేనా మీనాన్న యంత్రాలయంలోకిగాని, బొగ్గుగని లోకిగాని, వెళ్లమన్నాడంటే బుర్ర పగలెయ్యి."

నాప్రక్క-నేవున్న గార్బజ్ దానికి సమాధానంగా– "ఆతప్పు యంత్రాలది కాదని చెప్పవోయి–" అన్నాడు.

ఆఖరుమారుగా తాతయ్యకళ్లు గార్బచ్ ముఖాన నిలచేయి. ఆతదే దో చెప్పబోయేడు. కాని, మాటలు పైకి పెగిలిరాలేదు. కేవలం అతని ముఖంకేసి చూస్తూచేయి పట్టుకున్నాడు. అతడు కంఠంలో ప్రాణం వున్నంత సేపూ ఆచూపు తిప్పలేదు. చేయి వదలలేదు.

'బురదగుంట'లో నున్న అద్దెకి ఏడ్చేజనం వచ్చి తాతయ్యని స్నానంచేయించి పాడె కట్టేరు. మూడుపీటలు వరసన పెట్టినా అతని పొడుగుకి చాలలేదు. ఇంకొక చిన్నపీటకూడా కాళ్ళక్రింద పెట్టవలసివచ్చింది. ఆతని గుండెలు ఉబ్బివున్నాయి. కడుపు వెన్నుకి అంటివుంది. కణతలమీది రక్తనాళాలు నీలంగా కనిపిస్తూ న్నాయి.

కోమా మాఅమ్మ పోయినప్పుడూ లేడు. తాతయ్య పోయిన ప్పుడూ లేడు. అమ్మ ఇంకా వారానికి పోతుందనగానే ప్రభుత్వం అతనిని సైబీరియాకి పంపేసింది.

సైబీరియాకి తీసుకొనిపోయే రోజున వాడిని నాన్న చూసి వచ్చేడు. అయిలర్లుచేత— అసిస్టెంటులచేత— రోలర్లచేత సమ్మె చేయించినందుకై అతనికి ఈశిక్ష విధించేరు. ఆసమ్మె రోలింగుమిల్లు లోని అన్ని శాఖలలోకీ పాకింది. ఒక వారంరోజులపాటు తీవ్రంగా నడిచింది. కోమా సమ్మెదారుల సంఘానికి అధ్యక్షుడు. జర్మనులను ఎదిరించడానికి రెండోమారు సైన్యాల్ని పంపుతూన్న రోజులలో ఈసమ్మె ఆరంభం అయింది. కోమాతోపాటు ఆయుధకర్మాగారం

లోని కొలిమిపని వారినికూడా అరెస్టుచేస్తారని పుకారులు బయలు దేరినాయి.

★ ★ ★ ★

సంజవేళ అవుతూంది. తాతయ్యని త్వరగా శ్మశానానికి తీసుకొనిపోయేటందుకు ప్రయత్నాలు జరుగుతూన్నాయి. పగటిపూట కూలివాళ్ళంతా పనుల్లోకి పోతారు. పొట్టనిండా తిండయినాలేని, 'పందులదొడ్డి'లోని ఆడవాళ్ళు అరడజను మందయినా అతని శవాన్ని కదపలేరు. అందుచేత అతనిని సాయంకాలమే తీసుకుపోయి తీరాలి. డూబ్నిక్– కోవల్– గార్బజ్– నాన్నాకలిసి శవపేటికని ఎత్తుకున్నారు. మొట్టమొదటిసారు తనగుడిసెను పూర్తిచేసి ఏపైపుగా నిలబడి నికనేరు తనఆస్తిని చూసుకొని మురిసిపోయేడో ఆప్రదేశంలోనే ఒక్కనిముషం పెట్టె దింపేరు. అప్పుడే వచ్చేరు, ఆపోలీసువాళ్ళు.

నాన్నావగైరాలు–శవపుపెట్టెను ఎత్తుతూన్నవాళ్ళల్లా–పోలీసువారిని చూడడంతోటే మళ్ళీదింపేసేరు. బొచ్చుకుక్కలావున్న ఒక పోలీసు ఆఫీసరు మీసాలు మెలివేసుకుంటూ గబగబా ముందుకి వచ్చేడు.

"ఈయింటి యజమాని ఎవ్వరు?"

"నేను"– అంటూ నాన్న ముందుకొచ్చేడు.

"ఇక్కడున్న వారంతా ముందు ఇంట్లోకి వెళ్ళండి."–ఆఫీసరు శవపుపెట్టెకేసి వ్రేలుపెట్టి చూపిస్తూ–"ఫెదరింకో! నువ్వు ఇక్కడ కాపలా వుండవోయి! తర్వాత దీనిసంగతిచూద్దాం."– అన్నాడు.

అక్కడనున్నవారందరినీ గుడిసెలోకి గెంటి అందరిగుడ్డలూ విప్పించి సోధా చేసేరు.

"నీకొడుకు కోము సామానంతా ఏది? వాటిని ఏమి చేసేరు?"

"నాకొడుకు నాయింట వుండడం లేదు."

అక్కడ తన ఆటలేవీ సాగవని ఆబొమ్మకుక్కగాడు ఈమూరు నావద్దకి వచ్చేడు.

"ఇదిగో చూడండి. ఈకుర్రాడు చాలా బుద్ధిమంతుడు. వీడు తప్పకుండా చెప్పేస్తాడు. కాదుటాం? అబ్బాయి! ఎందుకురా మూతి ముడిచేవు? మీఅన్నయ్య ఎక్కడైనా ఏవయినా కాగితాలు దాచే దేమో ఎరుగుదువా? ఎక్కడో పాతేసివుంటాడు. నీకు తెలుసును."

గార్బజ్ నోరు విప్పలేదు. కాని, ఒళ్లు గుచ్చిపోయేలాగ నాకేసి చూసేడు. ఏవో కరపత్రాలకట్ట అతడు నాచేతికి ఇచ్చినవిషయం జ్ఞాపకానికి వచ్చింది. గార్బజ్ చూపుతో ఆమాట పైకి చెప్పవల సినది కాదనికూడా గ్రహించగలిగేను. ఇంక మళ్లీ నోరు విప్ప లేదు.

ఆబొమ్మమనిషి తనవారిని వెంటబెట్టుకొనివీధిలోకి పోయేడు. ఆ ఆఫీసరు శవపుపెట్టెను విప్పమని ఆజ్ఞాపించేడు. కోసక్కుసిపా యీలు ముక్కుతూ బిర్రబిగిసిన నికనేరుశవాన్ని ఆపెట్టెలోనే అటూ ఇటూ దొర్లించేరు.

ఏమీ దొరకలేదు. తల వ్రేలాడవేసుకొని లేచి పోయేరు, వాళ్లు.

వార్కా తాతయ్య శవంవద్ద నిలబడి ఏడురంగుల జేబురుమా

లుతో కళ్ళు తుడుచుకుంది. ఆమె చేతిలోని నిమ్మపండు ఆకను చీకట్లోకూడా నక్షత్రాలవెలుగులో మిలమిలలాడింది.

తొమ్మిదో...

ప్రకరణం.

ఒకరోజున తెల్లవారి చూసేటప్పటికి మావీధిగోడనిండా తారు బొమ్మలు. మధ్యన కాళ్ళమీదా-చేతులమీదా పాకుతూన్న ట్లున్నమనిషి బొమ్మ. దానిని నాలుగుమూలలా చుట్టుముట్టి కాళ్లూ—చేతులూ వాసన చూస్తూన్నట్లు పొడుగుపాటిమూతులూ—కొనలుతేరినముక్కు లూగల బొమ్మలు గీయబడినాయి.

"ఎదపోయిన వార్కా: చిత్తకార్తికుక్కలు".

ఇది ఆబొమ్మలక్రిందనున్న వివరణం. పందులదొడ్డిలోని జనం అశేషం ఆబొమ్మలు చూడడానికి మాయింటిముందు ప్రోగు పడ్డారు.

నాన్నసిగ్గుపడి తలఎత్తలేదు. తలవొంచుకొనే వీధిలోకి పోయేడు. పారయొక్క వార గోడమీద గరగరలాడింది. ఆతడు ఒక్కమాట కూడా ఆడకుండా ఆబొమ్మలన్నీ చెక్కేసి ఒక్కపరుగున ఇంట్లోకి వచ్చేసేడు. సరాసరి అక్కమంచం దగ్గిరికి వెళ్లి నిద్రపోతూన్న

దానినల్లా లేపేడు. ఆమెకూడా గబగబా గుడ్డలు వేసుకొనిపైన కండువా కప్పుకుంది. కాళ్లకి జోడువేసుకొనేదాకా నాన్న ఊరుకున్నాడు. అంతవరకూ ఊరుకున్నవాడల్లా నాన్న గభీమని ఆమె మెత్తని జుట్టు చేతికి మెలి వేసుకొని–"నీకీ గుడ్డలూ అవీ ఎక్కడినుంచి వచ్చేయి"– అని గద్దించేడు.

వార్కా హడిలిపోయింది. ఏదో అస్పష్టంగా గొణిగింది. బాధతో కళ్ళుమూసుకొని అరచేతులతో బుగ్గలురుద్దుకుంది.

"నేనే కొనుక్కున్నాను, నాన్నా! ఇంకా నాస్త్యాని అడుగు అబద్ధం ఏమో!"

"నిజం చెప్పు. లంజా!"

"నిజం! నేనే కొనుక్కున్నాను. అబద్ధం చెప్పితే చచ్చినంత ఒట్టు నిజం."

నాన్నకి కోపం ఆగడం లేదు. వార్కా జుట్టుపట్టి గుంజి నేలకంటా వొంచేసేడు. బాగాచేయి పైకెత్తి "హుం"– అంటూ చేతికి వచ్చినచోటనల్లా పిడికిలిపోట్లు పొడవడం ఆరంభించేడు. ఆహుంకారాలకి ఆగుడిసెగోడలు ఊగిపోయినాయి. జవజవలాడిపోతూన్న కాళ్లమీద ఊగులాడుతూ మేజా కిరకిరలాడింది. మాగోలా–వార్కా ఏడ్పులూ కలిసిపోయినాయి.

"ఇప్పుడైనా చెప్పుతావా?"

"చెప్పుతాను–"

అగనెస్సోవు స్వయంగా ఆమెతొడుక్కుంటూన్న బూట్లు, ఒక

రూబులునోటూ, చవకబారు చెవికమ్మలూ బహుమతీ చేసేదట. ఆఇత్తడివుంగరం, స్టాకింగులూ ఒకడిచ్చేడు. లావుగా తుండులా వుండే కసాయిదుకాణంవాడు తువ్వాలు కొని ఇచ్చేడట. ఎవడోగాని, మిఠాయిలు పెట్టి, ముద్దులాడి, ఆమెపాదాలవద్ద మోకరిలబడి ప్రాధేయపడ్డాడట. కాని, ఆమనిషి ఎవ్వరోమాత్రం ఆమె చెప్పలేకపోయింది.

నిమ్మషరబత్తువిషయం మినహాగా మిగిలినవన్నీ చెప్పేసింది. ఆసంగతిదానికి జ్ఞాపకమే లేదు. అన్నీ విన్నాక నాన్న దానిని వదిలేడు. అక్కయ్యకూడా లేచింది. దానిని నీటితొట్టె దగ్గిరికి తీసుకుపోయేడు.

"కాళ్లూ– మొగం కడుక్కో. ఈవేళ నువ్వీ యిల్లు వదిలిపోవాలి. ఒక్కక్షణం ఉండడానికి వీలులేదు. నువ్వు మళ్లీ ఈప్రాంతాలకికూడా రావద్దు. నీకు తండ్రి అనేవాడు ఒకడున్నాడనే సంగతి కూడా మరిచిపో. ఫో, లంజా!"– అంటూ మెడమీద చెయ్యివేసి ముందుకు నెట్టేడు.

కాని, వాళ్ళు, మొగంకూడా కడుక్కోకుండానే లపాళంగానే బయలుదేరి పోయింది. విసురుకుంటూ పోయినప్పుడు పైన కప్పుకున్న శిల్కుకండువా జారి గుమ్మంలో పడిపోయింది. దానిని మేము ఎప్పరం తీయలేదు. వచ్చీ–పోయేటప్పుడు మాకాళ్లక్రింద గరగరలాడుతూ నలిగిపోయింది.

నేను, అక్క వెనకాలే వీధిలోకి పరుగెత్తేను. ఎంతో చిన్న

తన౯ పడుతూ తలవొంచుకొని నడిచిపోతూంది. ఒక్కమారు కూడా వెనక్కి తిరిగి చూడలేదు. మార్కెటు ప్రక్కనుంచి, పెద్దపెద్ద ఆఫీసర్లున్న వీధులగుండా నడిచింది. ఫొండిచ్చేరియొక్క ఎత్తయిన ప్రహరీగోడ వెంబడినే కొంచెందూరం సాగి, దానికి ఎదురుగా నున్న మైదానానికి అడ్డుపడి మునిసిపలు చెత్తగుట్టలు దాటిపో యింది. దిగ్భ్రమచెందినట్లు— చుట్టప్రక్కల దేనిని వినజాలనట్లు, చూడజాలనట్లు, అలాగే నడిచిపోతూంది.

ఆరోజంతా అలాగే తిరిగింది. సాయంకాలం చీకటిపడినాక అగనెస్సోవు మందిరం దగ్గిరకివచ్చి ఒక్కనిముషం ఏదో ఆలో చిస్తూ నిలబడింది. ఇంతసేపూ నేను దానివెనక్కాలనే తిరుగు తూన్నాను. ఆమె నిలబడగానే గబగబా ముందుకివెళ్లి, చల్లగా నున్న ఆమెచేయి పట్టుకొని అమాయికంగా "అక్కా!"—అన్నాను.

వార్కా గిరున నాకేసి తిరిగింది. కళ్ళనీరు తిరుగుతూంది. పెదవులు అదిరిపోతూన్నాయి.

"నన్యా! ఇంటికి వెళ్లిపో"—అంటూ నాచేయి విదలించుకొని, గబగబా మెట్లపైకిఎక్కి తలుపుతెరచి, లోనికిపోయి, తలుపువేసు కుంది.

అటుతర్వాత ఆమె ఎప్పుడైనా బజారులో కనిపిస్తూండేది. త్రాగి ఒళ్లెరగకుండా, తూలితూలి పడుతూకాళ్లీడ్చుకుంటూ నడు స్తూండేది. వార్కా శరీరం త్వరలోనే శిథిలంఅయిపోయింది. ఆమె ఆరోగ్యంఅంతా అగనెస్సోవు విశ్రాంతిమందిరంలో నాశనం చేసి

వేయబడింది. కామతృప్తిలేని నరపశువుల చాపల్యానికి ఆమె గురి అయిపోయింది. దొంగలతో ఆమె చెలిమి. బట్టలూ- పాతలూ సంపాదన. చీకటిపడేటప్పటికి ఏవీధిమూలనో— దీప స్తంభాల క్రీనీడలలో నిలబడి, వచ్చి—పోయేవారిని కన్నుగీటుతూండేది.

మాకుంటుంబం అంతా నశించిపోయినాక నేను నాఅనేవారు లేక వీధుల్లో తిరిగేరోజులలో ఒకనాడు ఆమె బజారులో రోడ్డు ప్రక్కన కొయ్యరొట్టెనములుతూ నిలబడి కనిపించింది.

నన్ను చూడగానే వార్కా ఎంతో నెమ్మదిగా నాదగ్గిరికి వచ్చింది. ఆమెజుట్టు బూడిదరంగులోకి మారిపోయింది. పెద్ద తలకట్టు పల్చబడిపోయింది. రక్తహీనంగావున్న ముఖంలో ఎముకలు బయటపడిపోయేయి. పెదవులు బీటలువారి యున్నాయి.

నన్ను చూడగానే నాదగ్గిరికి వచ్చి భుజంతట్టి "సన్యా"— అంది.

నేను ఆగలేకపోయేను. మోకరిలబడిపోయేను. వార్కా అదిరిపడి, క్రింద చదికిలబడిపోయి నన్ను ఒడిలోకి తీసుకుంది. ఒకప్పుడు యౌవనోద్రేకంలో పొంగి దృఢంగా వుండే గుండెలకి నాతలని అదుముకుంది.

మార్కెట్టులో జనం అందరూ మాచుట్టూ పోగయ్యేరు.

"ఆమెకేసి చూడండి. ఎంతో బాధపడివుంటుంది. పాపం."

ఒక పెద్దకూరలతట్టని చప్పమీద ఈడ్చుకుంటూ వస్తూన్న ఒకఆడది మాస్థితికి వ్యాఖ్యానం చేసింది.

"బహుశా కొడుకుకాబోలు. చాలాకాలానికి కనిపించి వుంటాడు."—అంటూ నల్లనిగుడ్డలు కట్టుకున్న ఒకముసిలిది కళ్ళ నీరు పెట్టుకుంది.

"బహుశా తమ్ముడు కావచ్చును"— అంది ఒక త్తె.

"అదేం చిన్నపిల్ల అనుకుంటున్నారా? తమ్ముడేమిటి? కొడుకే అయివుంటాడు. దానికి ఒకడజనుమంది పిల్లలు ఉండివుంటారు."

వార్త నాతల తట్టింది. నాచొక్కా సరిచేసి కన్నీరు తుడిచింది. వెనుకటిరోజులలోనికి వలెనే నన్ను బుజ్జగించింది.

"ఏడవకు నన్నా! మళ్ళీ వేసవిశాలంరాగానే ఆఅడవులలోకి పోయి ఆఏట్లో స్నానం చేద్దాములే."

పదో.......

ప్రకరణం.

మానాన్న ఇంక ఆచెమ్మకొంపలో మమ్మల్ని పెట్టుకొని పడియుండలేకపోయేడు. ఇల్లంటే ఆతనికి పెద్దపులి అయిపోయింది. పనిలోంచి తిరిగివస్తూ గుమ్మంలో నిలబడి, దారితప్పి వచ్చినవాడికి మల్లే కంగారుగా దిక్కులు చూసేవాడు, చేతులకి తొడుక్కొన్న 'కాన్వాసుగ్లోవులు' బరువైపోయి చేతుల్ని దిగలాగుతూన్నట్లు భుజాలు జారవేసుకొని నిలబడేవాడు. నడ్డి వంగిపోయింది, నడు

స్తూన్నప్పుడు గడ్డం గుండెలకి తగిలేలా వంచుకొని నేలమీద ఏదో వెదుకుతూన్నట్లు కనబడేవాడు.

జీతపురాళ్ళు చేతబడగానే తిన్నగా సారాదుకాణానికి పరుగెత్తే వాడు. ఒక్కరాత్రిలో నెల్లాళ్లసంపాదనా 'స్వాహా' అయిపోయేది. ఇంటిదగ్గర ముగ్గురుపిల్లలం తిండీ—తిప్పలూ లేకుండా మాడిపో తూన్నామనే సంగతికూడా మరిచిపోయేవాడు. తాననుభవిస్తూన్న కష్టాలన్నింటినీ కొద్దిగంటలు మరచినా, మరపడమేమని 'అగనె స్సోవు' విశ్రాంతిమందిరంలో పూర్తిగా నిషాచేసేవాడు.

మామానాన మేము ఉండిపోయేము. మమ్మల్ని కనుక్కునే దిక్కూ—ఆదరించే దిక్కూ లేదు. నిద్రలోంచి కుక్కల్లా దెబ్బ లాడుకుంటూ లేచేవాళ్ళం. మాఅందరికంటేనూ ముందుగా'మిట్కా, నిద్రలేచేవాడు. అంతహడావిడీ నాన్నచొక్కాకోసం! ఇంట్లోవున్న దల్లాఆచొక్కా ఒక్కటే! మిట్కా ఆచొక్కా తానుతొడుక్కొని బజారుకి పోవడానికి తయారయ్యేవాడు. కాని, 'న్యూర్కా' వాడిని అడ్డగించేది. మాముగ్గురిలో కాస్త ఎముకపుష్టి గలది న్యూర్కాయే. మిట్కా చొక్కాతొడుక్కుని వీధిగుమ్మంలోకి పోయేదాకా పూరు కొని, గభీమని మీదపురికి మెడపట్టుకొని, గెంటుకుంటూలోనికి ఈడ్చుకు వచ్చేది. ఇంక మల్లయుద్ధం ఆరంభం అయ్యేది. ఏరొట్టె ముక్కో— ఏడబ్బో అడుక్కుని కడుపునింపుకుందుకు మార్కెట్టు లోకి వెళ్లాలంటే చొక్కాకావాలి. లేకపోతే చలి భరించలేము. చొక్కా వుంటేనే తిండివుంది. అందుకనే వాళ్లిద్దరూ ఆలాగ దెబ్బ

లాడుకొనేవారు. న్యూర్కా జుట్టు పొడుగూ—వత్తూకూడాను. మిట్కా ఆజుట్టు చేతికి మెలి వేసుకొనిగుంజి—గుంజి వదిలేవాడు. న్యూర్కా వాడిమొగంఅంతా బరికి రక్తపుకొల్లుచేసి వదిలేది. ఈద్వంద్వయుద్ధంలో ఎవరునెగ్గితేవారు చొక్కా స్వాధీనంచేసుకొనేవారు. సామాన్యంగా న్యూర్కాయే నెగ్గేది. ఆచొక్కా తొడుక్కొని, నాన్న బాపతుగుడ్డలు కాళ్ళకి కట్టుకొని, జోలి చంకకి తగిలించుకొని విజయోత్సాహంతో వెనక్కి తిరిగి—తిరిగి చూస్తూ సగర్వంగా రంగంలోనుంచి నిష్క్రమించేది. మిట్కా ఏడుస్తూ రక్తులకి ఉమ్మిపట్టించుకుంటూ కూర్చుండి, నేను వీధిలోకి బయలుదేరబోయేటప్పుడు అధికారం వెలిగించేవాడు.

"ఏమిరోయి! వెధవా! నాకుకూడా ఏదయినా తినడానికి తేకపోతే—"

నాకు వారిద్దరినీ చూస్తే అరికాలిమంట నెత్తికెక్కేది. కానయితే ఏమీచేయలేక నోరుమూసుకొని పడివుండేవాడిని. వాళ్ళిద్దరూకూడా నాకంటె పెద్దవాళ్ళు, బలవంతులూ కూడాను. అందుచేత వారిలో ఎవ్వరునెగ్గినా ఒక్కటే. చొక్కా నాకేలాగూ దక్కదు. పోనీయని వాళ్ళు తామతెచ్చుకున్నదయినా కాస్త నాకు పెట్టేవారుకాదు.

'బురదగుంట' కి దగ్గరలోనే పెద్దకసాయిదుకాణం వుంది. దానికొకపెద్దదొడ్డి. దానికి నడిమిన దడికట్టి రెండుభాగాలుగా చేసేరు. ఒకదాంట్లో కత్తికి బలికావలసిన జంతువుల్ని పెట్టేవారు. రెండో

దాంట్లో బలియవేుపవలసిన పందులు, పావురాలు, బాతులు, మొద
యినవానిని ఉంచేవారు.

కుక్కలు చేసిన సందుగుండా దూరి నేను ఈరెండో దొడ్డిలో దూరేను. దొడ్డికి మధ్య పెద్దమాను దొలిచి తయారుచేసిన తొట్టె ఒకటివుంది. నేనూ వెళ్ళేటప్పటికి జంతువులని పెంచేవాడు. బాగా ఉడకపెట్టి పొగలుచిమ్ముతూన్న తెలకపిండిగుండ బాల్చీతోతెచ్చి ఆతొట్టెలోపోసేడు. పొడుగుపాటిమెడలు పల్లకీబొంగులా వంచి, ముద్దీ తిప్పుకుంటూ పెద్దబాతులు తొట్టెచుట్టూ చేరేయి. బహుశా పాపంఅవి ఈజన్మానికితినేతిండిలో ఆఖరుది అదే అయివుంటుంది. నేను నెమ్మదిగా పొంచిపొంచి వెళ్ళి, గభీమని దోసిలినిండుగా ఆవేడితెలకపిండిగుండ తీసుకొని పరుగెత్తేను. కాని, తాముతిన వలసిన తిండిలో నాకు వంతుపెట్టడానికి ఆబాతులకి ఇష్టంలేదు. నేనూ తెలకపిండి తీయడంతోటే 'క్వాక్—క్వాక్' మంటూ తరుము కొచ్చి బండముక్కులతో పొడిచేయి. ఏమిచేసినా నేనుమాత్రం తెలకపిండి వదలలేదు. వాటిబాధ ఏదోవిధంగా తప్పించుకొని, బయటపడ్డాను. మరునాటికికూడా సరిపడింది, ఆరోజున తెచ్చు కున్నపిండి.

చలిగాలికి కాళ్ళూ— చేతులూ కొంకర్లుపోతూన్నాయి. తిండి వెతుక్కుందుకు మరొకచోటికి పోలేకుండావున్నాను. కాలికి జోడు- ఒంటిని గుడ్డాకూడా లేకపోవడంచేత కసాయిదుకాణందగ్గిరికి వెళ్ళే టప్పటికే తాతలు దిగివస్తూన్నారు.

ఇది ఈలావుండగానే మరోబాధకూడా మీద విరుచుకుపడింది. నాకేగాక ఇంకొకరిపొట్టకి కూడా తిండితేవలసిన పరిస్థితులు ఏర్ప డ్డాయి. ఒకరోజున తనకికూడా తిండిపెడితేనే తలుపుతీస్తాను, అని పేచీపెట్టేడు, మిట్కా.

నేను ఈయకతప్పిందికాదు. లేకుంటే తెల్లవార్లూ చలిలో ఆరుబయట జాగారం చేయవలసిందే. మిట్కాకి ఈసంపాదన చాలాసుఖంగా కనపడింది. న్యూర్కామీదకూడా అధికారం చలా యించసాగేడు వెంటనే న్యూర్కా నాతో స్నేహం కలిపింది. మాఇద్దరిలో ఒకరం ఇంట్లో వుండిపోతే రెండోవారు చొక్కావేసు కొని బజారుకిపోయేవాళ్లం. తెచ్చినది ఇద్దరమూ తినేవాళ్లం. 'మిట్కా' మాడిచావవలసిన అవస్థ ఏర్పడింది.

ఒక్కరొట్టెముక్కనిగాని, ఒక్కఏగానికాని, ఎప్పుడూ నాన్న తెచ్చి మాకిచ్చినపాపాన పోలేదు. నిజానికి అతనికికూడా అప్పుడూ-అప్పుడూ మేమే తిండిపెట్టవలసివచ్చేది. తరుచుగా మాదగ్గిరికి ఏదయినా పెట్టమంటూ వస్తూనే వుండేవాడు. ఇంటికి ఎప్పుడైనా వచ్చేడంటే వీధిగుమ్మంలోనుంచే, "నాకుకూడా ఏదయినా పెట్టవు తల్లీ!-" అంటూనే వచ్చేవాడు.

న్యూర్కా ఉన్నంతవరకు ఒకరికి లేదనేరకం మనిషికాదు. దానిజోలిలో ఎప్పుడూ కొద్దో– గొప్పో నిలవవుంటూనే ఉండేది. నాన్న అడగడంతడువు సంచీ వెదికి అతనిచేతిలో ఏదోఒకటి? పెట్టేది.

ఒకమారు కసాయిదుకాణంలోనుంచి ఏదోజంతువుయొక్క పెద్దపేగులు ఎత్తుకువచ్చేను. బురదగుంటకి ప్రక్కనే పారుతూన్నవా గులో దానిని శుభ్రంగా కడిగివేసి అచితుకూ– ఈచితుకూఏరి మంటబెట్టేము. నేనూ–న్యూర్కా ఒకచోట సావకాశంగా కూర్చుని కడుపుపట్టినంతా తిన్నాం. ఇంకా చాలామిగిలింది. దానిని ఏమిటి చేయడమా అని ఆలోచించేము.

"నన్యాః పట్టుకుపోయి నాన్నకి ఈయరా. పాపం తింటాడు." అంది న్యూర్కా.

'నరే'– నని ఇంట్లోవున్న ఆపీలికా– ఈపీలికా చుట్టుకొని నాన్న పనిచేస్తూన్న కొలిములదగ్గిరికి బయలుదేరేను.

దారిపొడుగునా నాన్న పొడుగూ– ఆకారమూ మననంచేస్తూ వెళ్ళేను. ఆతడు మాంచిబలంగా వుండేవాడు. గునపంచేతపట్టు కుంటూనే ఆవలిమూల కుళాయిదగ్గరనున్నజనాన్ని సిద్ధంగావుండ మని పిలిచేవాడు. ఈవల ఈతదొక్కడూ చేస్తూన్నపని అందుకుం దుకు కుళాయిక్రింద ముగ్గురు పనిచేయవలసివచ్చేది.

ఆరుగురు పనివాళ్ళయినా చేయలేనిపనిని నాన్నఒక్కడూ అతి సులువుగా చేసేవాడు. గునపం నడిమికి పట్టుకొని, ఒదివేయడానికి సిద్ధంగా నిలబడేవాడు. మెడనరాలన్నీ ఉబికి తాళ్ళలాగ కనిపిస్తూం డేవి. వెనక్కి ఒరిగి "హు"– అని ఒకవూపుతో గునపం దిగవేసేవాడు.

ఆతడొక్కడూ ఆరుగురు మనుష్యులపని చేస్తూంటే కార్ఖా

నాఇంజనీర్లు పెళ్లాల్ని వెంటబెట్టుకువచ్చి చూసి, ఆశ్చర్యపడుతూండే వారు. అంతపనీ చేసినందుకు ప్రతిఫలంగా నెలకి మూడురూబుళ్ళ జీతం హెచ్చించేరు.

కాని, ఆరోజులే పోయినాయి. అమ్మ బ్రదికియున్నరోజులలో మధ్యాహ్నంతిండికి కాదేజీపులుసూ— బంగాళాదుంపలూ ఇచ్చి పంపిననాటి మాట ఇది. అప్పటికి ఆతడు 'అగనెసోన్వు' గడప తొక్కలేదు. ఇంక ఇప్పుడా? ఆతనికి ఆతిండీ లేదు. ఆశక్తీ లేదు. గునపం ఎత్తడమే బ్రహ్మాండంగా వుంటూంది. నిల్చుంటే కళ్లు పచ్చలు కమ్ముతూన్నాయి. ఆకాశమే విరిగి, కరిగి, కాళ్ళమీద పడిపోతూన్నట్లు అనిపించేది. ఒక్కనిముషం కూర్చుండి ఆయాసం తీర్చుకోవాలనీ, కళ్లుమూసుకుపడుకోవాలనీ అనుకునేవాడు. కాని, కూర్చుండడానికి వల్లా? ఓపికవున్నా—లేకపోయినా చచ్చినట్లు పనిచేయవలసిందే. ఎంతో నీరసంగా వుండడంచేత కళ్ళుతిరిగి పడిపోకుండావుండేటందుకు రెండురెప్పలూ గట్టిగా మూసుకొని యంత్రంలాగ పనిచేస్తూనే వుండేవాడు.

కూలీలందరిదీ అదే అవస్థ. అందుచేతనే పనిఏమీ సాగేది కాదు. గునపం దిగవేస్తే, కాలిన గోడలకి పొడుచుకొని తూలి పోయేదేగాని, ఒక్కఅరఅంగుళంకూడా దిగేదికాదు. గొట్టాలలోకి లోహపునీరు ప్రవహించేదేకాదు. మూడుజతలచేతులు పనిచేస్తూన్నా కలయికలేకపోవడంచేత వారుకొట్టే దెబ్బలు నిరుపయోగం అయిపోయేవి.

మేస్త్రీ వట్టితొందరమనిషి. నోటిమరుకుదనం ఎక్కువ. ఊరపందిలా ఒళ్ళు. గంట్లుకొట్టిన తిరగలిదిబ్బలాగ మొహం. చుంచులా కళ్లు. ఆడంగిగొంతుక. యములాడులాగ వుండేవాడు.

ఆరోజున కూలీలు కదలలేకుండా వున్నారు. ఇనుము నీళ్ళలాగ కరిగిపోయింది. వానిని గొట్టాలలోకి మళ్ళించలేకుండా వున్నాయి కూలీల చేతులలోని గునపాలు. వెంటనే ఆతడు పరుగెత్తి వచ్చేడు.

దూరాన్నుంచే— "ఏంచేస్తూన్నారర్రోయ్! కూర్చుని కునికిపాట్లు పడడానికా ఇక్కడికివచ్చింది. ఏమిటి? లేవరేం?"—అంటూ గావు కేకలు పెట్టుకుంటూ నాన్నదగ్గిరికివచ్చి— "ఊ! లేమరీ!"—అన్నాడు.

నాన్న చేతిలో గునపం వొదిలేసి రెండుచేతులతోటీ పాదాలు నొక్కుకున్నాడు. రక్తంకాళ్లకి దిగి తెగనలుపుతూన్నాయి. పిక్క పరాలు మెలిపేసుకుపోతూన్నాయి. ఒక్కమారు కాళ్లు ఝాడించి కీళ్ళు మెటికలు విరుచుకోవాలని తలచేడు. వేడికి ఇగిరిపోయి, చిట్లిన పెదవులు పొడారిపోయిన నాలుకతో తడుపుకున్నాడు. మహాచెడ్డదాహం అవుతూవుంది. కళ్లు మూతలు బడిపోతూన్నాయి.

మేస్త్రీ కేకలకి తెలివివచ్చి పిచ్చివాడికిమల్లే కళ్ళుతెరిచి చూచేడు. ఏదో మరచిపోయిన విషయం జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నిస్తూన్నట్లు కనపడ్డాడు.

బాధలకి కృంగి, కృశించిపోయిన తనశరీరాన్ని చూచుకొని ఆతడు భరించలేకపోయేడు. పెద్దపెట్టున ఏడ్పు వచ్చింది. కాని,

తోడివారిముందర ఏడవడానికి అభిమానం అనిపించింది. వెంటనే క్రింద ఇసకగుట్టమీద చదికిలబడి రెండుచేతులతోటీ మొగం కప్పుకున్నాడు.

మేస్త్రీ అదిచూచి పళ్ళుకొరికి బండబూతులు తిట్టడం ఆరంభించేడు. రెక్కపట్టుకొని లాగి నిలవబెట్టడానికి ప్రయత్నించేడు. కాని, సాధ్యపడలేదు. ఆతనిని నిలవబెట్టలేక ముందుకు తోసేసేడు.

నాన్నకి ఆవేశం తలకెక్కింది. పుసికట్టినకళ్లూ—ఎత్తిపెట్టుకున్న ముక్కుషోణాలూ—తుట్టపెదవులూ—పెద్దగొంతుముడీ—వెక్కిరించినట్లుగా ఎదురుగాకనపడేటప్పటికి ఎన్నో ఏళ్లనుంచి— ఎన్నో వేల రోజులనుంచి, తన్నుఅవమానించి, తిట్టి, బాధిస్తూన్నది వీడేనని తోచింది.

బ్యుటిలోకీను ఎదురుగా నిలబడి తిడుతూన్నాడు. కుక్కవన్నాడు. పందివన్నాడు. రెక్క దొరకపుచ్చుకొని, బలవంతంగా పని చేయించాలని ఈడుస్తూన్నాడు.

ఎన్నో ఏళ్ళనుంచి మనస్సులో పెరుకుతూన్న కోపమూ—అసహ్యమూ ఇంక ఉండబట్టింది కాదు. ఇదివరకటి తిట్లన్నీ ఇంకా చెవులలో గింగురుమంటూనేవున్నాయి. మళ్లీ ఇప్పుడు ఈనీచుడు—యజమానుల ఎంగిలితినే ఈకుక్క తననీ తిడుతూన్నాడు. ఆతడింక భరించలేకపోయేడు. చేయిసాచి, గూబ 'గుంయ్' మనేటట్లు మేస్త్రీ మొగంమీద ఒక్కటి కొట్టేడు. మారుమాటాడకుండా 'బ్యుటిలోకీఁ' నేలమీది ఇసకలో కుప్పకూలిపోయేడు.

గార్ఫజ్ సరిగ్గా పక్కకొలిమిదగ్గరనే పనిచేస్తున్నాడు. అసలు ఈలాంటి సమయం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూండేమనిషి ఈయవకాశాన్ని జారవిడుస్తాడూ? నాన్న మేస్త్రీని కొట్టడం, వాడు 'కుంయ్—కంయ్' మనకుండా పడిపోవడం చూసి, ఆతడు ఎగిరి గంతువేసేడు.

"భేష్! ఓస్టవూ! మంచిపని చేసేవు. మరొక్కటి తగుల్చు!"

గార్ఫజ్ చప్పట్లుకొట్టి తన స్నేహితు లందర్నీ పిలిచేడు. తాపీపనివాళ్లు తాపీలు; కొలిమిదగ్గరవాళ్లు గునపాలు; బళ్ళవాళ్లు బళ్లు వొదిలేసేరు. 'పిట్టర్లు' చేతిలోని 'రెంచిలు' పారవేసేరు. 'స్మెల్టర్లు' ముడియినుము తొట్టెలలోనే వదిలిపెట్టేరు. 'మౌల్డర్లు' ఇనక దున్నేసేరు. ఒకవందచేతులు కలిసి తుమ్మదుంగలావున్న మేస్త్రీని ఆఇసకలో పడవేసి ఈడవడం ఆరంభించేయి.

మేస్త్రీని చావగొట్టడం అయినాక ఆజనాన్ని వెంటబెట్టుకొని గార్ఫజ్ ఆఫీసుగదులమీదికి దాడివెడలేడు. ఆఫీసుపనిలోవున్న ఇంజనీరు వాళ్ల చేతులలో పడ్డాడు. ఆఫీసుబయటనున్న తారుపీపా ఆతనినెత్తిన దిమ్మరించి, పెంటలమీద ఏరితెచ్చిన వెం(డుకలు ఒంటినిండా పట్టించి ఒకచిన్నపెట్టెబండిలో కూలవేసి చిట్లుపుగుట్టలదాకా ఈడ్చుకుపోయి, వాటిమీద బండీ తల(క్రిందులుచేసి వాడిని పడ(త్రోసేరు.

పరిస్థితులు ఇంతవిషమస్థితిలోకి రాగానే, కొందరు పనివాళ్ళు హడిలిపోయి, గునపాలు తీసుకొని, కొలిములదగ్గరకి తయార

య్యేరు. చల్లబడుతూన్న మంటలు మళ్ళీ ఇంకోమారు ప్రజ్వలించేయి.

... ...గొట్టాలదగ్గరనున్న మన్ను ఎర్రబడుతూంది. కొన్ని కొన్నిచోట్ల మంటలు పాలపొంగుమాదిరిగా మిలమిలలాడిపోతూ న్నాయి.

సమ్మెదారులు ఇతరికార్ఖానాలలోని జనాన్నికూడా వెంటబెట్టు కొని 'మీటింగ్'కు బయలుదేరుతూ తమమిత్రులు చేసిన ఈద్రోహం విని, ఉగ్రులయి, కొలిములదగ్గరకి పరుగెత్తేరు. గబగబా పనివాళ్ల చేతులలోని గునపాలు లాగుకొని, కరిగి చిరుఅలలువేస్తూన్న లోహంమధ్యకి విసిరేరు. కొందరు గొట్టాలు, కాలవలు, కందకాలు, తవ్విపాడుచేసేరు.

పెద్దధ్వనితో తొట్టెలు విచ్చిపోయి, లోహం నాలుగుమూల లకీ ప్రవహించింది. దానిలోనుంచి ఎర్రని మిణుగురులు చెదిరి నాలుగు మూలలకీ చిందేయి.

నేనూ వెళ్లేటప్పటికి నాన్న రెండుచేతులతోటీ కళ్లుకప్పుకొని పరుగెత్తివస్తూన్నాడు.

ఆఇనుమును ఆపడానికి ఎవ్వరూ ప్రయత్నించలేదు. అది మీదికి రాకుండా మూలమూలకి ఒదిగి, జనం గట్టిపడిపోతూన్న ఆ ప్రవాహంవంక ఎంతో సంతోషంతో చూస్తూన్నారు.

నేను తెచ్చిన మాంసం ఖర్చుకానేలేదు. చప్పగా చల్లారిపో యిన దానిని, ఆపాళంగానే మూటయినా విప్పకుండా ఇంటికి తీసు కొనిపోయేను.

## పదకొండో...

## ప్రకరణం.

ఆరోజున కొలిమిదగ్గర జరిగిన పనితో నాన్నకి 'చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు'అయింది. లోహప్రవాహంలోనుంచి, ఎగిరిన నెరుసుఒకటి కంట్లోపడి చూపుతప్పింది. ఇప్పుడు నడుస్తూ పీత లాగ అడ్డంవేస్తాడు అడుగులు. వ్రేలబడిపోయిన భుజాలకంటా తలవంచుకొని, ఏదో శ్రద్ధగా వింటూన్నట్లు కనిపిస్తాడు. మనిషికేసి చూస్తే తనగుడ్డికన్నుమూలంగా సిగ్గుపడుతూన్నట్లు కనిపిస్తాడు. కునికిపడుతూన్నట్లు ఆకంటిమీద రెప్పలు మూతబడివుంటాయి. మిగిలిన ఒక్కకన్నూ పూర్వంకంటే పెద్దదిగానూ, చురుకుగానూ వున్నట్లు కనిపిస్తుంది,

కాని, ఆతనిలో ఆనందం అనేదే చచ్చిపోయింది. ఆతని ఆశలన్నీ బుగ్గిఅయిపోయినాయి. ఆతనికిగల సర్వస్వమూ హరించిపోయింది. సమ్మెచూద్దామా— అంటే అది ఓడిపోయింది. ఇంక సంతోషం ఏలాగ వస్తుంది?

సమ్మె ఆరంభం అయినరోజుననే పోలీసువాళ్ళు నాన్ననీ— పార్వతాలునీ— అరెష్టుచేసేరు. సమ్మె మరింత బిగిసింది. కొలిముల వద్దవాళ్లు— తాపీవాళ్లు— రోలర్లు— మౌల్డర్లు— మొదలయిన కూలి జనం అంతా తమకోరికలు నెరవేరితేగాని పనిలోకి రామంటూ

భీష్మించేరు. నాన్ననీ— గార్బజునీ— వదిలిపెట్టడం, వాళ్లని మళ్ళీ పనుల్లోకి చేర్చుకోవడం, వాళ్లుపెట్టిన షరతులలో మొదటిది.

సమ్మె మూడువారాలపాటు బ్రహ్మాండంగా జరిగింది. కాని, యజమానులు ఒకకుయుక్తిచేసి కూలీలను బోల్తా కొట్టించేరు. దానితో సమ్మెఉద్దేశ్యాలే విఫలం అయిపోయినాయి.

యజమానులు ముందుగా నాన్ననీ— గార్బజునీ వదిలిపెట్టించి, వాళ్ళని మళ్లీ పనులలోకి తీసుకున్నారు. కూలీలకోరికలు నెరవేర్చబడ్డాయి. పనివాళ్ళంతా యథాప్రకారంగా పనులలోకి వెడుతూన్నారు. అదే సమయంలో యజమానులు ఒకయుక్తిచేసి, నాన్ననీ-గార్బజునీ పనుల్లోంచి పొమ్మన్నారు.

కూలీలచేత మళ్లీ సమ్మెచేయించడానికి గార్బజ్ చేసిన ప్రయత్నాలన్నీవ్యర్థం అయిపోయినాయి. మూడు వారాలపాటు జరిగింది, వెనుకటిసమ్మె. అందులోనే తిండీ—తిప్పలూలేక కూలీలు ప్రాణాలు విసిగియున్నారు. అంతబాధా పడిన వెంటనే మళ్లీ సమ్మెచేయడానికి వాళ్లు ఏమాత్రమూ అంగీకరించలేదు.

కూలీలు ఏనాడయితే తమహక్కులకోసం నిలవబడివుండడానికి అంగీకరించలేదో ఆనాడే ప్రభుత్వంకి అలుసుదనం చిక్కింది.

ఒకరోజురాత్రి గార్బజు మమ్మల్ని చూడడానికి వచ్చేడు. కళ్లు నీరుక్రమ్మి వున్నాయి. మొగం దోక్కుపోయివుంది. వస్తూనే బల్లమీద చదికిలబడిపోయి తమసంఘంలో కొంతమందినిఅరెస్టు చేసేరని చెప్పి ధైర్యం కోల్పోయి వెక్కివెక్కి ఏడ్చేడు. కొంచెం

సేపటికి మనసుచిక్కపట్టుకొని, గంభీరంగా కూర్చుండి, తమరిని గూర్చి కానట్లు—"త్వరలోనే బహుశా మనవంతుకూడా రావచ్చును"-అన్నాడు. అంతలో మళ్లీ బెంబేలుపడిపోయేడు. నిరాశతో మేజా మీదికి ఒరిగి రెండుచేతులలోనూ తలపెట్టుకొని ఒక్కనిముషం వుండిపోయేడు. కొద్దిసేపు వున్నాక— "సన్యా! కొద్దిగా వోడ్కా తెచ్చిపెట్టు. వొంట్లో ఏలాగో వుంది—" అంటూ జేబులోంచి డబ్బు లుతీసి బల్లమీద పెట్టేడు.

అంతకుపూర్వం గార్పజు త్రాగడం నేనెప్పుడూ చూడలేదు. ఇప్పుడు త్రాగుతున్నపద్ధతి చూచేక ఆతనికి ఆవ్యవహారం కొత్తదే నని తేలిపోయింది.

నిషా పట్టుఇచ్చేక తలచేతపట్టుకొని వెనక్కీ— ముందుకీ ఊగుతూ కూర్చుండి— "ఏదో దారి చూసుకోవాలి. చూసుకోక తప్పదు."— అంటూ పలవరిస్తూన్నట్లు మాటలాడసాగేడు.

కొద్దిసేపటికి నన్ను పిలచి దగ్గిరికివచ్చేక నానదుముచుట్టూ కాళ్లుమెలివేసి, వోడ్కాగ్లాసు నోటికి తగిలించేడు.

"సన్యా! త్రాగునాయనా! బ్రతికివుంటే ఆపీనుగుదగ్గరకి వెళ్ళ వలసిందే. ఆరాక్షసివెధవలు నిన్ను సుఖంగా బ్రతకనీయరు. అందుచేత గడచినరోజల్లా మంచిది. త్రాగు. కాస్తసేపేనా హుషా రుగావుండు. నేను త్రాగుతూన్నా ననా నీ ఆశ్చర్యం. ఫరవాలేదు. రేపు ప్రొద్దుటికి నేను మామూలుగా తయారవుతానులే."

బల్లదగ్గర కూర్చున్ననాన్న ఏదోగొణుక్కుంటూ తలత్రిప్ప

తూన్నాడు.

"మికోలా! నీగొంతు కొయ్యా! రాక్షసిపీనుగా! నీరోగం కుదు రుస్తా కంఠంలో ఊపిరివుండగా నీవు చేసిన అపకారం మరచి పోనురా!"

చుంచులా చూపులూ వాడూ ఆమేస్త్రీయే తన బాధలన్నింటికీ మూలంఅని నాన్న నమ్మకం.

నాన్న చచ్చిపోయినప్పటి సంగతులన్నీ ఈవేళకూడా కళ్ళకు కట్టినట్లుగా వున్నాయి. ఒకరోజున సాయంకాలం కనుచీకటి పడ బోయేముందు ఆతడు గుమ్మంలోకి వచ్చేడు. అప్పటికి వారం రోజు లనుంచి మావైపుకి తొంగిచూడడంకూడా లేదు. గుమ్మంలో నిల బడి పరాయిఇంట్లోకి అడుగుబెడుతూన్నట్లు సంశయంతో ఒకటి—రెండుమార్లు తారట్లాడి, తిన్నగా మాకేసి వచ్చేడు. మేము ముగ్గురం ఆకలికి నకనకలాడుతూ ముడిచిపెట్టుకొని అవంమీద కూర్చున్నాం. నాన్న రాక మాకేమీ ఉత్సాహకరంగా లేదు. అందుచేత చూసికూడా మాటలాడక ఊరకున్నాం.

ఆతడు తెలివిగానే వున్నాడు. తనస్థితికి ఎంతో సిగ్గుపడుతూ న్నట్లు తోచింది. తలమీది టోపీతీసి ఏదయినా ఇవ్వమని అడుగు తూన్నట్లు ముందుకుచాపి, అవం అంచుకు ఆనికూర్చుని చేయిజాపి మమ్మల్ని దగ్గరికి తీసుకున్నాడు.

ఆచేయి జాపడంవరస చూసి నాజుట్టు పీకుతాడేమోనని భయం వేసింది, ముట్టుకుంటేచాలు, పొడుం అయిపోయేలాగవుంది జుట్టు.

ఒంటికన్ను- చిట్లిన పెదవులు-కాల్పుడు మచ్చలతో నిండియున్న ఆమొగమూ- ఎంతో భయంకరంగా వున్నాడు. నాపళ్లు కటకట లాడేయి. నేను న్యూర్క్ వెనకకిదేకి ఒకమూలకి వొదిగేను.

తన కురూపిదనంచూసి మేము భయపడుతూన్నట్లు నాన్న కనిపెట్టేడు. నీరసంగా వున్నట్లు ఒక్క నిముషం దిగాలుపడి కూర్చు న్నాడు. తరువాత మాతో ఒక్కమాటయినా ఆడకుండానే లేచినిల బడి మొగాన గుడ్డకప్పుకొని వెళ్ళిపోయేడు. అంతే! మళ్ళీ ఆతడు ఆయింట కాలు పెట్టలేదు.

మరునాడు ప్రొద్దుటే మేమింకా నిద్రలోవుండగానే వచ్చి గార్పజు హడావిడిగా మమ్మల్ని లేపేడు.

"మీనాన్న మళ్లీ కనిపించడు. పోయి, ఒక్కమారు చూసి రండి."- అంటూ మమ్మల్ని వెంటబెట్టుకొని ఆచుంచుచూపులవాడి యింటికి తీసుకుపోయేడు.

ఆమేస్త్రీగాడి ఇంటివరండాలో చలువరాతిచప్టామీద నాన్న వెల్లకితలా పడివున్నాడు. చేతిలో ఒక గునపం వుంది. గుడ్డికంటి మీది రెప్పకొంచెం పైకిలేచి తెల్లగుడ్డును బయటపెట్టుతూంది.

బ్యుటిలోకినుమీది కసికొద్దీ నాన్న వాడిని చంపివేయడానికి వెళ్లేడు. కాని, వాడు ముందుగానే జాగ్రత్తపడ్డాడు. దానికి ఫలితంగా నాన్న ప్రాణాలు పోగొట్టుకొని, కలియబడినప్పుడు ముడుతలుబడ్డ తివాచీమీద ఒకకొసని వెల్లకితలా పడిపోయేడు.

నాన్నని ఆఅవస్థలో చూసినప్పుడు ఏడ్పుకిబదులు- అబ్బ!

ఎంతపొడుగున్నాడో— అని ఆశ్చర్యం కలిగింది.

నాన్న చనిపోయినాకకూడా మాజీవితపద్ధతిలో ఏమీ మార్పు కలగలేదు. వెనకటిలాగే అర్ధఆకలితో రోజులు గడుస్తూన్నాయి. మేము ఆమట్టిగుడిసె వదిలిపెట్టలేదు. ఆ'బురదగుంట'లో కాపురం వుంటూన్న ఏయమ్మో దయతలచి ఇన్నిదుంపలు పడవేసిపోయేది. వెనకటిలాగే ముష్టిఎత్తి ఇన్నిగింజలు తెచ్చేవాళ్ళం. న్యూర్కా అవి ఉడకబెట్టి ముగ్గురికీ పెట్టేది.

ఆపెద్దఆవంలో రాత్రీ— పగలూ చలికి ముడిచిపెట్టుకొని ఒక మూలకి నక్కి పడివుండేవాళ్ళం. ఆవంలోదూరగానే అమ్మ అక్కడ ఉడకపెట్టినదుంపలూ— కాబేజీ పులుసూ— రొట్టెలూ— బట్టలు ఉడకవేసిన కమ్మని వాసనా జ్ఞాపకానికి వచ్చేవి.

.......బెల్జియన్‌అడవు లనబడే చిట్టడవులమీదుగా చలిగాలులు వీచేయి. పక్షుల కలకలధ్వనులతోపాటు ఆవాయువులు రాలిపోయి కుళ్లిన ఆకుల దుర్వాసనలనీ, గాలిదుమారాలు రాబోయేముందు వేసవికాలంలో వీచే వాయువులశైత్యాన్నీ మోసుకువచ్చేయి. ఆకు పచ్చని కొండచరియలు రంగుమాసి, పసిమిరంగుగా కనిపిస్తు న్నాయి. న్యూర్కా- మిట్కాలు కడుపులో కాళ్లు, కాళ్ళలోతల పెట్టుకొని, అంతకంతకి మూలకి దేకుతూన్నారు. కరుదూపాలు, చవుడుదుమ్ము ముక్కులలోదూరి ఉక్కిరిబిక్కిరియై దగ్గుతూన్నారు.

వాళ్ళిద్దరూ చాలరోజులనుంచి జ్వరంతో వున్నారు. తిండి

ముట్టుకోవడమే లేదు. తమవాటా దుంపలు వాసనయినా చూడ కుండా నాకిచ్చేసి, ఆవంలో మూలగా కూర్చుని నన్ను వాళ్లకితగి లేలాగ కూర్చుండమని ప్రాధేయపడేవారు. నేను వారిద్దరిమధ్యా పడుక్కునే వాడిని. పెనంలాగ కాలిపోతూన్న వాళ్ల శరీరాలవేడికి ఉక్కపోసి నాకు ఉంగిడెత్తిపోతూంటే వాళ్ళు మాత్రం 'చలో-చలో' అని గోలపెట్టేవారు.

ఒకరోజు ప్రొద్దుట చలికి రక్తం గడ్డకట్టిపోతూవుంటే మెల కువ వచ్చింది. ఒకవైపున మ్యార్కా నిశ్శబ్దంగా పడివుంది. ఆమె శరీరం మంచుకంటేనూ చల్లగావుంది. మరొకవైపున మిట్కా యున్నాడు. వాడికాళ్లూ- చేతులూ చల్లగానే వున్నాయి. కాని, తల ఇంకా వేడిగానేవుంది. పెదవులు నిశ్శబ్దంగా, నల్లగా వున్నాయి.

ఆనిశ్శబ్దం నాకు చాలా భయం కలిగించింది. ఆవంలోంచి బయటికి పారిపోవాలనుకున్నాను. కాని, పోయేదెల్లాగ? కొయ్య బారిన మిట్కా- మ్యార్కాలకాళ్ళు ద్వారాన్ని మూసేసేయి. భయంతో వెర్రికేక పెట్టేను. పావురాయిగూడులావున్న ఆఆవం లోంచి నాక్షీణస్వరం బయటికి పోనేలేదు.

నాకూ తెలివివచ్చేటప్పటికి కసాయిదుకాణంయొక్క గబ్బు వాసన గుప్పుమని తగిలింది. కళ్లు తెరిచేను. పైన బూడిదరంగు కాన్వాసుగుడ్డ కప్పివుంది. దానివి తన్నివేసి లేచి కూర్చున్నాను.

నేనున్నది, పోలీసువాళ్ళ శవాలబండి. నాసోదరుడు- సోదరి బిగిసిపోయి ఒక ప్రక్కన పడిఉన్నారు. చుట్టువారా నిత్యంచూచే

మొగాలతోనిండిన మార్కెట్టుదుకాణాలు కవిపించేయి. చచ్చిపోయి నానని తలచిన నేను లేవడంచూసి, బజారంతా హడిలిపోయింది. ఈరోజువరకు పోలీసువాళ్ళబండిలో పడ్డమనిషి మళ్ళీలేవడం అనేది 'బురదగుంట' యొక్క చరిత్రలో అనమభూతం.

నేను బ్రదకడంచూచి, న్యూర్కా— మిట్కాలుకూడా లేస్తారేమోనని ప్రయత్నాలు చేయుబడినాయి, కాని, అప్పటికే చేయిదాటి పోయింది. చేతులు— కాళ్లు మెలికలుతిరిగిపోయినాయి. దౌడఎముకలమీద నల్లనిడాగులు స్పష్టంగా కనిపిస్తూన్నాయి.

బండీ మళ్లీ కిరకిరలాడుతూ బయలుదేరింది. నన్ను వెనక్కి మాగుడిసెకే— పంపేసేరు.

గుడిసెలో ఏవిధమైన జీవకళలేదు. ద్వారాలు—మిద్దె—మేజా ఆవం— అన్నీ నాకంటెఎన్నోరెట్లు పెద్దవిగా నన్నుమింగడానికి సిద్ధంగావున్నట్లు కనపడ్డాయి.

ఆగుడిసెలోనుంచి ఒక్కపరుగున ఈవల ఊడిపడ్డాను.

ఈవిశాలప్రపంచంలో నాతనుకోదగిన వారెవ్వరూ మిగలలేదని అప్పుడు తెలిసింది.

## పన్నెండో....

## ప్రకరణం.

'దూరా' పిన్ని కసాయివాడు మాంసంసరకే దుంగలాగ లావుగా, పొట్టిగా వుంటుంది. ఆస్వరూపానికితోడు వ్రేళ్లాడిపోతూన్న బాన కడుపుమీద తాటికాయంత కంతికూడాను. పందులదొడ్డిలోని ప్రజలు రక్తం పేరుకోవడంవలన ఆకంతి ఏర్పడింది అంటారు. కాని, మార్కెట్టులోని సరుకులమ్ముకొనే ఆడవాళ్ళు దానికి అంగీకరించరు. ఆవిడ ఆకంతిలో కప్పగుడ్లని పొదుగుతూందని వారి వాదన.

* 'దూరా' అన్నది ఆవిడ అసలుపేరుకాదు. నిజానికి ఆమె పేరు 'దోరా—అలక్జాండ్రోనా.' కాని, మార్కెటులోని ప్రజలయొక్క అనురాగాన్ని సంపాదించేక ఆమెకి "కప్పతల్లి—దూరా" అనే బిరుదనామం సంక్రమించింది.

ఆవిడకళ్లు షీకాయగింజలు. గుడ్రంగా చేతగాని పిల్లవాడు చేసిన 'దేవుడిగార్ల' మాదిరిగా వుంటాయి. రెండుపెదవలూ బాగా వ్రేలబడియుంటాయి. దవుడఎముకలు ఉబ్బెత్తుగాను, బుగ్గలు బూరెల మాదిరిగానూ వుంటాయి.

'పిన్ని' బజారులో వేడివేడి రొట్టెలు అమ్ముతుంది. మార్కెటులోకల్లా చేపలబజారు- చిల్లరదుకాణాలవీధి కలిసిన నాలుగు

---

* "దూరా' అంటే రష్యనుభాషలో మూర్ఖుడు అనిఅర్థం.

రోడ్లమొగనీ బాగా రద్దీగా వుంటుంది. ఆవిడ సరిగ్గా ఆమొగకాచి నిలబడుతుంది. వేసవికాలం కానీయండి- శీతాకాలం కానీయండి ఆశాలువా-ఆరేకుపొయ్యి- ఆడబ్బాతోటీ ఆమె సిద్ధంగా వుండవల సిందే. కళ్ళుతిప్పుతూ ఆలావుపాటి కళ్ళమీద నెమ్మదిగా జరుగుతూ, బజారంతా దద్దరిల్లేటట్లు-"రొట్టెలు! తాజారొట్టెలూ! వేడిరొట్టెలూ! వెన్నరొట్టెలూ! లేనిరొట్టెలూ! అంటూ బొబ్బరిస్తూంటుంది.

ఆ'బురదగుంట' వీధులలో దిక్కూ- మొక్కూ లేకుండా తిరుగుతూన్న నన్ను 'పందులదొడ్డి'కి ఒకకొసనివున్న తనయింటికి తీసుకొనిపోయింది.

"నువ్వు వరసకి నాకు కొడుకువు అవుతావు. నాకూ వెనక్కాల ఎవ్వరూ లేరు. నీకూ అంతే. రా. నాదగ్గరనే వుండిపోదువుగాని."

ఆక్షణం మొదలుకొని నేను ఆమె వద్దనే ఉండిపోయేను.

ఆరోజున బూజుదకొట్టుకొని, మాసిపోయిన, ఫొటోఒకటి చూపించింది. దానిలో చాలమంది పిల్లలున్నారు.

"అందరూ....అందరూ చచ్చిపోయేరురా! నేనొక్కర్తినీ చావ లేక మోడులాగ యీలాగ బ్రదికివున్నాను."- అంటూ గోలు గోలునఏడ్చింది.

కొద్దిసేపటికి ఆవిచారభారం తగ్గేక 'బ్లౌజరు' కొంగుతో కళ్లు తుడుచుకుంటూ- "నన్ను 'అలక్జాండ్రోనా-డోరా'-అని పిలవాలి. జ్ఞాపకం వుంటుందా?"- అని హెచ్చరించింది.

నేను అంగీకారసూచకంగా తల తిప్పేను.

అటుతరువాత బజారులో నిలబడి సరుకులమ్మేపద్ధతిని నేర్ప డం ఆరంభించింది. కాని, నాకు ఆపని చేతనయిందే కాదు. గదిలో, తలుపులు బిడాయించి, పచారుచేస్తూ, అంకెళ్ళు నొప్పులు పుట్టేదాకా అర్చేవాడిని. కాని, నాదృష్టి 'దోరా'మీదగాని, ఆమె రొట్టెలమీద గాని, వుండేకాదూ?

ఆమెకికూడా ప్రాణం విసిగింది. ఇంక పని ఇదికాదని నన్ను బజారుకు వెంటబెట్టుకొనిపోవడం ఆరంభించింది.

వీధిమొగలో నిలబడి ఇద్దరంకలిసి కేకలు ఆరంభించేవారం. మాపాఠం సగంవరకూ వచ్చేకఆవిడ తాను మానేసేది. కొసదాకా నేనొక్కడినే ఆదండకం వల్లించవలసివచ్చేది.

బజారంతా మాచుట్టూచేరి వేళాకోళం చేసేవారు. ఎవళ్లు ఏలాగ కూసుకుంటేనేం? మారొట్టెలు చులకనగా చెల్లిపోయేవి. పిన్నికి హుషారు ఎక్కువయింది. కొద్దిరోజులు గడిచేక రొట్టెలడబ్బా నాచేతికిచ్చి బజారుకు పంపించి తాను ఇంటివద్దనే ఉండిపోవడం ఆరంభించింది.

నా చేతులలో పద్దాక వర్తకం క్షీణించడం ఆరంభించింది. తీసుకువెళ్ళిన రొట్టెలు తీసుకు పోయినట్లే తిరిగితెచ్చేవాడిని. ఒక్కళ్లూ ఒక్కరొట్టెకూడా కొనేవారు కారు.

ఇంక పిన్ని నన్ను బజారుకిపంపడం మానుకుంది. రాత్రి తెల్ల వార్లూ వీధులవెంబడితిరిగి పుల్లా— పుటకా ఏరితేవడం, పగటిభాగం అంతా పొయ్యిదగ్గర కూర్చుండి మంటపెట్టడం వప్పచెప్పింది.

పొయ్యిలో రొొట్టెలు ఎర్రబడగానే తీసి ఆమెకిస్తే బల్లదగ్గర, కూర్చుండి, దానికవసరమయిన అలంకారాలన్నీ చేస్తూండేది.

'దోరా'కి మహాచెడ్డ మతిమరపు. నేను తిండి తింటాననీ, తిండి అనేది నాకుకూడా అవసరమేననీ ఆవిడ తరచుగా మరచి పోతూండేది.

అందుచేత నావిషయం నేనే చూసుకోవలసివచ్చేది. వెనక్కి తిరిగి బల్లదగ్గర ఆవిడ పనిచేసుకుంటూవుంటే చడీ-చప్పుడూకా కుండా పొయ్యిలో వేగుతూన్న రొట్టెలలోనుంచి కొంచెంకొంచెం పిండి దేవి నోట్లో వేసుకొనేవాడిని. ఆపచ్చిపిండి మింగుడుపడక ఉక్కిరిబిక్కిరి అవవలసివస్తూండేది. అయితేనేం? తప్పదు. ఏదో ఒకమాదిరిగా కడుపు నింపుకొనకుంటే ఏలాగ? ఆట్టే తిండిపెట్ట వలసిరాకపోవడంచేత పిన్నికికూడా సంతృప్తిగానేవుంది, ఇది.

★ ★ ★ ★

'పందులదొడ్డి'లోని నిత్యజీవితానికి నామనస్సు బాగా.అలవాటు పడిపోయింది. మాకిటికీలో కూర్చుంటే వీధినిపోయే ప్రతీవాళ్ళూ- మురికికాలవదగ్గరకి కిరకిరలాడుతూ పోతూండే డబ్బాబళ్లు, ఎము కలకోసమో, ప్రేగులకోసమో, కసాయిదుకాణాలకేసి పరుగులుపెట్టే ఆడవాళ్ళు-నిత్యమూ కనబడుతూ వుండేవారు. రాత్రితాగిన సారా వేడికి కమలిపోయిన మొగంతో, పెద్దపొడుగ్గా బ్లౌజరూ అతడూ 'కోవల్'నిత్యమూ ఆదారినే కార్ఖానాకి పోయేవాడు. 'రోలర్లు'- 'మౌల్డర్లు'- నాస్నేహితులయిన 'ఆయిలపు'చిన్నవాళ్లూ అందరూ

పొద్దుటా— సాయంత్రమూకూడా అదేదారిని వస్తూపోతూవుండే వారు. వాళ్ళలో ఒక్కడు ఒక్కరోజున ఆదారిన రాకపోతే నాకు గుర్తుగా తెలిసిపోయేటంత పరిపాటి అయిపోయినాయి ఆమొగాలు. బహుశా కిటికీ అద్దాలమీది మరకలచేత ననుకుంటాను ఎప్పుడు చూచినా వాళ్ళు కన్నీరుపెట్టుకుంటూన్నట్లే కనబడేది.

ప్రతిరోజూ కన్నుతెరిస్తే అదేదృశ్యం. ఈవేళకూడా రోజూ మాదిరిగానే నేను ఒకమారు వీధికేసి తొంగిచూచి మళ్ళీ ముసుగు బిగదన్నేను.ఎందుచేతనో అప్పటికప్పుడే బాగా రద్దీగా వుండవలసిన వీధులు నిర్మానుష్యంగావున్నాయి. ఎదురుగుండా గోడని తగిలించి యున్న ఆమాసినఫొటోలోని మొగాలుకూడా బాగాకనిపించేటంత వెలుతురు వచ్చినా పిన్ని నన్ను పిలవనేలేదు. పోనీ, తాను పనినీ ఆరంభించలేదు. ఎర్రనిపువ్వులద్దిన పండుగగౌను తొడిగి, సబ్బుతో మొగం రుద్దిరుద్ది, కళాయిపోయి మచ్చలుపడ్డ అద్దంముందు నిల బడి అలంకారం ఆరంభిస్తుంది. తరువాత కొంత సేపటికి ఆమె నెమ్మదిగా నాదగ్గిరికి వచ్చి, ఎంతో మృదువుగా తట్టి లేపింది.

"సన్యా! పొద్దుపోయింది. లే నాయనా!"

నేను మేలుకొనివున్నా కళ్లుతెరవలేదు. ఈవేళ ఆదివారంకాదు కదా యని 'కాలండరు' జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించసాగేను.

"సన్యా! త్వరగా లేవాలి, లేకుంటే వేళకి అందుకోలేము."

ఆ అందుకోలేని విషయం ఏమిటో తెలుసుకుందుకు కళ్లు

విప్పకతీరిందికాదు.

"మీఅన్నయ్య కోమా ఈబండీలో వస్తున్నాడు."

కోమా?....శానుతినేదాంట్లో వాటా బెట్టేవాడూ? జీతాలరోజున మిఠాయిలు తెచ్చేవాడూ? అప్పుడూ అప్పుడూ తలలుదువ్వి, అక్ష రాలు నేర్పుతుండేవాడూ?— ఆఅన్నయ్యేనా?....అయితే వాడిప్పుడు ఎక్కడవున్నాడో?—

నేను అతనినిఖి గురించి ఆలోచించుకుంటూ కళ్లు మూసుకొని పడుకున్నాను. పిన్ని ఇంకొమారు పిలిచిచూసి కదలకపోయేటప్ప టికి తలుపులు పైనగొండ్లెంపెట్టి వెళ్ళిపోయింది.

ఆవిడబాధ వొదిలిందికదా. పడుక్కుందాం;— అనుకున్నాను. కాని, నిద్రపట్టలేదు. కొంచెంసేపు కళ్లుమూసుకొని పడివుండే టప్పటికి మాగన్నుపడింది. తరువాత ఎవరిదో చేయి నుదుటికి తగిలి తెలివివచ్చింది.

పిన్ని నాపక్కలో కూర్చుండి ఏవయినా పాటలు పాడుతూం దేమోనని మొదట్లో అనుకున్నాను. కాని, పాటలేమీ చెవిని బడ లేదు. కళ్లు తెరిచేను. పెద్దమీసాలూ— గడ్డమూ ఉన్న మనిషి ఎవరో నామంచం ప్రక్కనిలచి మీదికివంగి, నుదుటిమీద ముద్దు పెట్టు కున్నాడు. ముళ్లకంపలావున్న అతని బిరుసుగడ్డం కనురెప్పలకి తగిలి కిచకిచలు పెట్టింది.

చేయిలేని చొక్కాచేతిని బట్టి ఆగడ్డం మనిషిని గుర్తుపట్టేను.

నేను లేవగానే అన్నయ్య నన్ను కాగలించుకొని ఏడ్చేడు.

ఆతనివయస్సయినా ఆతనిలో సంకోచాన్ని ప్రేరేపించలేదు. కొద్ది సేపటికి తేరుకొని పిడికిలిబిగించి- "ఓరి! కటికపీనుగుల్లారా!"- అని అర్చేడు.

అటుతరువాత అన్నయ్యనన్ను గుండెలకి అదుముకొని, వీధి లోకి తీసుకుపోయేడు. దారిపొడుగునా ఆతని కన్నీళ్ళు నాతలని తడుపుతూనే వున్నాయి.

మేము వీధిలోకి పోయేటప్పటికే 'పందులదొడ్డి' ప్రజలంతా పండుగదుస్తులతో 'అగనెస్సోవు' మందిరంకేసిపరుగెత్తిపోతూన్నారు.

మేము అక్కడికి వెళ్లేటప్పటికి బోసిగార్ఫజు మెట్లమీద నిల బడి ఉద్రేకంతో ఉపన్యసించుతూన్నాడు.

ఈవేళ ఏంవారం? ఆదివారమా!- లేక, ఏదయినా పండుగ రోజా? అల్లాఅయితే వీళ్లంతా తాగి తిట్టుకుంటూ- కొట్టుకుంటూ- గుద్దుకొనడంలేదే! బొగ్గుకూలీలూ- మిల్లుకూలీలూ- కర్రలూ- కత్తులూపుచ్చుకొని కొట్టుకొనకుండదానికి కారణంఏమో?

అనేకస్వరాలలో అనేకధ్వనులు వినుపిస్తున్నాయి.

"విప్లవం వర్ధిల్లాలి."

"జారుప్రభుత్వం నశించాలి."

"దేవుడికి వందనాలు."

"ఇంకముందయినా జీవితం సుఖంగా వుంటుంది."

'పందులదొడ్డి' ప్రజలు 'అగనెస్సోవు'మందిరంముందు ఎవరి కోసమో ఎదురుచూస్తూ నిలబడ్డారు.

మాఅన్నయ్య వస్తూంటే జనం దారి ఇచ్చేరు. ఆతడు సరాసరి మెట్లమీదికివచ్చి నన్ను భుజానికి ఎత్తుకొని, ప్రజలకి చూపుతూ ఉపన్యాసం అందుకున్నాడు.

"కామ్రేడ్స్!

ఈకుర్రాడికేసి చూడండి! ప్రజలమొగాలకేసి చూడడానికికూడా ఏలాగ బిడియపడుతూన్నాడో. నవ్వు అంటే ఏలావుంటుందో కూడా వాడెరగడు. వీడు మరెవ్వరోకాదు. నాతమ్ముడు: నాతమ్ము డొక్కడే ఈలాగ వున్నాడా? లేదు. మనపిల్లలలో ఎవ్వడూ ఇంతకంటె చెప్పుకోదగ్గ అవస్థలోలేరు. మనయింటి ఆడవడుచులు మగవాళ్ళు అంతా ఇదేమాదిరి. ఆఖరికి మనమాట ఆలోచించుకొని చూడండి. మనలనందరినీ ఈలాగ తయారుచేసినవాళ్లెవ్వరు? మన హృదయాలలోని ఆనందాన్ని– ఉత్సాహాన్ని ఇంకించివేసినది ఎవ్వరు? మనలని ఈగతికి తీసుకువచ్చినది ఎవరు?"

అన్నయ్య నన్ను నేలకి దింపి ఒకప్రక్కకి తప్పుకున్నాడు. వెనువెంటనే గార్ఫజు ఆచోటును ఆక్రమించేడు.

ఉద్రేకంచేత కాళ్ళు వొణికిపోతూంటే ఆతడు మునిగాళ్ళ మీదికి లేచి తనఉపన్యాసం ఆరంభించేడు.

"కామ్రేడ్స్! మనజీవితాలని ధ్వంసంచేసిన రాక్షసులమీద కసి తీర్చుకుందాం. వాళ్లగొంతుకలు నులిమివేసేద్దాం."

గార్ఫజు 'వందులదొడ్డి' ప్రజలనుగూర్చీ, వారిబాధల్నిగురించీ, ఉపన్యాసం సాగించేడు. వారి హృదయాలు పరిశీలించి, వారి

భావాలు గ్రహించి, వారి మనస్సులకి పట్టేలాగ ఉపన్యాసం చేస్తున్నాడు. ప్రజలరక్తం ఉడుకెత్తిపోతూంది. ఆతనిఉపన్యాసం ఇంకా పూర్తికాకుండానే ఆవేశంపట్టలేక గనికూలీ 'కోవల్' ఒక కంకరరాయితీసి అగనెస్సోవ్షుమందిరపు కిటికీతలుపులమీద కొట్టేడు.

కోవల్ తనరక్తంఅంతా ధారపోసి సంపాదించినధనంఅంతా అక్కడనే పూడ్చివేయబడింది. ఆతనిభార్య అగనెస్సోవ్షుమూలం గానే వ్యభిచారిణి అయిపోయింది. ఆతనిబిడ్డలు భిక్షుకులయ్యేరు.

"బద్దలుకొట్టేసెయ్యి! ఈపాపిష్ఠికొంపలో పేరుకయినా ఒక్క రాయి మిగల్చకు. కానీ............కోవల్........"

"............చూడు! వాళ్ళంతా నీసహాయానికి వస్తున్నారు. నీభార్య స్వయంగా చేతులతోటీ తలతోటీతలుపులు పగలకొట్టడానికి ప్రయత్నిస్తూంది. ఈపాపిష్ఠికొంప దిబ్బదేర్చమని పిలుస్తూంది. కోవల్!........కానీ........కానీ........"

నల్లగా తారులావున్న ఒకకమ్మరి, ఒకగూని మిల్లుకూలీ కలిసి తలుపులు విడగొట్టేరు. కట్టతెగిన ప్రవాహంలా జనం లోపలికి చొరబడింది. బీరువాలలో అమర్చిన బీరుసీసాలు భళ్ళా–భళ్ళా నేలబెట్టికొట్టేరు. సారాపీపాలు బద్దలుకొట్టివేస్తే గదులన్నీ మడుగులు కట్టేయి. ఇంతలో ఎవరో అగ్గిపుల్ల గీసేరు. ఒక పెణకని మంటలేచింది. మరుక్షణంలో అగనెస్సోవ్ ఆస్తి మంటల మధ్య చిక్కుకుంది. దానిలోనుంచి ఒకనిప్పుతుట్టలేచి 'పందుల దొడ్డి' కొంపలమీదపడింది.

గార్బజ్ మంటలకి దూరంగా నిలబడి ప్రజలందరినీ కేక వేసేడు. గబగబాచేయితిప్పుతూ— "మీ రాపెద్దపెద్ద హవేలీలు చూసేరా? కామ్రేడ్స్! మనమేకట్టేము వాటిని. మనం రక్తంవోడ్చి శ్రమపడితేనే అవితయారయ్యేయి. అవిమనవే. రాండి" —అంటూ దారితీసేడు.

దూరాన ఫిబ్రవరిసూర్యుని లేతయెండలో మిలమిలలాడుతూ కనిపిస్తూన్న కోసక్కుసిపాయిల ఈటెలు చూచినాకకూడా కూలీలు భయపడలేదు. కోమా ముందు నడుస్తూంటే జనం అంతా పెద్ద పెదకేకలు పెట్టుకుంటూ నడుస్తూన్నారు.

దూరాన తుపాకులు పేలేయి. మొదటిదెబ్బకే మాఅన్నయ నాకళ్లముందర కుప్పకూలిపోయేడు. నేను హడిలిపోయి నాకాళ్లు తీసుకొనిపోయినవైపునకల్లా పరుగెత్తేను. కాలిపోతూన్న పందుల దొడ్డిలో నిలపబడడానికి మనస్కరించలేదు.

నావిషయం మళ్లీఎవరూ కనుక్కోనూలేదు.

ఇంక నేనే ఆజనసంఘంలోపడి గార్బజుని వెదకడం అరంభించేను. ఇంక ఇప్పుడు మిగిలిన ఆత్మబంధువుడు అతడొక్కడే కాదూ?

పదమూడో....

ప్రకరణం.

ఆరోజులలో రైలుస్టేషనులు యుద్ధాలనుంచి పారిపోయివచ్చినవారితోటీ, యుద్ధాలకిపోతూన్నవారితోటీ, నిండియుండేవి. యుద్ధం పేరుచెప్పి దేశాన్నంతనీ దోచుకుంటూన్న వర్తకులుకొనితెచ్చిన పదార్థాలతో రైలుపెట్టెలు, స్టేషన్లు, నిండియుండేవి. ఈమధ్యకొద్ది నెలలనుంచి, నేనుస్టేషనులలోనే మకాంచేస్తూన్నాను. అక్కడికి వచ్చే యాత్రికుల్ని అడుక్కొనితిని, కడుపునింపుకుంటూన్నాను. ఒకరోజున ఏమీదొరకలేదు. ఆరాత్రి తిండిలేదు. ఆకలికి కడుపు కాలిపోతూంది. స్టేషనునిండా తినబండపదార్థాలే. కళ్ళు కుట్టేయి. నేను నెమ్మదిగా ఒకవర్తకుడి వెనక్కాలనే ఒకవేగను దగ్గిరికి చేరుకున్నాను.

కొంచెంసేపటికి వర్తకుడు కళ్లుమూసుకున్నాడు. నిద్రపట్టింది. నేను నెమ్మదిగా ఒకబస్తాకి బొర్రిపెట్టి క్రింద జేబుపెట్టేను. పచ్చ జొన్నలు బంగారపుగోళీలకి వలెనే జేబులో కురుస్తూన్నాయి. ఆచప్పుడువలన షాహుకారుకి తెలివివచ్చింది. జరుగుతూన్న సంగతి వెంటనేగ్రహించి గభీమని రెక్క దొరకపుచ్చుకొని కొడుతూ పక్కవాళ్ళనికూడా సాయం పిలిచేడు. పదిమందీ పోగు పడ్డారు. పదిచేతుల్తూ కలిసేయి. పిడికిలిపోట్లతో నాఒళ్ళంతా ముద్ద

ముద్దగా నలగకొట్టేసేరు. మొదటివిసురుకే నాకు స్మృతి తప్పింది. వాళ్లు అతివేగంగా గుద్దుతూన్నారు. ఇంకెప్పుడూ జొన్నలు ముట్టు కొననసీ, ఆఖరికి జొన్నలు తినసైనా తిననసీ ప్రార్థించినా, వినిపించుకుందుకు వేళలేదాయె. నేను మూర్ఛపోయేను.

ఆవర్తకులు నాశరీరాన్ని రైలుబద్దెలమీద పారవేయడానికి భయపడి, అక్కడికి కొంచెందూరంలో వున్న దూలగొండిచెట్లలోకి ఈడ్చిపారేసేరు.

నేను చచ్చిపోయేననే వాళ్లయూహ. కాని, అది వట్టిపొరపాటు. కొద్దిగా తెలివివచ్చినాక ఆచెట్లలోనుంచి దొర్లి ఇంకోమూలకిపోయి ఒకపెద్దమూలుగు మూలిగేను. దానితోనే 'వింగ్సు'తో ప్రథమపర్యాయం పరిచయం కలిసింది.

ఆరోజున 'వింగ్స్' మాంచి అందంగానూ– బరువుగానూ, వున్న ఒకస్యూట్‌కేసును ఎత్తుకువచ్చి స్టేషనుకు దగ్గరగావున్న ఈదూలగొండిచెట్లలో కూర్చుండి పగులకొట్టడానికి ప్రయత్నించుతూన్నాడు. అంతలో నామూలుగువినబడింది. దానితో పెట్టె ఎవ్వరికీ కనపడకుండా ఆకుగుబురులలో దాచేసి, తాళంతీయడానికి తెచ్చిన ఊచ జేబులో పెట్టేసుకొని, అటూ–ఇటూచెట్లలో వెదికి నాకేసివచ్చేడు.

నాకు ఒంటిమీద బాగాస్మృతిలేదు. నల్లనిగడ్డంతోయున్న ఒక ముఖం నామీదికి వొంగినట్లూ, ఒకచేతితో తలకాయ ఎత్తిపట్టుకొని రెండోచేతితో ఏదోగాని మూతికి ఆనించినట్లూ,చూచాయగా జ్ఞాపకం

కం వుంది. తరువాత ఆతడు నన్ను తనగదికి తీసుకొనివచ్చేడు. గాయాలకి-పట్టీలు వేసేడు. తిండి తినలేకపోవడంచేత పాలు. పోసి పోషించేడు కముకుదెబ్బలకి పిండికట్లు తరుచుగా మార్చి మార్చి కట్టుతూవుండేవాడు. తీరుబడిచిక్కినప్పుడెల్లా నాప్రక్కన నన్ను కనిపెట్టుకొని కూర్చుండేవాడు.

అతనితో ఆగదిలో నాయీడువాడే ఇంకో కుర్రాడున్నాడు. వాడిపేరు 'మూన్.' 'మూన్' ఎందుకోగాని నాకేసి కొరకొరా చూసేడు. శరీరాన్ని గుచ్చిపోయేటట్లుగావున్న ఆచూపులకి భయపడి నేను ఆపెద్దవానికేసి చేయిచాపేను. 'వింగ్స్' నాఅరచేతిని తనరెండుచేతులతోటీ ఎంతో ప్రేమతో నొక్కిపెట్టి —"నీవు ఎవరివి?.... ఎక్కడినుంచివచ్చేవు?"—అన్నాడు.

నేను నెమ్మదిగా కళ్ళుమూసుకొని వుండే నికనేరుతాత కథ ప్రారంభించి 'పందులదొడ్డి'కాపురగాథనంతనీ ఏకరువు పెట్టేను.

అంతా విన్నాడు.

"సరే! నీకేమీ ఫరవాలేదు. త్వరగానే లేచి తిరగగలవు. నీకు బాగా ఆరోగ్యంచిక్కేక ఒకపనికూడా ఇస్తానులే!"

'వింగ్స్' వెళ్ళిపోయేడు. నేనూ 'మూనూ' మాత్రమే ఆగదిలో వుండిపోయేం. 'వింగ్స్' వెళ్ళిపోయేక ఆకుర్రాడు నాప్రక్కలో వచ్చికూర్చుండి ఎంతో ప్రేమతో పలకరించేడు. ఆతని కంఠస్వరం ఎంతో మృదువుగా వుంది. మొదట్లో ఆతడిని చూచినప్పుడు అంత మృదువుగా మాటలాడగలుగుతాడనికూడా ఊహించలేదు.

"నీ కెన్నో ఏడు?"

"పదకొండు".— అన్నాను.

"నాకూ అంతే ననుకుంటాను. అప్పుడే ఏడాది కావస్తోంది వింగ్సు దగ్గిరికి వచ్చి."

"వింగ్సెవరు?"

నాయీప్రశ్నతో ఆకుర్రాడు ఎంతో అనుమాన పడ్డాడు. అతని చూపులలో వెనుకటితీక్ష్ణత మళ్ళీ వచ్చింది.

—'వింగ్స్' తెలియదూ? ఇప్పుడేకాదూ వీధిలోకి వెళ్లేడు!— అనల్లటివాడే."

తరువాత కొద్దిసేపటికి అతడు నామీదికి వొంగిచెవిలో రహస్యం మాటలాడసాగేడు.

"మేము చేతిదెబ్బలుకొట్టి బ్రదుకుతూన్నాం. తెలుసునా? ఇంత వరకు ఒక్కమారుకూడా పట్టుబడలేదు. 'వింగ్సు'నీకా విద్యనేర్పు తాడు. చాలామంచివాడు."

నేను ఎప్పుడు లేస్తానా— ఎప్పుడావిద్య నేర్చుకుంటానాయని 'వింగ్సు' కలవరించిపోతూన్నాడు. కొద్దివారాలక్రితమే ఆవృత్తిలో మంచినేర్పుగడించిన శిష్యుడొకడు అతడిని వదిలిపోయేడు. ఆస్థానానికి మళ్లీ ఎవరినో ఒకరిని తయారుచేసుకోవాలి.

నేను అప్పుడప్పుడే 'విద్దే'లు చేస్తూన్నాను. గదిలో తిరగడానికి ఓపికవచ్చింది.

ఒకరోజున 'వింగ్స్' పెద్దసీసాతో నిండుగా దొంగసారాయినీ,

దోసకాయఊరగాయ, పక్కగొడుగులవరుగు, రెండుజేబులకీ నిండుగా గోధుమపిండీ, తీసుకొనివచ్చేడు.

"ఈవేళరాత్రి ముహూర్తం బాగుంది. ఈతడిని తీసుకుపోదాం!"

'వింగ్స్' గ్లాసునిండుగా సారాయిపోసి గడగడా త్రాగేసేడు. 'మూన్' కొంచమేత్రాగేడు. వెంటనే వోయిపడుకున్నాడు. యజమాని నన్ను పిలిచేడు.

"త్రాగడం నేర్చుకో. మరేమీఫరవాలేదు. కొద్దిరోజులలోనే అలవాటు అవుతుందిలే."

'వింగ్స్' సారానింపిన గ్లాసుచేతికిచ్చి రెండుభుజాలమీదా చేతులువేసి చెవిలో—"ఏమోయి! అబ్బాయి! నిన్ను బలేమొనగాడివిలా తయారుచేస్తాను. చూసుకో. లేకుంటే నన్ను మారుపేరు పెట్టిపిలు. కొద్దిరోజులలో 'రేచుక్క—పగటిచుక్కల్ని' మించేలాగ తయారవుతావు—" అన్నాడు.

'వింగ్సు' గడ్డం నిమురుకుంటూ మళ్లీ గ్లాసు ఖాళీచేసేడు. తరువాత కిటికీలవద్దకిపోయి తెరలెత్తేడు. కిటికీల అద్దాలు నల్లగా జిడ్డుట్టడుతూవున్నాయి.

"ఇంక పోదామా మరి?"

'మూన్' చేతికొక సంచీతగిలించుకొని, లేచి, నిలువబడ్డాడు. 'వింగ్స్' పంట్లాములో ఒకఇనుపఊచ దాచుకొని, బయలుదేరేడు.

వీధులన్నీ నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా వున్నాయి. అక్కడా అక్కడా ఒక్కొక్క ఇంటిఅవరణలో కుక్కలు మొరుగుతూ

న్నాయి. 'వింగ్స్' పంట్లాముబొత్తానికి తగిలినప్పుడల్లా ఊస 'క్లింగ్—క్లింగ్'— మంటూంది. 'మూణ' భుజాలు కుదించుకొని ముందు నడుస్తూన్నాడు. 'వింగ్స్' పెద్దపెద్దఅంగలు వేసుకుంటూ నడుస్తూంటే ఆతనిఅడుగులలో అడుగులు వేసుకుంటూ, నేను నడుస్తూన్నాను.

కొంతదూరం వెళ్లేక 'వింగ్స్' నాభుజాల్ని పట్టుకొని చెవిలో— "భయపడకు.పదినిముషాలపని.త్వరలోనే ఇంటికి వచ్చివేద్దాంలే."— అన్నాడు.

నాపెదవులు వణుకుతూన్నాయి. బహుశా ఆవణుకు అతితీవ్రంగా విసురుతూన్న చలిగాలిబాధచేతనే అయివుంటుంది. కొంచెం వేగంగా నడుస్తే చలిఅయినా తగ్గుతుందని నడకజోరుచేసేను.

ఇనుపఊచలతో ఆవరణకట్టబడిన ఒకచిన్నఇంటిదగ్గిరికి వచ్చి మేము నిలబడ్డాము. 'వింగ్స్' ఒకమారు అటూ—యిటూ పరకాయించిచూచి, కటకటాలమీదికి ఎక్కి-పోయి, నాకు ఎక్కడంలో సహాయం చేసేడు. నేను ఆవలివైపుకి దిగేలోపుగానే 'మూన్' తనంతతానే లోపలికి వచ్చేసేడు. దిగుతూనే వడివడిగా గుమ్మం దాకా వెళ్లి మెడసాచి ఏదో వినడానికి ప్రయత్నించేడు.

ముగ్గురం ఇంటిచుట్టూ ఎన్నోమారులు తిరిగి లోపలికి ప్రవేశించడానికి అనువయినచోటు వున్నదేమోనని చూచేము. ఊపిరి కూడా గట్టిగా పీల్చుకుందుకు భయపడుతూ కిటికీలక్రింద నిలబడి జాగ్రత్తగా పరీక్షించేము. ఏమాత్రపు అలికిడిఅయినా నేలమీద

బోర్లగిలా పడుకునేవాళ్లం. చాలాసేపుచూచేక అక్కడయింక ఎవ్వరూ లేరని నిర్ధారణచేసుకొని, 'వింగ్స్' మొలలోనుంచి ఊచ తీసి ద్వారంవైపుకి వెళ్లేడు.

కొద్దిసేపటికి ఏదో 'ఖట్'మనిచప్పుడు. ఘల్లన గాజుముక్కలు క్రిందబడినట్లు చప్పుడు. నేను ఠకీమని నేలమీద కూర్చుండిపోయేను. నాతల తిరిగిపోతూంది. ఇంతలోగడ్డంవాడు నామొగంమీదికివొంగి- 'హుష్' అన్నాడు. నేను చురుకుగా లేనని వారిద్దరూ తిట్టడం ఆరంభించేరు. వెంటనే పని ప్రారంభించమని ఒత్తిడిచేసేరు.....నేను 'వింగ్స్' భుజంమీదికి ఎక్కేను. ఆతడు నన్ను తెరచివున్న ఒక కిటికీదగ్గిరికి తీసుకొనిపోయి, నన్ను పైకిఎత్తేడు. ఇంటిలోనుంచి వెచ్చనిగాలి, వెన్నబిస్కట్ల కమ్మనివాసనల్ని మోసుకొనివస్తూంది. నేను కిటికీవైపుకి చేయిచాపేను. 'వింగ్స్' నాపక్కలుపట్టుకొని, ఒకకొత్తయింట్లోకి దింపేడు.

ఆవిధంగా నానూతనజీవితం ఆరంభంఅయింది.

పదునాలుగో...

ప్రకరణం.

'వింగ్స్'కి అవి అదృష్టపు రోజులు. అతడు తాను దొంగతనాలు చేసుకుంటూ బ్రదకడం ఆరంభించిన ఆయిరవై ఏండ్లలోనూ సుఖపడ్డరోజులు ఏవయినా ఉన్నాయంటే అప్పుడే.

అతని చూపులలో దీనత్వంలేదిప్పుడు. అతనిస్వరం ఎంతో ఉత్సాహకరంగానూ, మృదువుగానూ, వుంటూంది.

ఎప్పుడో అత్యవసరమైన పనిపడ్డప్పుడుగాని, ఆతడు ఇల్లువదిలిపోవడమేలేదు. పోవలసిన పనికూడాలేదు. వృత్తిపనినంతనీ నామీదా, 'మూణ్' మీదావదిలిపెట్టి విశ్రాంతగా సీసాదగ్గరపెట్టుకొని కూర్చుంటున్నాడు.

మూనూ—వేమూ స్నేహితులం అయినాము. మావృత్తికి సహజంగావుండే అపాయాలు మాఇద్దరిమధ్యనూ స్నేహం బాగా బలపడడానికే తోడ్పడ్డాయి. ప్రతిరోజూ సాయంకాలం పూట షికారుకి బయలుదేరినట్లు 'వేటకి'బయలుదేరే వాళ్ళం. ఏయింటికి తాళాలు వేయబడియున్నాయో ఆఇళ్ళలోకి ఏమూలనుంచి దూరాలో, పరీక్షించుకుంటూ తిరిగేవాళ్లం. ఇప్పుడు 'మూన్' ఊచతీసుకుంటూన్నాడు. నేను సంచీ పుచ్చుకుంటున్నాను. ఇద్దరం సందులూ—గొందులూ తిరిగి, గోడలూ—కటకటాలూదాటి, సాయంకాలమే చూసుకొనివున్న ఇంటిదగ్గిరికి చేరేవాళ్లం.'మూన్' తాళంకప్ప చేతితో తడిమి,

ఊచదోపేవాడు. ఒక్కొక్కప్పుడు తాళంతీయడానికి మేమిద్దరమూ తంటాలుపడవలసివచ్చేది. ఒకటిరెండునిముషాలశ్రమ. 'క్లిక్'-మని చప్పుడు.

'మూణ' ఊసతీసివేసి జేబులో దాచుకొనేవాడు. నేను తలుపులుతీసి లోపలికి ప్రవేశించేక అతడక్కడనే నిలబడి కాపలా కాచేవాడు. తుప్పుపట్టిన తలుపుగ్రంథులు ఏవయినా 'కిర్రు'మన్నాయీ నాప్రాణాలు కడముట్టేవి. వీధితలుపు-పైగా వీధివైపునకున్న కిటికీ ఒకటి తప్పకుండా తెరచివుంచేవాడిని. ఏదయినా చేయిదాటివచ్చే పరిస్థితులువస్తే పారిపోవడానికి దారివుండవద్దూ!

ముందుగా మేడమీదనుంచి మోయడానికి వీలుగావుండే సామానంతా తరలించేవాడిని. చిలుకకొయ్యలనున్నకోట్లు-స్యూట్లు, పూర్తిగా మూటకట్టేసి ఆబరువుకి భుజాలు కృంగిపోతూంటే ఈడ్చుకుపోయేవాళ్ళం.

సిల్కుబట్టలు దొరికినప్పుడు వాటినుంచి వెలువడే మృదువయిన పరిమళానికి ఒళ్ళు పరవశమైపోయేది. అలాగంటిసమయాలలో కళ్ళుమూసుకొని ఒకచోట కూర్చుండిపోవాలనిపించేది.

....కాని, కూర్చుందుకు వీలా? ఇక్కడ ఆలస్యంచేస్తే ఎవరయినా రావచ్చు. పైగా, ఇంటిదగ్గర వింగ్సూ-ఆదొంగబేరగాడూ కనిపెట్టుకు కూర్చుంటారు!

సరుకు అమ్మగా వచ్చిన డబ్బును 'వింగ్సు' జేబులో వేసుకొనేవాడు.

రోజూ పెద్దసీసాడు సారాయీ, కొంచెం 'కోకెయినూ' తెచ్చేవాడు. గ్లాసుతరవాత గ్లాసుఖాళీఅయిపోయేవి. 'కొకెయిన్'పీలుస్తూ 'వింగ్స్'అట్టహాసం చేసేవాడు. నన్ను కాగలించుకొని,—ఇంతవరకు నీవంటి గజదొంగని చూడలేదు"—అనేవాడు. ఒక్కొక్కప్పుడు ఆఆవేశంలో నన్ను ముద్దుపెట్టుకొనేవాడుకూడాను.

'వింగ్స్' త్రాగడం పూర్తిఅయినాక అమిగిలినది గ్లాసులో వంచుకొనేవాడిని. ఆచల్లని అగ్నిజ్వాల కడుపులోకిపోయి మంట పుట్టించేది.

ఒకరోజున 'మూనూ'—నేనూ కూడబలుకుకొని జబ్బువచ్చినట్లు నటించాలని నిశ్చయించేము. వెంటనే ఇద్దరం పెద్దకంబళీ ఒకటి కప్పుకొని, వణకడం అరంభించేము. మొదటనావుద్దేశ్యం వట్టినటనచేయాలనే. కాని, త్వరలోనే నేనింతవరకు చేసినది నటన కాదనీ, నిజంగానే జ్వరం వచ్చిందనీ, గ్రహించగలిగేను. నిద్ర పట్టింది.

కొంచెం తెలివివచ్చేక ప్రక్కనున్న స్నేహితుడివంక ఎన్నడూ చూడనట్లు చూడసాగేను....మిటమిటలాడుతూన్న నూనె దీపం వెలుగులో అతనిగుడ్డలమీదిచిరుగులు నల్లగా కనిపిస్తూన్నాయి. జుట్టు దట్టంగా- ఎర్రగావుంది. దానికి నూనె వ్రాసినా ఒకటే. రంగుపూసిన గొర్రెచర్మంటోపీ తగిలించినా ఒకటే. ఆ జుట్టురంగు మారదనే నానమ్మకం ఆజుట్టు బంగారుతీగెలమాదిరిగా నుదుటిమీదుగా— బుగ్గలమీదికి పాకి మెడపట్టీలో ప్రవేశిస్తూంది.

"మీది ఏవూరు?"

నులివెచ్చని మోకాళ్లతో నాపక్కలుపొడుస్తూ, 'మూన్'—'పందులదొడ్డి' అన్నాడు.

"పందులదొడ్డా?— నిన్నెప్పుడూ 'బుద్ధగుంట' వీధులలో చూడ లేదేమరి."

"మీ 'పందులదొడ్డి' వేరు. మేమున్నది వేరు. మాదానికి యజ మాని 'హగ్సు.' 'హగనెస్సోక' అనేపేరు విన్నావా? అదేమా వూరు. నాన్న గనిలోకూలీ. అమ్మ చెడత్రాగి వీధులన్నీ తిరిగితిరిగి వచ్చి నన్ను చచ్చేలాగ బాదేది. దెబ్బకొట్టిందా ఎప్పుడూ కంటికేసే చేయివిసిరేది...,ఒకరోజున నాన్నతో చెప్పేను.— బహుశా ఆతడు ఆమెఅంటే హడిలిపోయేవాడనుకుంటాను. చాలా మంచివాడులే.— నన్ను ఊరుకోపెట్టి "ఈమాటు ఆరాక్షసిముండ చేయిచేసు కుంటే చంపేసేద్దువుగాని"— అన్నాడు. మర్నాదే ఆపని జరిగి పోయింది. నేలమాళిగ తలుపుతీసి అట్టేపెట్టి ఆమెతాగిరాగానే దాం ట్లోకి నెట్టేసి తలుపుబిగించేను. సాయంకాలందాకా ఆతలుపుకేసి పోలేదు. నాన్న రాగానే జరిగినసంగతి అంతా చెప్పేను. ఆతడు— 'అయ్యో!'అనికూడా అనలేదు. తిన్నగావెళ్లి తలుపుతీసేడు. లోపల చడీ-చప్పుడూలేదు. వెంటనే నన్నుకిందపడతోసి చావకొట్టి తన్నేడు........

'మూన్' ఒక్కనిముషం ఊరుకున్నాడు.

"........ఆరోజుననే మాయిల్లు వదిలేసి వీధిన బడ్డాను. మళ్లీ

ఇంతవరకు ఆగడప తొక్కి చూడ్డలేదు........"

'మూన్' ఏదో చెప్పబోయి మళ్లీ ఊరుకున్నాడు. బీటలువారిన పెదవులు తడుపుకుంటూ దీపంకేసి ఆకలికక్కే కళ్ళతో చూసేడు.

కంటికి కనబడని చేయిఒకటి కిటికీలమీద చీకటితెరని కప్పింది. దూరాన కుక్కలు మొరుగుతూన్నాయి. ఎక్కడినుంచో సన్ననిపాట వినుపిస్తూంది.

దీపం కొడిగట్టి రెండుమారులు 'యుప్—యుప్' మని ఆరిపోయింది. 'మూణ' సూక్ష్మంలో తనకథని ముగించివేసేడు.

"........మానాన్నని మరచిపోకుండా జ్ఞాపకం వుంచుకొనేందుకై అతడు నాకిచ్చినదల్లా ఇది ఒక్కటే........"

అతడు నాచేయి పట్టుకొని తనకాలిమీద రుద్దేడు. పెద్దపెద్ద గాయాలు మానిన నున్నని మచ్చలు చేతికి తగిలేయి.

"........అతడే ఈగాయాలు కొట్టేడు."

వదిలిపెడితే నాచేయి మళ్లీ దొరకదేమోనన్నట్లు 'మూణ' తనరెండుచేతులతోటీ పట్టుకొని వదిలేడుకాదు.

"నీపేరేమిటి అన్నావు? సోన్యా—కాదు? నేను నిన్ను 'జోగీ' అనిపిలుస్తాను. ఎందుకో తెలుసా? నీకళ్ళు బొమ్మలలో వుండే యోగుల కండ్లమాదిరిగావుంటాయి."

## పదిహేనో

## ప్రకరణం.

అగ్రికువాడిని పట్టుకోవడం ఒకఫట్టాన సాధ్యపడేదికాదు. వాడు 'మూన్'కే చిక్కేడుకాదు. ఇంచుమించుగా నన్నూ బోల్తా కొట్టించియుండేవాడే. నోట్లతో పిటపిటలాడుతూ పందికొక్కులా వున్న మనీపర్సుతో, ఒక్కఅరక్షణం కన్నుమూస్తే ఎగిరిపోయి వుండేవాడు. అలాగేజరిగితే వురిపెట్టుకు చావడమేగాని వేరేమయినా వుందా? నిజంగా తలయెత్తుకొని తిరగలేకపోయేవాడిని.

మొట్టమొదట ఆతడు 'రోస్టోపు' మార్కెట్టులో వెండి- బంగారాలు బేరం ఆడుతూ మాకంటపడ్డాడు. మేము ముగ్గురమూ కూరలదుకాణాలదగ్గిర విలబడి వోరకంట ఆతనిని కనిపెడుతూ వున్నాం. అరూపాయలసంచీ చూచినాక 'మూన్'కి క్రిందూ-మీదూ తెలియడంలేదు.

"అగ్రికువాడి వ్యవహారం చక్కపెట్టకపోతే నేను పట్టిచవటనే"— అంటూ 'మూన్' తొందచరిచేడు.

'వింగ్స్' చిరునవ్వుతో- "జాగ్రత్త! ఆడబ్బంతా తీసుకొని 'మూన్' పారిపోతాడేమో చూస్తూండు"—అంటూ చెవిలో ఊదేడు.

నేనేమీ మాటలాడలేదు. మాటలాడడానికిమాత్రం ఏముంది? నేను ఆతడికి పూర్తిగా లొంగిపోయేను.

మేమిద్దరమూ ఆకలీ– దప్పికూడా మరిచి వాడివెంటబడ్డాం. 'మూన్' శుభ్రంగా నీళ్ళు పోసుకొని, తెల్లనిగుడ్డలు వేసుకొని బయలుదేరేడు. కొంచెం పొడుగుగావుండే ఊచఒకటి బట్టలలో దాచుకొన్నాడు. 'ఆస్పిరియన్ బూట్ బ్లాక్'తో మెరుగుపెట్టిన బూట్లు తొడిగి అతిఠీవిగా గ్రీకువాడున్నచోటికిచేరి తనలో తానే నవ్వుకున్నాడు.

ఆగ్రీకువాడు దేవాంతకుడు. పదిమందీ నిలబడినచోట అసలు నిలబడితేకాదు. ఇద్దరుముగ్గురు దగ్గరగా వచ్చేరంటే తాను దూరంగా ఎవ్వరూ లేనిచోటికిపోయి నిలబడి ఓ గంట చుట్టూజనాన్ని కనిపెడుతూవుండేవాడు.

అతనివెంట వదలకుండదానికి 'మూన్' ఎన్నోప్రయత్నాలుచేసేడు. అగ్గిపెట్టెలు అమ్మతానంటూ వెళ్లి సగంఖరీదుకే వాడికి అగ్గిపెట్టెలు ఇచ్చేడు. మరొకవేషంలో బూట్లకురంగువేస్తానంటూ దరిచేరి కాలుస్తూకాలుస్తూన్న సిగరెట్టుపీకెకే బూట్లు తుడిచి రంగు వేసియిచ్చేడు. కాని 'మూన్' దగ్గరవుండగా వీడు ఎన్నిప్రయత్నాలు చేసినా ఆగ్రీకువాడు ఒక్కమారూ 'పర్సు' పైకితీయనేలేదు.

యాదృచ్ఛికంగా గ్రీకువాడు ఒకమారు 'మూన్'కళ్ళలోనికి చూచి, వానిలోని వింతవెలుగును గమనించి అదిరిపడ్డాడు. ఆక్షణం మొదలుకొని అతడు ఎంతోభయంతోటీ– అసహ్యంతోటీ 'మూన్' యొక్క పోకడలనన్నింటినీ గమనిస్తూవచ్చేడు.

ఎలకని పట్టడానికి పొంచివున్న పిల్లిలాగ 'మూన్' ఆగ్రీకు

వాడి వెనక్కాలే వొదిగివొదిగి తిరుగుతూండేవాడు.

ఒకమారు గ్రీకువాడు పర్సు పైకితీసేడు. 'మూన్' నెమ్మదిగా అడుగులువేస్తూ మాటువదిలేడు. కాని, రోడ్డుచప్టామీద బూటు నాడాలు టక్కుమన్నాయి. వెంటనే గ్రీకువాడు గతుక్కుమని 'పర్సు' జేబులోవేసుకొని వెనుదిరిగిచూసేడు.

తాను బయటపడిపోవడంతోనే 'మూణ్' తనప్రయత్నాలు వదులుకొనక తీరిందికాదు. ఆతడు తనవృత్తిలో పొందిన మొదటి పరాభవంఅదే.

'మూణ్' ఓడిపోయినందులకై విచారించడానికి బదులు నేను చాలాసంతోషించేను. మేమిద్దరం ఒకే వృత్తిలో వున్నా, ఇంత కాలంనుంచీ కలసిమెలసి వుంటూవున్నా, ఆఅసూయ తప్పిందికాదు.

'మూన్'కీ నాకూ చాలాస్నేహమే వుంది. రోస్టోవుబజారులో రొట్టెలు అమ్ముకొనే ఆడవాళ్ళవద్దనుంచి మేము ఎన్నిరొట్టెలు కొట్టేసేమో లెక్కలేదు. ఆమధ్య కాకేషియాలోవున్న నెలదినాలూ ఒక్కఏగానికూడా ఈయకుండా కేవలం ద్రాక్షపళ్ళు తింటూ గడి పేము. 'టాగెణారాగ్' నగరంలో స్టేషనువీధిలోయున్న ఒకపెద్ద దుకాణాన్ని మేమిద్దరమూ కలిసే దోచుకున్నాం.

పురుగులుపుచ్చిన ఆజైలుఖానాలోకూడా మేము ఇద్దరం కలిసే వుండేవాళ్ళం.నిజం ఆలోచిస్తే మాఇద్దరికీ మంచిస్నేహం కుదిరింది.

కాని, నాకుకలిగిన ఈఅసూయకి కారణం 'గజదొంగ'అనే బిరుదు ఆతనికి ఒక్కడికే దక్కిపోయిందే అనితప్ప వేరుకాదు.

లోకంఅంతా 'గేలపు'పద్ధతిని కనిపెట్టినవారు 'మూన్' అనుకుంటు న్నారు. ఎవ్వరికీ 'వింగ్స్'దృష్టేలేదు. అతడుమానాయకుడు.

రాస్టోవు- బటియాస్కురై బుమార్గం పొడుగునా పెద్దపెద్ద వరకాలు, కయ్యలు, కాలువలు, ఉన్నాయి. ఆగోతులు అలాగ 'డాన్'నదిగట్టుకంటా వ్యాపించియున్నాయి.

ఆరోజున చాలా చీకటిగావుంది. ఒకపొడుగుపాటితాడు చేత పట్టుకొని, ముగ్గురం ఒకవరకంలోకి దిగేము. తాడు మంచిబలంగా వుంది. దానికి ఒకవైపున ఇనుపకొంకీకూడావుంది.

మేము ముగ్గురం ముగ్గురమే! 'మూన్' అవిటికాలువాడయినా నక్కలాగ అరక్షణంలో నేలలో ఇంకిపోయినట్లు అదృశ్యంకాగల దిట్ట. నేను చడీ- చప్పుడూకాకుండా నీడలాగ అడుగుల్లోనే వెంబ డించియుండగల సమర్థుణ్ణి. మాతో ఈరోజునవున్న మూడోవాడు 'బలాలైకా' ఈమధ్యనే మాతోకలిసేడు. వీడు ఎప్పుడూ నవ్వు తూనే వుంటాడు. కిటికీలలో దూరుతూన్నా, జేబులు తడుముతూన్నా వాడి పెదవులు నవ్వుతూనేవుంటాయి. మేము ముగ్గురం కొద్దిసేపు కయ్యగట్టున వెల్లకిలాపడుండి విశ్రాంతితీసుకున్నాం. తర్వాత 'మూన్' త్రాడుతీసుకొని బయలుదేరి ఒకకొసదగ్గరగావున్న టెలి గ్రాఫుస్తంభానికి ముడిపెట్టి, కొక్కెంతగిలించిన రెండోకొన చేత బట్టుకొని, రైలుపట్టాలదగ్గరికి వెళ్లేడు. అక్కడ 'వింగ్స్' అతడిని కలుసుకున్నాడు. పట్టాలమీద వాడి పరసనుకూర్చుండి కార్యవిధానం అంతా బోధించేడు.

ఆప్రదేశం అంతటా చిమ్మచీకట్లు వ్యాపించియున్నాయి. ఏవిధమయినధ్వనీ వినబడడంలేదు. కొద్దిసేపటిలోనే రైలుపట్టాలమీద చెవిపెట్టి చప్పుడువలన రైలువస్తూన్నట్లు గ్రహించి అందరం సర్దుకున్నాము. దూరాన 'ఇంజిన్–లైటు' కనిపించింది. కొద్దిసేపులోనే మేమున్నప్రదేశంఅంతా తెల్లనివెలుతురులో మునిగిపోయింది. 'వింగ్స్' రైలుకట్టకేసిపోతూ చప్పట్లుకొట్టి ఏదోకేక పెడుతూన్నాడు. మాకేమీ వినబడలేదు. గుండెలలో ఆదటయినా లేకుండా మేమంతా ఒకదారుణకార్యానికి ఉపక్రమించేము.

రైలు వచ్చేసింది. ఇంజను మమ్మల్ని దాటిపోయినాక మళ్లీ మేమున్నచోట అంధకారం వ్యాపించింది. ఆబండి నూనెకోసం 'బకూ' పోతూంది. నూనెబండ్లకున్న సన్నని పడిచెక్కలమీద వర్తకులు పెద్దపెద్దమూటలు పెట్టుకొని కూర్చున్నారు. 'మూసా' నెమ్మదిగా కాలునిలదొక్కుకొని త్రాడు బండిమీదికి విసిరేడు.

ఇనపకొక్కెం బండికి తగిలింది. ఘళ్ళుమని చప్పుడు–వెర్రికేక–దగ్గు–ఉక్కిరిబిక్కిరి అయిపోతూన్నవాని గొంతుక. తాడు బిగిసింది. ఆదికొంచెంసేపు ఊగిసలాడి వదులయిపోయింది. వరకంలోకి నల్లటివస్తువులు ఏవో గబగబా దొర్లేయి. 'బిలాలయికా' కీ-నాకూ చేయవలసినపని బాగా తెలుసును. క్రిందపడ్డజనంయొక్క గొంతుకలు నొక్కడానికి గబగబాపరుగెత్తిపోయేం.

మేము ఇంక అక్కడ ఆగకూడదు. నాకు మహచెడ్డ దాహంగా వుంది. కాలువలోని బురదనీళ్లనే ఇప్పిత్రాగి, రైలు

లోరచదార్లిన్ పిండిబస్తాలు భుజానవేసుకొని, తెల్లవారేటప్పటికి 'బటమూస్కు' చేరుకున్నాం. ప్రొద్దుటే అచ్చటనున్న వర్తకులకి మా సరకులు అమ్మివేసేము. ఆరోజులలో బజారున గోధుమపిండి దొరకడంలేదు. అందుచేత దరకూడా వచ్చింది.

ఇదే 'గేలపు' పద్ధతి

   

'వింగ్స్' నాయూహాలు కనిపెట్టి 'మూణా' చూడకుండా నాదగ్గిరికి చేరేడు.

"ఒరేయి జోగీ! ఈసమయం దాటపెట్టకు. నీతెలివితేటలు చూపించాలి. చూస్తాను కాదూ?"

నాదగ్గరనుంచి మళ్లీ 'మూణా' దగ్గిరికివెళ్ళి వాడిచెవిలో ఏదో ఊదేడు ఆసమయంలో 'వింగ్స్' కళ్లు నక్కకళ్లలాగ మెరుస్తూన్నాయి.

నేను చొక్కా గుండీలు సర్దుకొని, ఎంతో శాంతంగానూ, నెమ్మదిగానూ మాటలాడుతూన్నానేగాని, నాగుండెలు పీచుపీచుమంటున్నాయి.

"-'మూణా' ఆగ్రీకువాడిసంగతి కనుక్కుందుకు పోతున్నాను."

వాడు ఏదో చెప్పుదామనుకున్నాడు గాని, ఆశ్చర్యంతో మాటలాడలేకపోయేడు. మూన్‌నిచూస్తూ కూర్చుండడానికి తీరికలేదు. ఆగ్రీకువాడు ఎక్కడికో ప్రయాణం అయిపోతూన్నాడు అప్పుడే.

నేను అతని వెంటపడ్డాను.

ఒకవారంరోజులపాటు విశ్వప్రయత్నాలూ చేసేను. ఈమధ్య కాలంలో ఆతనిదృష్టిలో పడకుండా వుండేటందుకు చాలాజాగ్రత్త తీసుకున్నాను. ఒక్కమారు అతడు నన్నుగమనించేడంటే ఇంక 'పర్సు' నాకుదొరకదని తెలుసును. ఆతడెక్కిన ట్రాములలోనే ఎక్కేను. ఆతడు కూర్చున్న బండిలోనే నేనూ ప్రయాణం చేసేను. రైల్వేదీకొని 'లైను' చెడిపోవడం మూలాన ఇద్దరమూ ఒకే హోటలులో 'టికోరెస్కు' నగరంలో రెండురోజులపాటు బస చేసేము. ఇన్నిరోజులూకూడా ఆతడు ఒక్కమారయినా 'పర్సు' వదిలియుండలేదు.

ఏడోరోజున ఆతడు కొద్దిక్షణాలపాటు ప్రకృతికి లొంగి పోయేడు. ఆరోజున 'కకేషియా' రైలులో ప్రయాణం చేస్తూన్నాము. ఇంక కొద్దినిముషాలకి స్టేషనును సమీపిస్తామనగా ఆతనికి నిద్ర పట్టింది. ఆ అవకాశంకోసమే ఈవారంనుంచీ ఎదురుచూస్తూన్నాను. ఆతడుకూర్చున్న బల్లకి సరిగాపైన సామానులబల్లమీద పడుక్కున్నాను. నెమ్మదిగా సమయంచూసుకొని, చేయిజార్చి నాజేబులోనుంచి తీసినంత చులకనగానూ పర్సు తీసేను. వెచ్చగానున్న ఆచర్మం చేతికి తగిలేటప్పటికి చేయివణికింది. "లేచేడాయేమిరా?"— అనుకుంటూ చేయివెనక్కి లాగేసుకున్నాను.

'పర్సు' నాచేతిలోకివచ్చి చొక్కాలోపలిజేబులో గుండెలవద్ద భద్రపరచబడింది. గ్రీకువాడు కళ్ళుతెరచి తనతలకిపైనవున్న నామొగంలోకి గుచ్చిగుచ్చి చూసేడు. నేను వెంటనే తలతిప్పుకొని

ద్వారం కేసి గంభీరంగా నడిచేను.

బండీ స్టేషనుని సమీపిస్తూంది. ఆ గ్రీకువాడు జరిగిన సంగతి గ్రహించేలోపున నేను నడుస్తూన్న బండిలోనుంచి ఉరికేను: ఉరుకుతూంటే వెనకవైపున గ్రీకువాని వెర్రికేక స్పష్టంగా వినిపించింది. బండి వెళ్ళిపోయింది.

రైలుకట్టక్రిందనున్న బొమ్మచెముడు దొంకలలోకిపరుగెత్తేను. ఒకముల్లుగుచ్చుకుంది. కాని 'పర్సు' చేతిలోపడిన ఆనందంలో ఆబాధ తెలియలేదు.

'మూణ' లాగునే కాళ్ళు ఈడ్చుకుంటూ స్టేషనుకి బయలుదేరేను.

మూడోనాటికి రాస్టోవులోయున్న 'వింగ్స్' చేతిలోవుంది ఆపర్సు.

'మూణ' చాలా సిగ్గుపడ్డాడు. కొద్దిరోజులవరకూ ఇల్లుకదకుండా ఒకమూల కూర్చుండిపోయేడు.

నాపేరు చెప్పుకుంటూ 'వింగ్స్' ఎన్నోమార్లు, సంచీఖాళీ అయిపోయేవరకూ చెడత్రాగేడు. గ్లాసునోటికి ఎత్తుకున్నప్పుడల్లా నాకేసిచూసి కనుబొమ్మ లెగురవేసేవాడు.

ఒళ్ళుతెలియకుండా చెడత్రాగి, అప్పుడప్పుడు నాభుజాలు పట్టి కుదుపుతూ తనమనసులోని దురాలోచనలన్నీ బయటపెట్టుకొనేవాడు.

"ఏమిరోయ్! జోగీ! మహాబాగా తగిలించేనురా పోటీ. నువ్వు దెబ్బలాడవే అనుకో, అయితేనేమి? 'మూన్' కి బలేవుద్దా! షేష్!"

## పదహారో....

## ప్రకరణం.

ఆరోజున పగలూ—రాత్రీ ఎడతెరిపిలేకుండా కురుస్తూంది వర్షం. స్టేషను ప్రక్కనున్న తోటలోని 'లీలక్' చెట్ల ఆకులన్నీ వర్షపుదెబ్బకి రాలిపోయి కొమ్మలన్నీ వొంగి బాడికొట్టుకొని వున్నాయి.

ఆలీలక్ పొదలక్రిందనే నేనూ—మూనూ—బలాలయికా—గలిసి ఆనాడు ఎత్తుకొనివచ్చిన స్యూటుకేసులు విడగొట్టేము. సరుకులన్నీ పర్దుకున్నాక నాటుసారాయితో ఇంత ఉడుకులాముకలిపి విందు ఆరగించేము.

ఆకిరిశంరోజురాత్రి అదేచెట్లక్రిందకూర్చుండి జూదంఆడి కట్టుబట్టలతోసహా ఓడిపోయేను. సాయంకాలం బలాలయికా ఎవ్వరివో గుడ్డలు తెచ్చియిచ్చేదాకా ఆవర్షంలో ఒక్కగోచీగుడ్డతో కూర్చుండవలసివచ్చింది.

వేసవికాలం గడిచిపోయింది. మావెనకటిబవేకాకుండా ఆనగరముకూడా వదిలిపోయింది.

ఈవర్షంబాధ తప్పించుకుందుకు ఇప్పుడు స్టేషన్లలో వుండిపోవడానికి వీలులేకుండా వచ్చింది. పరిస్థితులు చాలాబాధకరంగా వున్నాయి. ఎక్కడెక్కడి కుర్రవాళ్ళనీ వెదికివెదికి శరణాలయాలకి పంపివేస్తూన్నారు. అందుచేత బాగా చీకటిపడేదాకా పట్టణంలోనే

పందు-గొందులు తిరుగుతూ కాలక్షేపంచేసి, బాగా రాత్రిఅయినాక స్టేషన్లలోని 'ఇంజన్లషెడ్' లో దూరి కూర్చుంటున్నాం. ఆరోజున గూడా మామూలుమాదిరిగానే వెచ్చగానున్న గోడకి జేరబడి 'బోయిలరు' కేసి తిరిగి చలికాచుకుంటూ కూర్చున్నాం.

ఆవూళ్లో మావృత్తివాళ్లు చాలామందియున్నారు. కాని, ఆ మొగాలూ, ఆపట్టణమూకూడా మాకు బాగాకొత్త. 'వింగ్స్' ని విడిచిపెట్టి చాలారోజులు అయింది. ఇక్కడ నేను ఎరిగినవారల్లా బలాలయికా-మూనూ మాత్రమే. ఇప్పటికీ మూనుకీ-నాకూ మధ్య వెనుకటియంత స్నేహంలేదు. గ్రీకువాడివ్యవహారం జరిగినాక మాలోమాకు వైషమ్యాలు పెరిగేయి. కానయితే అప్పుడప్పుడు ఓహో-అంటే ఓహో-అనుకోవడం వుందిగాని, మొత్తంమీద ఒకేచోట వుంటూన్నా పరాయివాళ్ళకిమల్లేనే వుంటున్నాం. 'మూన్' చాలాతటస్థంగా వుంటున్నాడు. రాత్రీ-పగలూ స్వేచ్ఛగా నిద్ర పోవడానికి అవకాశాలు లేకపోవడంమూలాన ఎప్పుడూ మత్తుగా వుంటున్నాడు. మాతోటి ఎక్కువగా మాటలాడకపోయినా ఉండడం మాతోటే. ఒంటిగా వుండడానికి సంకోచిస్తున్నాడు. వలుగురి తోటీ కలిసివుండడం బాగాఅలవాటయిపోయింది. ఎప్పుడూ బలా లయికా వెనక్కాలనే కూర్చుండి, వాడిభుజాలమీదచేతులుఆని ముందుకివొంగి, కునికిపాట్లు పడుతూనేవుంటాడు.

గాలిపాటుకి వానజల్లు ఒకటివచ్చి మమ్మల్ని తడిపింది. నా గుండెలమీద వానతుంపరలు సగ్గుగింజలమాదిరిగా మెరుస్తున్నాయి.

నేను 'బోయిలరు' కి దగ్గరగా జరిగేను. నాతడిచొక్కానుంచి ఆవిర్లువస్తూన్నాయి. ఎంతప్రయత్నించినా నిద్రరావడంలేదు. నేల నున్న చెమ్మ, గాలిలోని చలి, ఎముకలని కటకటలాడించివేస్తూ న్నాయి. నాతల వాచినట్లు అనిపిస్తూంది. కళ్లుబరువుగాను, బాధ గానూ, వున్నాయి. 'బురదగుంట' లో నేను గడిపిన ఆఖరు రోజులు, చలికీ—ఆకలికీ—బిగిసిపోయిన మిట్కా—న్యూర్కాలు, ..........ఆఆవం..........ఆపోలీసుబండి..........అన్నీ కళ్ళకి కట్టినట్లుగా తోచేయి.

ఇంతలో పెద్దపంజా ఒకటి నాకాలుపట్టుకుంది. వెంటనే తెలివి వచ్చింది. హఠాత్తుగా గతస్మృతి విచ్ఛిన్నం అయి వర్తమానం ఆలోచనలోనికివచ్చింది. మేమురావడంచేత తమవృత్తికి బాధ కరంగా వుందనుకుంటూన్న పెద్దదొంగలు మమ్మల్ని అక్కడి నుంచి మరోచోటికి తరిమివేయాలని సంకల్పించేరు. ఆవిషయం మాకిదివరకే తెలుసును. ఇప్పుడు వచ్చినది వారేనని నాకాలు పట్టుకొన్నవెంటనే తెలిసిపోయి వెర్రికేక పెట్టి, ముందుకి వంగి ఆచేతిమీద కండలూడివచ్చేలాగ పళ్ళతో పీకివదిలేను.

మూశా తనచేతిలోయున్న కర్రితో రెండువిసురులు విసిరి ఒకడినడ్డి చిట్లకొట్టేడు. బలాలయికా కంకరరాయివిసిరి ఒకడిని 'కుయ్యో!' మనిపించేడు.

కాని, మేము కుర్రవాళ్ళం. వాళ్లు పదిమందివున్నారు. మమ్మల్ని రెక్కలుపుచ్చుకొని లాగేసి మావస్తువులూ— మాస్థానాలూ ఆక్ర

మించేరు. ఆచీకట్లో-వర్షంలో- హోరుగాలిలో- ఎక్కడికిపోయేదీ తోచక ముగ్గురమూ అక్కడనే నిలబడిపోయేము. విసురుగా వీచు తూన్న చలిగాలికి స్టేషనులోనిలైట్లు ఊగుతూన్నాయి. వాటివెలు తురులో స్టేషను వట్టిఅస్థిపంజరంలాగ కనపడుతూంది.

బలాలయికాకు ఎవ్వరిమీదా కోపంలేదు. ఆచలిగాలిలో పాట లుపాడుతూ గంతులువేస్తూ కేరింతాలు కొడుతున్నాడు.

బయట మేముముగ్గురం తప్ప మరెవ్వరూలేరు. ఇంజన్లలోకి పొడియిసుక తయారుచేసియిచ్చే కొలిములదగ్గిరికి పోదామన్నాడు, 'మూన్.'

అక్కడనున్న కాపలావాడికి మాదగ్గరనున్న పొగాకునం తనీ సమర్పించి వేడిగాయున్న అక్కడియిసుకలో పడుకుందుకు అనుజ్ఞ సంపాదించేము.

వస్తూనే బలాలయికా నేలకిదిగజారి ఇసకలో కొద్దిపల్లం చేసుకొని, మూడంకెవేసేడు.

నేనుకూడా నిద్రపోవడానికి ప్రయిత్నించేను. కానికనుగుడ్లు వాచిపోయినట్లుగా రెప్పలు మూతబడినాయేకాదు.

కొంచెంసేపు గడిచేక 'మూన్' నాగుండెలమీద చేయివేసి తట్టేడు.

"జోగీ! నిద్రపట్టిందా? జోగీ!"

నేనాతనిచేయి పట్టుకొని కండ్లమీదపెట్టుకొని,- "కళ్లుఏదో బాధగా వున్నాయోయ్! ఏమీ కనపడడంలేదు."-అన్నా.

'మూన్' మోచేతిమీద ఆనుకొని పక్కవాటుగాలేచి నాకళ్ళ మీదకి వొంగేడు. ఆతవినోరు 'వోడ్కా'వాసన వేస్తూంది.

"—కొకెయిన్ ఒకపట్టు పీలుస్తావా? జోగీ!"

హఠాత్తుగా- "నాకోమరి?"– అంటూ బలాలయికా లేచేడు. ఇద్దరం అదిరిపడి తిరిగిచూచేం. 'మూన్' చిలుముగొట్టంలో 'కొకెయిన్'వేసి వెలిగించేడు. అందరం తలకొక రెండుపీల్పులు పీల్చేము. చలికొంచెం తగ్గింది. హుషారుగా వున్నట్లుఅనిపించింది. 'మూన్' తనకపిటికాలు రెండోతొడమీదికి అడ్డంగాచేర్చి పాదం ఊగిస్తూ, మాతోకానట్లు మాటలాడసాగేడు.

"ఫరవాలేదు. ఉండండోయ్! నేను పెద్దవాడినయ్యేక గజదొంగని అవుతాను. మంచికత్తులు, చలిచొరడానికి సాధ్యంకాని-బూట్లు, తెచ్చియిస్తాను. ఎర్రనిచొక్కాలు తెస్తా. వలసినంత పటికిబెల్లం పెడతాను."—

బలాలైకా మత్తుతో ఊగుతూ ఏమేమిటో వాగుతూన్నాడు.

"నేను చిన్నతనంలో ఒకఆర్మీనియనుకుర్రవాడిదగ్గర ఒక పిల్లంగోరు లాగేసుకొని, ఊదుకుంటూ దర్జాగా వీధులవెంటతిరిగేను. ఆరోజున ఎంతమంది నాచుట్టూమూగేరనుకున్నావు? ప్రతివాడూరొట్టెముక్కో– ఒకటో– రెండో దుంపలో తెచ్చియిస్తేనే దానిని ఊదనిచ్చేను. అలాగంటిది ఈనాడు ఒక్కటివుంటేనా? ఊరి పాడుతూ వీధులవెంబడితిరుగుతేనే జేబులు నిండుతాయి."

ఇద్దరూ ఒక్కనిముషం ఊరుకున్నారు. లోపలికి రానీయ

మని గోలచేస్తున్నట్లు వర్షపుధారలు రేకుకప్పుమీద దబ—దిబా బాదుతూన్నాయి.

'మూన్' మళ్ళీ ఆరంభించేడు.

"తాష్ఖండ్‌లో ఇప్పుడింకా వేడిగానే వుంటుంది. ఈరోజు లలో ద్రాక్షలు—పుచ్చకాయలు—పులావూ—వలసినంతదొరుకుతుంది. విరుడు ఈరోజులలో అక్కడనేవున్నాను. ద్రాక్షపళ్లు తెగతిన్నా నంటే నమ్మండి. కాలికి జోడులేకపోయినా బాధలేదు. ఆరుబయట గడ్డిలోపడుకున్నా చలివేయదు. అక్కడ శీతాకాలం అనేదేలేదు. సూర్యుడు అసలు అస్తమించనే అస్తమించడు."

బలాలయికా తలఎత్తేడు.

"అయితే 'తాష్—ఖండ్' కి పోవుదామా?"

"ఊ! తప్పకుండా!"—అన్నాడు మూన్.

నేను రెండుదమ్ములులాగి వేడికలిగించుకొనే ప్రియత్నంలో వుండి మాటలాడలేదు. ఆఖరున నేనూ మరునాటిప్రయాణానికి తలతిప్పేను.

రెండోరోజున పొద్దుటే ఎక్స్ప్రెస్‌బండిలో 'ఎక్యూమలేటర్' పెట్టెలలో దొంగతనంగా దూరి 'తాష్—ఖండ్' కి బయలుదేరేము.

పదిహేడో....

ప్రకరణం.

సన్నగా, పొడుగ్గా, వుంది ఆగది. ద్వారం రెండునిలువు లెత్తువుంది. ఆద్వారంవెంబడి ఒకముసిలిది చరచరా లోపలికి వచ్చింది. ఏనాడో కురిసిన మంచులాగ ఎరుపుదొలుగలజుట్టూ అదీ పరమఅసహ్యంగా వుంది. మనిషి వ్యభిచారిణికిమాదిరిగా సన్నంగా వుంటుంది. ఆమొగాన ఏనాడయినా నవ్వుఅనేది పుట్టిందాయని నాయనుమానం. దిక్కుమాలినకేక పొలిబొబ్బలు పెట్టినట్లు వుంటుంది. చూపులు కరవవచ్చినట్లుగా వుంటాయి. ఆస్వరూపం చూసినమీదనే బలాలయికా ఆముండకి ముసిలిదయ్యం అని పేరు పెట్టేడు.

తాష్‌ఖండ్‌కి మేము బయలుదేరేక పదోనాడు రైలులో పట్టుకొని ఇందులో పడేసేరు. ఇది ఒక అనాథశరణాలయం. దీని కీముసిలిదయ్యం యజమానురాలు.

ఈశరణాలయంలో పిల్లలకి లెక్కలప్రకారం ముప్పొద్దులా తిండిపెడతారు. ప్రొద్దుటే ఇన్నివేడినీళ్ళు చిన్నరొట్టెముక్క ఇస్తారు. మధ్యాహ్నం పులుసు అనబడే బూడిదరంగునీళ్లతో రొట్టె పెడతారు. సాయంకాలపుపూట ఇచ్చే పులుసు కొంచెం చిక్కగా పేరుకు ఇంచుమించుదగ్గరలో వుంటుంది. అవురావురుమంటూవుండే కడుపులకి ఆతిండి ఏమూలకి? కడుపు నిండకపోవడంమూలాన

రాత్రిళ్లు నిద్దురే పట్టేదికాదు. శవపుపెట్టెలమాదిరిగా సన్నగా-పొడుగ్గా-ఎత్తుగావుండే ఆగదులకేసి చూడడానికి భయంవేస్తూండేవి. ఇక్కడినుంచి పోవడం ఏలాగ?............ఎప్పుడు ఆవేడిదేశానికి వెళ్ళిపోవడం?........ఇదే ఆలోచన.

ఆఇంటికెదుట ముంగిలివాకిలిఅంతా గచ్చుచేయబడి ఫ్యాక్టొరీ కళ్ళంలాగ వుండేది. శరణాలయంలోని పిల్లలు భోజనంచేసేది అక్కడనే.

ఒకరోజున ఇంక ప్రాణంవిసిగిపోయింది. అందరం చప్టా మీదకూర్చుండి తిండికి పళ్లేలు తెచ్చుకున్నాము. అందరికీ తల కాస్తా వడ్డించుకుపోయేరు. నాకుపెట్టినతిండి తినేసి పళ్లెంకూడా శుభ్రంగా నాకేసేను. ఆకలితీరలేదు. వెంటనే చేతితో పళ్లెం పైకెత్తి పక్కవాళ్ళని పిలిచి- "మరికాస్త పెట్టమని అడుగుదామా? వెళ్ళి." అన్నాను. అంతా- "సరే"- నంటే- "సరే"యన్నారు.

వరసని బారులుతీరి అందరం ద్వారాలుదాటి వంటగదిముందు నిలువబడ్డాం.

"ఇంకా పులుసు ఈలాగ పోయండి."

ఆరణగొంతధ్వనికి గదులన్నీమారుమ్రోగేయి.

ఎవ్వరూ మాటలాడలేదు.

నేలఅంతా బల్లకూర్పు. ఎవ్వరూ మాటాడకపోయేటప్పటికి ఆబల్లకూర్పు దబదిబా తొక్కుతూ పళ్లేలు పెట్టికొట్టేము.

"పులుసు ఇంకా పోయండి."

కాని, పులుసు ఏదీ? ఉన్నదేదో ఇదివరకే వడ్డించివేసేరు. నేను కోపం ఆపుకోలేక వంటచేసేభాగానికీ- మాకూ మధ్యన అడ్డుగావున్న అద్దాలగోడమీదికి గురుచూసి చేతిలో పళ్లెంవిసిరేను. అద్దాలు బద్దలయి ఘల్లున ఆముక్కలు నేలబడ్డాయి. ఇంతవరకు వచ్చేక పిల్లల్ని ఎవ్వరాపగలరు? బెంచీలు-కుర్చీలు విరుగకొట్టేరు? వంటపాత్రలు చితుకకొట్టేరు. అనాధబాలురంతా తిరుగుబాటుచేసి కనిపించినదంతా ధ్వంసంచేసేరు.

వంటయిల్లంతా చక్కపెట్టడం కాగానే ఈకుర్రపటాలం సరుకులకొట్టుమీదికి దాడితీసింది. మొదటివిసురుకే రేకులతలుపులు విచ్చిపోయినాయి. మేమందరమూ బిస్కట్లపెట్టెలు విడగొట్టి నోటినిండా కూరుకున్నాం. కెనడానుంచి తెప్పించిన గోధుమపిండి బస్తాలు విప్పేసేము. ఇన్నాళ్ళనుంచి అర్ధఆకలితో నకనకలాడిపోతూన్న ఆఅయిదువందలమంది కుర్రవాళ్లూ బాబాకరంగా కడుపులు నింపుకున్నారు.

కడుపునిండుగా తినివేసేక ఇంక ఆఆశ్రమంలో ఉండకూడదని నిశ్చయించేము. అందరమూ గబగబా వీధితలుపు దగ్గిరికి వచ్చేటప్పటికి భళ్లున తలుపులు తెరుచుకున్నాయి. గుమ్మానికి ఎదురుగా నిలబడి 'ఫైర్-ఇంజను' లావుపాటి నీటిధారమామీదికి చిమ్మడం ఆరంభించింది. దానిపక్కన ఆశీతాకాలపు ఎండలో మిలమిలలాడుతూన్నటోపీలతో "ఫైర్- మెన్"నిలవబడి ఆధార సరిగ్గా మామీద పడేటట్లు తిప్పుతూన్నారు. ఆనీటివిసురికి ఉక్కిరిబిక్కిరిఅయిపోయి,

మేము ఒకరినొకరు తోసుకుంటూ ఇంట్లోకి దూరేము. మావెవ క్కాలే కొందరువచ్చి ఈతిరుగుబాటుకి ప్రధాననాయకులయినవారిని కొందరిని పట్టుకొని, కాళ్లూ–చేతులూ కట్టేసి, పొడుగ్గావున్న వీధి సావడిలో రెండువరసల్ని శవాల్ని పేర్చినట్లు వరసగా పడవేసిపో యేరు.

ఒకరోజురోజంతా మామొగాలు చూచినవారే లేకపోయేరు. మరునాడు పొద్దుటే ఆ 'ముసిలిదయ్యం' తనఅనుచరుల్ని వెంట బెట్టుకొని వచ్చింది.

కూలీలు మాకట్లువిప్పేరు. ఆముసిలిది మమ్మల్ని లేచి విలబడ మంది. కాని, మాలో ఒక్కడూ కదలలేదు. మాటలాడలేదు. దానికి మహాచెడ్డకోపం వచ్చింది. త్రాగినకోతిలాగ గంతులువేస్తూ అనుచరుల్ని వెంటబెట్టుకొని తిట్టుకుంటూ లేచిపోయింది.

"గాడిదకొడుకుల్లారా! మీసంగతి చెప్తాను, ఉండండి!"

ఆవచ్చినవాళ్ళంతా ఎవరిదారినవారు పోయేరు. ఆటుతరువాత లేచేను, చేతులకి కట్టినతాళ్ళు ఒరుసుకొని పుళ్లుపడి బాధ పెడు తూన్నాయి.

స్వేచ్ఛగా బ్రదకడం బాగా అలవాటయిపోయింది. వెల్లుల్లి కారంపెట్టి వండిన గుర్రపుమాంసం–శుభ్రమైనపులుసూ–పెద్దపెద్ద రొట్టెలూ– సారాయీ– బజారులోఅమ్ముకొనే ఆడవాళ్ళనికనుగప్పి ఎత్తుకుపోయి తినేవాడికి ఉప్పులేని నిరుచప్పిడితిండి తిని, పడివుండ దానికి మనస్కరిస్తుందా?

మేమున్న ఆశ్రమానికి వెనుకవైపున దొడ్డిగోడ నానుకొని ఒకమట్టిగుడిసెవుంది. దానితలుపులూ-ద్వారబంధాలూ బులికిపోయి కూలిపోవడానికి సిద్ధంగా వున్నాయి. అనడం, దానిని ధాన్యపుకొట్టు అనియైనా 'మంచుకొట్టు' అంటేసరిపడుతుంది. పూర్వపురోజులలో దానిఉపయోగం ఏలాగవున్నా ఇప్పుడొక ప్రత్యేకమైన అవసరానికి దానిని వినియోగిస్తున్నారు. ఆరోజులలో 'టైఫాయిడ్'జ్వరాలు ఎక్కువగా వున్నాయి. దినదినమూ ఆశ్రమంలోవిద్యార్థులు నలుగురూ ముగ్గురూ చస్తూనేయున్నారు. వాళ్ళని రాత్రిపూట అందులో పారేసి ప్రొద్దుటే శ్మశానానికి తీసుకొనిపోతూన్నారు. ప్రస్తుతం అది'శవాల కొట్టు'గా వుపయోగిస్తూంది.

ఈదిక్కుమాలిన బ్రతుకుమీద రోతబుట్టి నేనూ- మూనూ- చచ్చిపోవాలని నిశ్చయించుకున్నాం. రాత్రిఅయింది. ఊరంతా మాటు మణిగింది. దీపాలు ఆరిపోయినాయి. తడుముకుంటూ ద్వారాలన్నీదాటి ఆ'కొట్టు'దగ్గిరికి వచ్చేటప్పటికి అర్ధరాత్రి దాటి పోయింది. మేడమీదనుంచి దిగివచ్చేటప్పుడు మెట్లక్రిందగదిలో గురువుతో దీకొన్నంతపని అయింది. ఆమెను చూడగానే ఇద్దరం తలుపువెనక్కాలదాగి, ఆమెవెళ్లిపోయేక బయలుదేరవలసివచ్చింది. మేము వెళ్లేటప్పటికే ఆశవాలకొట్టులో గడ్డిని చుట్టబెట్టబడి కొన్ని శవాలు పడియున్నాయి. మేమువాటిని తప్పించుకుంటూ ఒకమూలకి పోయి, యిద్దరమూ వట్టినేలనే పడుకున్నాం.

తెల్లవార్లూ ఏదో ఒకశవాన్ని తెచ్చి పడవేస్తూనేవున్నారు.

తెల్లవారేముందు గుమ్మంలో స్లెడ్జిబండి ఆగినచప్పుడయింది. మరి కొద్దిసేపటికి గొర్రెతోలుచొక్కాలు తొడిగిన ఇద్దరుమనుష్యులు మాటా- మంతీలేకుండా గదిలో ప్రవేశించి ఒక్కొక్కశవాన్నే మోసుకుపోయి బండీలో పారవేసేరు.

ఏదోవుపాయంపన్ని మేము శవాలమధ్యచేరి అందరికంటే ముందు బండిలోకి చేర్చబడ్డాం. మాపైన మిగిలినశవాల్ని పేర్చేరు.... ఒక్కక్షణం పోయేక బండికదిలింది. బండివెళ్లిపోయినాక ఆశ్రమం తలుపులు మూయబడినధ్వని వినిపించింది. శవాలబండిలో చేరి మేము ఆశ్రమంలోనుంచి దాటిపోతున్నాం. అప్పటికి ఇంకా 'ట్రెంబర్గు'లో ప్రజలు ఎవ్వరూ లేవనైనా లేవలేదు. బండిలోఅట్టఅడుగున నేను పడివున్నాను. ఒకచచ్చినవాని నల్లనిచేయి నాగొంతుకమీద పడి నన్ను ఉక్కిరిబిక్కిరిచేసివేస్తూంది. శవాలమీద వుండడంచేత కలిగినభయోద్రేకంచేత రక్తం గడ్డకట్టిపోతూంది.

అటూయిటూదొర్లి ఖాళీచేసుకొని 'మూన్'కోసం వెదకాలనుకున్నాను. కాని, ఆప్రయత్నంచేస్తే ఆమూగివాళ్లు పట్టుకుంటారేమోననే అదటుతో ఆప్రయత్నంనుంచి విరమించేను.

బండీ నెమ్మదిగా 'ట్రెంబర్గు'నగరబాహ్యప్రదేశానికి చేరుకుంది. అక్కడకి శ్మశానం ఆట్టేదూరంలోలేదు. కొద్దినిముషాలలోనే బండిఆగుతుంది. ఆమూగిముండాకొడుకులు చచ్చిన వాళ్లతోపాటు మమ్మల్నికూడా తవ్వి సిద్ధంగావున్న గోతులలో గిరాటువేసి నాలుగు పారలమన్ను మీదపోసి లేచిపోతారు.

ఆఆలోచన తట్టగానే గుండెలు ఝల్లుమన్నాయి. భయంతో, వెర్రికేక ఒకటివేసేను. కాని, నామీదవున్న ఆశవాలదొంతర నాక్షీణ స్వరాన్ని బయటకి పోనీయలేదు. కళ్ళువిప్పి చూస్తేవిగదా– ఒక శవంతల నాముగంమీదకి వొంగి పళ్లుకొరుకుతూన్నట్లు కనపడింది. ....నెమ్మదిగా ప్రాణాలు కూడగట్టుకొని, ఒక్కఊపుతో శవాల్ని గెంటేను. ఒకదానికాలు స్లెడ్జిచక్రంలో తగుల్కొన్నట్లూ ఆకారణంచేతనే బండి ఆగినట్లూ ఊహించేను.

బండిగమ్యస్థానానికి చేరుకొనడంచేత దానంతటఅదే ఆగి పోయింది. ఆమూగిపీనుగులు ఒక్కొక్కళ్ళనే తీసి తవ్విసిద్ధంగా వున్న గోతిలో పేర్చడం ఆరంభించేరు. నావంతు వచ్చింది. గభీమని లేచేను. లేస్తూనే నేనుబ్రదికియున్నాననీ– ఆబండిలోనే– నామాదిరి గానే వచ్చిన– 'మూన్' నాకు సాక్ష్యంఅనీ, చెప్పడానికి ఉపక్ర మించేను.

కాని, వాళ్ళు నామాటవినిపించుకోనేలేదు. నేనులేచికూర్చుండే టప్పటికే హడలి, గుర్రాలకళ్ళెపుతాళ్లు వొదిలిపెట్టి తూరీగలమాది రిగా ఎగిరిపోయేరు. ఆశవాలమధ్య నేనొక్కడినీ ఉండిపోయేను. వాళ్లు దూరం పోయేక 'మూన్'కోసం పిలిచేను. కాని, సమాధానం లేదు. వెతుకుదామంటే చేతులూ, నడవడానికి కాళ్లూ, అరవడానికి నోరూ, స్వాధీనంలోలేవు.

పద్దెనిమిదో
ప్రకరణం..

ఆశ్రమం 'గేటు' ముందర ఒక మోటారు బర్రున ఆగింది. రేడి యేటరుమీద వెండిహంస రెక్కలుచాపుకొని ఎగరడానికి సిద్ధంగా వున్నట్లు కొంచెం కదలబారింది.

బండిఆగగానే బూడిదరంగు 'స్యూట్' వేసిన ఛాఫరు వెనుక సోఫాదగ్గిరికివెళ్ళి, తెల్లనిగ్లోవుతొడిగిన చేయిజాపి తలుపుతెరచి పక్కకి తప్పుకున్నాడు.

తోలుకోటువేసుకొన్న పొడుగాటివాడొకడు వెనుకసోఫాలో నుంచి ఉరికేడు. గుమ్మంవద్ద నిలబడియున్న నేను ఒకచేతితో అభి వందనంచేసి రెండవచేయిబండీలో ఇంకా కూర్చునేవున్న ఆడవాళ్ళ కేసి జాపేను.

వీరు అమెరికన్‌రిలీఫ్‌కమిటీకి సంబంధించినజనం. అమెరికాకి తీసుకొనిపోవడానికి తగినకుర్రవారిని ఆఖరుపర్యాయం చూచి ఏరు కుందుకు వచ్చేరు వీళ్ళు. మాశరణాలయంలోనిపిల్లలు వీళ్ళు ఎప్పు డువస్తారాయని కనిపెట్టుకొని యున్నారు. మాలో మంచి బలంగా వున్నవాళ్ళని ఏరి అమెరికాతీసుకుపోతారనీ, అమెరికాఅంటే భూలో కస్వర్గమేననీ మాస్టర్లు చెప్పేరు. ఆమాటవిన్నాక ఆభూలోకస్వర్గ యాత్ర ఎన్నడుదొరుకుతుందాయని ఒకటేవిధంగా ఆరాటపడుతూ న్నాను. కాని, నాకాళ్ళకీ—చేతులకీపడ్డ పుళ్ళు ఇంకా మానలేదు,

నొప్పులు తీయలేదు.

ఈశరణాలయంలో వుండడంఅంటేనే విసుగుగా వుంది. రోజులశరబడి పట్టిపోమరిపోతులమాదిరిగా పనీ—పాటాలేకుండా పడివుంటున్నాను. ఏమీతోచక కిటికీతలుపుల పేళ్లు ఊడదీసి, పాడు వాసనవేస్తూన్నా, వాటినే కాలుస్తూ, సిగరెట్లుకాలుస్తూన్నట్లే సంతృప్తిపొందుతూన్నాం.

రాత్రి కన్నుమూస్తే అమెరికాను గూర్చి కలలు........

వెళ్ళడంవిషయంలో నాకెప్పుడూ సందేహంలేదు. ఎందుకు తీసుకువెళ్ళరు వాళ్లుమాత్రం? నేనేమయినా బలహీనుణ్ణా?—ఏను న్నానా?—

ఏపనిచేస్తూన్నా నాకదే యావ. ఇదివరకు ఎన్నడూ జ్ఞాపకం తెచ్చుకుందుకుకూడా ప్రయత్నించియుండని ఆదేవుణ్ణి నేడు తింటూన్నా, నడుస్తూన్నా, నిద్రపోతూన్నా, కాల్యాలు తీర్చుకుంటూ వున్నా, విధీ— విరామంలేకుండా స్మరిస్తూ, నన్ను అమెరికాకి పంపించమని నిత్యప్రార్థనలు చేస్తూన్నాను.

'కొకెయిన్' మీదా— సారామీదా ఎంతవాంఛవుందో ఈకమీషనుకోసంకూడా అంతతాపత్రయమూ పొందుతూన్నాను. వాళ్లు రాగానే దొడ్లోకి వెళ్లిపోయి, కాళ్ళకీ— చేతులకీ కట్టుకొన్నగుడ్డలు విప్పిచేసేను. పుళ్ళకి పట్టించిన తెల్లనిమలామా శుభ్రంగా కడిగేసి గుడ్డలువేసుకొని బయలుదేరేను. నాకాలు—సేతులకి కొత్తబలంవచ్చినట్లు తోచింది. పూర్ణారోగ్యం పొందేను. ఇంక పరీక్ష తరువాయి.

కమీషన్‌వారుచాలా ఖచ్చితంగా వున్నారు. ఎంతోమంది కుర్రవాళ్లని పనికిరారు పొమ్మని తోసిపుచ్చేరు. క్రిందిఅంతస్థులోవున్న రెండుమూడువందలమందిలోనూ నలభైమందిని మాత్రమే ఏరేరు. నన్నుకూడా ఏరితీరుతారనే నానమ్మకం. మావంశంలో ఊనాపివాళ్లెవ్వరూ లేరు.

నావంతు వచ్చింది. దెబ్బకోసం సిద్ధంగావున్నట్లు గుండెలు విరిచి నిబ్బరంగా ఆతెల్లకోటుతొడిగిన ఆపొడుగుపాటివాడికి ఎదురుగా నిలబడ్డాను. తప్పకుండా ఏరుకునితీరుతారనీ, అమెరికాకు పోయితీరుతాననీ, ఆశించడంవలనకలిగిన ఆనందాన్ని అణచిపెట్టడంలో నాపళ్లుకటకటలాడు తూన్నాయి.

కొంగకాళ్లవాడూ ఆఅమెరికావాడు నాదగ్గిరికివచ్చి నాముక్కుకి ఏవో రబ్బరుగొట్టం తగిలించేడు. కళ్లజోడు ముక్కుకొసకి జార్చి, దానిమీదుగా నాకాళ్ళకేసి పరకాయించిచూసేడు. డొక్కలు నొక్కిచూసేడు. మోకాళ్లజవజవలాడించి నాతరువాతివాడికేసి తిరిగేడు.

"చెడిపోయేడు"—ఇది ఆతడు నావిషయంలో ఇచ్చిన అభిప్రాయం.

ఆమాటకి అర్థంతెలియక నేను అక్కడనే నిలబడియున్నానుగాని అమెరికనువాడు నాకేసి చూడనైనాలేదు. తరువాతివాళ్లని పరీక్షించుకోవడంలో మునిగిపోయేడు. నాకండలు, నానరాలు, ఎంతబాగా మెలితిరిగాయో గ్రహించలేకపోయిన ఆతని తెలివితక్కువదనానికి

చాలా విచారించేను.

ఇంతలో ముసిలి 'ఆంద్రీ' వచ్చి ఎంతోదయతో నాచేతిని పట్టుకుంది.

"రా! సోనీ! ఆఅమెరికావాళ్లకి నువ్వుపనికిరాలేదని తోస్తుంది. మేమిద్దరం వెలుతురులేని ఆ 'కారిడరు' పడినడుస్తున్నాం. ఆమెరికావాడిమాట నాకు బాగాతెలియలేదు. నాఆశలకి వ్యతిరేకమైన అభిప్రాయంతెలుపుతుందేమోనని ఆంద్రీని ఏవిషయమూ అడగడానికి సంకోచిస్తూన్నాను. ఇద్దరమూ మేమందరమూ పడుక్కుందుకు ఉపయోగించే ఆసన్నని గదిలోనికి వెళ్ళేము. ముక్కలూడిన కిటికీకమ్ములు, ఉమ్ములతోనిండిన చాపలు, పెన్సిలుగీతలతో నిండిన గోడలు, చూచేటప్పటికి నాఒళ్ళు కంపరంఎత్తిపోయింది.

మనసులో పెనగొంటూన్న వెర్రిఆలోచనలతో నోటమాట రావడంలేదు.

"అయితే— నేను ఆమెరికా వెళ్ళను?"

"వెళ్లవురా నాయనా! నీబలం వాళ్ళకి నచ్చలేదుట."

నిలువునా కుప్పకూలిపోయి నిరాశతో తల బల్లలకూర్చునిబెట్టి కొట్టుకున్నాను. నేలనున్న పుల్లఒకటిదీసి పెదవులు చీరుకొనడానికి ప్రయత్నించేను.

ఆంద్రీ చేతులలోని పుల్ల లాగిపారవేసింది.

"గోలపెట్టకురా, చవటా! నిన్ను ఆమెరికాకి తీసుకుపోయేటట్లు నేనుఏర్పాటుచేస్తానుకాదూ?"

ఆంద్రీ నన్ను రెక్కపుచ్చుకొనిదొడ్డిలోకి తీసుకుపోయి బట్టలన్నీ లాగేసి, నేలనున్న మంచులో పడద్రోసి, ఆమంచుగడ్డలతో ఒళ్ళంతా రుద్దింది. కొద్దిసేపటిలోనే నాశరీరం కంది, ఎఱ్ఱబడింది. తరువాత కుళాయిదగ్గిరికి ఈడ్చుకుపోయి, శుభ్రంగా చన్నీళ్ళతో స్నానంచేయించి పొడిగుడ్డతో చలికాయలుపోయేదాకా నొక్కి తుడిచింది. తినడానికి చిన్నరొట్టెపెట్టి, అందర్నీ పరీక్షించి ప్రాణం విసిగి విశ్రాంతితీసుకుందామని అనుకునేటప్పుడు నన్ను తీసుకొనిపోయి అమెరికనుకమీషనుముందు నిలబెట్టింది.

ఈమారు ఆకాశ్ళపింగడి ఎఱ్ఱగా, డాబుగా కనిపిస్తూన్న నా నడ్డిమీద తట్టి, స్వయంగాచేయిపట్టుకొని, అదివరకు తాను ఎంచుకొన్నవారిని ఉంచినగదిలోకి తీసుకుపోయి వదిలేడు.

ఆసాయంకాలంపూట మాఅందరికీ మంచిమంచి ఫ్లానలు దుస్తులు ఇచ్చి, లారీలు ఎక్కించేరు. స్టేషనులో బండి మాకోసం సిద్ధంగావుంది.

ఆప్రయాణీకులబండ్లలో బల్లలు మూడువరసలుగా ఉన్నాయి. వాటిమీద మెత్తని దళసరిచాపలు పరచివున్నాయి. చాపలమీద కరకరలాడుతూన్న దుప్పట్లు, వానిక్రింద మెత్తనితలగడాలతోటీ, పక్కలు అమర్చివున్నాయి.

ఆరాత్రిభోజనం చాలా.... పంచదారతోకలిపిన తెల్లనిబియ్యపు అన్నము, ఎఱ్ఱవిసిరపూ—అమిరేఖి. మాకు తినడానికి ఇచ్చిన రొట్టెలు దూదిలా మెత్తగా వున్నాయి. మడిచి జేబులో పెట్టుకునేట

ట్లావున్నాయి.

ఆరోజున భేరీలమాదిరిగా పొంగినపొట్టలతో పక్కలకి చేరు కున్నాం.

ఆరోజు రాత్రిఅంతా అమెరికానుగూర్చే కలలు కన్నాను. నేను పువ్వులమధ్య నిలబడ్డానట. దగ్గరలోనే పాలవెల్లిలాంటి శుభ్రమైన నదిఏదో ప్రవహిస్తూందిట. ఎక్కడినుంచో పువ్వులు వర్షంలా కురు స్తూన్నాయట—

అక్కడితో కల కరిగిపోయింది. చెవులు గింగురుమనేటట్లు ఊదిన ఈలచప్పుడికీ—నగారామోతలకి తెలివివచ్చింది.

ఆమునిలిదయ్యం అప్పుడే పొద్దుటి ప్రార్థనలకి తయారయింది. పొద్దుటిభోజనాలు పూర్తిచేసేము మేమందరమూ. అటుతరువాత మమ్మల్ని పీటలమీద కూర్చుండమని, తానొక పడకకుర్చీలో కాళ్లు సాచుకొని పండుకొని బోధనలు ఆరంభించింది.

"........మీరంతా మహాపాపులు. మీహృదయాలు కల్మషంతో నిండివున్నాయి. మిమ్మల్ని సరియైన మార్గంలో పెట్టమని, స్వర్గం లోనున్న ఆపరమపితని ప్రార్థించండి. ఆతనినిగూర్చి రాత్రిం-బగళ్లు ధ్యానించండి. ఆతడే మీమనసుల్నీ—మీఆత్మల్నీ—మీరక్తాన్నీ—శుభ్ర పరచి, సరియైనదారిలోనికి తెస్తాడు ........మీరిప్పుడొక భూలోక స్వర్గంకి పోతూన్నారు. అచ్చట మీజీవితాలు సుఖంగా వెళ్ళబుచ్చు కుంటూ, మీజీవితనిష్కృతికోసం పాటుపడడానికి అక్కడ కావలసి నన్ని అవకాశాలున్నాయి. మీరు అక్కడ శ్రమపడి పనిచేయండి.

వారుమిమ్మల్ని నేర్పరులయిన కూలీలనుగా, 'ఛాఫర్ల'నుగా, 'పైల ట్ల'నుగా, 'ఫిట్టర్లు'-'ఇంజనుడ్రైవర్లు'-'మైనర్ల'నుగా తయారు చేస్తారు—"

....ఫిట్టర్లు?—మైనర్లు?—ఆపేర్లు వినేటప్పటికి భయావేశంకలిగి నిలువునా వొణికిపోయేను నోట మాటరాలేదు. వెనుకటి 'పందుల దొడ్డి'లో గడిపిన రోజులన్నీ జ్ఞాపకంవచ్చేయి. తెల్లవారేటప్పటికి వేర్రిలుమొగాలు వేసుకొని, ఫిట్టర్లూ—మైనర్లూ పనుల్లోకి పరుగెత్తు తోన్నట్టే తోచింది. ఒకపొడుగుపాటి మనిషియొక్క—నీడ నాకళ్ళ ముందు మెదిలింది. కాలిపోయిన కంటికి చేయిఅడ్డంపెట్టుకొని, కొలిమిదగ్గరనుంచి పరుగెత్తివస్తూన్న నాన్నవిగ్రహం కళ్ళముందు సాక్షాత్కరించింది. అ త డిం కా ఫోర్మన్ ఇంటివసారాలో చేతులోగునపంపట్టుకొని, గుడ్డికన్నుఅరతెరిచి పడివున్నట్లే తోచింది.

పగలెల్లా ఆవేదనపడ్డాను. ఆరోజురాత్రే రైలుబండీకిటికీపగల కొట్టి, చడీ—చప్పుడూ లేకుండా నెమ్మదిగా బండిలోనుంచి బయటి చీకటిలోకి అంతరించేను. తెల్లవారేవరకూ రైలుకట్టవెంబడినే పరు గుపెట్టేను. రాత్రితొడుక్కున్నచొక్కా మోకాళ్ళకూడా దిగడం లేదు. కాళ్ళకి జోడులేదు. లేకపోయినాసరే— చలిబాధ అనిపిం చలేదు.

తెల్లవారేటంతకి స్టేషనుచేరేను. స్టేషనులో 'డానెట్జి బేసిజ్ ప్రొలిటేరియట్' అనే పేరుగల 'ఆర్మర్డు-ట్రెయిన్' బయలుదేర

దానికి సిద్ధంగా వుంది. ఆబండీలోని ప్రతీపెట్టెకీ పైభాగాన

"పోలిష్రంగానికి. 1920"

—అనివార్యబడివుంది. బండీలోనున్న 'రెడ్-ఆర్మీ' సైనికులు-నన్ను తమతో తీసుకొనిపోతామన్నారు.

పందొమ్మిదో....

ప్రకరణం.

రాత్రి............

యుద్ధరంగంఅంతా వట్టిబురదనేల. ఏమూలకి చూడబోయినా కన్నుపొడుచుకున్నా కానరాని కటికచీకటి. ఎక్కడా ఏవిధమైన ధ్వనీ వినబడడంలేదు.

ఆకుపచ్చనిరంగుపూయబడిన మా 'ఆర్మర్డు- ట్రెయిన్' అతివేగంగా రైలుమార్గం వెంబడే చీకటిని చీరుకుంటూ ముందుకుపోతూంది. ఇంజను కూతలులేవు. సిగ్నల్‌లైట్లమీదకూడా నల్లని దళసరితెరలు కప్పివున్నాయి. పచ్చికబయళ్ళు, గాలిమరలు, చిన్న చిన్నగుట్టలు, అతిక్రమించి రైలుబండి సాగిపోతూంది. మాఎదుట, మావెనుక, కుడి-యెడమల నాలుగుమూలలా మహారణ్యాలు.

గుబురుగా పెరిగిన అడవిచెట్లమధ్యనుంచి, రైలుమార్గంపోతూంది. చెట్లకొమ్మలు రైలుబాటమీదికి వొంగియున్నాయి. బండీపోతూంటే ఇంజనుయొక్క కవచంమీద చెట్లరెమ్మలు జరజరా రాసుకుంటు న్నాయి.

మధ్యమధ్య ఆచెమ్మనేలమీదనుంచి కుళ్ళినఆకులవాసన తెరలు-తెరలుగా విసురుతూంది. చలిమిక్కటంగావుంది. నేను చొక్కాగుండీలుబిగించి 'బోయిలరు'కి దగ్గరగా జరిగేను. ఇంజను డ్రైవరు 'బొగాటరీవు' చాలాసరదాయైనవాడు. నేను బోయిలరుదగ్గ రకి చేరడంచూసి, కళ్లుచికిలించి, మీసాలు మెలిపెట్టుకుంటూ, పళ్ళు ఇగిలించేడు.

"హ్హా!సన్నా!సిగ్గు!సిగ్గు!పాపమే! చలివేస్తూందా నాయనా? లేక 'పోల్'వాళ్ళని తలుచుకొని మూలనక్కుతూన్నావా?"

అతని హాస్యానికి సమాధానం ఇద్దామని నోరుతెరవబోయేట ప్పటికి 'టెలిఫోన్'గంట మోగింది. ఇంజనుపక్కగదిలో మేజా వద్దకూర్చున్న 'కమిస్సారు' 'రిసీవర్ని'చెవికి ఎత్తుకున్నాడు. అలాగ వింటూన్నంతసేపూ కాలితో పెట్టెఅడుగును లయతప్పకుండా తాటి స్తూనేవున్నాడు. ఆఖరున 'రిసీవరు' క్రిందపెట్టేసి బొగాటరీవుకి ఆజ్ఞలు అందించేడు.

'డానెట్జ్-బేసిన్'లో ఇనపయంత్రాలయంలో కొలిమిలవద్ద పనిచేసినగార్బజే ఈ'ఆర్మర్డు-ట్రెయిను'లో కమాండరు. అతని ఆచరణలో నేడు దయా-దాక్షిణ్యాలు ఏకోశానా లేవు. ఆమొగాన

"బండిని ముందుకు నడుపు. నెమ్మదిగా.........నిశ్శబ్దంగా.... పూర్తివేగం ఈయడానికి సిద్ధంగావుండాలి..............మనం మళ్ళీ ముందుకి అతివేగంగా చొరుచుకుపోవలసివస్తుంది........."

ఆమాటవినగానే నాకు కాళ్లలోనుంచీ వణుకు పుట్టుకొని వచ్చింది. ఇప్పుడేగనక బేరింగులు సరిచేయకపోయేమా తప్ప కుండా ఇరుసు విరిగిపోతుంది. తరువాత ఏమిజరిగేదీ అందరికీ తెలుసును. గార్బుజు డ్రైవరును రెండోపెట్టెలోవున్న తనచిన్న ఆఫీసుగదికి పిలిచి తలుపులు బిడాయిస్తాడు. తుపాకీకాల్పుకూడా ఎవ్వరికీ వినబడదు. మూడంగుళాల మరఫిరంగిని పాడుచేసినందుకు ఫిరంగిదళంలోని 'ఇవానోవు' ను చేసినది అదేకాదు?

మరి బొగాటరీవుకు తీరికలేదు. ఇంకనేనే స్వయంగా బేరింగుల మరమ్మతు చేయాలనుకుంటున్నాను. చేతితో రెంచీ—సుత్తీ పట్టుకున్నా. దూరాన అరణ్యాలలోంచి తుపాకులుకాల్చినధ్వని.

ట్రెయిను నెమ్మదిగా నడుస్తూంది. బొగాటరీవు నావద్దకు వచ్చి— "మిగిలినపని నేనుచూసుకుంటానుగాని కమ్మిపట్టుకొని వొంగి బేరింగులు మరమ్మతుచేయగలవా?"—అన్నాడు.

నేను చేతిలోని గరిటె మూలబెట్టేను.

కమేండరు మావెనక్కాలనే నిలబడియున్నాడు. అతని క్రిందిపెదవి ముడతపడి బోసినోటిలో అదృశ్యంఅయిపోయింది.

నేను తొడుక్కున్నది తెల్లనిచొక్కా. దానితోనే పనికి సిద్ధంకావడంచూసి కమేండరు కంగారుపడి తానుతొడుక్కున్న ఆకు

పచ్చవికోటువిప్పి మీదవేసేడు.

"ఈమారు చీకట్లో నిన్ను గు_ర్తించలేటులే."

నేను సిద్ధంఅయినాక 'ఇంజన్' తలుపు కొంచెము ఓరగాతీసి నన్ను బయటికి నెట్టివేసి మళ్ళీ తలుపులు బిగించేరు.

అవిసురుకి నేను క్రింద గోతిలో పడ్డాను. గోయి బురదతోటీ—ఆకులతోటీ, కప్పివుండడంచేత దెబ్బకగులలేదు. ఆపాటికి గోతిలో వున్న ఎండుటాకులు గలగలలాడేయి. ఏదోచట్టుక్కున నామొగం మీదికి ఎగిరింది. ఆఎగిరినది వట్టికప్ప అని ఎరిగినా ఎందుకో భయంమాత్రం తప్పలేదు. ఆభయంతోటే బంతిలాగ చెంగున ఎగిరి, గోయిఎక్కి, 'ఇంజను' వైపుకి, పరుగుపెట్టేను. చలిగాలికి పళ్లు గిట్టకరుచుకుపోతున్నాయి. నె_త్తిమీద తాటికాయలంతలేసి నక్షత్రాలు మిలమిలలాడుతూన్నాయి. నేనుఅతివడిగా బండీతో నడుస్తున్నాను. బండీ చాలానెమ్మదిగా — పా కు తూ న్న ట్లే నడుస్తూంది. వర్షాలచేత శుభ్రంగా కడిగివేయబడిన గులకరాళ్ళ వోతగట్టుమీద నడుస్తూంటే నేను తొడిగిన సోల్జరుబూట్లు గరగర లాడుతూన్నాయి.

రైలుయొక్క ఇనుపకవచాన్నిపట్టుకొని నెమ్మదిగా లోపలికి దూరేను. రైలు ఒక్కఅడుగు ఆగినప్పుడెల్లా సు_త్తితో రెండు దెబ్బలుకొట్టి మూతవదులుచేసి బేరింగునిండుగా నూనె పోస్తూ వచ్చేను. కొద్దిసేపటిలోనే పని పూ_ర్తిఅయింది. అత్యవసరం—ముఖ్యంఅయిన కార్యాన్ని నెరవేర్చిన ఆనందంతో కవచం ఈవలికి

వచ్చి, పరిసరాలజ్ఞానంకూడాలేకుండా గంతులువేస్తూ మెట్లకేసి పరుగెత్తేను.

ఇంజనుతలుపు తెరుచుకుంది. పైన బొగ్గాటరీవు నల్లనిముఖం కనిపించింది. నన్నుచూడగానే అతడు ముందుకువంగి, చేయిచ్చి, పైకిలాగుకున్నాడు. తలుపులు మళ్ళీఘడియలు పడ్డాయి. బొగ్గాటరీవు భుజాలురెండూపట్టుకొని కుదించి ఆనందంతో బొక్కెనడునీళ్లు నెత్తిన కుమ్మరించేడు.

వెంటనే భుజంతట్టుతూ "ఇంజనులో మంటచూడు. నీరు ఎక్కించు. పిస్టన్లలో నూనెపోయాలి."— అంటూ మారుమాట వినిపించుకోకుండా ఆజ్ఞలు ఇచ్చేడు.

ఇరవయ్యో....

ప్రకరణం.

'ఆర్మర్డు—ట్రెయిన్' తూర్పుటొఖారాగుండా నడుస్తూంది. చాలారోజులక్రితమే మమ్మల్ని పోలీసురంగంనుంచి మార్చేసేరు. ఈమధ్యనే 'భప్మాచీ'లో తిరుగుబాటుదారులు బయలుదేరి, ఆ ప్రాంతాలన్నీ శ్మశానాలుగా చేసివేసేరు. వ్యవసాయంఅంతా కట్టుబడిపోయింది. పశువులన్నీ ఏమయిపోయినాయో ఒక్కటీ కనపడదు. ఎక్క

డపడితే అక్కడనే, కనపడే ఒంటెలు ఇప్పుడు మచ్చుకికూడాలేవు. రోడ్లు పాడుచేసివేయబడ్డాయి. కాలువలు, గట్లు, తెంపివేయబడ్డాయి. 'ఇరిగేషన్' పూర్తిగా ధ్వంసం అయిపోయింది.

దురంతకులయిన ఈతిరుగుబాటుదారుల్ని అణిచివేయడానికే మమ్మల్ని పంపించేరు.

బండిపోతూంది. నేను కిటికీలోకూర్చుండి ఎదురుగుండా బయలుకేసి చూస్తూన్నాను. ఇంతలో బట్టతల 'ఫెడొరోవు' తనవంతు పూర్తిచేసుకొని, విశ్రాంతితీసుకుందుకు వచ్చి, నాప్రక్కన చదికిలబడ్డాడు. ఆతడుగూడా కిటికీలోంచి బయటికిచూసి, మనుష్యసంచారంలేని ఆప్రాంతాల దురవస్థకి చాలా విచారపడ్డాడు. హఠాత్తుగా ఏదో జ్ఞాపకంవచ్చి నాభుజం తట్టేడు.

"ఆశ్చర్యం ఏమిటి? ఈప్రదేశాలు చూచినాక, 'టాంబోవు' లో— అంథొనోవుబంట్లువేసిన దుర్మార్గాలు ఎన్నోరెట్లు తక్కువ అనిపిస్తూంది. వాటితలదన్నిపోయినాయి ఇక్కడి పరిస్థితులు."

శూన్యంగావున్న ఆమైదానంలోకి కళ్ళు గుచ్చి—గుచ్చిచూసి, తలఎగరేసి మళ్లీ ఆరంభించేడు.

"—వీళ్ళ ముండమోయ!—ప్రజలేమిటి తింటారనుకున్నారో"

—నాకు తెలియక అడుగుతాను!— ఊః—తుంటరిపీనుగలు!—

ఆతడు విచారంతో రెండుచేతులూ బాగా ఎత్తి నెత్తి మొత్తుకున్నాడు. నున్నని నడినెత్తి వేళ్ళతో రుద్దుకుంటూ మరపిరంగిపెట్టెమీదికి ఒరిగేడు. చాలాసేపటిదాకా ఏదో ఆలోచనలోపడి నోరువిప్ప

నేలేదు. తరువాత సర్దుకొని, లేచి, బయటికిచూస్తూన్న నన్ను భుజం పట్టుకొని తనకేసి తిప్పుకున్నాడు.

"మనదేశంలో నాకు ముగ్గురుపిల్లలూ— పెళ్లామూ—వున్నారు. ఒకమంచిఆవు, గిత్తదూడాకూడా, వున్నాయి. సన్యాః నేనిప్పటికి వాళ్లనిచూసి, అయిదేళ్ళుకావస్తూంది. పాపం ఏమిచేస్తూన్నారో? ఏమిటో?....తొలకరిసమయం!....విత్తనాల చల్లికరోజులు!....కాని, చల్లేవాళ్ళు ఏరి? నేనిక్కడనే పడివున్నాను, కదా?"

ఆతనిఅవస్థ నాకేమీ విచారం కలిగించలేదు. అసలు ఆతని వాంఛ యేమిటో నాకు అర్థంకాలేదు. నేను చల్లనిగాలికోసం చొక్కాబొత్తాలు ఊడదీసుకొని, కాళ్లురెండూ బారజాపుకొని బల్ల మీదికి ఒరిగేను.

ఆమైదానాన్ని రెండుగా చీలుస్తూన్న రైలుబాటవెంబడే మాబండి వేగంగా ముందుకుపోతూంది. ఇనుపకవచాన్ని ఒరుసుకుంటూ, కటికీసందులగుండా ఈలలువేసుకుంటూ, పైరుగాలి బండిలోచొరబడుతూంది. ఆగాలి తగిలేటప్పటికల్లా ఒళ్లు చల్లబడి మైకం కమ్ముతూంది.

నేను సరిగ్గా కిటికీ క్రిందపడుకున్నాను. ప్రపంచం అందరివలెనే నేనుకూడా ఆపిల్లవాయువుల సౌఖ్యాన్ని అనుభవిస్తూన్నా. అక్కడినుంచి నన్నుపొమ్మనేవాడు లేడు. అందరివంటివాడినే నేనూను. నాకుకూడా ఆనక్షత్రం— ఆఉన్నిషర్టూఆప్రపట్టీలూ ఈయబడ్డాయి. కొద్దిరోజులక్రితమే నాపేరుకూడా పటాలంలిస్టులో

చేర్చుకున్నారు. మా 'బ్రెయిన్-కమాండర'యిన గార్బుజు నాకుయీ విషారం కావాలని పైకిబ్రాసేడు. అప్పుడే నేనురాజకీయపాఠాలు నేర్చుకుంటున్నాను, కూడా.

నేనిప్పుడు కమేండరుకు నమస్కారంచేస్తే చిరునవ్వుతో స్వీకరించి ఊరుకొనడంలేదు. నిశ్శబ్దంగా ప్రతివందనం చేస్తూన్నాడు.

'ఆర్మర్డు-బ్రెయిన'లో ఇంజను డ్రైవరు'కి నేను అసిస్టెంటుని. పని అవసరాన్నిపట్టి ఒక్కొక్కరోజున ఇరవైనాలుగుఘంటలూ పనిలో ఉండవలసివస్తూంది.

నేనక్కడ పడుకొన్నివుండగానే బొగాటరీవు ఆపెట్టెలోకి ప్రవేశించేడు. ఆతనినడ్డి వికారంగా వొంగివుంది.

"సన్యా! మనపనివచ్చింది. లేచిరా!-"

నేను వెంటనేలేచి ఆతనివెనుక నడిచేను. ఇరవైనాలుగుగంటలసేపు ఏకదీక్షగా పనిచేసి, అప్పుడే ఒక్కఅరఘడియవ్రక్రతమే వెన్నువాల్చేను. ఇంతలో మళ్లీ ఈపిలుపు. కాని, ఇందువలన నాకేమీ విసుగుకలగడంలేదు. తరుచుగా ఈలాగ జరుగుతూనేవుంది. ప్రతిసారీ, మంచిఅవసరం వచ్చినప్పుడెల్లా మమ్మల్ని పిలుస్తూనే వుండేవారు. ఆఅవసరంకూడా తరుచుతరుచుగా వస్తూందేది. రెండో ఇంజనుడ్రైవరుకి బాగా అనుభవంలేదు. పనికికొత్త. గార్బుజ్ అతనిమీద ఆధారపడియుండలేడు.

మేమూ ఇంజనులోనికి వచ్చేటప్పటికి రెండోడ్రైవరు జ్వరంతో వణికిపోతూ 'రెగ్యులేటరు' ప్రక్క చదికిలబడియున్నాడు. పెద

వులు నల్లగావున్నాయి. బుగ్గలనిండా చలికాయలు లేచినాయి. తల భుజాలమీదికి వాలిపోతూంది. చేతితో రెంచికూడా పట్టుకొనలేని స్థితిలో వున్నాడు. పెదవుల్లోంచి సిగరెట్టుపీకె దూరంగా తూలి పోయింది.

బొగాటరీవు ఇంజనులోకి అడుగుపెడుతూ లోనున్నరోగికి వినబడకుండా నెమ్మదిగా–"వీడితలపగల! ఆబోసివాడు మహా దిట్టమైనవాడోయి! తాను కూర్చోడు. ఒకరిని కూర్చోనీయడు".– అన్నాడు.

బొగాటరీవు నావద్ద ఏమిచెప్పడానికీ సంశయించడు. ఈవేళ ప్రొద్దుటే తురకటోపీ–దొంగచూపులూవాడూ ఎవడోగాని, బియ్యపు సారా పట్టుకువచ్చేడు. బొగాటరీవు ఆతడికి కొంచెంకిరసనాయిలు పోసి ఒకసీసాడు సారా దొంగతనంగా కొన్నాడు. ఈవేళసాయం కాలం దానిని మస్తుగాత్రాగి ముసుగుబిగదన్ని పడకవేయాలని చూసేడు. కాని, ఆతని ఆశ ఫలించిందికాదు.

ఆతనికి వోడ్కా–మీద గలఅభిమానం కమాండరుకి తెలియనిది కాదు. ఒకరోజున 'టీ–కెటిల్' కొమ్మునోటపెట్టుకొని త్రాగు తూంటే గార్బజు కంటపడ్డాడు. పోలిష్ రంగానికి పోతూన్న రోజులనాటి మాటయిది. ఆరోజున గార్బజుని చూడగానే ఆతని పైప్రాణాలు పైనే పోయేయి. భయంచేత ఉక్కి–రి–బిక్కి–రిఅయి దగ్గువచ్చింది. నోరువిప్పి దగ్గినాడా దొంగతనం బయటపడి పోతుంది. కనక ఏమాత్రమూ అనుమానం తగలకుండాలని

'కెటిల్' ఖాళీచేస్తేగాని వదిలేడుకాదు. పూర్తిగా త్రాగివేసి, బిరడా బిగించి, నోరుతుడుచుకున్నాడు. భయంతో మొగం తెల్లబడి పోయింది. కళ్ళునీలాలు కమ్ముతూన్నాయి. కాళ్లూ–చేతులూ వణుకుతూన్నాయి.

గార్బుజ్ దేవాంతకుడు. చూపులోనే అసలుసంగతి గ్రహించేడు. కాని, అక్కడనేమీ గోలచేయలేదు. బొగాటరీవును తనఆఫీసుకు రమ్మనిచెప్పి వెళ్ళిపోయేడు. ఆపిలచినది ఎందుకో ఎవరికీ తెలియదు. అక్కడ ఏమిజరిగిందో అంతకన్న తెలియదు. బొగాటరీవయినా ఏమీ చెప్పలేదు. ఏమిజరిగిందయ్యా–అంటే వెర్రిమొగం వేసి, "అబ్బే! ఏమీలేదు. ఇంజనుయొక్క స్థితిగతుల్నిగురించి అడిగేడు అంతే!"–అన్నాడు.

ఆరోజుపోయినాక బొగాటరీవు మరిత్రాగలేదు. కాని, ఏషియా లోకివచ్చేక మనసుపట్టలేకపోయేడు. సీసాడూ కొన్నాడు. ఆదొంగతనం నాకంట బడింది.

"మిషా! నువ్వు దానిని పారపోయకపోతే కమాండరుతో చెప్తా."

బొగాటరీవు హడిలిపోయేడు.

"నన్యా! గార్బుజుకి నేను మాటయిచ్చేను. అతనితో వోడ్కా త్రాగడం మానేస్తానని చెప్పేను. అబ్బే! మళ్ళీ అదితప్పుతానను కున్నావా? ఊరికే దగ్గిరవుంచుకుంటాను. అంతే. 'భస్మాచీ' లో మనపని పూర్తిఅయినాక మనం విజయోత్సవం చేయాలా? వద్దనవు

వవ్వుఅనేదేలేదు. ఎప్పుడునల్లనిరంగువేసిన తోలుచొక్కాలు తొడుగుతాడు. మాటలాడేటప్పుడైనా ఎదటివాడికేసి చూడడు. గట్టిగా మాటలాడడు. ఏమాటఆడినా, ఏఆజ్ఞయిచ్చినా, రహస్యంచెప్పినట్లే. అబోసినోటినుంచి వచ్చేమాటలుకూడా వినబడేవికావు. ఆతనికి కోపంవచ్చినా—గట్టిగామాటలాడినా నరాలన్నీ ఉద్రేకంపొంది, కొన్నివారాలపాటుమంచాన పడియుండవలసివస్తుందని 'రెడ్—ఆర్మీ' సైనికులు చెప్పేరు.

నేనిప్పుడు పూర్తిగా 'ఆర్మర్డు—ట్రెయిన్'కి అలవాటుపడిపోయేను. రాత్రీ—పగలూ అనకుండా తరుచుగా మ్రోగించబడే హెచ్చరికగంటలు నన్నిప్పుడు కంగారుపెట్టడంలేదు. చేయదలచుకుంటే తలమునగాపని. నేనెప్పుడూ కూర్చుండే స్వభావంకాదు. వంటపొయిదగ్గరకిపోయి దుంపలు ఒలిచిఇచ్చేవాడిని. అసిస్టెంటుతోకలిసి మరలలో నూనె పోసేవాడిని. చిన్నచిన్న మరమ్మతులు చేస్తూండేవాడిని. మరఫిరంగులక్రింద కదలడానికిలేకుండా కాపుకుని కూర్చున్న'రెడ్—ఆర్మీ'వాళ్ళకి దాహంఇచ్చేవాడిని. వారందరూ నేనంటే ఎంతో అభిమానం చూపేవారు. "నాయనా!సన్యా!" అంటూ ఎంతో ఆదరించేవారు.

ఇందులోకివచ్చినాకనే నాజీవితంలో మొట్టమొదటిమారుగా నవ్వడం—హాస్యమాడడం అనేవి నేర్చుకున్నాను. ఆకుపచ్చని టోపీమీద అయిదుకోణాలతో ఎర్రని నక్షత్రం మెరిసిపోతూంటే హడావిడిగా బండీలో తిరుగుతూండేవాడిని. త్వరలోనే నాకుకూడా

కత్తి ఇస్తారని ఎంతో ఉబలాటపడేవాడిని. గార్బజ్ కూడా అదేమాట అన్నాడు. పోలుల్ని ఓడించేక తప్పకుండా కత్తి బహుమతీగా ఇప్పించుతానని చెప్పేడు.

బహుశా ఆనాడు పోలులతో యుద్ధం తప్పదని తోచింది. మాబండిలోని సైనికులంతా తప్పకుండా ఆనాడు తీవ్రయుద్ధం జరుగుతుందనే చెప్పుతూన్నారు. నేను అక్కడికివచ్చినాక ఆరోజున చేయబడినన్ని కట్టుదిట్టాలు ఎన్నడూ చూడలేదు. అంత వేగంగా ముందుకి చొరుచుకుపోవనూ లేదు.

ఎక్కడెక్కడ ఎవళ్లెవళ్లు ఏమేమిచేస్తూన్నారో చూడడానికి ఒక్కమారు బండీఅంతా చుట్టివచ్చేను. అర్ధరాత్రి కావచ్చినా ఒక్కడూ నిద్రపోవడంలేదు. 'రెడ్-ఆర్మీ'వాళ్ళంతా బిగువైన దుస్తులతో 'మిషన్-గను'లప్రక్కన ఒరిగివున్నారు. తూటాల బెల్టులు పాములవలె చుట్టలుచుట్టలుగా పడివున్నాయి. మరఫిరంగుల మూతులు ఆసన్నని వెలుతురులో మిలమిలామెరిసిపోతూన్నాయి. బండ్లలోపల వెచ్చగానూ-ఉక్కగానూవుంది. మరఫిరంగులుపెట్టే గవనులు, పెట్టెలద్వారాలు, కిటికీలు, అన్నీ గట్టిగాబిగించి గడియలు వేయబడియున్నాయి. మరఫిరంగిగొట్టాలుదూర్చిన ఇనప పెట్టెలనిండుగా చల్లనినీరు నింపబడింది. ఒక 'రెడ్'సైనికుడు నీటితొట్టె దగ్గర కనిపించేడు. ఉక్కకి ఉడికిపోతూన్న మొగంమీద ఇన్నిచన్నీళ్ళు కొట్టుకుంటూన్నాడు. చెమటలు పడుతూండడంచేత 'కాలరు'గుండీలు ఊడదీసుకున్నాడు.

నేను దగ్గిరికిపోయి ఎంతో స్నేహంతో పలకరించేను.

"ఏం?ఉక్కగావుందా?"

"అబ్బ!చంపేస్తూంది!"

"మరఫిరంగివద్ద కూర్చుంటే విసుగెత్తుతూందా?"

"విసుగుపుట్టదూ? నిజంగా చచ్చిపోతూన్నాను. ఆ'వోల్' (గార్బజ్)ఉన్నాదే మహాజిత్తులమారి."

"జిత్తులమారా?"

"ఆహా!మళ్ళీగుంటనక్కే. మనం అందరం మాటలాడుకునే టట్లయినా నోరువిప్పడు. అంతారహస్యం. ష్-ష్-అంటాడు. అంతే ఏమయితేనేం? ఏంరహస్యాలు చెబితేనేం? మనకి సహాయం చేస్తూన్నాడు. అదేపదివేలు."

"కంగ్....గ్....గ్....గ్."

వెంటనే బొంగురుగొంతులో ఆజ్ఞలు వినబడుతూన్నాయి.

"వేగం తగ్గించాలి.... ఆగవలసినచోటు వస్తూంది....సిద్ధంగా వుండండి"....

మరఫిరంగుల వద్దనున్న సైనికులు సరంజామా చేసుకుంటూ న్నారు. 'రెడ్'సైనికుడు వేవేగంగా తనస్థానం చేరుకున్నాడు. నేను ఇంజనులోనికి పరుగెత్తేను. స్-స్మంటూ ఆవిరివదిలేస్తూన్నారు. అక్కడికి చేరుకొనేలోపుగానే చుర్రుమంటూన్న ఆవిరికి గుడ్డలు తడిసిపోయేయి. బొగాటరీవు నుదుటినుంచి చెమటలు కళ్ళలోకి ప్రవహిస్తూన్నాయి. అతడు కిటికీదగ్గిరికిపోయి, బోల్టులు తప్పించి,

కవచం పైకిఎత్తి బయటికి చీకట్లోకి తలపెట్టిచూసేడు.

నిశ్శబ్దం... నిశ్శబ్దం....బురదగుంటలలో వేరువేరుస్థాయిలలో అరుస్తూన్న బోదురుకప్పలరొదతప్ప ఎక్కడా మనుష్యుల అలికిడి లేదు. లోపల ఇంజనుపొయ్యిలో బొగ్గుఇచిట్టినట్లు చిటచిటలు విని పించేయి ... మంటలు వేస్తూన్నాయి.... ఆచిటపటలు అజాగ్రత్తగా ఎండుపుల్లలమీద అడుగుపెట్టడంచేత కలిగినచప్పుడు కాదుగదా?

'కమిస్సారు'కూడా కిటికీలో తలదూర్చి చెవిఒగ్గి విన్నాడు. కళ్ళునేలలోకిగుచ్చి అడవులలోనుంచివచ్చే ధ్వనులు వినడానికి చెవులు రిక్కించేడు. తరువాత తలుపుమూసి కుర్చీలోకూర్చుని గం టనొక్కేడు.

"అంతా మామూలుగానే వుంది....అనుమానించతగినది ఏమీ లేదు....బహుశా శత్రువుల వెనుకభాగంలో వున్నామని తలు స్తాను ...మనం వెళ్ళవలసినదూరానికి రెండురెట్లుపైగా వచ్చేము.... ఏమిటి?....ఎరవేసి లాగుతూన్నారేమో నంటారా?....అయితే ఏమి చేద్దాం?....మరి...."

బొగాటరీవు కమిస్సారు దగ్గిరికిపోయి, ఇంజనువెలుపలిభా గాలు పరీక్షించిరావడానికి అనుమతికోరేడు. 'కమిస్సారు'టెలిఫో నులో 'కమాండరు'తో సంప్రదించేడు. వెంటనే అనుమతిచిక్కింది. బండి ఆగింది.

అసిస్టెంటు సుత్తి-నూనెడబ్బా తీసుకొని, ద్వారంతాళంతీసి, ఇనుపకవచం బోల్టులుతీసి. నిశ్శబ్దంగా క్రిందికిదిగి నన్నుకూడా పిలి

చేడు. అతనివెనకనే నేనూ నేలకి ఉరికేను. త్రాగినవాడికిమాదిరిగా కాళ్లతడబడి తూలిపోయేను.

"రైలులో చాలాదూరం ప్రయాణంచేస్తే అలాగేవుంటుంది"— అన్నాడు అతడు.

ఇద్దరం ఒక్కనిముషం అక్కడే నిలబడి అరణ్యంకేసి చూసేము. ఎక్కడా ఏవిధమైన అనుమానకారణాలూ లేవు. మా నెత్తిమీదికంటా చెట్లకొమ్మలువంగి చీకట్లు కలిగిస్తూన్నాయి.

"అబ్బః ఈఅరణ్యాలంటేనే అసహ్యం"— అంటూ అసిస్టెంటు తలవూపుతూ కవచంఎత్తి బండిక్రిందికి దూరేడు. సుత్తితో ఒకటి రెండుమారులు చప్పుడుచేసి, ఆతురతతో నన్ను దగ్గిరికి పిలిచేడు.

"బేరింగులు కాలిపోతూన్నాయి. రొట్టెలు కాల్చుకోవచ్చు. మూత లువదులుచేసి నూనెపోయాలి. డబ్బా తీసుకురా."

నేనువేగంగా ఇంజనుకేసి నడుస్తూన్నాను. హఠాత్తుగా అడవిలో కలకలం బయలుదేరింది. తుపాకులు కాల్చిన చప్పుడు. అక్కడక్కడ వెలుగులు వేయబడ్డాయి.

ఇంజనుక్రిందినుంచి వేగంగారమ్మని అతనిని పిలిచి నేను తలుపులకేసి పరుగెత్తేను. అసిస్టెంటు క్రిందనుంచి బయటికివచ్చి గాలిలో చేతులు తిప్పుకుంటూ మెట్లకేసి వచ్చేడు. ఇంక ఎంతో దూరంలేదు. నాలుగడుగులలో ఇంజనులోకి వచ్చేసేవాడే. హఠాత్తుగా కాళ్ళువణికి వెర్రిమూలుగు మూలిగి క్రిందపడిపోయేడు.

నేను ద్వారంప్రక్కనున్న ఊసపట్టుకొని మొదటిమెట్టుమీద

కత్తి ఇస్తారని ఎంతో ఉబలాటపడేవాడిని. గార్బజ్ కూడా అదేమాట అన్నాడు. పోలుల్ని ఓడించేక తప్పకుండా కత్తి బహుమతీగా ఇప్పించుతానని చెప్పేడు.

బహుశా ఆనాడు పోలులతో యుద్ధం తప్పదని తోచింది. మాబండిలోని సైనికులంతా తప్పకుండా ఆనాడు తీవ్రయుద్ధం జరుగుతుందనే చెప్పుతూన్నారు. నేను అక్కడికివచ్చినాక ఆరోజువ చేయబడినన్ని కట్టుదిట్టాలు ఎన్నడూ చూడలేదు. అంతవేగంగా ముందుకి చొరుచుకుపోవనూ లేదు.

ఎక్కడెక్కడ ఎవళ్లెవళ్లు ఏమేమిచేస్తూన్నారో చూడడానికి ఒక్కమారు బండీఅంతా చుట్టివచ్చేను. అర్ధరాత్రి కావచ్చినా ఒక్కడూ నిద్రపోవడంలేదు. 'రెడ్—ఆర్మీ'వాళ్ళంతా బిగువైన దుస్తులతో 'మిషన్—గను'ల ప్రక్కన ఒరిగివున్నారు. తూటాల బెల్టులు పాములవలె చుట్టలుచుట్టలుగా పడివున్నాయి. మరఫిరంగుల మూతులు ఆసన్నని వెలుతురులో మిలమిలామెరిసిపోతూన్నాయి. బండ్లలోపల వెచ్చగానూ—ఉక్కగానూవుంది. మరఫిరంగులుపెట్టే గవనులు, పెట్టెలద్వారాలు, కిటికీలు, అన్నీ గట్టిగాబిగించి గడియలు వేయబడియున్నాయి. మరఫిరంగిగొట్టాలుదూర్చిన ఇనప పెట్టెలనిండుగా చల్లనినీరు నింపబడింది. ఒక 'రెడ్'సైనికుడు నీటితొట్టె దగ్గర కనిపించేడు. ఉక్కకి ఉడికిపోతూన్న మొగం మీద ఇన్నిచన్నీళ్ళు కొట్టుకుంటూన్నాడు. చెమటలు పడుతూండడం చేత 'కాలరు'గుండీలు ఊడదీసుకున్నాడు.

నేను దగ్గిరికిపోయి ఎంతో స్నేహంతో పలకరించేను.

"ఏం?ఉక్కగావుందా?"

"అద్భుతం పేస్తూంది!"

"మరఫిరంగివద్ద కూర్చుంటే విసుగెత్తుతూందా?"

"విసుగుపుట్టదూ? నిజంగా చచ్చిపోతూన్నాను. ఆ'పోల్' (గార్బజ్)ఉన్నాడే మహాజిత్తులమారి."

"జిత్తులమారా?"

"అహా!మళ్ళీగుంటనక్క. మనం అందరం మాటలాడుకునే టట్లయినా నోరువిప్పడు. అంతారహస్యం. ష్-ష్-అంటాడు. అంతే ఏమయితేనేం? ఏంరహస్యాలు చెబితేనేం? మనకి సహాయం చేస్తూన్నాడు. అదేపదివేలు."

"కంగ్....గ్....గ్....గ్."

వెంటనే బొంగురుగొంతులో ఆజ్ఞలు వినబడుతూన్నాయి.

"వేగం తగ్గించాలి.... ఆగవలసినచోటు వస్తూంది....సిద్ధంగా వుండండి"....

మరఫిరంగుల వద్దనున్న సైనికులు సరంజామా చేసుకుంటూ న్నారు. 'రెడ్'సైనికుడు వేవేగంగా తనస్థానం చేరుకున్నాడు. నేను ఇంజనులోనికి పరుగెత్తేను. స్-స్మంటూ ఆవిరివదిలేస్తూన్నారు. అక్కడికి చేరుకొనేలోపుగానే చుర్రుమంటూన్న ఆవిరికి గుడ్డలు తడిసిపోయేయి. బొగాటరీవు నుదుటినుంచి చెమటలు కళ్ళలోకి ప్రవహిస్తూన్నాయి. ఆతడు కిటికీదగ్గిరికిపోయి, బోల్టులు తప్పించి,

కవచం పైకిఎత్తి బయటికి చీకట్లోకి తలపెట్టిచూసేడు.

నిశ్శబ్దం... నిశ్శబ్దం....బురదగుంటలలో వేరువేరుస్థాయిలలో అరుస్తూన్న బోదురుకప్పలరొదతప్ప ఎక్కడా మనుష్యుల అలికిడి లేదు. లోపల ఇంజనుపొయ్యిలో బొగ్గుఇచిట్టినట్లు చిటచిటలు విని పించేయి ... మంటలు వేస్తూన్నాయి.... ఆచిటపటలు అజాగ్రత్తగా ఎండుపుల్లలమీద అడుగుపెట్టడంచేత కలిగినచప్పుడు కాదుగదా?

'కమిస్సారు'కూడా కిటికీలో తలదూర్చి చెవిఒగ్గి విన్నాడు. కళ్ళునేలలోకిగుచ్చి అడవులలోనుంచివచ్చే ధ్వనులు వినడానికి చెవులు రిక్కించేడు. తరువాత తలుపుమూసి కుర్చీలోకూర్చుని గం టనొక్కేడు.

"అంతా మామూలుగానే వుంది....అనుమానించతగినది ఏమీ లేదు....బహుశా శత్రువుల వెనుకభాగంలో వున్నామని తలు స్తాను ...మనం వెళ్ళవలసినదూరానికి రెండురెట్లుపైగా వచ్చేము.... ఏమిటి?....ఎరవేసి లాగుతూన్నారేమో నంటారా?....అయితే ఏమి చేద్దాం?....మరి...."

బొగ్గుటరీవు కమిస్సారు దగ్గిరికిపోయి, ఇంజనువెలుపలిభా గాలు పరీక్షించిరావడానికి అనుమతికోరేడు. 'కమిస్సారు'టెలిఫో నులో 'కమాండరు'తో సంప్రదించేడు. వెంటనే అనుమతిచిక్కింది. బండి ఆగింది.

అసిస్టెంటు సుత్తీ-నూనెడబ్బా తీసుకొని, ద్వారంతాళంతీసి, ఇనుపకవచం బోల్టులుతీసి. నిశ్శబ్దంగా క్రిందికిదిగి నన్నుకూడా పిలి

చేడు. అతనివెనకనే నేనూ నేలకి ఉరికేను. త్రాగినవాడికిమాదిరిగా కాళ్లతడబడి తూలిపోయేను.

"రైలులో చాలాదూరం ప్రయాణంచేస్తే అలాగేవుంటుంది"– అన్నాడు అతడు.

ఇద్దరం ఒక్కనిముషం అక్కడే నిలబడి అరణ్యంకేసి చూసేము. ఎక్కడా ఏవిధమైన అనుమానకారణాలూ లేవు. మా నెత్తిమీదికంటా చెట్లకొమ్మలువంగి చీకట్లు కలిగిస్తున్నాయి.

"అబ్బ! 'ఈఅరణ్యాలంటేనే అసహ్యం"– అంటూ అసిస్టెంటు తలవూపుతూ కవచంఎత్తి బండిక్రిందికి దూరేడు. సుత్తితో ఒకటి రెండుమారులు చప్పుడుచేసి, ఆతురతతో నన్ను దగ్గిరికి పిలిచేడు.

"బేరింగులు కాలిపోతూన్నాయి. రొట్టెలు కాల్చుకోవచ్చు. మూత లువదులుచేసి నూనెపోయాలి. డబ్బా తీసుకురా."

నేనువేగంగా ఇంజనుకేసి నడుస్తున్నాను. హఠాత్తుగా అడవిలో కలకలం బయలుదేరింది. తుపాకులు కాల్చిన చప్పుడు. అక్కడక్కడ వెలుగులు వేయబడ్డాయి.

ఇంజనుక్రిందినుంచి వేగంగారమ్మని అతనిని పిలిచి నేను తలుపులకేసి పరుగెత్తేను. అసిస్టెంటు క్రిందనుంచి బయటికివచ్చి గాలిలో చేతులు తిప్పుకుంటూ మెట్లకేసి వచ్చేడు. ఇంక ఎంతో దూరంలేదు. నాలుగడుగులలో ఇంజనులోకి వచ్చేసేవాడే. హఠాత్తుగా కాళ్ళువణికి వెర్రిమూలుగు మూలిగి క్రిందపడిపోయేడు.

నేను ద్వారంప్రక్కనున్న ఊసపట్టుకొని మొదటిమెట్టుమీద

కాలుపెట్టి వెనక్కితిరిగిచూసేను. చాలామంది కట్టదిగువనుంచి రోజుకుంటూ పరుగెత్తివస్తూన్నారు. ఇంజనుకేసి ఉరకలు వేసు కుంటూ వస్తూన్నారు. నేను చట్టుక్కున పైమెట్టుమీదికి ఎగిరేను. ఎవరో నాజుట్టుపట్టుకొని లోనికి లాగేసుకొన్నారు. ఆవిసురుకి నేను ఇంజనులో వెల్లకిలా బడిపోయేను. కవచంబోల్టులు, ద్వారం ఘడియలు, టకటకా పడిపోయేయి. తాళం 'క్లిక్' మంది.

బొగాటరీవు ఆశ్చర్యంతో నాకేసిచూసేడు. ఆతడు ఆసిస్టెంటు కోసం మనుష్యుల్ని పంపమని 'కమిస్సారు' ను అడిగేడు.

టెలిఫోనులో 'కమేండరు' ఆజ్ఞలు వింటూన్న 'కమిస్సారు' తలకూడా తిప్పలేదు. ఆఖరున 'రిసీవరు' క్రిందపెడుతూ—"సరే కామ్రేడ్ కమాండర్"— అంటూ కుర్చీలో సర్దుకున్నాడు.

ఈమారు 'బొగాటరీవు' కి ఆజ్ఞలు ఈయబడసాగేయి.

"పూర్తివేగంతో బండి.... వెనక్కి........."

బొగాటరీవు కదలలేదు.

ఎంతో మృదువుగా ఆ ఆజ్ఞనే కమిస్సారు మళ్ళీ ఉచ్చరించేడు.

"పూర్తి వేగంతో........వెనక్కి...."

డ్రైవరు ఎంతో విచారంతో —నెమ్మదిగా— ఇంజనులోకికదిలేదు. 'కమిస్సారు' కి చాలాకోపం వచ్చింది. ఆతనికంఠంలో ఈమారు మార్దవంలేదు.

"ఇదేఆఖరుమారు........వెనక్కి........వేగం.........."

'కమిస్సారు' చేయి మొలనున్న రివాల్వరుమీదికిచేరింది.

ఆవేశంతో పెదవులు వణికేయి. తలఅంతా చెమటలుపట్టి టోపీ తడిసింది.

బొగాటరీవ్ గబగబా ఇంజనులోకి పోయి, 'లివర్' చేత పట్టుకొని, 'రెగ్యులేటరు' తిప్పేడు. ఇంజను బఫ్–బఫ్ మంటూ వెనక్కి వేగంగా పరుగెత్తింది.

కమిస్సారు కుర్చీలోనుంచిలేచివచ్చి మూలనున్న గరిటె నాచేతిలో వుంచేడు.

"సన్యా! నువ్వుకూడా కాస్త సాయంచేయి నాయనా!"

గరిటె పెద్దది. నాయెత్తువుంది. చాలాబరువు. దానితో చే అతికష్టంతో మంటలు ఎగసనదోస్తూ, మరొకమూల బోయిలరు లోనికి నీరుకూడా ఎక్కించుతూన్నాను. ఆయాసంవచ్చింది. కను రెప్పలు మూతలుబడిపోతూన్నాయి. ఎదురుగావున్న 'ఎయిర్–గాజ్'ను గాని, జనాన్నిగాని, చూడలేకుండావున్నాను. కళ్లు చీకట్లు కమ్ముతూన్నాయి. పనిచేస్తూ, చేస్తూ ఒక్కొక్కమారు మోకాళ్లమీద చేతులు చాచుకొని గొంతుకూర్చుండిపోతూన్నాను. అలాంటిసమయాలలో బొగాటరీవు నాకు సహాయంచేయడానికి పరుగెత్తివచ్చేవాడు. ఒక్కనిముషంపోయేక నేను ళ్ళు విరుచుకొని లేచి, ఇంజనుపొయ్యిలోకి బొగ్గులు విసిరేవాడిని. 'బోయిలరు'కు నీరు ఎక్కించేవాడిని. బొగాటరీవు తనపనిలోకిపోయేవాడు. ఎక్కువశ్రమమూలంగా అసలే కదలలేనేమోనని బొగాటరీవు నన్నుగురించి భయపడుతూన్నాడు.

అక్కర్లేదు. ఆలాగ అలవాటయిపోయింది. చావమంటావా? ఈఅలవాటు ఈవేళా—నిన్ననూ వచ్చినదా? ఇరవై ఏళ్ళనుంచి. ఇంజనులో బొగ్గువేసేవాడినిగా ఉన్ననాటినుంచీ. ప్రొద్దుటి భోజనంతో ఒకగ్లాసు. మధ్యాహ్నం ఒకగ్లాసు. బండినడిపేటందుకు వెళ్ళేముందు రెండుగ్లాసులు. —ఇదిగో చూడు! మనపని వుందే, నిప్పులలో ఆ స్తమానం పడివుండాలి. అప్పుడూ—అప్పుడూ కాస్త గొంతుక తడిచేసుకోకపోతే బ్రదుకగలమా?"

"కూడదు! కూడదు!!"

"నోరుమూయి! ఇంక మాట్లాడకు. అప్పుడూ—అప్పుడూ ఊరికే ఒక్క ఉగ్గుగిన్నెడుమాత్రం. అంతకంటె ఎక్కువవద్దులే! నీకు అనుమానంవుంటే సీసా నీదగ్గిరేవుంచు. ఇదిగో............ ఎవ్వరూ దగ్గిరలేనప్పుడు నీచేతితోటే పుడిసెడు—పుడిసెడుచొప్పున ఇస్తూండు."

బొగాటరీవు ఆసీసా నాచేతిలో పెట్టేసేడు. నేను విస్తుపోయి ఆలోచిస్తూంటే తలుపుచప్పుడు అయింది. వెంటనే ఎవరయినా చూస్తారేమోననే భయంతో దానిని వంట్లం జేబులలో తోపేసేను.

అవచ్చినది గార్బజే. ఆతడు మావద్దనుంచి ముందుకు సాగి పోయేడు. గార్బజు నావద్దకు వచ్చినపుడు సీసా ఆతనిచేతికి అందిం చుదామనుకున్నాను. కాని, బొగాటరీవు తనను బయటపెట్టవద్దని కోరుతూన్నట్లు వెర్రిచూపులు చూస్తూన్నాడు.

నాచేయి లేవలేదు ....కమాండరు వెళ్ళిపోయేడు. మళ్ళీ ఆసీసా

బొగాటరీవుకే ఇచ్చేసేను. ఆతడు పని ఇంతరద్దీగా వుండగా త్రాగడు. త్రాగుతాడే అందాము. అప్పుడుఇంక చేసేదిమాత్రం ఏముంది? గార్బజ్‌వచ్చినప్పుడు ఈయక ఇప్పుడు అందించబోవడం పొరపాటు. ఇందాకానే ఆపని ఏలచేసేవుకాదని నామీదపడతాడు. బహుశా దానివి ఏమూలకో పారవేయించేవాడినే. కాని, ఇంతలో పిలుపురావడంచేత అవకాశం లేకపోయింది. మళ్లీ సాయంకాలం పూట చూసుకోవచ్చునని అక్కడినుంచి లేచిపోయేను.

ఆరోజంతా బొగాటరీవుని ఒకకంట కనిబెడుతూనేవున్నాను ... బండి అతివేగంగా పోతూంది. బొగాటరీవు కవచం తప్పించి బయటికి కిటికీలోనుంచి చూస్తున్నాడు.

ఆరోజున ప్రొద్దుటినుంచీ ఎక్కడా చెట్టూ—చేమా కనపడడం లేదు. పెద్ద ఇసుక—ఎడారి. రైలుకట్టకి ఆవైపునా ఈవైపునా విశాలమైన 'కారా—ఖుమ్'ఎడారి వ్యాపించివుంది.

రైలువేగానికి ఇసుకతెరలు మేఘాలల్లే లేస్తున్నాయి. పగటి భాగంఅంతా సుడిగాలులు పూర్తిగా ఇసుకతెరలలో ముంచివెత్తి ఇప్పుడిప్పుడే వదిలేయి.

బొగాటరీవు తల ఈవలకుతీసుకొని, కళ్లు నలుపుకుంటూ— "ఎక్కడికిపోతూన్నామో—ఎక్కడనున్నామోకూడాతెలియడంలేదు. ఏదయినా ఒకచిన్నదెబ్బ తగిలిందంటే చచ్చేమన్నమాటే—"అంటూన్నాడు.

ఆతనిమాటలింకా పూర్తికాలేదు. ఇంజనుయొక్క ముందు

చక్రాలు దేనిమీదినుంచో దుమికినట్లయింది. బొగాటరీవు తూలిపడ కుండా కిటికీ గట్టిగా పట్టుకున్నాడు. ఆఅదిరిపాటులో నాతల వెను కనున్న ఇనపగొట్టానికి కొట్టుకుంది. నొప్పికి కెవ్వుమని ఆర్చేను. ఏదోసీసా తలక్రిందులయిపోతూన్నట్లు తోచింది. ఇంజనులోంచి ఆవిరి 'బుస్-స్'మంటూ బయటికిపోతూంది. మొగంఅంతా కుమ్ము లోపెట్టినట్లు మండిపోతూంది. 'వాటర్-గాజ్' బద్దలయిపోయిందని వెంటనే గ్రహించేను. ఇంజనుపొయ్యి కణకణలాడుతూన్న నిప్పు లతో సరిగ్గా నానెత్తిపైన కనిపిస్తూంది. అది అక్కడికి ఏలాగున వచ్చిందో గ్రహించలేకపోయేను. నాలుగుమూలలా చప్పట్లు, మూలుగులు, వినిపిస్తూన్నాయి. క్రమంగా నాకు స్మృతి తప్పింది.

కొద్దిసేపటికే మళ్లీ స్మృతివచ్చింది. విపరీతంగా దాహం అవు తూంది. కళ్ళుతెరచిచూచి పొగలు చిమ్ముతూన్న ఇంజనులోపడి వున్నట్లు గ్రహించేను. కాళ్లరెండూ తడిగావున్నాయి. విరిగిపోలేదు కదాయని తడిమిచూచుకున్నాను. ఫరవాలేదు. ఎముకలేవీ విరిగినట్లు లేవు. నాప్రక్కనే నూనెడబ్బా తలక్రిందులుగా పడివుంది. దాంట్లో నుంచి నల్లని మడ్డినూనె ప్రవహిస్తూంది. అక్కడనుంచి కదిలిపోదా మనుకున్నాను. సాధ్యపడిందికాదు. చేతులూ-కాళ్లూవిరుగకపోయినా స్వాధీనంలోమాత్రం లేవు.

"మంచినీళ్ళు...."

-నోరుతెరిచి ఉబ్బిననాలుక చాచేను. అది కంఠనాళాన్ని పూర్తిగా అడ్డుకోవడం మూలాన దగ్గుతెర వచ్చింది. నోరు ఎంతో

వేడిగావుంది. నోటినిండా బూడిదే.

"మంచినీళ్లు...."

చేతికి దగ్గరలోనే గుర్రంఒకటిసకిలించింది. ఆతరువాత ఇం కొకటి. తరువాత మరొకటి. గుర్రపు కళ్లెములచప్పుడు. కొత్త జీనుల కిరకిరలు. ఇదివరకు ఎన్నడూ వినియుండని పెద్దపెద్దగొం తుకలు నాచెవినిబడ్డాయి.

పూర్తిగా తెలివివచ్చింది. మూలగడంసంగతికూడా మరచి పోయి, ఆశబ్దాలని శ్రద్ధగా వింటున్నాను. అప్రయత్నంగా నానోట "మంచినీళ్లు–" అనేమాట వెలువడింది.

ఎవ్వరిదోచేయి నానోరును మూసింది.–"హుష్! మాట్లాడకు– అన్నాడు ఆతడు.

స్వరాన్నిపట్టి గార్బజును గుర్తుపట్టేను. తిరగబడిన బండి క్రిందినుంచి దూరివచ్చి, ఆబొగ్గులలో ఏమిటో వెదుకుతున్నాడు.

"ఇంకా ఎవరయినా వున్నారా ఇక్కడ"

"లేరు."

ఆతడు నన్ను లేవదీసి నారెండుచేతులూ తనమెడచుట్టూ వేసు కొని, నన్నీడ్చుకుంటూ పాకి బయటికి లాగుకొనివచ్చేడు. ఆతని చేయిఒకటి విరిగిపోయినట్లు ఊగులాడుతూంది. భుజాలు వెచ్చగా వున్నా తడిగావున్నాయి. ఆస్థితి చూసేటప్పటికి నాగుండెలు ఝల్లు మన్నాయి. వెర్రికేకపెట్టేను. గార్బజు అదిరిపడిచూసేడు.

"వాళ్ళువింటారు. మాట్లాడకు."

మేము నెమ్మదిగా పాకి ఒక ఇసుకగోతిలోకి చేరుకున్నాం. మాకంటె ముందుగానే అందులో ఇద్దరు'రెడ్' సైనికులు ఉన్నారు. నెరిసినజుట్టునుపట్టి'బొగాటరీవ్' నీ, బట్టతలనుపట్టి'ఫెడొరోవు'నూ గుర్తించేను. మేము వెళ్ళేటప్పటికి వాళ్లు తెగమూలుగుతూన్నారు.

గార్బజ్ ఇసుకగోతిలోనికి వచ్చేక మళ్లీ అధికారం స్వీకరించేడు.

"వేగం, లేవండి. వాళ్లు వెలుగులు వేసుకుని వస్తూన్నారు."

అతనిస్వరం నీరసంగా— బొంగురుపోయి ఉంది.

కమేండరు నెమ్మదిగా ఇసుకగోతిమీదికి ఎక్కేడు. అతని వెనక్కాలనే మేమూ పాకేం. వేడిఇసక మాకళ్ళలోకి చిమ్ముకుంటూంది.

గార్బజు ఎక్కడా ఆగకుండా ఎడారికి అడ్డపడి పాకిపోతూన్నాడు. అతనివెనక్కాలనే పాకివస్తూన్నాం.

ఇసకగుట్టల చాటుగాచూసుకొని మేము వెళ్ళుతూన్నాం. ఆగుట్టలు మమ్మల్ని ఇతరుల కంటబడకుండా అడ్డుగలిగినాయేగాని, గాలిపాటునుంచి సంరక్షించలేకపోయినాయి. మైదానంమీదుగా, అదృశ్యములయిన తనదెక్కలతో ఇసుకరేపుకుంటూ, వాయువు వెర్రినాట్యం చేస్తూంది.

మేము సరిగ్గా దానికి దారిలోవున్నాం. తుపాను అంతకంతకి బలపడుతూంది.

గార్బజు ఆఖరుకి విలువబడిపోయి రెండుచేతులతోటీ మొగం

కప్పుకున్నాడు. మోకాళ్లమీద పాకివస్తూన్న పెదరోవ్వూ— బొగాట రీవ్వూ—చాపచుట్టుగా దొర్లిపోయేరు. బహుశా వాళ్ళు పెద్దపెద్ద అర్పులే అర్చివుంటారు. గాని, నాచెవికి సన్న నిమూలుగులు మాత్రమే వినబడ్డాయి.

...గాలి కొంచెం ఆగింది. గార్బుజు తలతిప్పి మాకేసిచూసి మళ్లీ ముందుకి సాగేరు. కొంచెందూరంవెళ్లేక కుడివేపుకి తిరిగేడు.

కాని.... మేమూ కదలగానే గాలిఅందుకుంది. ఆగాలివిసురుకి మేమంతా చుట్టచుట్టుకొని ఒకపెద్దఇసకగోతిలోకి దొర్లిపోయేం. లోపల ఛాలాచల్లగావుంది. గాలివిసురు అక్కడికి ఏమాత్రమూ తగలడంలేదు. నేనునాలుగుమూలలూ శ్రద్ధగా పరిశీలించేను. నిటారుగావున్న అగట్లూ—అప్రదేశమూ గుర్తుకి వచ్చేయి. ఇందాకా ఎక్కడ బయలుదేరేమో ఆబండీదగ్గిరికే తిరిగితిరిగివచ్చేము. గార్బుజు అందులోనుంచి పైకి ఎక్కడానికి కాళ్లూ చేతులూ వ్యర్థంగా కదుపుతూన్నాడు.

కాని....ఆమెత్తని ఇసకలో ఆతనికి ఏమాత్రమూ పట్టుదొరకడంలేదు. కొంచెం ఎక్కేటప్పటికల్లా ఇసుకదిగజారి తనతోపాటు ఆతనినికూడా వెనక్కి ఈడుస్తూంది.....మళ్లీ ఎక్కేడు.....ఇసుక ఆతనిని క్రిందికి తెచ్చింది....మళ్ళీ ప్రయత్నం....మళ్ళీ మొదటికి....

ఆఖరుకి గార్బుజ్‌కూడా ఓడిపోయేడు. చేతులు బారజాపుకొని ఆఇసకలో వెల్లకితలా బడిపోయేడు. ఆతనిగుండెలమీదికీ— గడ్డం

లోనికీ ఇసక పోగుపడింది. ఆతడు దానిని ఏమాత్రమూ అడ్డుపెట్ట లేకపోయేడు. ఆతనికి ప్రక్కనే బొగాటరీవు–ఫెడొరోవు పడియున్నారు. వాళ్ళలో ఏమాత్రమూ చైతన్యంలేదు. నేను పాకివెళ్ళి వాళ్ళని పిలిచేను. ఎవ్వరూ పలకలేదు. ఇంకఅక్కడ వుండడానికి మనస్కరించిందికాదు. నామట్టునకయినా ఆగోయిఎక్కిపోదామని ఇంకోమూలనుంచి ప్రయత్నించేను. ఇసకజారలేదు. పట్టుదొరికింది. కొంతదూరం ఎక్కివెవక్కితిరిగిచూచేను. ఎవ్వరూనా వెనకబడలేదు. ఎక్కడివారక్కడే బడియున్నారు. నేను మళ్ళీదిగేను. గార్బజు తలవూపి ఏదోసంజ్ఞచేసేడు. పెదవులు నాకుకున్నాడు. గుండెలపై పోగుపడ్డ ఇసుకతెరపైకీ–కిందికీ ఊగుతూంది. బొగాటరీవు కదిలి నన్నుదగ్గిరికి లాగుకున్నాడు. ఏదో మాటలాడబోయేడు. నోటిచెంబకీ వెచ్చనిగాలి నాముగానికి వచ్చితగిలింది.

"సన్యా! జేబులోవుంది సీసా. పైకితీయి. ఇంతవరకు ముట్టుకోనయినాలేదు."

ఆతని చొక్కాతకిమి జేబులోంచి సీసా పైకిలాగేను. అది ఎంతో చల్లగానూ–నున్నగానూ వుంది. చేతిప్రేళ్లు కొంకర్లుపోతూన్నట్లున్నాయి. కదిలివప్పుడల్లా లోపలిద్రవం మెరిసిపోతూంది. అది కంటపడ్డాక ఇంక నిలువలేకపోయేను. బిరడా రావడంలేదు. వెంటనే మొలదట్టీలోవున్న రివాల్వరుపైకిలాగి దానిపిడితో సీసామూత ఊడగొట్టి, వెంటనే నోటికి తగిలించేను. వాసనగాని, రుచిగాని, తెలియడంలేదు. గొంతుక తడిసింది. గుండెలు సర్దుకున్నాయి.

కాళ్ళలోను, చేతులలోను, జీవచేరుకుంది.

నాలుగుగుక్కలు నేనుతాగి సీసా గార్బజుదగ్గిరికి తీసుకువెళ్ళేను. ఇసకలో కప్పడిన ఆతనిపెదవులకోసం చీకట్లో తడిమేను పెదవులు విప్పి సీసా నోటికి తగిలించి, కొంచెంఎత్తేను.

గార్బజు ఆతురతతో సీసాను నొక్కిపట్టి గుటకలువేసేడు. రక్తం వేడిఎక్కింది. రుచితెలిసింది. అసహ్యంతో నోటిలోనున్నది నాముొగాన ఉమ్మివేసేడు.

"ఛరీః దొంగవెధవః నిన్ను 'కోర్టు–మార్షల్' చేయించినా పాపంలేదు. వోడ్కా తెచ్చేవటరాః"

గార్బజు సీసా విసిరి దూరంగా పారేసేడు.

నామనస్సు కొంచెం కుదుటబడింది. మళ్ళీ ఇసకగుట్టకి ఎగబ్రాకేను.

ఆర్మర్డు–ట్రెయినుకి ఆవలివైపున తుపాకులు పేలుతూన్న చప్పుడు వినిపిస్తూంది. 'రెడ్'సైనికులు శత్రువుల్ని కాల్చి తరుముతూన్నారు. మేము ఆధ్వని వస్తూన్న వైపుకి నెమ్మదిగా పాకిపోయేము.

★ ★ ★ ★

మరునాడుప్రొద్దుటే విరిగి మెలికలుతిరిగిపోయిన 'ఆర్మర్డు–ట్రెయిను' మరమ్మతులకి బయలుదేరింది. గార్బజు నన్ను పటాలంలోనుంచి గెంటివేసేడు. ఆతడు కారణం ఏమిటో పైకి చెప్పకపోయినా నాకుమాత్రం బాగాతెలుసును. ఆవెధవవోడ్కాసీసాయే

ఇంతఘాత తెచ్చిపెట్టింది. ట్రెయిన్ వెళ్లిపోతూంటే నేనుదిక్కు మొగం వేసుకొని స్టేషనులో ప్లాట్ ఫారంమీదనిలవబడ్డాను. నాకళ్లు చెమ్మగిల్లినాయి. ఒకపెద్ద ఇసుకపఱ్ఱలో కొత్త మొగాల నడిమిని వదిలివేయబడ్డాను.

## ఇరవై ఒకటో ప్రకరణం.

ఏదోమారుమూలస్టేషనులో 'ఇంటర్నేషనలు ఎక్స్ప్రెస్' నీరు వింపుకొనడానికి ఆగింది. ఆసమయంలో ఇద్దరు మనుష్యులు దాని లోకిప్రవేశించేరు.

వాళ్ళు స్టేషనుకి ఎదురుగావున్న మైదానానికి అడ్డపడివచ్చి, బండీక్రింద కీనీడలో అంటిపెట్టుకొనికూర్చుండి, బండికదిలేక పాకి వచ్చి నెమ్మదిగా ఇనుపనిచ్చెనమీదుగా పైకిఎక్కి నిశ్శబ్దంగావున్న పెట్టెలలోకి ప్రవేశించేరు.

వాళ్ళిద్దరూఅంటే కొత్తవాళ్ళుకాదు.ఒకడు 'వింగ్సు'. రెండోది ఆతనిశిష్యుడనయిన నేను. ఆఏడాది వేసవికాలంలో 'వింగ్సు'ను మధ్యఏషియాలో కలుసుకున్నాను. అర్మర్డు-ట్రెయిన్‌లోనుంచి గెంటివేసేక నాకు ఏమిచేయడానికీ తోచిందికాదు. పరిస్థితులు సాను కూలపడేదాకా 'వింగ్స్'తో కాలక్షేపం చేయడమే మంచిదని

తోచింది.

ప్రస్తుతం మావని రైళ్లచక్కబెట్టడమే।

ఏదో మారుమూలస్టేషనులో ఆరోజున 'ఎక్స్ప్రెస్'కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాం. మేము స్టేషనుకి వచ్చేటప్పటికి బాగా పొద్దువుంది. చీకటిపడ్డాకగాని, 'ఎక్స్ప్రెస్' రాదు.

ఒక 'లైన్'మీద రెండుమార్లుప్రయత్నించడం మాపద్ధతికాదు. ప్రతీమారూ దోపిడీవలన వచ్చినడబ్బును పూర్తిగా త్రాగివేస్తేగాని, బయలుదేరేవాళ్ళం కాము. క్రిందటిమారు 'టిఫలిస్'ట్రెయిన్‌లో దిట్టంగా కొట్టేము. ఈమారు మళ్లీ 'మంచూరియన్‌ఎక్స్ప్రెసు'కి సిద్ధం.

దట్టంగా మంచుకురుస్తూంది. కోడిగుడ్డు ఆకారంగావున్న రైలుపెట్టెలకప్పులు దట్టంగా మంచుతో కప్పబడి 'స్కేటింగ్-గ్రౌండ్'లాగ వున్నాయి. కాలిబూట్లలోనుంచికూడా చలి లోనికి ప్రవేశించి నరాల్ని కొరికివేస్తూంది. వట్టిపైజామాలు తొడిగి దుప్పట్లుమాత్రం కప్పుకొనివుండడంచేత మరీబాధగా వుంది. బందిపోటు లావాదెవ్వడయినా చూచినా అనుమానం లేకుండడానికి ఆదుస్తులు వేసుకోవలసివచ్చింది.

సరిగ్గా పనిప్రారంభించవలసినసమయం అయింది. బహుశా నాకు జ్వరం వచ్చిందనుకుంటాను. పదునుపెట్టుకుంటూన్నట్లు పళ్ళు కటకటలాడిపోతున్నాయి. భయంచేతమాత్రంకాదు. అంతవరకు నిజమే. భయంఅంటే ఏలాగవుంటుందోకూడా నాకుతెలియదు.

స్లీపింగ్— కార్లకీ-సామానుబళ్ళకీ మధ్యగల పకిచెక్కమీదికి నిచ్చెనమీదుగా దిగి, తాళంతీసి, స్నానాలగదిలో దూరేము. బూట్లకి పట్టుకున్నమంచును దులుపుకొని, కాస్త చలితగ్గేవరకూ అక్కడనే కూర్చున్నాము. బయలుదేరేముందు ఆగదిలోనేయున్న అద్దంలో మొగంచూచుకొని అనుమానానికి అవకాశంలేకుండా సర్దుకొని, తయారయి ఈవలికి వచ్చేను. నెమ్మదిగా— గంభీరంగా నడిచి, రెండుపెట్టెలుదాటి, మూడోదాని గుమ్మంలో ఆగి ఒక్కనిముషం చెవిఒగ్గి విన్నాను. ప్రయాణీకునికివలెనే తాళంచెవులు గలగలలాడిస్తూ తలుపులుతెరచి లోనికి తొంగిచూచేను. లోన దీపపువెలుతురు మసకమసకగావుంది. తలుపుతీసిన చప్పుడుకి ఎవడయినా తలఎత్తి ఎవరువారు? అని పలకరించేడా — "నాదనుకొని పొరపాటున ఇందులోకి వచ్చేను. క్షమించండి"— అని తప్పుకు పోవచ్చును. నాపై జామా-కప్పుకున్నదుప్పటీ గనకచుస్తే కాపలావాడికీ-ప్రయాణీకులకీ కూడా ఏవిధమయిన అనుమానమూ కలుగడానికి అవకాశంలేదు. అట్లాంటిదేమీ జరగలేదుకూడాను. అంతా నిద్రపోతూన్నారు. అలాంటిసమయంలో పెట్టెలలో ప్రవేశించి కొయ్యల్ని తగిలించివున్న కోటుజేబులు వెదకడం, 'అల్మయిరా' లలోవున్న సూట్ కేసులు చేతపట్టడం పెద్దకష్టమయినపనికాదు. గబగబా నేనువచ్చి పని కానిచ్చుకొని వచ్చినదారినే స్నానాలగదిదగ్గిరికి వచ్చేసేను. అక్కడ 'వింగ్స్' నాకోసం కనిపెట్టుకుని వున్నాడు. చేతిలోని సూట్ కేసు ఎదురుగావున్న మంచులోకి విసిరేసి, అతివేగంగా

పోతున్న బండీలోనుంచి ఇద్దరం క్రిందికి వురికేము.

పెద్దఎత్తుగావున్న మంచుదిబ్బలమధ్యకి తీసుకుపోయి పెట్టె విడగొట్టేము. లోపలమాకు ఉపయోగించేవి ఏమీలేవు. మంచి అందంగా బైండుచేసిన పుస్తకాలు, ఒకఫ్లాస్కు, తువ్వాలు, అనేక రకాల 'టూత్-పేస్టు'లు, కొన్నిమాసపత్రికలు, ఛాకలెట్లడబ్బాఒకటీ, ఇవే అందులోయున్న సామాను.

మంచు దట్టంగా కురుస్తూంది. గాలికి మాసపత్రికలపుటలు తటతటాకొట్టుకుంటూన్నాయి. ఎవరిజాగ్రత్తలోవాళ్లు ఇద్దరమూ పెట్టెవద్దకూర్చుండియున్నాము.

నేను వింగ్స్‌కేసిచూసేను. ఆతడు బాగావొంగి కూర్చున్నాడు. ఉంగరాలుతిరిగిన ఆతని గడ్డపువెంట్రుకలు గాలికి ఊగుతూన్నాయి. లోతుగావున్నకళ్లమీదికి బరువయినరెప్పలు మూసుకొనివున్నాయి. పెదవులు కరిచిపెట్టి దేనికోసమో ఎదురుచూస్తూన్నట్లు కనిపించేడు. కొద్దిసేపు అలాగేకూర్చుండి కళ్లుతెరవకుండానే—"జో గీః మరేమీదొరకలేదూ?"—అన్నాడు.

రెండు గడియారాలు, బరువయిన వెండిడబ్బీఒకటి, ఏదో మంచిలావుగావున్న కాగితాలకట్ట నాజేబులోనేవున్నాయి. కాని, ఆతనికి అవి ఈయదలచుకోలేదు. 'ఏమి దొరకలేద'—నే చెప్పేసేను.

"వాళ్ళ చొక్కాలలో ఏమీ దొరకలేదూ?"

"ఒక్కటీ—"

'వింగ్సు' ఎగిరి తనవాడిగోళ్ళతో నాగొంతుక పట్టుకున్నాడు.

మొగంమీద మొగంపెట్టి తెగతిట్టేడు. తుంపరలు నాకళ్ళనిండా పడ్డాయి.

"ఓరిః తెలుకొండివెధవాః నీయిల్లు నీవుచక్క బెట్టుకోవడంఆరంభించేవూః కోటీశ్వరుడివి అయిపోదామనుకున్నావేంః అబ్బ!"

వాగొంతుక వదిలేసి టోపీతీసి నాకేసి చాపేడు.

"నావాటా నాకుపారేయి."

ఆకోరిక నాకువెనుకటిరోజులన్నింటినీ జ్ఞాపకంకి తెచ్చింది. ఒకరోజున 'ఇంటర్నేషనుల్ —ట్రెయిన్'లో ఒకపెద్దతోలుపెట్టె ఎత్తుకువచ్చేను. దానినిండుగా బంగారం—వెండికడ్డీలు వున్నాయి. అంతధనంలోనూ నాకుముట్టినదల్లా ఇంత'కొకెయిను.' రెండు రొట్టెలూ మాత్రమే. మిగిలినదంతా 'వింగ్స్'వాటాకే వెళ్ళింది.

ఆసంగతులన్నీ జ్ఞాపకం వచ్చేక నామనస్సు మరింతదృఢపడింది. జేబులోంచి ఒకగడియారం తీసి ఆతడికళ్ళముందు తిప్పేను.

"నీకేమీ ఇవ్వను. నీదారి నీవు చూచుకో."

'వింగ్స్' ఏమాత్రమూ బెదరలేదు. సన్నని పొడుగుపాటివేళ్ళు చాపి గాలిలో ఏదో పట్టుకోబోయేడు.

ఆతడు ఏపనిచేసినా అతిచురుకుగా సాగిస్తాడు. ఇరవైఏళ్ల నుంచి అలవాటాయె. ఆచురుకుదనమే ఆతడిని ఇంతవరకు కాపాడింది. మంచిపేరు తెచ్చిపెట్టింది. కాని, నేను అతనికంటేనూ కూడా చురుకయినవాడిని. పైగా స్వాతంత్ర్యంకోసం పోరాడుతూన్నాను. ఆతడు తనస్వార్థంకోసం చూసుకుంటూన్నాడు. నేను నెల

లతరబడిగా స్వతంత్రుణ్ణి కావడానికి ప్రయత్నిస్తూన్నాను. అవసరం అయితే ఉపయోగించడానికని ఎప్పుడూ కత్తి సిద్ధంగా వుంచుకుంటున్నాను. ఆతడో నన్ను భయపెట్టి నాచేత నానాచాకిరీచేయించుకొని తానుసుఖంగా కూర్చుండాలని చూస్తూన్నాడు.

'వింగ్స్'కి దొంగల జిత్తులన్నీ కరతలామలకం. హఠాత్తుగా చడికిలబడి, కాళ్ళుపట్టుకులాగేసి పడద్రోసేడు. నేను పడడంలో వెల్లకితలాపడి వెనుకనున్న చెట్టుమోదుకుబెట్టి తలకొట్టుకుంటాననీ, క్రిందపడ్డాక తాను పైకిచేరి ఎంతపనియైనా చేయవచ్చుననీ ఊహించేడు.

కాని ఈలోపుగానే నేను చేయివిసిరేను. క్రిందపడడంలో ఇద్దరం ఒకేమారుపడ్డాం. నాచెవులు ఘడియలుపడ్డట్టులయింది. 'వింగ్స్' నాకు కనపడడం లేదు. బహుశా నాకు నిద్రవచ్చిందేమో. ఆతడు కూడా పడిపోయేడనీ, కదలలేకుండా వున్నాడనీ ఆతని మూలుగుల్నిపట్టి ఊహించేను. ఆతడు ఏలాగో కొంతదూరంవరకూ పొట్టతోపాకి పొడుగ్గావున్న తెల్లని నవారుతో నామెడమీదకొడుతూన్నాడు. అదితగిలి గిలిగింతలు పెట్టినట్లయి నవ్వేను. 'వింగ్స్' ఆయాసంతో మూలిగేడు.

## ఇరవై రెండో

## ప్రకరణం

ఆఖరుకి కళ్లు తెరిచేను. చూసేను. ఇప్పుడు నేనున్న ప్రదేశం నాకు కేవలమూ క్రొత్త. వంటినిండా కట్లూ—పట్టీలూ వేయబడి యున్నాయి. నేనున్న గది పొడుగ్గా, సన్నగా, వుంది. నేనెక్కడ వున్నానాయని చాలసేపుఆలోచించేనుగాని, అర్థంకాలేదు. ఇంక వట్టినే పడుకొని చూడసాగేను. నాగుండెలు శుభ్రంగా—తెల్లగా వున్నాయి. భుజాలు నిగనిగలాడుతూన్నాయి. పాదాలుపొడిగానూ—వెచ్చగానూ వున్నాయి.

నాశరీరంలో ఏవయినాభాగాలు లోపించేయేమోనని ఒక్కమారు తడిమిచూచుకున్నాను. దానికి పర్యవసానం ఏమిటంటే అసలు ఈశరీరంనాదేనా అనే అనుమానం కలిగింది. ఏమంటే—చొక్కాలకి గుండీలులేకపోవడంచేత, గాలికి—మంచుకి—ఎండకి—గురియై గుండెలనిండా నీలిరంగుమచ్చలు పడ్డాయి. వేళ్లు—గోళ్ళు—మణికట్లు నల్లగావుండేవి. మోకాళ్ళపైకంటా బూడిదరంగు స్టాకింగ్సు తొడుక్కున్నట్లు ఉండేవి.

ఆరోజులలో నేనెన్నడూ స్నానం చేసివుండలేదు. చేయడానికి మాత్రం వేళదొరికిందా? ....మడ్డి ఓడుతూవుండే నాశరీరం ఇప్పుడు తెల్లగా—శుభ్రంగావుంది.

నేను పడుకున్నగదికూడా ఎంతో శుభ్రంగావుంది. నాతల వైపునే గోడలో పెద్దకిటికీవుంది. దానిలోంచి ఎదురుగా తెల్లని మంచుదిబ్బలు సుందరంగా కనిపిస్తున్నాయి.

వెచ్చగానూ—కాంతివంతములుగానూయున్న సూర్యునికిరణాలు కిటికీలోంచి నాపరుపుమీద పడుతున్నాయి. ఆవెలుతురులోని కొత్తదనానికి కళ్ళుమిరిమిట్లుగొలుపుతూన్నాయి. ఆవెలుతురులో నేను పడుకున్న మంచానికి వేసిన మెత్తనిదోమతెర ఎంతో సుందరంగా కనిపిస్తూంది నామంచానికి ప్రక్కనే ఒకటేబిలువుంది. టేబిలుమీద తెల్లనిపింగాణీపాత్రలు, ఒకదాంట్లో వేడిరొట్టె. మరొకదాంట్లో ఆవిరులు చిమ్ముతూన్నపాలు ఉంచబడ్డాయి.

నేల, సామానులు, పక్కబట్టలు, అన్నీ అప్పుడేవికిచిన మల్లెపూవుల సౌందర్యాన్నీ, స్వచ్ఛతనీ, ప్రకటిస్తూన్నాయి.

నాకు కొంచెం దూరంలో పడకకుర్చీలో ఒకరు పడుకొని యున్నారు. ఆయన నేను లేచినవిషయం గమనించి కుర్చీలోనుంచి లేచేడు. దారికి అడ్డంగావున్న—పత్రికలున్న మేజా కాలితోప్రక్కకి గెంటేసి. తిన్నగా నాకేసివచ్చేడు.

"ఏలాగ వున్నావు? అబ్బాయి"—అంటూ ఆయన నాచేయి పట్టుకొని, —"ఆఖరుకి లేచేవే! ఇప్పుడే నీపుస్తకాలు చూస్తూన్నాను."—అన్నాడు.

నాకు తలఎత్తడానికి చాలాబాధ కలుగుతూంది.. అతికష్టం మీద కళ్ళుఎత్తి చూసేను. ఆయన చాలాబరువుగావుండే తోలు

కోటుతొడుక్కున్నాడు. నున్నగావున్న ఆకోటుమీద సూర్యకిరణాలు జారిపోతూన్నాయి..... ఆయననెమ్మదిగా నామంచంపక్కపైమీద కూర్చున్నాడు.

"నీగాయాలు ఏలాగవున్నాయి? త్వరగా లేవాలి; అరుగో. కమ్యూన్‌లో పిల్లలంతా నీకోసం ఎదురుచూస్తూన్నారు."

నడ్డిమీద అతనివెచ్చనిచేయి ఎంతో ఆహ్లాదకరంగా పడింది. ఆగదిలోని స్వచ్ఛతకి—శుభ్రతకి నాతల తిరిగిపోతూంది. పక్కమీద దొర్లితేకూడా ఆగదియొక్కసౌందర్యం లోపించిపోతుందేమోనని జంకుకలిగింది.

"లే. ఈపాటికి కదులుమరి;" అదిగో వెచ్చని తోలు చొక్కాలు. 'స్కీ'లు తొడుక్కొని పిల్లలతో కలిసి పోయి తిరిగిరా. మంచిమంచి అడవులు, పచ్చని సైబీరియన్‌మైదానాలు, ఉడతలు, నక్కలు, కుందేళ్ళు, అన్నీ చూసిరావచ్చును. వెళ్ళు."

"అల్లాగే"

"సరేకాని, నీపేరేమిటి?"

—నాపేరు ఎందుకు ఈతనికి? హఠాత్తుగా వెనుకటి సంగతులన్నీ జ్ఞాపకంవచ్చి, భయంవేసింది. ఈతడు ...ఈగది....ఈసూర్యకిరణాలు....నేను చాలాపొరపాటుచేసేను. వాళ్లకి నేనెవ్వరో తెలిసియుండదు. తెలుస్తే నన్నింత ఆప్యాయంగా చూస్తారా? ఈమాధుర్యం— ఈపరిశుభ్రత— నావంటివాళ్ళకోసం కాదు. కాని... కాని.... నాకుకూడా శుభ్రంగా వుండాలనీ, గౌరవంగా బ్రతకాలనీ

ఆశపడుతూంది. ఇంక రహస్యం ఏమాత్రమూ దాచకూడదని నిశ్చయించేను. బుర్రలోను–కడుపులోనూ– ఏదో బాధగావుంది. దానిని అణిచిపెట్టుకొని ఆతనిమొగంమీదికివెళ్ళి పళ్లబిగించి బిగ్గరగా– "నేనువట్టి పచ్చెపువాణ్ణి. మీకు తెలుసునో– తెలియదో– నేను గజ దొంగని."–అన్నాను.

ఆయన అతిశాంతంగా తలవూపేడు.

"తెలుసును. హాస్పిటలుతోటకి దగ్గరగా పడివుండగా మా కుర్రవాళ్ళు చూసేరు, నిన్ను."

ఆతడు ఒకనిముషం ఊరుకుని–"నాపేరు 'ఆంథొనీ పెడరోవిచ్' అందరూ 'ఆంటోనిచ్' అని పిలుస్తారు."– అన్నాడు.

ఆతని మొగంమీద ఏదోపురుగు పాకుతూన్నట్లు కనబడింది. దానిని తీసివేయడానికి చేయి చాపేను. కాని, అది పోలేదు.

'ఆంటోనిచ్' నవ్వేడు.

"మాస్కోలో 'గైజాన్–వర్కు–షాపుల్లో' పనిచేసేరోజుల్లో ఇది తగిలింది. ఎర్రగా కాలివున్న సీలఒకటి ఎగిరివచ్చి, మొగంకాలింది. దెబ్బతగిలి పదిహేను ఏళ్ళుగడిచినా అదిమాత్రం మాసిపోలేదు."

## ఇరవైమూడో

## ప్రకరణం.

గుమ్మంలో మెట్లకిక్రింద ఆవైపునా— ఈవైపునా రెండు రాతి సింహాలు వున్నాయి. ఇల్లంతా తెల్లని చలువరాళ్ళతో చప్టాచేయబడి వుంది. మెట్లు నల్లరాళ్ళతో చెక్కబడ్డాయి. ద్వారబంధాలు జాజిక ర్రతో చేసేరు. అటువంటి సుందరభవనంలో జీవితం ఎంతోమం దంగా వున్నట్లు తోస్తూంది. ఒకేవిధమైన కార్యక్రమంతో యంత్రం లాగ పనిచేయడంఅంటే విసుగుపుదుతూంది. ఇంకాచీకటి వుండ గానే పెద్దబాకాపట్టి మమ్మల్నిలేపుతారు. ఆవలించడం—ఒళ్లువిరుచు కోవడం— కళ్లనులుపుకొనడం. పూర్తిఅయి కళ్లుతెరచేటప్పటికి అప్పుడే నాపక్కవాళ్లు బయలుదేరడానికి సిద్ధంగా వుండేవారు. వాళ్ళంతా పక్కలు దులుపుకొని, చుట్టపెట్టి, తుండుగుడ్డలు పైన వేసుకొని, స్నానాలగదికేసి పరుగెత్తుతూండేవారు. వాళ్ళంతా కస రత్తుచేసుకొని భోజనశాలకి పోయేవేళకి నాది స్నానంమాత్రంఅ య్యేది. ఈకమ్యూణకిరాకపూర్వం నేనెప్పుడూ ప్రొద్దుపోయి లేవ లేదు. కాని, ఈలేవడం— స్నానం—కసరత్తు— భోజనం—వర్క షాపు— సాయంకాలం క్లబ్బు— వరసగా ఒకదానివెనక ఒకటిగా— ఒకే క్రమవిధానంలో ఒకే వేళలో చేయడం అంటే అసహ్యం వేస్తూంది. చస్తున్నాను. ప్రాణంవిసిగి ఏడుపువస్తూంది.

అసలు— ఈపరిస్థితులన్నీ చూచేక చాలారోజులక్రితమే అక్కడనుంచి పారిపోయివుండేవాడిని. కాని, అలాగ జరగలేదు. కారణం మరేమీలేదు. నన్ను వద్దనేవారెవ్వరూ లేరు. ఈకమ్యూనులో కంటె ఎక్కువస్వేచ్ఛ ఎక్కడావుండదు. దానికి తాళాలు లేవు. తలుపులకి ఘడియలు వేయరు. ఒకహాజరుపట్టీలేదు. ఏమీలేదు.... ఒకరోజున లేచిపోవాలనితోచింది. నెమ్మదిగా మెట్లుదిగిరాతిసింహాల జూలుదువ్వుతూ ఒక్కక్షణం నిలబడి, బయటిద్వారంవద్దకి వచ్చేను. కటకటాలతలుపుల వూచలు ఆకాశాన్ని పొడుచుకుంటూన్నట్లు తోచేయి. వానికి తలఆన్చి బయటికి తొంగిచూచేను. చల్లని ఇనుపఊచలకి తగిలి నుదురు నిప్పు ముట్టుకున్నట్లు చుర్రుమంది. మళ్లీ వెనక్కిచూచేను. ఆవిశాలభవనంలోని కిటికీ అద్దాలకి ముక్కులు ఆనించి, కమ్యూన్‌లోవి పిల్లలంతా నాకేసిచూస్తూ నవ్వుతూన్నట్లుతోచి కంగారుపడ్డాను.

నేను ఆవరణదడిప్రక్కనే షికారుకి పోతూన్నట్లు నడవసాగేను. కమ్యూనులోని పిల్లలంతా చువ్వలలాగ పరుగెత్తివచ్చి ఆడుకొనడానికి తోటనాలుగుమూలలకీ చెదిరిపోయేరు. నా ప్రక్కమంచంమీదనే పడుకునే ఆపొడుగుపాటి కుర్రాడు—బోరిసు తిన్నగా నాకేసిపరుగెత్తివచ్చి ఒకమంచుబంతి నాకేసివిసిరేడు. కోపంతో నేమ ఇంకొకగడ్డతీసి ఆతని మొగానబెట్టి కొట్టేను. అది అతని మూతికితగిలి, ఇగుళ్ళనుంచిరెండురక్తపుచుక్కలు తెల్లనిమంచులో చిందేయి. కాని, అతడేమీకోపపడలేదు. మామూలుగానే నవ్వుతూ,

చప్పట్లుకొట్టి మిగిలినవాళ్ళని పిలిచేడు.

"ఈమూల ఎవ్వరూలేరు. ఈలారండి"

గబగబా నాలుగుమూలలనుంచీ పిల్లలు పరుగెత్తివచ్చేరు. అందరూపోగడి నన్నుదొర్లించి నాతోపాటు తాముకూడా ఆ మంచులో దొర్లేటు. నాఒంటినిండా మంచుగడ్డ రుద్దేరు. మేము ఒకళ్ళమీద ఒకళ్ళుపడి చెరలాటాలాడేము. పెద్దపెట్టున నవ్వులు! కేరింతాలు! ఆఖరుకి నేనుకూడా ఆనవ్వులాటలలో చేరిపోయేను.

ఆక్షణం మొదలుకొని బోరిసూ నేనూ స్నేహితులం అయినాము. మాకమ్యూకాలోవున్న పిల్లలు అందరిలోకీ ఆతడే పెద్దవాడు. నాకు చదవడం-వ్రాయడం నేర్పినది ఆతడే. నేను ఆతని సహాయంవలన కమ్యూన్ద్వారతోరణంమీదచెక్కిన 'ఆశ్రయహీనులయిన అనాదబాలుర శరణాలయం'— అంటూవున్న బంగారపు గిల్టుఅక్షరాలను కూడబలుకుకో గలుగుతూన్నాను. ఆతడు పొద్దుటే వచ్చి పక్కచుట్టుకొనడంలో సాయంచేస్తాడు. కసరత్తుచేసేటప్పుడు నాతోవుండి తప్పుచేస్తే కనుసంజ్ఞతో హెచ్చరించేవాడు. అతి తెలివిగా, వర్కుషాపుపని మప్పినదికూడా ఆతడే. ఒక్కనిముషం కూర్చోడు. ఎల్లపుడూ 'కమ్యూన్' లో గిర్రున తిరుగుతూనే వుంటాడు.

ఈ 'కమ్యూన్' రైల్వేకూలీలపోషణలో నడిపించబడుతూంది. వారే మాకోసం ఇక్కడ వర్కు—షాపు తెరిచేరు. మిషన్లలోకి భాగాలు కోసేటందుకు అందులో ఏడు 'లేతుమిషను' లున్నాయి.

బోరిసు అందులో ఏడాదిపైనుంచి పనిచేస్తూన్నాడు. పని చేత నయింది. అతని మనస్సుకి సంతృప్తికరంగానేవుంది. కాని, నాకేమీ నచ్చలేదు. నేను ఆరంభించి రెండువారాలు మించలేదు. పనిలో విసుగుదల ఎక్కువ అవుతూంది. పేడకుప్పమీది దోమల లాగ చక్రాలు బజ్–జ్–జ్–మంటూ హోరుచేస్తూన్నాయి. క్లాప్–క్లాప్‌మంటూ బెల్టులు గబగబా తిరుగుతూన్నాయి. నేను లేతుగోడకి జేరగిలబడి ముక్కు నలుపుకుంటూ నిల్చుండేవాడిని. నాలేతు ఆసావడిలో ఒకమారుమూలవుంది. యంత్రభాగాలన్నీ మడ్డి ఓడుతూ దుమ్ముకొట్టుకొని వున్నాయి. ఆయంత్రంఅంతటిలోనూ పరిశుభ్రంగా వున్నదల్లా నాపేరువున్న ప్లేటుఒక్కటే. అలాగ నిల్చుని దానికేసిచూస్తూ వారానికి ఒకరోజయినా పనిచేయనప్పుడు ఈలేతు నాదెట్లా అవుతుందాయని ఆలోచించేవాడిని.

సరిగ్గా నాతలకిపైన మిషనుకి ఎదురుగా అందమయిన అక్షరాలలో చెక్కబడిన ఒక 'బోర్డు' వుంది.

"నీకు ఆయాసంగావుంటే పని కట్టిపెట్టు. 'రెడ్–కార్నర్' లోకి పోయి, పడకకుర్చీలో కూర్చుండి, విశ్రాంతి తీసుకుంటూ చదువుకో. వెళ్ళు."

మొత్తంమీద ఈపద్ధతి కనిపెట్టినవాడెవ్వడో చాలా తెలివయిన ఘటంమాత్రం అవును. చాలాసేపటినుంచి లేతుమీద వంగి పని చేస్తూంటే నడ్డి పడిపోయింది. పదునయిన ఉలి, తెల్లగా మెరుస్తూన్న 'సిలెండరు' మీద 'కర్రు' మంటూంటే నాబుర్రనే సాన

పట్టేస్తూన్నట్లు అనిపించింది. హఠాత్తుగా ఆసలహామీద పడ్డాయి కళ్ళు. వెంటనే 'మోటారు' ఆపేను. 'కట్టరు' ఆగింది. పక్కనున్న గుడ్డపీలికలతో చేయితుడుచుకొని, కుళాయిదగ్గర శుభ్రంగా కడుగుకొని, ద్వారంకేసి బయలుదేరేను. సలహాప్రకారమే నడుచుకున్నా, బయటికి పోవడానికి సిగ్గువేసింది.

మిలిగినవాళ్ళంతా తమ మోటార్లమీద వొంగియున్నారు. వారుపనిచేసుకుంటూవుంటే నేను లేచిపోతూన్నాను. వాళ్ళు చూడనట్లు—నన్ను గమనించనట్లు ఊరుకున్నా —అది వట్టినటన మాత్రమేనని ఆచేతుల కదలికలనిపట్టి గ్రహించేను.

ఆఖరికి బాగానేవుంది. మళ్ళీవెనకటిగోలే. ఇంక ఇక్కడ వుండగూడదని నిశ్చయించుకున్నాను. కాని, ఎప్పుడు పోయేదీ నిశ్చయించుకోలేదు. ఏరోజుకు ఆరోజే వెళ్ళిపోదా మనుకుంటూ వుంటాను. ఏరోజుకారోజే మంచంవదలడానికి బద్ధకిస్తూంటాను. ఇంక ఆరోజున వెళ్ళితీరాలని నిశ్చయించేను. ఒంట్లో బాగులేదని 'రెడ్ కార్నరు' లో ఏవో చర్చలు జరుగుతూంటే లేచివచ్చి మంచంమీద పడుకుని కిటికీలోంచి బయటికి చూసేను. బయటనంతా కాటికవర్షం కురుస్తూన్నట్లు కారుచీకటి. గదిలో ఎవ్వరూలేరు. ఆవరణదాటితే తోడేళ్ళభయంతప్పితే మరోభయం లేదు. ఏమయితే అయింది. ఈదిక్కుమాలిన 'కమ్యూన్' వదిలిపోవాలని నిశ్చయించుకున్నాను. ఎంతోకాలంనుంచి ఎదురుచూస్తూన్న శుభసమయం సమీపించినట్లే తోచింది. 'కారిడరు' లో ఏమాత్రమూ చప్పుదు

లేదు. పరుపు చుట్టివేయడం, కంబళీ మడతబెట్టి, దుప్పట్లు కట్ట కట్టి, మంచానికి ఎగువని తెల్లనిగోడమీద—నాముద్దుపేరు "జోగి" అని చిత్రించడం, కిటికీలోంచి బయటికి నిశ్శబ్దంగావున్న తోటలోకి దిగడం తోటలోనుంచి అడవిగుండా రోడ్డుమీదికి—రైలుబండిలోకి— తరువాత అంతాస్వేచ్ఛే!—

అంతా బాగానేవుంది. కాని, లేవడానికి మనస్కరించలేదు. భారంగా వుంది. జబ్బుపడలేదుగదా యని గుండెలు ముట్టి చూచు కున్నాను....అప్పుడు అర్థం అయింది. నేను ఎందుకు బయలుదేరి పోలేకున్నానో నాకు అర్థం అయిపోయింది. ఆగది విడవడానికి మనసుఒప్పడం లేదు. నేను అక్కడి జీవితానికి బాగా అలవాటుపడి పోయేను. నామంచానికి ఆవల బోరిసుమంచం. దానిప్రక్కన పుస్త కాలతోనిండిన టేబిలు. ఏమీతోచనప్పుడు బోరిసు ఏదోపుస్తకం తీసి చదువుతూంటాడు. అతడు చదువుతూండగానే నాకు నిద్ర పట్టేది. అదిగమనించి చదువుమాని పుస్తకం మంచంమీద బోర్లిం చి, నామంచంవద్దకు వచ్చి, మీదరగ్గుకప్పి, తిరిగిచదువుకొనేవాడు. ఆవిషయాలన్నీ జ్ఞాపకంవచ్చేయి.

భోజనాలవేళ. ముందు నాపళ్లెం ఖాళీఅయిపోయింది. కడుపు నిండక మిడుతూ—మిడుతూ చూస్తూన్నాను. వెంటనే బోరిసు తన రొట్టెలోనుంచి కొంతభాగం నాకంచంలోపడేసి,—"నాకు పాలు పడవు. ఈగ్లాసెడూకూడా నువ్వేతీసుకో"మని పాలగ్లాసు ముందర పెట్టేడు నిజానికి ఆలోచిస్తే బోరిసు సన్నంగా ఉన్నాడన్నమాటే

గాని, నాకంటె మూడురెట్లు తింటాడు.

అతనికి కృతజ్ఞత అయినా చెప్పకుండా ఆపాలు గొంతుకలో పోసుకున్నాను. ఆరోజున బోరిసు ఈలాగ ఈయండలో ఉద్దేశ్యం ఏమిటా?—యని ఆలోచించేను. నన్ను లోబరుచుకుందుకు వేసిన ఎత్తే మోనని అనుమానించేను. కాని, ఇప్పుడు ఆఅభిప్రాయం మారింది. ఆతనియందు ఆకర్షణ కలిగింది. బియ్యపుగింజలలాగ సన్ననిపళ్ళు, విలువంపుగా వున్న దట్టమైన కనుబొమ్మలు నన్ను ఆతనివైపుకి అధికంగా ఆకర్షించుకున్నాయి.

నేను జబ్బుగా వున్నపుడు నన్ను ఆనందపెట్టిన ఆస్వచ్ఛసౌందర్యాన్ని—'ఆంటోనిచ్'నీ వదిలిపోవాలనిలేదు. ఆఆలోచన కలుగగానే సాలిగూడులతోనిండిన నా'మోటారు' కళ్ళకి కట్టినట్లు అయింది.

కాని, ఆఊహ క్షణమాత్రమే:. ఛా! అదేం పని?—అనుకుంటూ మంచంవురికి బోరిసుమంచంమీది దుప్పటీ తెచ్చికోలుకోపంతో లాగి పైకి ఎగరవేసేను. అంతట్లో మళ్ళీ—"పాపం. దుప్పటీలేకుంటే బోరిసు చలిలో బాధపడతాడే"—అని ఆలోచనకలిగి పక్కసర్దివేసేను.

నేను ఈమారు వట్టిచేతులతోనే కిటికీదగ్గిరికిపోయి, గడియలు తీసేను. చల్లనిగాలి లోపికి తోసుకువచ్చింది. పొగమంచు మొగం మీదకొట్టి నిలువబెట్టింది. చలికి వణుకుతూనే కిటికీలోకి ఎక్కి కూర్చున్నాను. ఇంక దిగడం తరువాయి.

ఇంతలో బలమైన చేయిఒకటి నన్ను వెనక్కిలాగింది. అదిరి

పడి తిరిగిచూచేను. ఆంథొనీవిచ్ పెద్దమీసాలతో ప్రత్యక్షం.

ఆంటొనిచ్ నన్ను చేయిపట్టుకొని కిటికీలోనుంచిదింపి, ఎంతో తాపీగా రహస్యంచెప్పుతూన్నట్లు మాటలాడేడు.

"కిటికీలోనుంచి ఎందుకు? సన్యా! వీధిగుమ్మం వెంబడిపో. అక్కడున్న సింహాలు వట్టిరాతిబొమ్మలు. నిన్ను అడ్డగించవు. అదీగాక ఇక్కడనిన్ను ఆపడానికి ఎవరికి అధికారం వుందోయి!"

'ఎలక్ట్రిక్‌స్విచ్'—'క్లిక్'మంది. వెలుతురులో కళ్లు జిగాలు మన్నాయి. గుమ్మంలో బోరిసు, ఆతనివెనకాల పిల్లలూ నిలబడియున్నారు.

ఆంటోనిచ్ పిల్లల్ని పిలిచేడు.

"సన్యాని గుమ్మంలో దిగబెట్టండోయి!"

ఆమాటచాలు సిగ్గుపడడానికి. అక్కడ విలబడలేకపోయేను. ఒక్కగంతులో 'కారిడీరు' దాటేను.

నావెనకాల ఎవ్వరూ రాలేదు. దూరానమాత్రం సన్నవి కీచుగొంతుక వినబడింది.

"వెళ్ళనీండి. ఆలాగంటివాడుండి ప్రయోజనం ఏమిటి?

గంట్లుకొట్టిన తిరగలిదిబ్బలా మొగంవాడూ 'పెట్కా'ది ఆస్వరం సిగ్గుతో చచ్చి స్నానాలగదిలో దూరి, అక్కడికిటికీలో గోళ్ళు మీటుకుంటూ కూర్చున్నాను. కళ్లలో రెండు కన్నీటిచుక్కలు నిలిచేయి.......

## ఇరవైనాలుగో. ప్రకరణం.

అబ్బ! ఎంతలో తెల్లవారిపోయింది? ఇప్పుడేకాదు కళ్ళు మూసేను? మళ్ళీ లేచితీరాలి కాబోలురా బాబు! హాయిగా కరువు తీరా కంటినిండా నిద్రపోయి ఎన్నాళ్లయింది. ఇక్కడికి వచ్చిన దెప్పుడు?........సరిగ్గా నెల. నెలదినాలకిత్రితం ఎంతో స్వేచ్ఛ! కాని, ఈముప్పైరోజులకే ఎన్నోయుగాలు గడిచిపోయినట్లుఅనిపిస్తూంది. ఇక్కడనున్నవాళ్ళలో ఏమాత్రమూ స్వేచ్ఛలేనట్లు బాధపడుతూన్నది నేనొక్కడినే! మిగిలినవాళ్ళకి ఆధారణేలేదు. మొన్నమొన్న పారిపోవడంకోసం నేను ప్రయత్నించే నన్నసంగతికూడా వాళ్ళు మరిచిపోయేరు. ఆప్రయత్నం జరిగేక నేను మూడురోజులపాటు మంచం దిగలేదు. బోరిసే రొట్టీ—పాలూ తెచ్చిపెడుతూండేవాడు. అతడయినా ఒక్కమారుకూడా —"నీకీబుద్ధి పుట్టిందేమిటి?"—అని అయినా అడగలేదు. అబ్బ ఎంత మంచితనం?

శనివారంనాడు ప్రొద్దుటే పిల్లలంతా నాగదిలో చొరబడి నన్ను మంచంమీదినుంచి ఈడ్చేసి —"రా. ఆడుకుందుకు పోదాం"—అని లాక్కుపోయేరు. ఆరోజునా మరునాడూకూడా స్లెడ్జిబళ్ళతోటే ఆడుకున్నాం. ఆమరునాడు బోరిసు తాను గుడ్డలువేసుకుంటూ నాజాకెటుతీసి నామీద పడేసేడు. ఆరోజునే మళ్ళీ 'లేతులో' పనికి

వెళ్ళేను. పిల్లలందర్నీదాటి ముందుకుపోతూంటే ఒక్కరయినా తిరిగిచూడలేదు! ఏమీ విశేషం జరగనట్లుగానే అన్నీ సక్రమంగా జరిగిపోతూన్నాయి.

ఆపగలంతా మోటారు బాగుచేసుకొనడంలోనే గడిచిపోయింది. కిరసనాయిలుతో శుభ్రంగా కడిగివేసి, గుడ్డపీలికలతో తుడిచి, గరుకకాగితంతో రుద్ది–మెరుగు పేట్టేను. ఆరోజున వెన్ను ఎత్తలేదు. తలతిప్పలేదు.

కనుచీకటి పడేదాకా నేను లేతుదగ్గరనుంచి లేవనేలేదు. పనిలోనుంచి తిన్నగా పడకగదిలోకే వచ్చేసి, బట్టలయినా మార్చుకోకుండా పడుకున్నాను. రోగం వస్తుందేమోననీ, కాళ్ళూ–చేతులూ పడిపోతాయేమోననీ విపరీతంగా భయపడ్డాను.

ఒకరోజురాత్రి నేను పడుకున్నాను. పిల్లలందర్నీ చుట్టూపెట్టుకొని ఆంటొనోవిచ్ కూర్చున్నాడు. అతడు నాకేసి చూపిస్తూ–"ఆతడికి చాలా కష్టంగావుంది. అయినా అలవాటు పడతాడు. మీరంతా ఆతనికి సాయం చేయండి"– అనడం నిద్రకళ్ళని నాచెవిని పడింది.

శనివారం.... రేపు ఆదివారం గదా? స్వేచ్ఛగా నిద్రపోవచ్చునని పెందలకడనే పక్కవేసేను. మరునాడు ప్రొద్దుటే పక్కవూళ్లో మాకమ్యూన్ యొక్క సహాయంతో నడిపించబడుతూన్న గ్రామ 'కమ్యూన్' ను చూడడానికి 'ఆంటొనిచ్' తోకూడా వస్తానని చెప్పిన విషయం జ్ఞాపకమే లేకపోయింది.

....ఆంటోనిచ్ నాతల చేతులమధ్య నొక్కిపట్టి అటూ–

ఇటూ ఊపుతూన్నాడు.

తెలివి వచ్చింది. ఎదురుగా అంటొనోవిచ్‌ని చూసేటప్పటికి అన్నివిషయాలూ జ్ఞాపకం వచ్చేయి. గబగబా బూట్లుతొడిగి, ఊలు 'స్వెట్టరు' ఊలుటోపీ తగిలించేను. నీళ్లు పోసుకోకపోవడంచేత ఒళ్ళంతా తాంౘ్రపూసినట్లు చిరాకుగా వుంది.

మేము వరాండాలోకి వచ్చేటప్పటికి చల్లనిగాలి కళ్ళలో కొట్టు కొని, కన్నీరు వచ్చింది. పొగమంచు మమ్మల్ని చుట్టవేసింది. అయినాసరే బయలుదేరేము. కొంచెందూరం సాగేటప్పటికి చురు కుదనం కలిగింది. ఒళ్లు వేడి ఎక్కింది 'అంటొనోవిచ్' 'స్కైయింగ్' కర్రలు తీసుకొని అడవులు—పచ్చికబీళ్ళు—అడ్డపడి, క్షణంలో కనుమరగు అయ్యేడు.

'రా, సన్యా! ఈముసిలివాడిని పట్టుకో చూద్దాం."

అంటొనిచ్ దూరాన్నుంచి సవాలుచేస్తూ పిలిచేడు.

మొదట్లో నాకు 'స్కీయింగ్' నేర్పినది బోరిసు. కాని, త్వరలోనే ఆయాటలో గురువును మించిపోయేను. మంచుదిబ్బ లలో పరుగెత్తడంలోనూ, కొత్తకొత్తగమనికలు చూపడంలోనూ అందరినీ మించిపోయేను. ఆధైర్యంచేతనే నేను అంటొనోవిచ్ వెనక్కాల పరుగెత్తడానికి తొందరపడలేదు. సావకాశంగా గ్లోవు లుతొడుక్కుంటూ నడుస్తూన్నాను. పరుగెత్తడానికి సరంజామా అంతాచేసికొని, సిద్ధం అయ్యేటప్పటికి కుడివేపు పొదలలోనుంచి పెద్దనవ్వువినవచ్చింది. ఆమూలకి హడావిడిగా పరుగెత్తేను. ఆ

గుడ్డివెలుతురులో అంటొనోవిచ్ పెట్టుకొన్న బొచ్చుటోపీ లీలగాఅ యినా కనపడడంలేదు. ఆతని గొంతుక వినిపిస్తూన్నా. ప్రతిధ్వ నులుమూలంగా ఏమూలనుంచి వస్తూందోకూడా గ్రహించలేక పోయేను.

మైదానం వెనకబడిపోయింది. దూరాన ఒకమెట్టమీద అంటొ నోవిచ్ కనిపించేడు. ఆతనికి వెనుకవైపున నీలాకాశంలో అరుణో దయరేఖలు వ్యాపిస్తూన్నాయి. నేను గబగబా పోయి అతనిని కలుసుకున్నాను. ఆతనిప్రక్కనే నిలబడి మొగాన బుట్టిన చిరుచెమ టలు తుడుచుకున్నాను. అంటొనోవిచ్ నాకెదురుగా నిలబడి భుజాల మీద చేతులుబెట్టి నాకళ్ళలోకి తొంగిచూచేడు.

—"స్కైయింగ్ మంచిఆటకాదుః సన్యా!"

"చాలా సరదాగా వుంటుంది."

"అపునుకాని, మరి అబ్బాయిః చేతులు సర్దుకో."

అంటొనోవిచ్ ఉదయిస్తూన్న సూర్యకాంతిలో మిలమిలలాడు తూన్నపచ్చని సైబీరియన్ మైదానంకేసిచూసి, 'స్కై'లలోకి వురికి వరకంగావున్న కొండపల్లాలలోకి జరజరా పాకిపోయేడు. 'స్కై'లు ముందుకి జరిగిపోతూంటే వెనక్కాల అస్పష్టంగా రెండుజాడలు పడుతూన్నాయి. ఆతనివెనకనే ఆజాడల వెంబడినే నేనూ జారడం ఆరంభించేను. చెట్లమొదళ్లని తప్పించుకొని, పొదలు, జారిపోవ డానికి సిద్ధంగావున్న మంచుదిబ్బలు, తొలగి అతడు అతివేగంగా పోతున్నాడు. నేను ఎంత ప్రయత్నించినా అతనిని తప్పించలేక

పోయేను. శివం ఎత్తినట్లు అతిచురుకుగా జారుతూన్నాను. అతని లాగే కర్రలఊతం తీసుకుందుకు ప్రయత్నించేను. కాని, సాధ్యపడ లేదు. కర్రలు ఎడం–ఎడంగా మంచులో గుచ్చిగుచ్చిలేస్తూ వెనక్కి తిరిగిఅయినా చూడకుండా, తలఎగరవేస్తూ, నాబలం కనుక్కుం దుకు ప్రయత్నించుతూన్నట్లు, గబగబాపోతూన్నాడు. నేనాతని వెంట వదలలేదు.

"అంటొనోవిచ్! నిన్ను దాటిపోనీయను. నీవెనక్కాలే వున్నానులే."

బిర్రబిగిసిన మంచుగడ్డలమీద కర్ర'స్కై'లుజరుగుతూన్నపుడు కలుగుతూన్న ధ్వని, దూరాన నలుదిక్కులా ప్రతిధ్వనిస్తూంది. ప్రతి దేవదారుచెట్టూ ఆధ్వనిని స్వీకరించి వ్యాపింపచేయడంలో తోడ్పడుతూంది. ఆసైబీరియన్ మైదానంమాదిరిగానే అనంతమైన ఆనందం–ఉత్సాహం–నాహృదయంలో బయలుదేరింది.

"అంటొనోవిచ్! పోనీ!.... నేనేమీవెనకబడను.లే."

మేము ఉరకలు వేసుకుంటూ ఒకఎత్తయిన మంచుగుట్టమీదికి ఎక్కేము. దూరాన ఎదురుగాగ్రామంలోని పొయ్యిలలోనుంచి పొగ తుట్టలు తుట్టలుగా ఆకాశంకేసి పరుగులు పెడుతూంది. మైదానం మీదుగా ఆకాశంలో ఎర్రగా గుడికట్టి మూడుసూర్యబింబాలు ప్రకాశిస్తూన్నాయి. ఆమూడింటినుంచీ, విశాలమైన కాంతిమార్గాలు క్రింది మైదానంలోనికంటా వ్యాపించియున్నాయి.

అంటోనిచ్ టోపీ తీసిచేతబట్టుకున్నాడు. తలవెంట ఆవిరులు

వస్తున్నాయి. గ్లోవులనిండా మంచు నిలచింది. అతడు ఆమూడు కాంతిమార్గాలవైపుకీ చూస్తూ విస్తుపోయినట్లు నిలబడిపోయేడు. నాకు తలపోటెత్తుతూంది. అంతకంతకి చలి ఎక్కువ అవుతూంది. అతడుమాత్రం కదలలేదు. చూపులుమార్చలేదు. కొద్దిసేపున్నాక నాచేయి పట్టుకొని పలవరిస్తూన్నట్లు మాట్లాడసాగేడు.

"—నాకుడికాలి వేళ్లు మూడుతెగిపోయేయి. ఈనాడుకూడా నావెన్నులో తుపాకీగుళ్లు వున్నాయి. గాలిమార్పు కలిగినప్పుడల్లా వాటివలన నేటికీ బాధ కలుగుతూనే వుంది. మూడేళ్ళక్రితం జపాను సైన్యాలతో పోరాడినప్పుడు తగిలిన దెబ్బల ఫలితం ఇది. ఆరోజున రైతుదళాధిపతి చచ్చిపోయేడనే వాళ్ళుఊహించేరు. తమర్ని ఏడిపించివదలిన పటాలాన్ని పూర్తిగా ధ్వంసంచేసి వాళ్ళు లేచిపోయేరు. ఆనలభై మందిలోనూ ఒక్కడయినా బ్రదికిపోగలడని వాళ్ళు అనుమానించలేదు. కాని, నేనే లేచేను. ఒక్కణ్ణీ రెండో సాయమైనా లేకుండా ఈమైదానంలో ప్రయాణం చేసేను. ఒక వారంరోజులపాటు, పచ్చికాయలు, బెరళ్ళు, తినిబ్రదికేను. దారి పొడూగునా నాగాయాలనుంచి రక్తబిందువులు పడుతూనే వున్నాయి.....ఆరోజున చూసేను. ఈవేళలాగే ముగ్గురు సూర్యులు, మూడు కాంతిమార్గాలు, కనపడ్డాయి. సరిగ్గా, ఈవేళమాదిరిగానే."

క్రమంగా కొంచెం సేపటిలో ఎండమావులు అంతరించేయి. అంటొవిచ్ టోపీ తగిలించేడు. చలిజ్వరం వచ్చినవాడిలాగ వొణికిపోతూ, మందకొడిగా, ఏదో ఆలోచిస్తూ గ్రామంవైపుకి నడవ

సాగేడు.

గ్రామప్రజలు కంటబడగానే ఆతనిలో మళ్లీ ఉత్సాహం బయలుదేరింది. మాకు మార్గంలో ఒకగడ్డంమనిషి ఎదురయ్యేడు. మమ్మల్నిచూడగానే ఆతడు తనచిన్నికళ్ళు మిటకరిస్తూ, పకపకా నవ్వేడు. మారాకకి ఎంతో ఆనందం—ఉత్సాహం చూపించేడు.

"ఓహో! అంటొనోవిచ్! చిరకాలదర్శనం. ఈముసిలివాళ్ళం దరికీ తాటాకులు కడదామనుకున్నావా? నాయనా! ఆలాగ ఎప్పుడూ సాధ్యపడదనుకో. క్రిందటిఆదివారమేవస్తానని చెప్పి మొగం చాటు చేసేవా? నువ్వువస్తావుకదాయని తేనె తీసుకువచ్చేను. ముసిలిది ప్రత్యేకంగా నీకోసం పరమాన్నం తయారుచేసింది. రాతియుగం లోని మనుష్యుణ్ణిగురించి చెప్పుతానని చెప్పేవేకాదు. ఇప్పుడో— ఆనకో వస్తావని మనవాళ్ళంతా కనిపెట్టుకు కూర్చున్నారు. ధాన్యపు వసూళ్ళు పూర్తిఅయినాక చెబుతానన్నావుకాదూ? సరే....రా. మరి. పోదాం.

మధ్యాహ్నం భోజనాలవేళకి మేము కమ్యూన్‌కి తిరిగివచ్చేము.

భోజనంవేళ పరాధ్యానంగా వేడిపులుసు తాగబోయి మూతి కాల్చుకున్నాను. త్వరగా తిండితిని పోయి పడుకోవాలని యూహ. తీరా పడుకుంటే నిద్రపట్టలేదు. అంటొనోవిచ్‌ని గూర్చిన ఆలోచ నలతో కళ్ళు మూతలు పడలేదు.

కొద్దిసేపటికి అంటొనోవిచ్‌వచ్చి నామంచంమీద కూర్చున్నా డు. జేబులోంచి నీలిరంగు కవరలో పెట్టిన కాగితాలకట్టదీసి,

తొడలమీద పెట్టుకొని, కొసలు నలిగిన పాతపత్రికకాగితం ఒకటి తీసి నాచేతికిచ్చేడు.

"సన్యా! చదువు."

అక్షరాలు కూడబలుకుకుందుకు ప్రయత్నించేను. కాని, ఏమీ అర్థంకాలేదు. సిగ్గుపడి కాగితం క్రిందపెట్టేసేను.

"అక్షరాలు మరచిపోయేను. అంటొనిచ్!"

ఆతడు పేపరు తానే తీసుకున్నాడు. ఒకచేతితో నానడ్డిమీద ఆనుకొని, కొంచెంవొరిగి నెమ్మదిగా చదవడం ఆరంభించేడు.

—"అక్టోబరు 12 వ తేదీన తోడేళ్ళఅడవికీ-స్టేషనుకీ మధ్య కొందరురైతులు ఒకశవాన్ని చూసేరు. ఆమనిషికి నడ్డిమీద కత్తి పోటుతగిలింది. కత్తి గుండెలకంటా దిగిపోయి, అందులోనే వుండి పోయింది. కత్తిపిడి ఖరీదయిన దంతముతో ఛేయబడింది. దాని మీద 'జోగి'-అనే పెట్టుడుపేరు చెక్క బడివుంది.—

"—అదేరాత్రి ఈస్టేషనుకి సమీపంలోనే దూరప్రాచ్యదేశాన్ని పోతూన్న 'ఎక్స్ప్రెసు' యొక్క 'స్లీపింగ్-కార్ల'లో నిద్రిస్తూన్న ఇద్దరుప్రయాణీకులసామాన్లు హరించబడ్డాయి. పరిశోధనలు చేయగా ఈరెండుసంఘటనలకీ సంబంధంవున్నట్లు తేలింది. ఆదోచుకున్న డబ్బు పంచుకోవడంలో వారిద్దరికీ పేచీవచ్చింది. ఆపేచీకి ఒకడు తనప్రాణాలు బలిపెట్టేడు."

అంటొనిచ్ చదువు ఆపేడు. అంతకంతకీ విజృంభిస్తూన్న చలిగాలి కిటికీతలుపుల్ని గుంజివేస్తూంది.

తలనొప్పి వస్తూంది. నీలికళ్లు—తోస్సినోరూ వీడూ వెళ్ళిపోయి మరొకడెవడైనా వస్తాడేమో, అప్పుడు మనపని చూసుకుందామని ఆలోచించేను. కాని, అటువంటి మార్పేమీ జరగలేదు. ప్రజలంతకంతకి వచ్చి కిటికీదగ్గరమూగుతున్నారు. పెద్దగుంపు తయారయింది. నేను వరాండాలో ఒకమూల ఒడిగి నిలబడ్డాను. ఈపని ఎప్పుడు అవుతుందాయని ఆతురతగావుంది. అంతలో నాదికాకపోయినా ప్యాకెటులో ఏంవుందో చూస్తేనే— మనిపించింది. తీసేను. ఒక మూల తడిగావుంది. దానినికొంచెం చింపేను. లోపల సరికొత్త నోట్లు. ఆశ కలిగింది. అంతలో హఠాత్తుగా కమ్యూన్ తలంపుకు వచ్చింది. ఆంటోనిచ్ కళ్లు, కమ్యూన్‌లోని సౌందర్యము—స్వచ్ఛత, నాలేతు, దానిమీదనున్న సిలండరు, నాపేరున్న ఎర్రని ప్లేటు, ఒకదానివెనక్కొకటి నాకళ్ళముందు తాండవించేయి. నాకుబదులుగా నాలేతును యింకొకడు తీసుకుంటాడేమోనని అసూయ కలిగింది. వెంటనే భయంకూడావేసింది. గబగబా కిటికీదగ్గిరికి పరుగెత్తేను. నామనస్సును కలతపెడుతూన్న ఆనీలిరంగుప్యాకెట్టును చటుక్కున ఆతొస్సిఆఫీసరు చేతిలో పడేసేను. దానిమీది ఎడ్రసు, ఆకవరరంగు చూసి ఆతడు ఆశ్చర్యంతో నాకేసి చూస్తూ దానిని వేలిమీద తూచుకున్నాడు. ప్యాకెట్టు ఆతని చేతిలో పడిపోయేక —"అయ్యో! అంత త్వరగా ఎందుకు ఇచ్చివేశానా"— అని విచారం కలిగింది.

దగ్గరలోనే రైలుకూత వినబడింది. నాకు తెలియకుండానా కాళ్లు ఆమూలకి తీసుకుపోయేయి. ఇంతకాలమూ ఏదోబందిఖానాలో

ఉన్నట్లనిపించింది. ఆకూతతో నాపూర్వస్మృతి— ఆసంచారాలు, చిన్న చిన్న మురికిబళ్ళలో గడిపిన ఆర్మాతులు; స్టేషన్లదగ్గర తినుబండారాలు అమ్మే ఆస్త్రీలు: 'కోకెయిన్'పీలుస్తూంటే కలిగే అమత్తు; నాటువోడ్కా తాగడంచేత గుండెలలోకలిగే ఆమంట; అర్మర్దు—ట్రెయినూ; ఇంజనూ; ఒకదానివెనక ఒకటి మనసులో మెదిలేయి.

కూత మళ్ళీ మరీదగ్గరలో వినిపించింది. వెంటనే చెవులు ఘడియలుపడేధ్వనితో పొగలు చిమ్ముకుంటూ ట్రెయిన్ సరిగ్గా పోస్టాఫీసు ద్వారానికి ఎదురుగా నిలబడింది. పొగమంచు నాకళ్ళలోకి కొడుతూంది. వెనుకటినంగతులు జ్ఞాపకంవచ్చి తలతిరుగుతూంది. గోడకానుకొని బండికి ఎదురుగా నిలబడిపోయేను. ఆకుపచ్చని రంగుపూసిన రైలుపెట్టెలు నామనస్సును తమవైపుకి ఆకర్షించి వేస్తున్నాయి. బహుశా వీటిలోనే అయివుంటుంది. 'బటూమ్'పోయి బత్తాయినారింజపళ్ళు తిన్నాను. మళ్ళీ రైలెక్కాలనిపించింది. వెంటనే కిటికీదగ్గిరికిపోయి గుమాస్తాబల్లమీదికి వొంగి, నాప్యాకెటు ఇచ్చివేయమన్నాను. ఆశ్చర్యంతో ఆతడు నాకేసి కళ్ళువిప్పిచూసి, కాగితం ఒకటి చింపేడు. మళ్ళీ బండి పెద్ద కూత వేసింది. ఆఫీసరు రెండుచెవులూ గట్టిగా మూసుకున్నాడు. బండిపోయింది. ఆతడు నాప్యాకెట్టుకి రశీదుగా ఒకబూడిదరంగు కాగితం చేతిలోపెట్టి, మళ్ళీ తనపనిలో మునిగిపోయేడు.

నేను గబగబా కటకటాలదగ్గిరికి పరుగెత్తి, దూరాన పొగమంచులోకి వెళ్ళిపోతూన్న రైలుబండికేసిచూస్తూ చాలాసేపు నిలువ

బడి పోయేను.

బయట చీకటిపడిపోతూంది. గడ్డంతాత ఒకడు లాంతరు స్తంభాలు ఎక్కిదిగుతూన్నాడు. నేను చల్లగాలికి కొంకర్లుపోతూన్న చేతివేళ్ళు ఊదుకుంటూ, ఆతనిదగ్గిరికిపోయి ఒకచుట్ట ఈయమన్నాను. ఆతడు నిలబడి జేబులోంచి రెండుపొగాకులుతీసి చేతిలోపెట్టి నన్ను పరీక్షగా చూచేడు.

"కొత్తగా ఎక్కడినుంచేనా వచ్చేవా? నీయిల్లు ఎక్కడ?"

అగ్గిపుల్ల ఆర్పేసి, చుట్టపొగలో మొగంమాటు చేసుకుంటూ:

"—మాకెక్కడా కొంపా— గోడీ లేదు"—అని నెమ్మదిగా మైదానానికి అడ్డపడ్డాను.

నాచేతిలోవున్న చుట్ట పూర్తిగా తగులబడ్డాక నేనుతెచ్చిన 'సైకిలు' పోస్టాఫీసులో వరాండాలో వదిలిపెట్టి వచ్చేనని జ్ఞాపకం వచ్చింది. మళ్ళీ స్టేషనువైపు బయలుదేరేను. కాని, వస్తూనే 'సైకిల' సంగతిచూసుకోకుండా గడ్డంతాతకోసం వెదకి పట్టుకున్నాను. నేను వెళ్ళేటప్పటికి ఆతడు దీపం వెలిగించి దిగుతూన్నాడు. ఆతని కోటుజేబులోనుంచి వ్రేలాడుతూన్న కర్రగిలకపట్టుకొని నిలువబెట్టేను.

"నాకూ ఇల్లువుంది. తాతా! దిక్కులేని కుర్రాళ్ళకోసం పెట్టిన 'కమ్యూణ్' ఎరగవు? 'ఆంటోనిచ్'వుంటాడూ! అదే మాయిల్లు."

కొంతసేపు ఆతనితో బాతాఖానీవేసి ఆఖరున—"ఎప్పుడయినా, మాయింటికి వచ్చిచూడు. తాతా!" —అని బయలుదేరేను.

## ఇరవయ్యారో
## ప్రకరణం

తిరగలిదిబ్బలాగ మొహం వాడూ ఆ'పెట్కా' గాడు నాప్రాణానికి యములాడులాగ దాపరించేడు.

నాలేతుకు అయిదుగజాలకి ఈవలగా వాడిలేతువుంది. గరప నక్కలాగ పళ్ళిగిలిస్తూ అక్కడవిల్చుని ఎవ్వళ్ళతోటో ఒకళ్లతో, బహుశా నన్ను గురించే అయివుంటుంది, ఏదోచెప్పుతూండేవాడు. నాపక్కనుంచిపోతూ వెధవకళ్ళు చికిలించేవాడు. నాకు వాడివాల కంచూస్తే ఒళ్ళు మండుకువచ్చేది.

మిగిలినవాళ్లంతా అక్కడ రెండేళ్లనుంచి ఉంటూవుండడం మూలాన దానికి అలవాటుఅయిపోయేరు. యంత్రాలషాపులో వాళ్లకి కొద్దో—గొప్పో అనుభవం కలిగింది. ప్రతిలేతుమీదవున్న చిన్న చొరుగులో తోలుబైండుచేసిన ఒకదళసరిపుస్తకం వుంటుంది. వారంఆఖరున ఆఆరురోజులలోను ఎవ్వడెవ్వడెంత పనిచేసినది ఆంటోనిచే స్వయంగా ఆపుస్తకంలో వ్రాస్తాడు. ప్రతికుర్రవాడు తాను తయారుచేసిన ప్రతిచిన్నవస్తువునుగూర్చిన లెఖ్ఖా దాంట్లో ఎక్కాలని తాపత్రయపడుతూంటాడు. నాపుస్తకంవిప్పి పేజీలు తిరగవేసినప్పుడల్లా నేనూ విపరీతమైన ఆనందం పొందేవాడిని. పని పూర్తిఅయినాక వోయి, మంచంమీదకూర్చుండి, 'ఆంటోనిచ్' రిమార్కులు మిగిలిన కుర్రవాళ్లకి చదివివినిపిస్తూండేవాడిని. ఎన్ని

బిరడాలు, ఎన్నికడియాలు, ఎన్నిసిలండర్లు, ఎన్నిసీలలు, ఎన్నిఇం జెక్టరు- ఛెక్కులు, ఎన్నిగొట్టాలు, ఎన్ని 'స్క్రూ'లు, చేసేను! అబ్బ!....నాచేతులకేసి చూసుకొని-" ఈచేతులేనా ఇంతపనీ చేస్త?-" అని ఆశ్చర్యపడేవాడిని.

ఒకరోజున పెట్టా గబగబా నాలేతుదగ్గిరికివచ్చి పనియున్నట్లు చొరుగులోని పుస్తకంపైకితీసి పుటలుతిరగేసి, కళ్ళుచికిలిస్తూ,పక్క వాళ్ళకేసి, చూస్తూ నన్ను హేళనచేసేడు.

"ఇదేమిటి? పుటలన్నీ ఖాళీగానే వున్నాయేం? నన్యా!"

....నన్ను హేళనచేసి ఇంక వాడక్కడ ఆగలేదు. పళ్ళసందు నుంచి ఉమ్మి వెనక్కీ-ముందుకీ లాగుతూ, తనచోటికి వెళ్ళి పోయేడు. నేను అంతసేపూ వాడివాలకం- నడక చూస్తూనే వున్నాను. ఆపొట్టికాళ్లు-గుండ్రభుజాలు-చూస్తూ వీడిని ఎప్పటికీ సహృదయంతో గమనించలేనని తలచేను.

వాడిని ఎవ్వరూ చూడకుండా ఏదోమూలపెట్టి ఒక్కమారు గట్టిగా దేహశుద్ధిచేయాలని చాలరోజులక్రితమే నిర్ణయించుకొని సమయంకోసం నిరీక్షిస్తూన్నాను.

ఆఖరుకి ఒకరోజున కొట్టుగదిలో దొరికేడు. కేకపెట్టడానికి కూడా అవకాశంలేకుండా నాచొక్కా వాడినెత్తిన ముసుగువేసి, పిడియచుట్టి మూడంగుళాలబోల్టుఒకటి తీసుకొని సరిగ్గా మెడగుళ్ళ మీద హడలకొట్టేను. ఆప్రదేశంలో ఎన్ని కొట్టినా రక్తంరాదనే సంగతి నాకు బాగా తెలుసును. ఆఖరుకి గుర్తుకూడా పడదు.

కొట్టికొట్టి చేతివేళ్లు నొప్పులుపుట్టి బోట్లుకూడా పట్టుకోలేక పోయినప్పుడు వాడిని వదిలేను. నేను వదిలిపెట్టేకకూడా వాడినోట మాటలేదు.

వాడు కొట్టుగదిలో కదలలేకుండా పడివుండగా చూసి పిల్లలు బయటికి తీసుకువచ్చేరు. ఎన్నోవిధాల తిప్పితిప్పి వాడినికొట్టినవాడి పేరు ఎంతఅడిగినా పెట్కా చెప్పనేలేదు. నాపేరు చెబితే ఎక్కడ చంపేస్తానోయని వాడునోరువిప్పలేదు.

కాని, ఆరహస్యం దాగలేదు. నేనే 'పెట్కా'ని ఈఅవస్థలోకి తెచ్చేననేసంగతి బయటికి పొక్కింది. ఆవార్త వినగానే కమ్యూను లో జనంఅంతా దద్దరిల్లిపోయేరు. సాయంకాలం 'రెడ్-కార్నర్' లో మీటింగు నిర్ణయం అయింది.

నేను పెట్కాని ఆవిధంగా ఎదుర్కొన్నవిషయాన్నిగురించి కమ్యూన్ నన్నువిచారిస్తుంది.

'రెడ్-కార్నరు' జనంతో నిండిపోయింది. ఎక్కువమంది జనం కూర్చుండేటందుకు వీలుగా అక్కడనున్న బెంచీలన్నీ బయట పడేసేరు.

లోపల జనంక్రిక్కిరిసిపోయి కూర్చున్నారు. అక్కడికీ చోటు చాలక కొందరు గుమ్మంలో నిలవబడవలసివచ్చింది.

ప్రతివాడూ ఉద్రేకంతో ఏమేమిటో అంటూ, చేతులు త్రిప్పు తూనే వున్నాడు. ఒకనిమొగానా నవ్వు అనేదిలేదు.

ఆసభకి బోరిసు అధ్యక్షుడు. ఎదురుగా బల్లమీదపెట్టిన గ్లాసును

చేతిలోని పెన్సిలుతో వాయించి తలవొంచుకొని సద్దుమణిగేదాకా కూర్చున్నాడు.

"ఈవేళ కొట్టుగదిలో చీకటిగావున్నమూలలో పెట్కాని చిక్కించుకొని సన్యా రక్తాలు కారేలాగ బాదేడు. రేపు మరొకదెవ్వడో తనకి ఏదో అపకారం చేస్తాడని సుత్తిపుచ్చుకొని తలపగలకొట్టవచ్చు. ఎల్లుండి తన ఇష్టంవచ్చినన్ని చుట్టలు కాల్చుకోనిచ్చేదు కాదని ఆంటోనిచ్ నే చాకుపుచ్చుకు పొడిచివేయవచ్చును. ఈవేళ కొట్టినవాడు రేపు ఆపని చేయడని నమ్మకంఏమిటి? జరిగినవల్లా చూస్తూ, వట్టిచవటలాగు మనవంతు వచ్చేదాకా చూస్తూ కూర్చోవలసిందేనా?"

బోరిసు ఈమాటలు చెప్పుతూన్నంతసేపూ గాలిలో వేళ్లు తిప్పుతూనేవున్నాడు. ఎదురుగావున్న కుర్రాళ్లమీద-ఉరికిపడతాడా అన్నంత ఉద్రేకంలో పిడికిళ్లుబిగించి బల్లమీద గుద్దేడు.

తరువాత ఉద్రేకం అణుచుకొని నెమ్మదిగా మాట్లాడడం ఆరంభించేడు.

"ఏమంటారయ్యా! మీరు? మనవంతువచ్చేదాకా కూర్చుందామా?"

అంతా ఊరుకున్నారు. నేను దీపానికి సరిగ్గా క్రింద నిలబడియున్నాను. తలఅంతా చెమటలు పట్టేసేయి. వీధిలోకి పారిపోయి చల్లగాలిలో కాస్త సేపు తిరిగివద్దామని అనుకుంటున్నా.

ఇంతలోకీ పెట్కావచ్చి కొంచెం వినోదం కలిగించేడు.

జనాన్ని ఒత్తిగించుకొని వచ్చి సభావేదిక ఎక్కడానికి ప్రయత్నించేడు. కాని, కాళ్లపొట్టి. చేయి తొంట. బల్లఅంచులు పట్టుకొని పైకి పాకడానికి ప్రయత్నించేడు. గుండెలు బల్లలకానించి కాళ్లు పైకితీసుకొనేప్రయత్నంలో పట్టుదొరకక గాలిలో ఆడించేడు. అది చూచి ఎదురుగావున్నవాళ్లు పకపకానవ్వేరు. ఒకక్షణంలో సభాస్థలం అంతా పకపకలతో నిండిపోయింది.

ఆఖరుకి పెట్లా ఏలాగఅయితేనేమి వేదికమీదికి ఎక్కి, తొంటిచేయి ఊపుకుంటూ, పిల్లలు నవ్వుతూన్నది తన్నుగురించికానట్లే తానుకూడా ఒకవెర్రినవ్వు నవ్వి మాటలాడడం ఆరంభించేడు. కాని, సభ్యులలో ఇందాకటి పట్టుదల సడలింది. ఆగాంభీర్యం ఇప్పుడు లేదు.

"నేను మీకు ఒక ముఖ్యమైనవిషయం చెప్పితీరాలి. సన్యాసి ఇక్కడికి వచ్చి ఆట్టేరోజులు కాలేదు. అయినా దీనికంతకీ నాయకుడు అయిపోవాలనీ, విపరీతమైన స్వేచ్ఛదీసుకొని మనజీవితవిధానాన్నే నిర్మూలించాలనీ ఊహిస్తూన్నాడు. నన్ను కొట్టేటప్పుడుతనకు అడ్డంవస్తే కమ్యూన్‌లోవాళ్లందరీ ఈలాగే కొట్టి చంపేస్తానంటూ అన్నాడు."

వాడిఅబద్ధాలు వినేటప్పటికి నాకు మహాచెడ్డతామసం వచ్చింది. ఆసమయంలో బోరిసు నన్ను పట్టుకోకుండావుంటే వాడి తల పగలపేయడమో–నాలిక పెల్లగించడమో చేసివుండేవాడినే. నాఆవేశంచూసి వాడు వేదికమీదనుంచి జనంలోకి ఒక్కగంతువేసేడు.

కాని, పిల్లలు వాడిని తనదగ్గిరికి రానీయలేదు. కటకటాలదగ్గిరి కంటా గెంటేసేరు. ఆసమయంలో మంచికోపంతో 'కోల్కా' వేదిక ఎక్కేడు. ఈతడు మావర్కుషాపులోని వాళ్లందరిలో మంచిపనివాడు.

"అసలుమీరంతా ఇక్కడ ఎందుకు పోగుపడ్డారు. ఇప్పటిక యినా ఈ'పెట్కా' పట్టిలబద్ధాలకోరు అనితేలిందా? ఇన్నేళ్లు నెత్తి మీదికి వచ్చేయి. వాడినీ-వీడినీ గదుముకొని తినడమేగాని. ఆఖరు కి ఒక్కశలగబద్దయినా తనచేతులతో ఎత్తుకువచ్చేనా తినగలిగేడా? ఇప్పుడు సవ్యాని ఏడిపించుదామని చూస్తూన్నాడు. ఎందుకు? ఈతడు పన్నెండునెలలునేర్చుకున్న పని, సవ్యా మూడు నెలలలో నేర్చుకోగలిగేడు. వెధవ బురదగొడ్డు! వాడు నిన్ను కొట్టేడా? చావకొట్టవలసిందే! ఇంకా సవ్యా కొట్టుగదికోసం కాచేడు. కాని నేనయితే పట్టపగలు నడివీధిలో గుడ్లు తోడివేసేవాడిని."

కమ్యూన్‌లో వంటమేస్త్రీ కోల్కాతరువాత వెడవెడనవ్వులు నవ్వుతూ వేదికమీదికి ఎక్కేడు.

"వంటఇంట్లోవుండే పిల్లికూడా పెట్కాకంటె ఎన్నోరెట్లు నయం. తినడానికి ఏదయినా పెడితేనే అదితింటుంది. లేకుంటే మూలవొదిగి కూర్చుంటుంది. కాని, పెట్కా అలాగకాదు. రెండు మాట్లు ఇతగాడిని నేను వంటయింట్లోవుండగా పట్టుకున్నాను. ఆసమ యంలో గిన్నెలోని అన్నం మూకుడులోకి తోడుకుంటూన్నాడు. అదీ- ఆతడు చేస్తూన్నపని."

సభలో గోల బయలుదేరింది.

సభాసదులంతా నాకుబదులు పెట్కాని తిట్టడం ఆరంభించేరు. బోరిస్‌మాత్రం చలించలేదు.

"వినండి. అబ్బాయిలు! సన్యాచేసింది తప్పే. అది నిశ్చయం కాదనడానికి వీలులేదు. తాను దొంగతనాలు చేసుకొనేరోజులలో ఏలాగవున్నా, ఇక్కడ ఇంక అపద్ధతులు సాగించడానికి వీలులేదు. 'కమ్యూనకమిటీ' అతనికి ఈవిషయం తెలియపరుస్తూంది."

వెంటనే ఒకపెద్దఈల. ఆవెంటనే చప్పట్లు. వందలకొలదీ పెదవులనుంచి వెక్కిరిస్తూ కూతలు బయలుదేరేయి. కమిటీసభ్యులు వేదికదిగి జనంలోకి వచ్చేసేరు. నేనూ-బోరిసూ మాత్రమే అక్కడ వున్నాము. అతనికి ఏమిచేయాలో తోచక తనమిత్రులసహాయం కోసం ఒక్కనిముషం ఊరుకున్నాడు.

తరువాత తనంతతానే ఆరంభించేడు.

"వోటుకి పెడదాం!.....సన్యాని 'దోషి'-అనేవారెవరు?........ ఎవ్వరూ లేరు. ఈమారుకు వదిలేసి మళ్లీ ఈలాంటివనే చేస్తే, తీవ్రచర్య తీసుకుందా-మనే వారెవ్వరు?"

వందలకొలదీ చేతులు లేచేయి. బోరిసు సభముగించి వేదిక మీది దీపాలు స్విచ్-ఆఫ్ చేసేడు.

ఆరాత్రి నేను పడుకున్నపుడు బోరిసుకూడా నామంచం మీదికే వచ్చి నాదుప్పటీలో దూరేడు.

"సన్యా! నామీద కోపపడకు. నేను చెప్పింది అబద్ధమా?"

"నాకేమీ కోపంలేదు. బోరిసూ!"

మేమిద్దరమూ చాలారాత్రివరకూ ఏవేవో కబుర్లుచెప్పుకుంటూ పడుండి, నిద్రపోయి, — ఇద్దరు ఒకమంచంమీద నిద్రించకూడదనే కమ్యూన్ నిబంధనని ఉల్లంఘించేము.

ఇరవయ్యోది...

ప్రకరణం.

'ఆశ్రయహీనులయిన అనాధబాలుర శరణాలయం'లో సమ్మె బయలుదేరింది. బయట వరాండాలో దూలానికి వ్రేలాడగట్టిన రైలు పట్టాముక్కమీద నిద్రపోవలసిన సమయాన్నిసూచించే గంటమ్రోగి చాలాసేపు అయింది. కాని, విశాలమైన ఆభవనంలో దీపాలన్నీ ఇంకా అలాగ వెలుగుతూనేవున్నాయి.

ఆసమ్మె మాగదిలోనే ఆరంభం అయింది. ఆరోజున వర్కుషాపులోనుంచి చచ్చివొచ్చేను. ఒళ్ళు హూనం అయిపోయింది. మెట్లపైకి ఎక్కడమే గగనం అయిపోయింది. తల తిర్గిపోతూంది. నాలుకఅంతా తడిఆరి బెరడుకట్టిపోయింది.

వస్తూనే కాలిజోడయినా విప్పకుండా మంచంమీద పడుకున్నాను. నాకోసంతెచ్చిన టీ—భోజనాలని దూరంగా తోసేసేను. త్వరగా కళ్లుమూసికొని నిద్రపోతే మనసు కుదుటపడుతుందని ఆశ.

అగోడల్ని చూచినా, ఆమనుష్యుల్ని చూచినా, ఆప్రదేశాన్ని చూచినా ఎంతో విసుగు కలుగుతూంది. శరీరంలో నాకేమి జబ్బులేదు. కాని, వీళ్లో నాకేదో అపకారం చేస్తూన్నారనే విచారం మనస్సుని బాధ పెడుతూంది.

పడుకుందుకు కంబళీ ఎత్తేను. పరుపుమీది దుప్పటీ. ఎవర యినా మార్చివేసేరేమో ననిపించింది. నాది తెల్లని దుప్పటీ. దీనిని చూద్దామంటే బూడిదరంగుగా—నూనెడాగులతో నిండివుంది. నేను ఆదౌర్జన్యం సహించలేక పెద్దపెద్ద కేకలుపెడుతూ పిల్లలందరినీ పిలిచేను. వాళ్ళు వచ్చిచూసి వకవకా నవ్వేరు.

"కొంచెం కళ్ళు తెరచి చూడు, సన్యా!"

నేను వొంగి పరీక్షించేను.....ఔను ఈదుప్పటీ నాదే. అదిగో అమూల నాబూట్లగుర్తు వుందికూడాను. ఈవేళవరకూ దుప్పటీ నల్లగామాసిపోయిందనే విషయం గమనించనే లేదే! ఛా! ఈలాంటి పాడుదుప్పటీమీద పడకవేమిటి?

డ్యూటీలోవున్న పనివాడిని పిలుస్తూ, కారిడర్‌లోకి పరుగెత్తి కొత్త శుభ్రమైనగుడ్డలు తెచ్చియిమ్మని కేకబెట్టేను.

అంతవరకూ చదరంగం ఆడుకుంటూకూర్చున్న పిల్లలంతా నావిసురుచూసి, పరుగెత్తివచ్చి నాచేతులు పట్టుకొని శాంతపరచ డానికి ప్రయత్నించసాగేరు. ఆసమయంలో వదిలేస్తే ఎవ్వరినైనా కొట్టిపోతానేమోనని వారిశంక. కాని, నేను ఆగలేదు. పక్కమీటి నుంచి లాగేసిన దుప్పటీ చేతబట్టుకొని, విసురుకుంటూ, అరుస్తూ,

పరుగెత్తుతూనేవున్నాను.

"పక్క-బట్టలు మార్చాలి. ప్రక్క-బట్టలుకావాలి."

గదులు తలుపులుతెరుచుకొని గబగబా నాలుగుమూలలనుంచీ పిల్లలంతా పరుగెత్తివచ్చేరు. కాపలామనిషి 'ఫెడోర్-పెట్రోవిచ్' ఉరకలు వేసుకుంటూ పరుగెత్తివచ్చేడు. నేనొకపెద్ద పేచీలేవ దీసేను. నన్నెవ్వరూ చూడడం లేదన్నాను. పలుదోముకుంచెకూడా కనపడలేదాయె.

ఈగంద్రగోళం—ఈఅల్లరి—ఈకేకలు ఎందుకని పిల్లలు-తెగ ప్రశ్నలు వేస్తూన్నారు. కాని, నేనొక్కదాని కయినా సమాధానం ఇస్తేనా? సాధ్యమయినంత పెద్దదిగా నోరుతెరచి, అరుస్తూ, దుప్పటీ ఎగరవేస్తూనేయున్నాను.

"పక్క-బట్టలు మార్చండి. శుభ్రమైన బట్టలు కావాలి."

నేను పరుగెత్తుతూ, పరుగెత్తుతూ ఇరవై అయిదోనెంబరు గదిలోకివెళ్లేను. ఆగదిలోని వారంతా ఈమధ్యనే పల్లెటివూళ్ళకి పోయివచ్చేరు. అక్కడికి దగ్గరలోనే ఒక పల్లెటూళ్లోవున్న కమ్యూను సైబీరియన్ మైదానంలో ఆప్రాంతాలకల్లా మొట్టమొదట సమిష్టివ్యవసాయపద్ధతిని ఆరంభించింది. ఈజట్టువాళ్ళు ఆవూరు పోయి కొంతకాలంవుండి, బళ్ళు—నాగళ్ళు—మొదలయినవి మరమ్మతులుచేసియిచ్చీ, వ్యవసాయానికి అనువైనమార్గాలు బోధించీ, సహాయం చేసివచ్చేరు. వచ్చికూడా రెండురోజులు మాత్రమే అయింది. వచ్చేటప్పటికి చాలానీరసంగా మాటలాడడానికికూడా

ఓపికలేని స్థితిలో వచ్చేరు.

నేను నాపక్కదుప్పటీ వాళ్ళముందు పడేసేను.

"ఇల్లాచూడండి. మనకి పక్కలమీద పరుచుకొనేటందుకు ఈయవలసినదుప్పట్లు ఇల్లాంటివేనా? చూడండి. మనస్థితి ఏలాగ వుందో."

'పిట్టరు' గా పనిచేస్తూన్న 'మిష్కా' తనపరుపుమీద పరచిన దుప్పటీ లాగేడు.

"మా అందరివీకూడా అలాగేవున్నాయి. వాళ్ళదృష్టిలో మనం పందులకంటేనూ హీనంగా వున్నాం."

మిష్కా కొద్దిరోజులక్రితమే తాము వెళ్ళినఊరిలో త్రాగడం కోసం తనబూట్సులజత అమ్మేసేడు. ఈతడుకూడా 'కారిడర్' లోకి వచ్చి, —'మాకు శుభ్రమైన గుడ్డలు ఈయండి'— అంటూ మొగం కందిపోయేలాగ అరవడం ఆరంభించేడు.

ఆగదిలోనివారంతా మిష్కాతో కలిసేరు. అందరూ పక్కదుప్పట్లు లాగేసి, చుట్టచుట్టి, ఎత్తిపట్టుకొని ఒక్కొక్కగదికే బయలుదేరసాగేరు.

మెట్లమీద కొందరుపిల్లల్ని వెంటబెట్టుకొని కోల్కా వచ్చి మమ్మల్ని అడ్డగించుకున్నాడు.

"ఎక్కడికి బయలుదేరేరు? వెనక్కినడవండి!"

"నీఉద్దేశ్యం ఏమిటి?—మమ్మల్ని పోనీయ"—మంటూ తిరుగుబాటుదారులు అరిచేరు. నేను మామూలు అలవాటుకొద్దీ పిడికిలి

బిగించి చేయి ఎ_త్తేను.

కోల్కా మొగం జేవురించింది.

"ఓరివిషపుపురుగా! రా. ధైర్యంవుంటే కొడుదువుగాని."

నేను నెమ్మదిగా చేయివాల్చేను. కోల్కావచ్చి అగుప్పిడి పట్టుకున్నాడు

"రా. 'రెడ్-కార్నరు' లోకి. ఈగొడవ అంతా ఎందుకో చెబుదువుగాని. వాళ్ళనికూడా తీసుకురండోయి."

'రెడ్-కార్నరు' ఒకమారు మళ్ళీ జనసమ్మర్దం అయింది. నేను మరొకమారు విచారణకి సిద్ధంచేయబడ్డాను. కోల్కా నాప్రక్కనేనిలబడి పిల్లలందర్నీ పిలిచి విచారణను ఆరంభించేడు.

"కామ్రేడ్స్! ఈపేచీఅంతా ఎందుకో తెలుసునా? ఇతని పక్క బట్టలు మురికిగా వున్నాయట. అందుకు, ఈగోల."

అక్కడినుంచి అతనివిసురంతా నామీధికి తిరిగింది.

"ఊరపందిలా ఏలావున్నావు? అసలుకి పెట్కాకూడా బట్టలు శుభ్రంగా వుంచుకుంటాడు! అతనిబట్టలు శుభ్రంగా ఏలావుంచుకో గలుగుతున్నాడో అడిగేవా? పెట్కా! ఈలా రావోయి'"

మషూచికపు మచ్చలతో నిండిన మొగమూవాడూ పెట్కా జనాన్ని ఒ_త్తిగించుకుంటూ ముందుకువచ్చేడు. అతనికళ్ళలో ఒకవిధమైన జ్యోతి వెలుగుతూంది. విజయానందంతో వణుకు తూన్న స్వరంతో అతడు వేదికఎక్కి ఉపన్యాసం ఆరంభించేడు.

"కమ్యూన్లా నాసేవకి తయారై బాగుద్దళు ఉతికి ఇచ్చేదాన్నా

నేను నోట్లో వేలుపెట్టుకొని కూర్చోడం లేదు. అందుచేతనే నాబట్టలు శుభ్రంగా వున్నాయి. నాబట్టలు నేనే వుతుక్కుంటున్నాను. సన్యాకి చాకలి కావాలి. జోళ్ళయినా విప్పకుండా మురికిగుడ్డలతో పక్కమీదపడి దొర్లుతాడు. ఎప్పుడూనిద్రే, అతగాడికి బట్టలుదుకు కుందుకు ఖాళీయేదొరకడం లేదు."

పెట్కా చెమర్చిన అరిచేతుచొక్కాకొంగులకి రుద్దుకుంటూ బల్లదిగేడు.

ఆవెనక్కాల మిష్కా అందుకున్నాడు.

"ఆచవట 'పెట్కా'గాడు ఎన్నయినా చెబుతాడు. మేము నెల రోజులయింది ఊరికిపోయి. మొన్ననేనా మేము వచ్చేము. మాకు చేసినసౌకర్యాలు ఏమిటి?"

కమిటీసభ్యులలో ఒకడైన మిట్కా వెంటనేలేచేడు.

"మిష్కా! అది మీలోపమేగాని, మరొకరిది కాదు. మీకు మూడురోజులు విశ్రాంతికీ, రెండురోజులు స్వంతపనులు చూసుకుందుకూ! గడువు ఈయబడింది. ఈఅయిదురోజులూ కళ్లు మూసుకొని నిద్రపోయి, ఇప్పుడు ఎవ్వరినేమంటావు?"

ఇరువై అయిదోనెంబరు గదిలో పిల్లలు నోరుమూసుకున్నారు.

ఆసమయంలో ఏవో కాగితాలుకొన్ని చేతబట్టుకొని బోరిసు తయారయ్యేడు. వస్తూనే తనఅధ్యక్షపీఠం అలంకరించి సభవారిని అల్లరిచేయవద్దని హెచ్చరించేడు. సభలో అల్లరి చల్లబడగానే కాగి

తాలంకట్ట విప్పేడు.

"మనకమ్యూణాలోమొత్తంనూటముప్పదిమంది పిల్లలున్నారు. వీరందరికీకలిపి వెయ్యినలభైదుప్పట్లు వున్నాయి.అంటే ఒక్కొక్కడికి ఎనిమిదెనిమిది దుప్పట్లు ఉన్నాయి. మన గృహనిర్వహణసంఘం ప్రతిసభ్యుడికీఒక్కొక్క నెంబరుఇచ్చింది. వారివారి పేర్లూ నెంబర్లూ సంరక్షకుని పుస్తకంలో వ్రాయబడియున్నాయి. ప్రతిసభ్యుని బట్టలమీదా వారివారిసంఖ్యలు ముద్రించబడ్డాయి. వీనితోబాటు ఉదికిన బట్టలు పెట్టుకుందుకు ఒకటీ, మాసినవానికోసం ఒకటీ రెండుసొరుగులు ప్రతివానికీ ఈయబడ్డాయి. మీకిచ్చినసొరుగులలో మంచిగుడ్డలు వేసుకొనేది ఖాళీఅయిపోయిందంటే మీకు కంజాయింపుచేసుకొనే తెలివితేటలు లేవన్నమాట ఇక్కడ మీఅందరికి సేవకులు ఎవ్వరూ లేరు. ఎవరిసంరక్షణ వారు చూసుకోవలసిందే. సన్యాచొరుగులలో మంచిగుడ్డలు పెట్టుకొనేది ఖాళీగావుంది, ఆతడు పక్కగుడ్డలు మార్చుకోవాలంటే ఎక్కడినుంచి వస్తాయి? తనకున్నవన్నీ వాడేసుకున్నాడాయె. పెట్టె సొరుగుతో ఆరు దుప్పట్లున్నాయి. కోళ్ళాకీ-అంతే. నాదాంట్లో నాలుగున్నాయి. మిగిలిన పిల్లవాళ్ల పరుపులమీద శుభ్రమైన దుప్పట్లున్నాయి.

మేము ఒక్కరం నోరు విప్పలేదు.

మాతిరుగుబాటు అణిచివేయబడింది. దానిని మళ్లీతలఎత్తకుండా చేసేసేరు. దానితాలూకు గుర్తుకూడా లేకుండా తుడిచివేయబడింది. నేనీపేచీ ఎందుకు ప్రారంభించినదీ ఎవ్వరూ అడగలేదు.

నాతప్పుల్నిగురించి ఎవ్వరూ ఖాతిరీచేయలేదు.

ఈగందరగోళం జరగడానికి అసలుకారణంవేరు.

ఒకవారంరోజులక్రితం అంటోనోవిచ్ పెట్కా కీ—నాకూ ఒక తొందరపని వప్పచెప్పేడు. షాపులోకికొన్ని 'ఇంజెక్టరు—ఛెక్కు'లు అత్యవసరంగా కావలిసివచ్చేయి.—"ఈపని త్వరగా పూర్తిచేసిపెట్టాలోయి"—అని మామీద పెట్టేడు; ఆపని. పని చాలా సులువయినదే. గుండ్రని ఇత్తడికడ్డీలమీదనుంచి సన్నని, బంగారంలా మెరిసిపోతూన్న, తీగల్ని ఉలి అతిసున్నితంగా లేవదీసివేస్తూంది. పనికూడా సరదాగా నడిచింది. సాయంకాలంమోటారు ఆపేటప్పటికి ఎనిమిది 'ఛెక్కు'లు తయారయినాయి. పనిమాని, నేనుచేయి కడుక్కుంటూవుండగా, పెట్కాగొంతుక ఆమూల నుంచి వర్కు-షాపునంతనీ ప్రతిధ్వనింపచేస్తూ వినవచ్చింది.

"అంటోనివిచ్! ఇవిగో పన్నెండు తయారుచేసేను."

కుళాయి కట్టివేయాలనే సంగతికూడా మరచిపోయి, ఆతని మాట ఎంతవరకూ నిజమో పరీక్షించడానికి పరుగెత్తేను. మెరుగు పెట్టిన బంగారపుముక్కలలాగ పన్నెండు 'ఛెక్కు'లు ఆతనిచేతులలో మెరసిపోతూన్నాయి. సిగ్గుఅనే సంగతికూడా మరచిపోయి, ఎంతోసంతోషంతో వాటిని నాచేతిల్లోకి తీసుకొని చూసేను. పెట్కా విజయోత్సాహంతో ఈలపాట పాడుతూ, పాటకుఅనుగుణంగా చేతితో తుంటిమీద తాళంవేసుకుంటూ నిలబడ్డాడు.

మరునాడు ఇంకా గంటకొట్టకుండానే'వర్కు-షాపు'కి బయలు

దేరేను. ఉలి వగైరాసాధనాలన్నీ బాగా సానపట్టిసిద్ధంచేసుకున్నాను. లేతుచక్రాలలో నూనెపోసి పరీక్షించి చూసుకున్నాను. మోటారు కదిలేటప్పటికి అన్నిపనిముట్లూసిద్ధంగా ఉన్నాయి. గంటమోతఆగకుండానే ఇత్తడితుండుమీది మొదటిపొర లేచి ఊడవలబడింది.

"ఆంటోనివిచ్ ఈవేళ ఎవరుఎక్కువపని చేసేరంటాడో చూద్దాం—" అనుకుంటూ ఉలిని అదుముతూన్నాను.

సాయంకాలం అయింది. నేనుఇంతశ్రమపడితే పదింటిని మాత్రమే తయారుచేయగలిగేను. పెట్కాపదమూడింటిని తయారు చేసేడు.

మరునాడు పొద్దుటిభోజనానికికూడా వంటశాలకి పోలేదు. మోటారుప్రక్కన నిలబడే తిండి తిన్నాను.

కాని, పెట్కాని అందుకోలేకపోయేను.

అప్పుడు కోల్కా నానహాయానికి వచ్చేడు. పిల్లలందరికీ నేనంటే అభిమానమే. కాని, ఆఅభిమానంవలన ఏమాత్రమూ ప్రయోజనం లేకపోయింది. పెట్కా నాకంటె ఎప్పుడూ పైచేయిగానే వున్నాడు. అందుచేతనే నన్నెవ్వరూ ఖాతిరీచేయడంలేదనీ, నన్ను సరిగ్గా చూడడంలేదనీ, దురభిమానం బయలుదేరి తిరుగుబాటుకి దారితీసింది.

ఈవేళ 'రెడ్-కార్నర్'లోసభజరిపి అందులో పెట్కాకి బహుమతీయిస్తారు. పిల్లలంతా అక్కడికి పోయేరు. నేను ఒక్కడినీమాత్రం గదిలో వుండిపోయేను. దీపంఆర్పేసి కిటికీవద్ద బయటికి

చూస్తూ నిలబడ్డాను.

మైదానాలు పచ్చబడ్డాయి. చెట్లు చిగుళ్ళుతొడిగేయి. ఈరోజు లలో 'సుఖూమ్'లోగాని, 'వ్లాడివాస్టక్'లో గాని, వుంటే ఎంత బాగుంటుంది? గంజాయి పీలిస్తే ఈరోజుల్లోనే పీల్చాలి.

దూరాన మైదానంలోంచి దట్టంగా పొగలేస్తూంది. బహుశా రైతులు నాటుసారా వండుతూవుండియుంటారు.

చీకటిపడ్డాక ఒకమారు ఊళ్ళోకి పోతే?—ఇంతలో ఇటికీనుంచి వెనక్కి తిరిగేను. అంటోనిచ్ ఎదురయ్యేడు.

"ఏమిటోయి! సన్యా!"

నేను ఆపాదమస్తకం వణికిపోయేను. ఎంతో నీరసంగా వున్నట్లు అనిపించింది. —అంటోనిచ్ నన్ను 'రెడ్–కార్నరు'లోకి తేసుకుపోయేడు. నేనేమీ అనలేదు. అధ్యక్షస్థానంకి దగ్గరగానే కూర్చుండబెట్టుకొని సాయంకాలందాకా వదలనేలేదు.

మరునాడుప్రొద్దుటే అంటోనిచ్ నామోటారువద్దకివచ్చేడు. ఆరోజంతా మరోపనిమాని నావద్దనే కూర్చుండి నాపనిలో సాయంచేసేడు. ఉలిపట్టుకొనే పద్ధతి నేర్పేడు. లేతుమీద పనిచేసేవిధానం బోధించేడు;

అంటోనిచ్ మూడురోజులదాకా నాకోసమని వర్కు–షాపుపని అంతా వొదులుకున్నాడు.

రెండువారాలు గడచేడప్పటికి నాకు పనిలో మంచినేర్పు అలవడింది. ఇప్పుడు రోజుకి పదిహేను 'ఇంజెక్టరు–చెక్కు'లు తయా

రుచేస్తూన్నాను. త్వరలోనే ఇంతకంటె ఎక్కువ చేయగలుగుతాననే ఆశ కూడావుంది. పెట్కా పదమూడువగ్గరే ఆగిపోయాడు. నేను అతిశుస్నితంగా పనిచేస్తూవుంటే చూసి ఆంటోనిచ్ ఎంతో ఆనందించేరు. నేను ఆతనివగ్గరికివెళ్లి ఆతని చెవిలో. నాలేతుకిపైన వేలాడుతూన్న హెచ్చరికబల్ల—

—'నీకు అయాసంగావుంటే పనికట్టిపెట్టు, 'రెడ్–కార్నరు' లోకిపోయి పడకకుర్చీలో విశ్రాంతితీసుకుంటూ, చదువుకో, వెళ్లు" తీయించవేయమని చెప్పేను.

కమ్యూన్‌కమిటీ బల్ల తీసివేసింది. దానిని తీసుకుపోయి ఒక మూలలో తుప్పుపట్టిన మేకుకి తగిలిస్తూంటే కమ్యూన్‌లోని నూట ముప్పైమందీ తొంగితొంగి చూసేరు.

## ఇరవైఎనిమిదో ప్రకరణం.

ఆరోజున కమ్యూనుయొక్క మూడో సంవత్సరోత్సవం జరప బడుతూంది. మేము నేలనంతనీ శుభ్రంగా కడిగి తుడిచి మెరుగు పెట్టేము. గోడమూలలనుంచీ. సరంబీలమీదనుంచీ, సాలిగూళ్లు తీసివేసి పాలెపురుగుల్ని తరిమివేసేం. తెల్ల—పక్కబట్టలు మార్చి క్రొత్తనివి పరిచేము. ఆంటోనిచ్ తన తోలుకోటుకి బాగా మెరుగు

పెట్టుకున్నాడు. మీసాలు నీటుగా కత్తిరించేడు. 'రెడ్–కార్నరు'లో గోడలన్నిటిమీదా అనేకప్రకటనలు, బొమ్మలు, కమ్యూనులోని జీవితవిధానాన్ని తెలియజేసే ఫొటోగ్రాఫులు, వ్రేలాడదీయబడ్డాయి.

మాకమ్యూనుకి పోషకులుగావుంటూన్న రైల్వేకార్మికులు, ఆఉత్సవసమయంలో మాకు బహుమతులు తెచ్చేరు. కమ్యూన్‌లో పనినేర్చుకున్న పిల్లల్ని కొందరిని ఎంచి తమలోకి తీసుకుంటారు. కమ్యూన్‌కమిటీ అయిదుగురుపిల్లల్ని సూచించింది. జనరల్ బాడీలో ఆసూచనలు పరిశీలించబడి అంగీకరించబడినాయి. ఒకప్పుడు నేరగాండ్రయిన ఆఅయిదుగురూ ఈసాయంత్రంనుంచీ ఒకనూతన జీవితవిధానంలో అడుగుపెడతారు.

ఈమధ్యనే నన్ను కమ్యూనుకమిటీకి అధ్యక్షుణ్ణిగా ఎన్నుకోవడంచేత ఆనాటిసాయంకాలం మీటింగుకి అధ్యక్షపీఠం నాది అయింది. ఆంటోనిచ్ తనసాంవత్సరికనివేదిక చదివేక నేనులేచి మాటలాడాలి. కాని, ప్రారంభంలోనే నాకు కంగారుబయలుదేరింది. ఉపన్యాసం ఏవిధంగా ప్రారంభించాలో ఏమీ తెలియదు. ఉపన్యాసం అయినాక పిల్లలపట్టిక చదివి, వారిని కమ్యూనిస్టుయువజనసంఘంలోకి తీసుకోవలసిందని మాకమ్యూను కమిటీతరఫున సిఫార్సు చేయాలి. నేను పత్రికచేతబట్టుకొని లేచినిలబడ్డాను. అన్ని పేర్లకీ పైన వుంది నాపేరు పెద్దఅక్షరాలతో.

ఆంటోనిచ్ నాకంగారు గమనించి ఆపట్టికను నాచేతిలోంచి తీసుకొని వేదిక చివరకి నడిచివెళ్ళి రేలింగులమీద కాలూని,

ముందుకు కొంచెంవంగి చదవడం ఆరంభించేడు.

"అలెక్జాండరు:—వయస్సు పద్దెనిమిది. 'టర్నరు'. 'ఇంజను డ్రైవరు' గా వుండాలని కోరుతూన్నాడు. ఇదివరకే ఇంజన్లవిషయం కొంతవరకూ తెలుసును.—

బోరిస్ కౌడిల్య:—వయస్సు పద్దెనిమిది. 'టర్నరు'. ఈతడు కూడా 'ఇంజనుడ్రైవరు' అవగోరుతున్నాడు.—

నికోలాయ్ దూబ్రోవు:—వయస్సు పద్దెనిమిది. 'టర్నరు' అందులో ప్రావీణ్యత సంపాదించాలని ఊహిస్తూన్నాడు.

వాన్యా జోలోటుకిన్:—ప్రావీణ్యతగల 'ఫిట్టరు'. 'మౌల్డరు' గావుండాలని కోరుతూన్నాడు.

పెటర్ మోత్రూష్కిణ:—"టర్నరు.................."

ఆంటోనిచ్ పేర్లు చదివేసి కాగితం చుట్టివేసేడు. తరువాత నెమ్మదిగా తలఎత్తి పెదవులు బిగించి మాశేసి చూసేడు. ఆతని కళ్ళు వింతవెలుగుతో ప్రజ్వలిస్తూన్నాయి. మీసాలు నిగనిగలాడు తూన్నాయా అనిపించింది. ఆతనిస్వరం చాలాగంభీరంగా పోరాటానికి కవ్విస్తూన్నమాదిరిగా వుంది.

"పిల్లలారా! ముందుకు సాగండి. కళ్లు ఎప్పుడూ తెరచివుంచుకోండి. ఎట్టిపరిస్థితులలోనూ కంగారుపడవద్దు. దారితప్పవద్దు. ఈకమ్యూన్‌లో ఉండిపోతూన్న మమ్మల్ని మరచిపోవద్దని కోరిక. ఈకమ్యూన్‌లోనే మీరు స్వశక్తిపై ముందుకి రాగలిగేరు. అభివృద్ధి పొందగలిగేరు. మీరెక్కడికి పోండి!—మాస్కోకి వెళ్ళినా—తాష్

ఖండ్ కిపోయినా, ఈవర్క్—షాపులోనే వుండిపోయినా, కమ్యూ న్‌లో వున్నట్లే భావించుకోండి. మీవ్యక్తిత్వం నిలబెట్టుకొనండి."

తరువాత అధ్యక్షస్థానంలోవున్న నావద్దకు వచ్చి నాకళ్ళలోకి చూసేడు.

"సన్యా! 'ఇంజను—డ్రైవింగ్' లో ప్రవీణుడివి, కా."

ఆంటోనిచ్ నన్నుగురించి ఏదోజ్ఞాపకం చేసుకుంటూన్నట్లు కొద్దిసేపు ఊరుకుని, చేతులు బారచాపి, బల్లమీదికి వొంగేడు. అతని కనురెప్పలు అదిరిపోతూన్నాయి.

మేమిద్దరమూ ఒకరినొకరం గాఢంగా కాగలించుకున్నాం. బల్లమీదికాగితాలు రెపరెపలాడేయి. గ్లాసుక్రిందికి దొర్లిపోయింది. ప్రజలంతా గభీమని లేచినిలబడిపోయేరు. కాని, మాలో చైతన్యం స్తంభించింది. పొగాకువాసన వేస్తూన్న ఆతని బిరుసుమీసాలు, నాకనురెప్పలకి—బుగ్గలకి— పెదవులకి తగిలి గిలిగింతలు పెడుతూన్నాయి. హృదయంలోంచీ పుట్టుకువచ్చిన ఒకవిధమైన ఆవేగం మెదడును ఆక్రమించి స్తంభింపచేసింది.

మాకన్నీరు కలిసింది. ఆజనసమూహంముందుగాని మాపోషకులున్నారనిగాని, ఒకమూల గోడకి తగిలించివున్న ఆ 'లెనిన్' ఫొటోయెదుటగాని, మేము కంట నీరుపెట్టడానికి సిగ్గుపడలేదు. సరంబీకి తగులుతూన్న 'లెనిన్' యొక్క నిలివెడు విగ్రహం మమ్మల్ని ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో చూస్తూన్నట్లుగా కనపడింది.

కొంతసేపటికి ఆంటోనిచ్ నన్నువొదిలి కన్నీళ్లు తుడుచుకున్నాడు. ఆతనిస్వరం గద్గదికంగా వుంది.

"నన్యా! నువ్వు వెళ్లిపోతావంటే ఏలాగో అనిపిస్తూంది. నిన్ను మచ్చికచేసుకోవడమే కష్టం అయిపోయింది. సరే!—సెలవు. నన్యా! నీస్వశక్తిమేద నీజీవితసుఖాన్ని సంపాదించుకో."

ఆతడు రైల్వేకార్మికులకేసి తిరిగి వారికి మమ్మల్ని అప్పగింతలు పెట్టేడు.

—"ఇంక మీమాట! ఇదుగో మేము ఈయగలబహుమతీ వీళ్ళే. వీళ్ళవిలువ అమూల్యం. వీరిని రక్షించుకోండి. మాకమ్యూనులో అందరూ 'కమ్యూనిస్టుయువజనసంఘంలోకి వీరిని తీసుకోవలసిందని సిఫార్సు చేస్తూన్నారు."

ఆరోజున జరిగిపోయినదంతా ఆనందకరమైనదే. ప్రతివాడూ అటువంటి భావోద్రేకాన్నే పొందేడు. మాపోషకులు తామువచ్చేటప్పుడు తమతో 'బ్యాండు' ఒకటి తీసుకువచ్చేరు. ఆఇత్తడిసాధనాలు మెరుగుపెట్టబడి మిలమిలా మెరిసిపోతూన్నాయి. పరిమళభరితములయిన పూవుదోటల సౌభాగ్యం అంతా ఆనాడు అక్కడ కేంద్రీకరించినదేమో ననిపించింది. అయినా—

మసూచికపు మచ్చలతో నిండిన మొగమూ వాడూ పెట్కా ఎదుటిబల్లమీదనే కూర్చున్నాడు. ఆతని పెదవులు బిగించియున్నా వణుకుతూనేవున్నాయి. మొగం అందవికారంగావున్నా ఆకళ్ళు ఒకవిధమైన అందాన్నే ఇస్తూన్నాయి. నాహృదయంలో దివ్యమైన

ఆనందం ప్రజ్వలిస్తూంది. కమ్యూనాలోవారందరినీ కౌగలించుకో వాలనీ, గోడలన్నీ ముట్టుకోవాలనీ, నూటముప్పైమందినీ ప్రత్యేక ప్రత్యేకంగా కలుసుకొని వాళ్ళ భుజాలు తట్టుతూ, నాజీవితాన్ని సుఖవంతం చేసుకోగలనని చెప్పాలనీ, మనసులో ఉబలాటం కలిగింది.

ఇరవైతొమ్మిదో

ప్రకరణం.

వలచదరంగావున్న మేజామీది గ్లాసులోని నీరు తొణుకు తూంది. పైన బల్లమీద పడుక్కున్న 'పెట్కా మోత్రూష్కిన్' తొడుక్కున్న కోటుచివరలు క్రిందికి వ్రేలాడుతూన్నాయి. బోరిసు కిటికీకి జేరబడి చదువుకుంటూన్నాడు. అతని భుజాలు అదిరిపోతూ న్నాయి. బండికుదుపుకి మనిషి వూగుతూన్నాడు. చదువుతూ—చదు వుతూ మధ్యమధ్య కిటికీలోంచి బయటికి చూస్తూన్నాడు.

"నేటి మాగ్నిటోస్ట్రాయ్."

ఆపుస్తకం అట్టమీద ఊదారంగుసిరాతో ముద్రించబడ్డ అక్ష రాలు కూడబలుకుకున్నాను. బోరిసు ప్రతిస్టేషనులోనూ దిగి ప్రభు త్వప్రచురణశాఖవారి పుస్తకశాలలన్నింటిలోనూ 'మాగ్నిటోగోర స్కు'నుగూర్చిన పుస్తకాలకోసం గాలించివేస్తూన్నాడు. చాలా

రోజులనుంచి ఆతనికి పుస్తకాలుతప్ప మారుధోరణిలేదు.

ఆతనికి తిండిమాటకూడా పట్టేదికాదు. పెట్కా బలవంత పెట్టి వేడిపాలు తెచ్చియిచ్చేవాడు. తన చదువుకి అడ్డంవచ్చినందుకు బోరిసు అతడి చెంపలు వాయిస్తూండేవాడు. అయినాసరే పెట్కా యూ వదిలేది? పీక్కుతిని ఏలాగో ఒకలాగు తంటాలుపడి ఆతనిచేత ఏపిలు కొరికించేవాడు. తన్ను బాధిస్తూన్నందుకు శిక్షగా పెట్కా మొగంమీద ఉమ్మివేయడానికి ముక్క కొరికేవాడు. గానిదానిరుచి చూచి పారవేయలేక నెమ్మదిగా నమిలేవాడు. నములుతూన్నా ఆతని కళ్లు పుస్తకంమీదినుంచి తొలిగేవికావు.

నాకు బోరిసంటే ఒక్కొక్కప్పుడు మహాచెడ్డకోపం వస్తూంటుంది. ఆతడు ఎప్పుడూ ఒక్కమాదిరిగానే వున్నాడు. ఒక పని ప్రారంభించేడంటే మళ్ళీ తిండీ-తిప్పలూకూడా మరిచిపోయే వాడు. కమ్యూన్‌లోవుండగా చూసేవాడినికదూ? ఆతనికళ్లు-ఆతని వదక-విసుక్కుంటూ తిండితినడం, ఇవేమీ నాకు కొత్తవికావు. ఎంతో సున్నితములయిన పనులుచేస్తూండేటప్పుడు ఎంతో ఆశ్చ ర్యంతో ఊపిరికూడా బిగపట్టుకొని, పరిశీలిస్తూండేవాడిని, వర్కు-షాపులో వున్నప్పుడు. ఆతనితెలివీ-ఆపనినేర్పూ, ఎప్పటికయినా నాకు అలవడుతాయా అని ఎంతో ఆశపడుతూంటాను.

ఫ్యాక్టొరీస్కూలులోకూడా ఆతడు నాకంటె పెద్దతరగతిలోనే చదువుకొనేవాడు. కమ్యూన్‌లో నేను అక్షరాలు నేర్చుకుంటూన్న నాటికి అప్పుడే ఆతడు గణితంలో 'ఖిన్నా'లుచేసివేస్తూన్నాడు. నేను

ఫ్యాక్టొరీస్కూలుచదువు పూర్తిచేసేటప్పటికి ఆతడు 'ఇంజను—డ్రైవింగ్'లో పెద్దపరీక్ష ఇచ్చేసేడు. నేను ఇప్పుడు అసిస్టెంటుగా వుంటూన్నాను. ఆతడు 'గూడ్సు—బళ్ళ'కి డ్రైవరుగా పనిచేస్తున్నాడు.

ఆతనితో ఏలాగయినా సమానంకావాలనే కోరిక నాకెప్పుడూ వుంది. ఎప్పుడూ ఆప్రయత్నం మానలేదు. ఆతనిని ఒక్కక్షణం వొదిలి దూరంఅయిపోతే, నాఉనికీ,- నాదైనికాభివృద్ధీ—నాకే అర్థంగాక నెమ్మదిగా పాకడం ఆరంభిస్తానేమోనని నాభయం.

కమ్యూనిస్టుయువజనసంఘం ఆతడిని మాగ్నిటోగోరస్కుకి ఇంజన్లు నడపడానికి పంపించడానికి నిశ్చయం చేసుకున్నప్పుడు, నన్నుకూడా అక్కడికే పంపించమని అడిగేను. ఒంటరిగా వుండలేక పెట్కాకూడా మాతో కలిసేడు.

మాగ్నిటోగోరస్కునిగురించి ఎన్నోవిషయాలు విన్నాను. పార్టీ మీటింగులలో — రాజకీయసమావేశాలలో — సినీమాలలో — నాటకశాలలలో—ఎన్నో వివరాలు గ్రహించేను. అక్కడి పరిస్థితులు—వస్తువులయొక్క ఫొటోగ్రాపులతో నిండిన ప్రదర్శనశాలలెన్నింటినో చూచేను. ప్రతిఉపన్యాసకుడు మాగ్నిటోగోరస్కునుగురించే ముందుగా ఎత్తుకుంటాడు. మాగ్నిటోగోరస్కుమీదిబొమ్మలు—హెచ్చరికలు—ప్రకటనలు—వందలకొలది పుస్తకాలు, సంచికలు, పత్రికలు, ఓ—ఒక్కటేమిటిః—ఎన్నో బయలుదేరేయి. దానిపేరు అద్భుతంగా ప్రచారంఅయిపోయింది. దానిపేరు చెబితేచాలు ప్రజలు

ఉద్రేకపరవశులై పోతూన్నారు. వెర్రిఆవేశం కలుగుతూంది.

దానిని రెండురోజులలో చూడబోతూన్నాను. నేనింక అక్కడనే పనిచేయబోతూన్నాను. అక్కడనే కాపురం వుండబోతూన్నాను. ఆఆలోచనవలనకలిగిన ఆనందాన్ని ఉండబట్టలేకుండా వున్నాను. దానినిగూర్చి ఎవ్వరితోనైనా చెప్పుకొని హృదయభారం అణుచుకుంటే బాగుండును. కాని ఎవరితో చెప్పుకోవడం? పెట్కాగుర్రుపెడుతూన్నాడు. బో రి సు పు స్త కం చదువుకోవడంలో మునిగిపోయివున్నాడు.

* * * *

కండక్టరు కారిడరులో హడావిడిగా నడిచివస్తూనేవున్నాడు. ఆతని చేతిలోని చీపురుకట్టా—బకెట్టూ ఒకదానికొకటి కొట్టుకొని గణగణలాడుతూన్నాయి.

నేనుఆతనిని పిలిచి —"మాగ్నిటోగ్స్రాయి' ఇంకాఎంతదూరం వుందేమిటి?" —అనిఅడిగేను. ఆతడు ఎంతో ఆశ్చర్యంతో నామొగంకేసిచూసేడు.

"అబ్బే!ఎంతోదూరంలేదు. స్టేషనుకి వచ్చేటప్పటికి నేను బళ్లు తుడవడం పూర్తి కానేకాదు."

నేను హడవిడిగాలేచి పెట్కాని లేవగొట్టేను. బోరిసుచేతిలోంచి పుస్తకం లాగేసుకున్నాను.

"మాగ్నిటోగ్స్ట్రాయికి వచ్చేసేమోయ్! అబ్బాయిలు! ఈపాటికి లేవండి. అదిగో మాగ్ని—టో—స్ట్రాయ్."

మేమంతా కిటికీదగ్గర గుమిగూడి బయటమైదానంలోకి చూసేము. ఎండిపోయిన రెల్లుదుబ్బులతో నిండిన విశాలమైన మైదానం గిరాగిరాతిరుగుతూ వెనక్కి జరిగి పోతూంది. బూడిదరంగుగా చట్రాయిలా కనిపిస్తూన్న ఆకాశం,చేతికి అందుతూన్నట్లుగా కనిపిస్తూంది. ఏక్కడా—మనుష్యులు— జంతువులు— పక్షులు— ఆఖరుకి సూర్యుడుకూడా కనబడడంలేదు.

ఆమూల ఏదో నీడ మెదులుతూన్నట్లు అయింది. దూరాన బోర్లించివున్న గిన్నెలాగ ఒక 'యూర్టా' బొచ్చుతోకూడినచర్మంతో కప్పబడి కనిపిస్తూంది. ఆగుడారంద్వారం ఇక్కడికి నల్లగా కనిపిస్తూంది. దానిముందు గొర్రెతోళ్లు కట్టుకొని, పెద్దబొచ్చుటోపీ పెట్టుకొని పొడుగుపాటి మనిషిఒకడు నిలబడియున్నాడు. ఆతని ప్రక్కనే ఒక కుక్క నిలబడియుంది. దానిబొచ్చు దువ్వబడివుంది. చెవిఒకటి చీలివుంది. కోరలు మంచిపదునుగా భయంగొల్పుతూ వున్నాయి. ఆ'యూర్టా'కి దగ్గరనే ఒకవొంటె ఆకులులేని చొప్ప కర్రలు నములుతూంది. అదిబండిచప్పుడికి కాబోలు తలఎత్తిచూసి, పెద్దదిగావున్న క్రిందిపెదవి జార్చి దవుడలు కదిపింది.

చుట్టుప్రక్కలకిచూస్తే ఏదో'రాకెట్'లోకూర్చుండి, నాగరికత వాసనలేని కొత్తగ్రహంలో ఎక్కడో ప్రయాణం చేయటంలేదుగదా అనిపించింది. సూర్యరశ్మిలేని పెద్దపెద్ద ఎడారులు, నిప్పుచేసుకొనడంకూడా తెలియక, చర్మాలుకట్టుకుంటూ కాలక్షేపంచేస్తూన్న మనుష్యులుగల చోటికి పోతూన్నాము. ఇప్పటి ప్రజలు మచ్చికచేసుకో

గలిగిన జంతువులల్లా కుక్కలు-ఒంటెలు మాత్రమే?

"మాగ్నిటోగోర్స్ట్రాయి ఏదిరా? మమ్మల్ని హడలుకొట్టి చంపేవు?"

బోరిసు ఆశ్చర్యముతో నామొగంకేసిచూసి మళ్లీ చదువులో మునిగిపోయేడు. పెట్కా గోడవైపుతిరిగి బర్రున గుర్రుపెట్టడం ఆరంభించేడు.

రైల్వే-పాయింట్లమీద బండిచక్రాలు దుముకుతూన్నాయి. మాబండికి ఆవైపునా-ఈవైపునా, రైలుపెట్టెలు కనిపిస్తూన్నాయి. మట్టిఇళ్లు, పొడుగుపాటి కర్రషెడ్లు, కాపలావాళ్ల ఇళ్లు, అప్పుడప్పుడే తవ్వివోస్తూన్న మట్టిదిబ్బలు, వాటిప్రక్కన పారలు-తట్టలు చేతపట్టుకొని నిలబడ్డ కూలీలు, గుర్రాల సహాయంతో దున్నబడుతూన్న పొలాలనీదాటి బండివేగంగా పోతూంది.

"ఇదిగో-ఈమారు నిజంగా మాగ్నిటోగోర్స్ట్రాయికి చేరేమోయి?"

గ్లాసులోని నీరు తొణకడం మానింది. బల్లమీది ఏపిలుపండు ఒకమూలకి స్థిరపడింది. బళ్లన్నీ దిగేవారితోటీ-ఎక్కేవారితోటీ రణగుణధ్వనిగా వున్నాయి. ట్రంకుపెట్టెలు రాపాడిన చప్పుడు, బరువులు ఈడ్చిన బరబరలు, వచ్చీ-పోయేవారి కేకలతోటీ చెవులు ఘడియలుపడిపోతూన్నాయి.

త్వరలోనే బండినుంచిదిగి ముగ్గురమూ ప్లాట్‌ఫారమ్మీద అడుగు పెట్టేము. ఆదీర్ఘప్రయాణంలో కలిగిన కదలికమూలంగా కాళ్ళు తూలేయి.

ప్లాట్‌ఫారమ్మీద దిగి నాలుగుమూలలకీ చూసేను. ఒక

బారక్కుకీ – కిర్షిజ్ 'యూర్టాకీ' నడుమన ఒకఇంటిచూరికి 'మాగ్ని టానయా స్టేషన్'– అనేబోర్డు వ్రేలగట్టబడివుంది. కోళ్లగంపలా వున్న ఆ'యూర్టా'కి పక్కన ఇసక–ఇటికలు–రాళ్లు––ప్రోగు లై పడివున్నాయి. వానికిఅవల తెరదించినట్లు నేలకంటా వ్యాపించియున్న పొగమంచు.

నాకు నామిత్రుల సంగతికూడా జ్ఞాపకంలేదు. హడావిడిగా ప్లాట్‌ఫారానికి ఒకవైపుగావెళ్లి అక్కడవున్న ఒకమనిషినిపిలిచి 'మాగ్నిటోగ్స్త్రాయ్ ఇదేనా?"—అన్నాను.

నాప్రశ్నకి అతడు చాలా ఆశ్చర్యపడ్డాడు. కాలిక్రిందనున్న పుల్ల నొకదానిని దూరంగా తేసేస్తూ అతడు నాతెలివితక్కువదనానికి జాలిపడుతూన్నట్లు ఇదేనా మాగ్నిటోగ్స్త్రాయి అంటే? కాదు. ఈప్రదేశం చూడడానికి కనీసం పదిరోజులయినా పడుతుంది. అదిగో –చూడు–మంటూ పొగమంచులోకి చేయి చాపేడు.

నేనూ—పెట్కా మూటలమీదకూర్చున్నాం. బోరిసు ఎక్కడికోవెళ్లేడు. రైలుపెట్టెలలోనుంచి జనం ఇంకా దిగుతూవున్నారు; అనేకప్రాంతాలనుండి జనంవస్తూన్నారు. స్వచ్ఛమైన రష్యను పలుకుబడి, అతిమృదువుగావుండే యూక్రేనియన్‌భాష, కఠినాక్షరాలతోవుండే ఏషియాటిక్‌భాషలు, దీర్ఘసమాసాలతో గంద్రగోళంగా వుండే 'వైట్–రష్యన్'భాష, దుడుకుగా వినిపించే 'యిడ్డిష' భాష, ఒకటేమిటి అనేకభాషలు, అనేకయాసలు; చెవినిబడుతూన్నాయి. బూడిదరంగుపూయబడ్డ మొదటితరగతిపెట్టెలలోనుంచి విదే

మాకారు పరుగెత్తుతూంది. ఒకటిరెండుమారులు,కరిగించిన ఇనుము తొట్టెల్ని లాగుకొనిపోతూన్న నల్లగా నిగనిగలాడుతూన్న ఇంజ న్లకోసం మాకారు అక్కడక్కడ నిలువబడవలసివచ్చింది. కాన్వాసు స్యూట్లు తొడిగి, మెత్తని ఫెల్టుటోపీలుతగిలించుకొని, బరువయిన దళసరిగ్లోవులు చేతులకి తొడుక్కొని కూలీలు అటూ—ఇటూ తిరు గుతూన్నారు. ఏవిధమైన కంగారూ—బెదురూ లేకుండా తాపీగా తమపనులు చేసుకుంటూన్నారు. అదిఅంతా చూసేక "ఫరవాలేదు. మేము ఈపని నిర్వహించగలం!"—అని ధైర్యంకలిగింది.

'బ్లాస్టింగ్—మిషన్లు'ండే ఎనిమిది అంతస్థుల భవనం, కొలి మిలవరసలు, ఉక్కుదూలాలూ—స్తంభాలూ—గొట్టాలూ మొదల యినవానిని తీసుకుపోయే 'ట్రావెలింగ్—క్రేనులు, ఏడుపొగగొట్టా లున్న 'ఓపెన్—హెర్తు—ఫర్నేసు.' అన్నింటినీ దాటి వెళ్ళి పోతూన్నాం.

ఆమూడు 'బ్లాస్టు—ఫర్నేసు'లకీ చుట్టువారా బోయిలర్ల షాపు, యంత్రభాగాలుంచే షాపు, బోరింగ్—మిషన్ల షాపు, మరొకపెద్దకా ర్ఖానా వున్నాయి. పెద్దరోలింగుమిల్లు, దానికి పార్శ్వాన సిమెంటుతో పోసిన పెద్ద'ఎలక్ట్రిక్—పవర్—స్టేషను.' ఈ'బ్లాస్టు—ఫర్నేసు'లు, ఈ'ఓపెన్—హెర్తు—ఫర్నేసు' పెద్దఓడరేవును జ్ఞాపకం తెస్తూ న్నాయి. వీనికి ప్రక్కన పెద్దపెద్దపర్వతాలమాటున గాలిపులదెబ్బ, మంచు తుపానులు, దుమ్ము—బూడిది తగలని ప్రదేశంలో అయి దంతస్థుల మేడలతో సోషలిస్టు నగరం పువ్వులతోటలమధ్య కన

బడుతూంది. దానిచుట్టూ మూడువరిసల్ని బోదెచెట్లు పెట్టనిగోడల మాదిరిగా వున్నాయి.

నేను ఆనందంతో బోరిసువైపుచూసేను. బూడిదకొట్టాడుతూన్న మోటారులో బల్లలమీద పుస్తకాలు దొర్లిపోతూన్నా అతడు వానివైపుకయినా చూడడంలేదు. నావీపుమీద మోచేతులు ఆనుకొని ముందుకువంగి నిశ్శబ్దంగా బయటచూస్తూన్నాడు.

ఆ ఊరుకి 'మాగ్నిటోగోర్స్కు' చేరుకున్నాము.

మమ్మల్ని తిన్నగా 'క్వారంటైను'కి తీసుకువెళ్లేరు. వస్తూనే మాసినగడ్డాలు క్షౌరంచేసికొని, స్నానాలు చేసి, వారుపెట్టిన తిండి తిని, కొయ్యమంచాలమీద ఒక్కమారు వెన్నువాల్చేము.

ఆరోజున రాత్రి నాకు నిద్రపట్టనేలేదు, సాయంకాలంపూట 'క్వారంటైన్'కాపలాదారు చెప్పినమాటలు తెల్లవార్లూ మననం చేస్తూనేయున్నాను.

"సామాన్యంగా మూడు రోజులకంటె జనం ఈ'క్వారంటైన్'లో వుండవలసిన అగత్యంలేదు. కాని, మీరు బహుశా ఇంకా చాలారోజులదాకా ఇక్కడనే వుండవలసివస్తుంది. 'మాగ్నిటానోయా'లో జనం విశేషంగా పోగుపడుతూన్నారు. వారందరికీ సరిపడేటన్ని బారక్సు తయారుకావడంలేదు."

ఆమాటల్ని గురించే ఆలోచిస్తూ పక్కలు ఒత్తుతూన్న ఆబల్లమీద తెల్లవార్లూ అటూ—ఇటూ దొర్లుతూనే వున్నాను.

రైలుస్టేషన్లలోయున్నప్పుడు, ట్రైన్లలోను అనుభవించిన అది

క్కుమాలిన 'ఫినైలు'ఘాటు ఇక్కడాతటస్థపడింది. దీనితో ఆరోజు లనాటి దారిద్ర్యం, ఆజీవితం, అన్నీ జ్ఞాపకానికి వచ్చేయి. పళ్ళు కొరికి, తల బల్లనిపెట్టి కొట్టుకొన్నాను. అప్రయత్నంగా నానోట— "ఆఫ్యాక్టొరీస్కూలులో వట్టి సోమరిపోతుగా, ఎందుకూ పనికిరాని వాడినిగా తయారయ్యేను"—అనేమాట వెలువడింది.

బోరిసు అదిరిపడి తలెత్తిచూసేడు.

"ఎవ్వరితోటి మాట్లాడుతున్నావు? సన్యా!."

అతనికీ నిద్ర పట్టడంలేదు. నెమ్మదిగా లేచికూర్చుని —"ఏం నీకు నిరుత్సాహం కలుగుతూందా?"—అన్నాడు.

"నీకో?"

"వెర్రికబుర్లు చెప్పకు. నాకు నిరుత్సాహం ఎందుకు?"

"నాకుమాత్రం?"

తెల్లవారకముందే మేమిద్దరమూ లేచేము. పెట్టాకొయ్యల మీద దొర్లుతూ ఆలాగే పడుకొని కబుర్లు ఆరంభించేడు.

"ఉండండోయి! ఎక్కడయినా బస వెతుక్కొని లేచిపోవాలి. రోగిష్ఠివాళ్ళనుకున్నారోయేమో మనల్ని 'క్వారంటయిను'లో పెట్టే రేమిటి?"

బోరిసు ఎక్కడికోవెళ్ళి టీ—చేసుకొనేటందుకు ఇన్ని వేడి నీళ్లు పట్టుకువచ్చేడు. నేను మళ్ళీ పక్కవేసేను. కళ్ళు పొడారి పోయినట్లు కనిపించేయి. కళ్లుమూసుకొని కమ్యూనునూ, ఆమైదా నాలనూ, ఒక్కమారు జ్ఞప్తికి తెచ్చుకుందామని ప్రయత్నం.

"నువ్వెందుకూ పనికిరావు. సన్యాశీ! ఆలగ్జాండరూ! కానీ యి!"—అంటూ ఆంటోనిచ్ అన్నమాటలు మనసుకి వచ్చేయి. ఆతను చెప్పినట్లే నేను ఇప్పుడు ఎందుకూ పనికిరాని ఆలోచనలలో పడియున్నాను.

నన్ను నేనే తిట్టుకుంటూ గభీమని మంచం ఉరికేను.

ముప్ఫయ్యో....
ప్రకరణం.

వెచ్చనినీరు మొహంమీద వర్షంలాపడుతూంది నాచల్లనిగుండెలలో వేసవిసూర్యుడు ప్రవేశించినట్లు మండిపోతూంది. తాగిన వాడికిమాదిరిగా శరీరం తూలిపోతూంది. ఎక్కడికో అంధకారం లోకి పాకిపోవడంలేదుగదా యనిపిస్తూంది. హఠాత్తుగా మెఱుపు. వెనకనొక ఉఱుము, వేడివర్షము చల్లబడింది. ఆవేసవిసూర్యుడు 'స్కేటింగ్' మైదానంలాగా, ఆఅంధకారం పదునైన బొగ్గుముక్కలగానూ, మారిపోయినాయి.

నేను కళ్ళు తెరచిచూసేను. పెద్దబొద్దుమీసాలు, బొచ్చుటోపీతోటీ, ఇంజనుడ్రైవరు నామొగంమీదికివొంగి, కెటిల్‌లోని నీళ్ల మొగాన్ని చిలకరిస్తూ, నిప్పులు ఎగతోసేగరిటెతో గుండెలమీద పొడుస్తున్నాడు. చొక్కాకాలరుపట్టుకొని కేబిన్‌లో చిందివున్న

వాడి బొగ్గులమీద ఈడుస్తున్నాడు.

ఆర్మగ్డ్ బ్రెయిత్— 'డానెట్టిజేసీ ప్రొలిటేరియన్'లో ఉండే రోజులలో ఈమాదిరి సంఘటనే ఒకటిజరిగింది. అది జ్ఞాపకానికి వచ్చి మనస్సు కలగుండువడింది.

"ఇంజనులోనన్రా! నిద్రపోవడం? ఓరి! అభాగ్యుడా? నీకస్త మానం పెద్దమ్మ నెత్తిమీదనే వుంటుందేం? ఇప్పటికి ముప్పైఏళ్ళ నుంచి నేను ఇంజన్లమీద తిరుగుతూన్నాను! నేను ప్రయాణంచేసిన దూరం కలుపుతే ప్రపంచంచుట్టూ నలభైమార్లు తిరిగినంతవుం టుంది. ఇంతప్రయాణంలోనూ ఎన్నడూ కనురెప్ప ఈలా మూయ లేదు. ఎంత చల్లగా పడుకున్నావు? లేవవేం? చవటా! ఈలానిద్ర పోయేవాడివి మళ్ళీ ఇంజనులో అడుగుపెట్టకు. నీలాంటి నిద్రపో తుల అవసరంలేదు. బొగ్గువేసేవాడు ఈవేళకి ఈపని చూస్తాడులే. నడు."

బూత్‌లోని ద్వారానికి వ్రేలాడుతూన్న కాన్వాసుతెర తటతట లాడుతూంది. ఇంజను అతివేగంగా పరుగెత్తిపోతూంది. అదృష్ట యినా లేకుండా నిద్రకళ్ళని మెట్లకేసి నడిచేను. తెరతొలిగించి మెట్ల మీద అడుగుపెట్టబోతూంటే అంతవరకు నేనేమీచేయబోతూన్నానో యని ఆశ్చర్యంతో చూస్తూన్న డ్రైవరు గభీమని మెడపట్టీ పట్టు కొని లోపలికి ఈడ్చేసేడు. భయపూరితమయిన కేకఒకటి నాచెవు లలో గింగురుమంది.

"ఓరి నిద్రబోతూ! ఎక్కడికి బయలుదేరేవు? వేగంగా

పోతూన్న ఇంజనులోంచి ఉరికి చస్తావటరా?

నేను మళ్లీ లోనికివచ్చి కూర్చున్నాను. డ్రైవరు పునః పాఠింపుప్రారంభించేడు.

"నిన్ను వదిలేస్తాననుకోకు. ముందుస్టేషనులోకి వెళ్ళేకచెప్తా. ఈవేళ నిద్రపోయినందుకు శిక్షగా మళ్లీ ఈప్రాంతాలు తొక్కిచూడ నీయను. బొగ్గుపెట్టెలోకిపో. నాకంటనైనా పడకు. నీళ్ళయినా పోసుకోకుండా, పందిలాగ."

నేను బొగ్గుగుట్టమీద కూర్చుండి వేళ్ళు దులుపుకున్నాను. ఒక వారంనుంచి జోళ్లు విప్పలేదు. బట్టలు మార్చుకోలేదు. ఇంజన్లషాపు యొక్క రెడ్-కార్నరులో మామకాం. అక్కడ క్వారంటయిన్‌లో వుండలేకపోయేం. పోనీయని మాకెక్కడా బసా దొరకలేదు. ఎన్నో వేలమంది ఇళ్లకట్టుబడికోసం రోజూ మాగ్నిటోస్ట్రాయికి వస్తూన్నా, తగినంతచురుకుగా పనిజరగడంలేదు.

అయితేనేం? వేచి ఉండాలిమరి. ఆలాగే కాలక్షేపం చేస్తూన్నాను.

నేను ఒళ్ళు విరుచుకొని, గరిటెతీసుకొని, ఇంజనుపొయ్యి లోకి బొగ్గులు విసరడం ఆరంభించేను. బద్ధకంచేత కాళ్లు మడతలు పడిపోతూన్నాయి, అయినా పని నిలుపలేదు, కనురెప్పలు మూత పడితే పని ఆగిపోతుందనే భయంతో అంతసేపూ 'వాటర్-గాజ్' వైపే చూస్తూన్నాను. అలసిపోయిన కనుగుడ్లకి ఆ'వాటర్-గాజ్' ఒకప్పుడు పెద్దదిగానూ, ఒకప్పుడు చిన్నదిగానూ కనిపిస్తూంది.

తలతూలిపోయి ఏఱుపకమ్మికీ కొట్టుకోకుండా కాచుకుంటూ అదే పనిగా బొగ్గు వేస్తున్నాను. బోయిలరు చిట్లిపోతుందేమోననే భయంతో అతిజాగ్రత్తగా చిట్లం లాగిపారవేస్తున్నాను.

కొద్దిసేపు విశ్రాంతితీసుకొనడానికయినా గోడలకి జేరబడడానికి భయపడుతూన్నాను. కాస్త దేనినైనా ఆనుకున్నానా అంటే కళ్లు మూతలుబడిపోయినాయే. కాళ్ళు పట్టుజారిపోతాయి. నేలకి ఒరుగుతాను. ఇంజను కూసినాలేదు. డ్రైవరు తిట్టినా లేదు. అందుచేతనే-ఆభయంతోటే ఎంతోజాగ్రత్తగా ఆరాత్రంతా కాలక్షేపంచేసేను. ఇంక తెల్లవారబోతూంది. కాస్త చల్లనిగాలి తగులుతే సుఖంగా వుంటుందని కిటికీకమ్మీమీద గుండెలు ఆవి బయటికి తలపెట్టేను. కాస్త ఆసరా దొరకడంతోటే మైకం కమ్ముతూంది.

........ట్రెయిన్ ఇంక కొద్దినిముషాలలో స్టేషనులో నిలబడుతుంది. వెంటనే డ్రైవరు పనిలో వుండగా నిద్రపోయిన నేరానికై నన్ను తొలగించేస్తాడు. పొమ్మంటాడు. అందులో అతని తప్పేముంది? సమాధానం ఈయడానికిమాత్రం ఏముంది?

ఇంజను వేగం తగ్గింది. ఆఅంధకారాన్ని చీల్చుకుంటూ బండి నెమ్మదిగా అడుగులువేస్తూంది. నేను మధ్యన తలఎత్తి ఒకమాఱు 'స్టీమ్-గాజ్' కేసి చూసేను. ఎనిమిది 'ఎట్మాస్ఫియరు' లకంటె అధికంలేదు. ఇంజన్‌డ్రైవరు 'సిగ్నలు' కోసం కిటికీదగ్గరికీ మళ్ళీ ఇంజనులోకీ ఊరికేపరుగెత్తుతూన్నాడు. స్టేషను సమీపిస్తూంది. 'సిగ్నలు' చూసుకోవాలి. అందుచేత కిటికీ వదలడానికిలేదు. నేను

నిద్రపోతులా వున్నాను. ఇంజను వదలడానికి లేదు. బొగ్గువేసే వాడినిపిలిచి చిట్లం లాగెయ్యమని చెప్పేడు. వాడొకపెదకొంకీ దీసుకొని, ఒక్కపోటుపొడిచేడు. చిట్లంకి గురితప్పి ఆకొంకీ బోయిలరుకువేసిన రాగిచట్రంమీద తగిలింది. కొంచెంలో తప్పిపోయిందికాని, ఆవిసురుకి అది చాలా సున్నితంగావుండే నీటి గొట్టాలకి తగులుతే మరేమన్నావుందా? వెంటనే చిట్లిపోయి, నీరు కారడం ఆరంభించేవే.

ఇంజనుడ్రైవరు టోపీలాగి కోపంతో వాడినడ్డిమీద కొట్టేడు.

"దౌర్భాగ్యుడా! ఏమిటా చేస్తూన్నపని? ఇంజను బద్దలుచేస్తావటరా?"

మళ్ళీ 'ఆర్మర్డు-ట్రెయిన్' మాట జ్ఞాపకంవచ్చింది. నామొట్టమొదటిగురువు బొగాటరీవు ఇంజనువద్ద ఏదయినా పొరపాటు పనిచేస్తే ఆలాగేతిట్టేవాడు.

డ్రైవరు బొగ్గువేసేవాని చేతిలోని కొక్కీలాగేసుకొని, తానే చిట్లంలాగేసి, కిటికీమాట జ్ఞాపకానికివచ్చి, చెమటలు కక్కుకుంటూ ఆమూలకి పరుగెత్తేడు. స్టేషను సమీపించింది. కూతవేసి, కిటికీ వద్దనున్న ఎత్తుకుర్చీలో ఆయాసంతో చదికిలబడి నాకేసి చూసేడు.

అతని స్థితిచూసి ఇందాకటి తిట్లన్నీ మరిచిపోయి, ఇంజను పొయ్యి దగ్గిరికి పరుగెత్తేను. కొక్కీ చేతపట్టుకొని చిట్లానికి తగిలించి నావైపుకు లాగి, విరిచేసి, బయట మైదానంలోకి విసిరేసేను. బండీ 'సెమాఫోర్' ను సమీపించేటప్పటికి పొయ్యి పరి

శుభ్రం అయిపోయింది. 'స్టీమ్–గాజ్' లోనిముల్లు నెమ్మదిగా పైకి తిరిగింది. డ్రైవరు మొగాన ఉత్సాహం కనబడింది.

"ఈకుర్రకుంకలు ఏమి పనిచేయగలరు? ఒకడు విరిగిపోతాడు. వరొకడు ఇంజను తగులబెడతాడు. మాగ్నిటోస్ట్రాయి లోని నూరు ఇంజన్లమీదా ఇదే అవస్థ. చాలా బాధగావుంది. పోనీ, అంటే పనిచేతనైనవాళ్లు దొరకడంలేదు. ఇదొకపీడరం. అబ్బే! వీళ్ళతో వేగలేక ప్రాణంవిసిగిపోతూంది. ఈశ్మశానంలోకి ఎందుకు వచ్చేనా అనిపిస్తూంది. నాతెలివి తగులబెట్ట!"

ఆకుపచ్చని సిగ్నల్‌దీపం మినుకుమంటూంది. తెల్లని స్విచ్–బోర్డునుకూడా దాటేసి ఇంజను 'రౌండ్–హౌస్' కి పోయే లైను మీద పరుగెత్తిపోతూంది. అదేమిటి?

........అరే! ఈ 'లైన్' మాకోసం ఖాళీగా వుండవలసిందేనే కాని, అదేమిటి? దూరాన అనల్లగా కనిపించేది ఏమిటి? ఇంజనే! సందేహంలేదు. రెండూ డీకొంటాయి.

"ఎదురుగా ఇంజనువుంది. బండి నిలుపు."

రెగ్యులేటరు మూసివేసేము. 'స్పీడ్–లివర్' వెనక్కి తిప్పబడింది. కాని, చాలా బరువుతో వస్తూన్నబండి ఒకపట్టాన ఆగుతుందా? ఇంజనును ముందుకు గెంటుకు పోతూన్నాయి, బళ్ళు. ఆ 'షంటింగ్–ఇంజన్' ఎంతో దూరంలో లేదు. కొద్దిసేపటిలోనే కాలివున్న ఈరెండు ఇంజన్లు డీకుంటాయి. బళ్ళు పప్పు–పప్పయి పోతాయి. పెట్టెలన్నీ కుప్పక్రింద పోగడిపోతాయి. బొగ్గువేసే

వాడు భయంతో ద్వారంకేసి పరుగెత్తేడు. కాని, ఆతడు తొడు క్కున్న వదులుకునూలు యూ(కేనియర్-కోటు ఒకసీలకి తగుల్కొని కదలనివ్వలేదు. గట్టిగా లాగుతే కోటు చిరుగుతుంది. అందు లోనే వుండామంటే ప్రాణం దక్కదని భయం. ఆరెండూకూడా ఆతనికి నచ్చలేదు. ఏమిచేయడానికీ తోచక వెర్రిగోల ఆరంభించేడు.

ఆపరిస్థితులు నాలో ఒకనూతనజీవాన్ని పోసేయి. నామత్తు వొదిలిపోయింది. ఒకచేతితో, బోయిలరులోకి నీరుతోడుతూ, 'సేఫ్టీ—వాల్వు' తెరిచి ప్రమాదం తటస్థించేకల్పంలో అవసరమయిన ప్రయత్నాలు చేస్తూన్నాను. రెండో చేతితో ఇసుకపెట్టె కుదుపుతూ చక్రాలకి కొంచెం ఆసరాకల్పిగిస్తూన్నాను.

ఇంజనుకి ఒక్కగజంలోకివచ్చి మాబండి ఆగింది. డ్రైవరు నిప్పులు కక్కుతూ స్టేషనులోకి పరుగెత్తేడు.

వచ్చేటప్పటికి ఆతని మొగం కంది ఎర్రగా కంపదుంపలాగ తయారయింది. మనిషి తెగఆయాసపడుతూన్నాడు.

"ప్రతిరోజూ ఇంతే. ఒక్కడికీ తలలో మెదడులేదు. వట్టి మన్ను! చవిటిమన్ను! పనిలోవున్న బాటమీద 'షంటింగ్—ఇంజనా? వెధవపని చేసేది వాళ్ళు. మధ్యని నలిగిచచ్చేది డ్రైవర్లు. ప్రతి రోజూ ఆదేతప్పా? అప్పుడే నాలుగైదు ఇంజన్లు ముక్కలయి పోయాయి. ఛా! ఈవేళ అదృష్టం బాగుంది. ఇంజన్లేమీ దెబ్బ తినలేదు.........మేరియా! నువ్వు చెప్పినది అబద్ధం కాదు."

డ్రైవరు సరాసరి నావద్దకువచ్చి "ఏమోయి! ఏమంటావు?

నీనిద్రవిషయం ఏమిటి?"—అన్నాడు.

నాకాతనిమాట వినబడలేదు. నేను ఇంకో ఆలోచనలో వున్నాను. డ్రైవరుమాటలు విన్నాక మాపార్టీసెక్రెటరీ 'ఇంజను డ్రైవర్లు' ఎక్కడా దొరకడం లేదంటూ, చెప్పినవిషయం జ్ఞాపకానికి వచ్చింది. 'రైల్వే—మెకానిక్కు' ల సందర్భో ఆపరీక్షకి కూర్చోమని ఆతడు ఎన్నో చెప్పేడు. అపరీక్ష చాలా తేలికచేయబడిందనీ,వెడితే తప్పకుండా ప్యాసవుతాననీ చెప్పేడు. కాని, నేను ఆతనితో వితండవాదంపెట్టుకొని,మిడిమిడిజ్ఞానంతో పరీక్షకికూర్చుండననిచెప్పేను.'డ్రైవింగ్'లో చాతుర్యంవుండాలికాని, మిడిజ్ఞానంతో ముక్కునపెట్టుకొని పరీక్షయిచ్చినందున ప్రయోజనంవుండదని నా వాదన.ఎందరో చెప్పేరు.పరీక్షకి కూర్చుండమని. ఉహుఃనేను వినిపించుకోలేదు. నాదారినాది పొమ్మన్నాను. ఇప్పుడు ఈడ్రైవరు మాటలతో నేను పరీక్షఈయనిలోపం బాగా తెలిసివచ్చింది.

మేమిద్దరమూ బండికోసం ఎదురుచూస్తూ స్టేషనుగదిలో కూర్చున్నాము. కిటికీలన్నీ మూసివున్నాయి. లోపలవెచ్చగావుంది. డ్రైవరుకి ఇందాకటి కోపం తగ్గింది. అతిశాంతంగా పొగాకు—పైపు కాలుస్తూన్నాడు.

"ఏప్రాంతమోయిః మీది?"

ఆతనిస్వరంలో ఎంతో ప్రేమా— శాంతమూ దీపిస్తూన్నాయి. నేను ఆతనిదగ్గరగా జరిగి కమ్యూనునూ—ఆంటొనిచ్‌నీ, గురించి వివరంగా చెప్పేను. ఆతడు చాలా సంతోషించేడు. ఎక్కడో ఒక

చోట బసకుదిరేవరకూ తనయింటికివచ్చి బసచేయమని అడిగేడు.

"మాగది పెద్దవిశాలమైనది కాదనుకో. అయినా ఏదో తంటాలు పడదాం!"

"నేను ఒంటిగాడిని కాను. నాకూడా బోరిసంటూ మరొక స్నేహితుడున్నాడు."

"ఇద్దరా! బాగా ఇరుకవుతుంది. అయితేనేం? ఫరవాలేదు. రాండి. కొంచెం చిక్కుపడదాం మరి, మేరియా తిడితేతిడుతుంది."

ఇంకముందర ఆతనియెదుట నన్ను బయటపెట్టుకోకుండా నిలువలేకపోయేను. నేను ఆతనికి దగ్గరగా జరిగి, భుజాలమీద రెండుచేతులూ వేసి, —"మామా! మరిచిపోయేవా? నన్నింకా గుర్తించలేదు? ఔనుమరి, చాలా ఏళ్లు అయిపోయింది."

బొగాటరీవు అదిరిపడ్డాడు. నాచేయిపట్టుకొని దీపంవెలుగుకి తీసుకువెళ్ళి, పరీక్షించిచూసి, కౌగిలించుకున్నాడు.

"ఓహో! సన్యా? ఎన్నాళ్ళకి కనపడ్డావు?....సరేగాని, నేనడిగిన దానికి సమాధానం ఏమిచెప్పుతావు?"

....మరునాడే నేనూ—బోరిసూ—బారక్సులోవున్న బొగాటరీవు గదికి మకాం మార్చేము.

ముప్పైఒకటో.

ప్రకరణం.

బొగాటరీవు ఇక్కడ అడుగుపెట్టేటప్పటికి ఉరల్ నదికి మనుష్యనాగరికత పొడకూడా తగలలేదు. మాగ్నిటానది ప్రవహిస్తూన్న ఆపెద్దలోయలో కిర్ఘిజ్ అడవిగుర్రాలు మందలు—మందలుగా సంచరిస్తూన్నాయి. అవి మనుష్యులు కనబడేటప్పటికల్లా డెక్కలతాకిడికి కంకరబూడిద లేవగొడుతూ పేరెంతీసేవి. నేడు పవర్ స్టేషను కట్టబడినచోట ఆనాటికి వట్టిదిబ్బలు మాత్రమే యున్నాయి. కొత్తయింజనును నడుపుతూ బొగాటరీవే మొట్టమొదటిమారు ఇంజనుకూతలతో ఆలోయలన్నింటినీ ప్రతిధ్వనింపచేసేడు.

ఎప్పుడైనా తీరిక చిక్కినప్పుడల్లా బొగాటరీవు ఆరోజులనాటి విషయాలన్నీ చెప్పుతూండేవాడు.

"ఆరోజున చెవులు గింగురుమనిపోయేలాగ ఈలకొట్టి, గుడ్డు—ండి కదిపేను. ఆనాటిపనికి ఈలోయలన్నీ నవ్వి వేళాకోళంచేసేయి. నన్ను వెక్కిరిస్తూన్నట్లు తామూ కూయడం ఆరంభించేయి. వెంటనే ఈపర్వతాలు అందుకున్నాయి. వాటిని ఉరలుపర్వతాలు అనుకరించేయి. క్షణంలో చెవులుఘడియలుపడే కూతలతో దిక్కులు బద్దలయిపోయేయి. నేను 1918.నాటినుంచీ పార్టీలో సభ్యుణ్ణిగావున్నాను. ఇరవైఅయిదునెలలపాటు విరామంలేకుండా

'ఆర్మర్డ–ట్రెయిన్' నడిపించేను. నీ కు తెలియదూ నాసంగతి? అల్లాంటివాడిని ఆకూతలతో నీరుకారిపోయేనంటేనమ్ము. అసిస్టెం టునిపిలిచి 'బోయిలరు'లోకి నీరు తోడమన్నాను. ఏదో ప్రమాదం జరుగుతుందనే భయపడ్డాను. కాని, ఏవిధమైన ప్రమాదం జరగలేదు. బండితిన్నగా స్టేషనులోకివచ్చి ఆగింది. కోసక్కులు, తార్తారులు, నోమాదులు, వందలు–వేలజనం చేతులు ఎగరవేసుకుంటూ నాబం డిదగ్గిరికి పరుగెత్తుకొనివచ్చేరు. తోలుకోటు తొడుక్కున్నఅతడు ఒకడు వారిమధ్యనుంచివచ్చి ఇంజనులోనికి ఎక్కి ఎంతో అప్యా యంగా నాచేతివేళ్ళు పట్టుకున్నాడు. ఏదో చెప్పబోయేడుగాని ఆనం దంచేత చాలసేపటివరకు మాట చెప్పలేకపోయేడు. –"బాబూ మాగ్నిటనోస్ట్రాయిని నీచేతులతో ఒకకొత్తశకంలోకి తీసుకువచ్చేవు" –ఈమాటలు అంటూంటే ఆతని కళ్ళల్లో నీరు నిలిచింది. చిన్న పిల్లవాడి గొంతుకలాగ ఎంతోఅమాయికం గావుంది పలుకుబడి. ఆతడే ఈనిర్మాణాన్ని తలపెట్టినది."

తవ్వినమన్ను దూరానికి లాగించుకొనిపోయినది బొగాటరీవే. ఆతడే అమన్నురుచిచూచి దానిఉపయోగం మొట్టమొదటిమారు బయటపెట్టేడు. ఫ్యాక్టొరీలు కట్టడంకోసంఇటికలరైలు నడిపించినది ఇతడే. కరిగించినఇనుము నింపిన తొట్టెలను మొట్టమొదటిమారు ఫ్యాక్టొరీకి తీసుకువచ్చినవాడు, కూలికుర్రవాళ్ళని డ్రైవర్లనుగా తయారుచేసినదికూడా, బొగాటరీవే.

నేడు మాగ్నిటోస్ట్రాయిలో నూరు ఇంజన్లున్నాయి. బొగాట

రీవు మొట్టమొదట తాను నడిపిన ఇంజనునే నేటికీ నడిపిస్తూన్నా ఆనూరుఇంజన్లూ తనవై నట్లూ, వాటివిషయంలోకూడా తానే పూచీ వహిస్తూన్నట్లూ, భావిస్తూ వాటివిషయం పరీక్షిస్తూంటాండు. తన వంతు పూర్తిఅయినాకకూడా, కట్టుకున్న పడుచుపెళ్ళాము-'మేరియా గ్రివరోనా' ని చూడడానికికూడా వెళ్ళడు.

అయిదేళ్లక్రితం ఆతడు రెండోమారు పెళ్ళిచేసుకున్నాడు. కొత్తలో ఆమెనివిడిచి ఒక్కక్షణంకూడా ఉండలేకపోయేవాడు. ఏదయినా కొద్దిదూరం ప్రయాణం తగిలిందంటే ఆవిడకోసం అటమటించిపోయేవాడు. రోజూ జాబులు వ్రాసేవాడు. ఆమెదగ్గిర నుంచి జాబురాకపోయినా ఆలాగేవుండేవాడు. వాళ్ళిద్దరిమనసులూ ఆలాగకలిసేయి. కాని, ఇప్పుడు దానికి కేవలమూ వ్యతిరేకం. ఆవిడమీద విసుగే కలిగిందో, ఆవిడ జ్ఞాపకమే వుండడంలేదో, లేకుంటే అసలు తీరుబడే వుండడంలేదోకాని, అటువైపయినా తొంగిచూడడంలేదు. ఎప్పుడోగాని, ఇంటికేసి వెళ్ళడంలేదు. మేరియాలో మునుపటి ఆనందం లేదు. జగడగొండి అయిపోతూంది. ఆవిడ స్వభావమే పూర్తిగా మారిపోయింది. కాని, బొగాటరీవు దృష్టి అటువైపుకి పోవడమే లేదు. రాత్రీ-పగలూ ఇంజన్లగొడవ తప్ప మరొకటి పట్టడమే లేదు. ఇంజన్లలోనే తిండి. అక్కడనే విశ్రాంతి. పనివాళ్ళని పరీక్షిస్తూ, బళ్ళు పరీక్షిస్తూ, మధ్యమధ్యని ఆగి తననోటుపుస్తకంలో ఏవేవో ఎక్కించుకుంటూ పగలంతా తిరుగుతాడు. ఇంకరాత్రి ఇంటికివచ్చి, తానువ్రాసుకొనివచ్చినవన్నీ

పరిశీలించి, ఏవేవో అంచనాలు గీసి, ఏమి సంతృప్తికరంగాలేనట్లు తల అడ్డంగా ఊపేవాడు.

"చూసేవు? మేరియా! ఒక్క అసిస్టెంటయినా తెలివైనవాడు లేడే. ఇదిగో వీళ్ళుతప్ప మరిఒక్కడ్రైవరు వెదుకుదామన్నా దొరకడే! అబ్బ! పరిస్థితులు చాలాబాధకరంగావున్నాయి."

మేరియా మగనిమాటలకి ఏనిథమైన సానుభూతీ చూపేది కాదు. పుట్టినఇంటినుంచి తెచ్చుకొన్న ఆబొచ్చుపిల్లి నడ్డినుంచి గోమార్లుతీసివేస్తూ మూగిముసానమ్మలా కూర్చుండేది. పగలెల్లా పలుకుతోడులేకుండా ఆగదిలో మగ్గిపోయిందికాకుండా రాత్రివేళ మాటా–మంచీలేకుండా ఇంజన్లగోలతో చంపేస్తావేమని మొగుణ్ణి నిలదీద్దామని ఒకప్పుడు; మూటా–ముల్లెకట్టుకొని ఇంటికి లేచిపోవడమే మంచిదని ఒకప్పుడు; అనుకొనేది. మనసులోనే.

బొగాటరీవుకి అసలు ఈధోరణేలేదు. తనవంతు పూర్తికాగానే మిగిలినవాళ్ళ పనిపాటలు ఆజమాయిషీచేయడానికి బయలుదేరేవాడు. అనుభవంఏమాత్రమూలేక పరీక్షప్యాసైవచ్చిన డ్రైవర్లఅసమర్థతకి విచారపడుతూ, పల్లందిగేటప్పుడు బరువుబండిని ఎంతవేగంలో నడపాలో, చాలాపెట్టెలబరువుతోవస్తూన్న బండిని ప్రమాదంలేకుండా పల్లందింపడానికి 'స్పీడ్–లివర్,' ఎంతవరకు ఒత్తాలో, 'సెమాఫర్' ఏలాగ చూసుకోవాలో ఎంతో ఓర్పుతో బోధిస్తూండేవాడు.

ఒక్కొక్కప్పుడు ఈనేర్పడంలో చాలాదూరపుస్టేషనుకి వెళ్ళిపోయేవాడు. అలవాటులేకపోవడంచేత ఆయాసపడి అసిస్టెంటు

ఇంజనుపొయ్యిముందు చదికిలబడిపోయేవాడు. అపరితగినంతలేక 'వాటర్-గాజ్'లోముల్లు అంతకంతకి దిగిపోయేది.

అటువంటిసమయంలో దొగాటరీవు ఆతడికి తలపూపుతూ ధైర్యంచెప్పి, గరిటెచేతబట్టేవాడు. పెద్దపెద్దబొగ్గుగడ్డలు చిప్పలోకి ఎత్తి ఎంతోసున్నితంగా పొయ్యిలోపలికంటా విసిరేవాడు. ఒక్కక్షణంలోపచ్చనిమంటలు ఎర్రబడి, మరుక్షణంలో తెల్లబడి పాలపొంగులాగ కనబడేవి. ఊగి, దిగిపోతూన్న 'వాటర్-గాజ్' లోని ముల్లు నిలదొక్కుకొని, పైకి కదిలేది. సిలండర్లు గబగబా కదిలేవి.

అలాంటిరోజున ఇంటికి వచ్చేటప్పటికి చాలారాత్రి అయిపోతూండేది. అప్పుడు ఇంటికివచ్చి ఆఇంజనువ్యవహారాలు చర్చఆరంభించేవాడు.

"పైవాళ్ళని ఎవ్వరినో ఇద్దరిని తెచ్చిపెట్టిందిగాక, సాయంకాలం మీటింగులుకూడా పెడతాదేమి కర్మం"-అని మేరియా సాధించేది.

నిజానికి మేమక్కడ మీటింగులూ చేయడంలేదు. వాగ్వాదాలు జరపడంలేదు. అక్కడ జరుగుతూన్న సమావేశాల్ని ఏమనాలో నాకే అర్థంకాదు. రాత్రిఅయినాక మాగదిలో ఆ'బారక్సు'లోని 'మెకానిక్కు'లంతా పోగుపడేవారు. చిన్నగది. కూర్చుందుకుకూడా చోటుండేదికాదు. మంచాలమీద, పెట్టెలమీద, కూర్చుండేవారుకొందరు. కొందరు బల్లలకి ఆనుకుని నిల్చుండేవారు. ఎదుటివారి భుజా

లమీద వొంగి నిలబడేవారు కొందరు. ఈవిధంగా అందరం ఆగది లోనే ఏదోవిధంగా ఇరికేవారం. బొగాటరీవు మాఅందరిమధ్యనా నిలబడి, తనముప్ఫైఏళ్ళ అనుభవాన్నీ కథలమాదిరిగా చెబుతూండే వాడు.

ముప్ఫైరెండో
ప్రకరణం.

మేరియాగ్రిగరోనా ప్రయాణపుచేర్పాట్లేవీ ప్రారంభంకాకుండానే ఒకనీలిరంగుకవరలో వచ్చిన బూడిదరంగుకాగితం పటన్నిటినీ తల్లక్రిందులు చేసేసింది.

అదొక శీతాకాలపు సాయంకాలం. నేను అప్పుడే రాత్రిపాఠశాలనుంచి తిరిగివచ్చేను. చాలాకాలంనుంచి మూలబెట్టిన 'స్కై'లు తీసి బయటషికారుపోవడానికై బూజుదులుపుతూన్నాను. బయట మంచుదిబ్బలు బారక్సుకంటేనూ ఎత్తుగా ఏర్పడియున్నాయి. మంచు దిట్టంగా కురుస్తూంది. ఆకాశాన నక్షత్రాలు మెరిసిపోతూన్నాయి. కొలిములలోంచి మిణుగురులులేచి ఆనక్షత్రాలవైపు ప్రయాణం చేస్తూన్నాయి. ఈవేళషికారు బయలుదేరి మంచుదిబ్బలమీద ఆడుకోవాలని ఊహపుట్టింది. ఈమధ్యని 'ఇంజనడ్రైవర్ల' పరీక్షకి కూర్చుండడానికి చదువుతూవుండడంమూలంగా ఆటపాటలకీ ఖాళీ

లేదు. సరియైనడ్రైవర్లు లేకపోవడం గట్టిచిక్కుగానే వుంది. విన్ననే ఇద్దరు అసమర్థులు. పోగడి రెండుఇంజన్లని, ఎన్నోపెట్టెలనీ, ముక్కలూ—చెక్కలూచేసి 'రైనంతా' మూసేసేరు. కొలిములకి నిన్నా—ఈపేళ ముడియినుము సప్లయి ఆగిపోయి పని మొండిపడింది.

నేను ప్రతిరోజూ సాయంకాలం పాఠశాలకి వెడుతూనే వున్నాను. ఈరోజున 'వెస్టింగ్—హౌస్—బ్రేకు' ల్ని గురించిన పాఠం. పాఠం జరుగుతూన్నంతసేపూ విషయంఅంతా కళ్ళకు కట్టినట్లు కనిపించింది. అందుచేతనే ఈపేళ షికారుమీదికి దృష్టి పోయింది. తీరా ఇంటికివచ్చేక పాఠం జ్ఞాపకం తెచ్చుకోబోయేటప్పటికి నాబుర్ర వట్టిఖాళీగానే వున్నట్లుతేలిపోయింది. ఆబ్రేకుల పద్ధతులు—ఆవిధానము బాగా మెదడుకి పట్టలేదు. "బండి నడిచేటప్పుడు పంపుపాడయిపోతే ఏమిచేయాలి?"—అనే విషయాన్ని గూర్చి ఆలోచించడం ఆరంభించేను. చాలాసేపు తలబద్దలుకొట్టుకొని ఆలోచించి, బాగా స్ఫురణకి దెచ్చుకొని కాగితంమీద వ్రాసేను ..........కాని, అందులో లోపాలున్నాయి. విసుగుతో కాగితాలన్నింటినీ చిమ్మేసి, బల్లనేసికొట్టి పెన్సిలు విరగకొట్టేను.

బ్రేకులవిషయమే తెలియకపోతే నా 'డ్రైవింగ్' ఏమిటి? ఈలాగేవుంటే ఎప్పటికైనా 'ఆర్మర్డు—ట్రెయిన్' నాచేతిలో పెడతారా? వాయువేగంతో పోవలసిన 'ఎక్స్ప్రెస్' నాచేత పెట్టడం అనేది జరుగుతుందా?

దీపం వెలవెలలాడుతూంది. గదిలోకి శుభ్రమైనగాలి విసురుకు వస్తూంది. బొగాటరీవు దయ–శాంతము తొణికే మొగంతో బల్ల దగ్గిర కూర్చుండి ఏమేమిటో ఆలోచిస్తూన్నాడు. షికారువెళ్లే దృష్టి కట్టిపెట్టి ఈవలికి తీసిన 'స్కైలు' మూలకితోసి కాగితం– పెన్సిలుతో బొగాటరీవు ప్రక్కకిచేరేను. ఆతనికి ఎదురుగా బల్లమీద తెరిచివున్న పుస్తకంతో నీలిరంగుసిరాతో అందంగా ముద్రించబడి వున్న 'పెస్టింగ్–హౌస్–బ్రేకులు' బొమ్మలమీద చేతితో తట్టి బల్ల ప్రక్కన నేనూ చదికిలబడ్డాను.

మావ్యవహారంచూసి ఇంక తెల్లవార్లూ జాగారం చేస్తామని నిశ్చయించి మేరియా 'టీ'– తెచ్చిపెట్టింది.........

........ఈమధ్యనే మేరియాలో ఏదో గొప్పమార్పు వచ్చింది. మగనిని సాధించడం మానేసింది. మునపటిమాదిరిగా గాకుండా సరదాగా వుంటూంది. మాఅందరిమీదా దయగానూ–ప్రేమతోనూ వుంటూంది. ఆయన పనిలోంచి వచ్చేటప్పటికి అంబరునూనెలో హెర్రింగ్‌చేపలూ–ఉల్లిపాయలూ వేయించి సిద్ధంగా వుంచుతూంది. భోజనంముందు నిమ్మరసంపిండినవోడ్కా గ్లాసులలో సిద్ధంచేసేది.

ఆవిషయం గమనించి బొగాటరీవు చాలా సంతోషపడ్డాడు.

"ఆవిడ తిక్క తిరిగింది. అదీగాక ఎంతకాలం వుంటుందా. యేం?"

ఆమెలో కలిగిన ఈమార్పును ప్రోత్సాహించడానికై ఏవయినా బహుమతులు కొని తెచ్చి ఈయాలనుకున్నాడు. ఆలాగే ఒకరోజున

ప్రక్కవూరినుంచి, గుడ్లుపెడుతూన్న కోడిని, కొన్నిగుడ్లని రేకు పెట్టెలలో పెంచుతూన్న కొన్ని మొక్కల్ని తెచ్చియిచ్చేడు.

"ఇవిగో చూడు, మేరియా. వీటితోనే కూపోర్కక కాస్త ఇంటి పనులుకూడా చూస్తూవుండేం?"– అంటూ బుజ్జగించేడు.

ఆమె అతనివిషయంలో కొంచెం శ్రద్ధకనబరచగానే అతడు ఆకాశం అంటేడు. ఒకరోజున బొగాటరీపు కొందరు పాతస్నేహితులతోకలిసి ఒకయింజనును పరీక్షకోసం నడపడానికి బయలుదేరేడు. వారంతాకూడా 'ఇంజనుడ్రైవర్ల' పరీక్షలో పేరుప్రఖ్యాతులతో ప్యాసైనవారే. ఆరోజున బొగాటరీపుచాలా ఉత్సాహంగా వున్నాడు.

"వాళ్ళు నడుపుతూంటే చూసితీరాలి. మేరియా! కళ్ళు మూసుకొనికూడా వాళ్ళు తిన్నగా నడిపించగలరు. మహాదిట్టమైనవాళ్ళు."

మేరియా అతనితో సమానంగా ఆఆనందంలో పాల్గొంది.

"ఆలోచించిచూడు. ఒక్కఏడాదిలో డ్రైవర్లు తయారవుతూన్నారు. నేను? ఇంచుమించు పదిహేనేళ్ళపాటు జీవితంలో ఎక్కువభాగం దానికోసం ఖర్చుపెట్టేను. అయినా నేను వాళ్ళదగ్గర నిలవడానికి వుందా?"

కుసులు వదులయి కదులుతూన్న ఎత్తుపీటమీద కూర్చుండి అతడు తనవయసునంతనీ వ్యర్థంచేసుకున్నందుకు విచారిస్తూ ఊగుతూన్నాడు.

కాని మేరియా అతనిని ఆధోరణిలో ఆట్టేసేపు వుంచలేదు. ఎప్పుడూ వోడ్కాసీసా చేతపట్టుకోవుంటుంది. పొద్దుట–మధ్యా

హ్నాం-రాత్రి- పడుక్కో-బోయేముందు గ్లాసులోపోసి అందించ డానికి సిద్ధంగావుంటుంది.

కాని, ఇప్పుడొక తమాషా. బొగాటరీవుకి వోడ్కా-అలవాటు ఇరవై యేళ్లనుంచి. మేరియా వచ్చేక ఆమెయే ఆఅలవాటుమాని పించింది. అతడు ఎంతగోలపెట్టినా వినిపించుకోలేదు, అప్పుడు. కాని, ఆలాంటి ఆవిడ ఇప్పుడు స్వయంగా భోజనందగ్గిర వోడ్కా- అమరుస్తూంది.

బొగాటరీవుకు తనపూర్వపుదురలవాటును పునరుద్ధరించడం ఇష్టంలేదు. కాని మేరియాచిన్నపుచ్చుకోకుండా ఒకచిన్నగ్లాసు లోకి కొంచెంతీసుకొని త్రాగి —"ఇంతకంటె ఇప్పుడు తీరికలేదు. మేరియా!"—అంటూ ఇంజనుకేసి పరుగెత్తేవాడు.

ఒకరోజురాత్రి మేరియా మంచం నడిమిని కూర్చుండి వెక్కి- వెక్కి-ఏడుస్తూంది. బొగాటరీవు అదిరిపడిలేచి ఆమెను నెమ్మదిగా బుజ్జగించి పడుకోపెట్టేడు.

మరునాడు పొద్దుటే అతడెంతో ఉదాసీనంగా —"ఈజీవితానికి అలవాటు పడాలి. పాపం. మొదట్లో కష్టంగానే వుంటుంది."— అన్నాడు.

ఈరోజున సాయంకాలం బొగాటరీవూ—నేనూ 'వెస్టింగ్- హౌస్-బ్రేకుల్ని' గురించి చదవడానికి కూర్చుందేదాకా ఆవిడస్థితిని గూర్చి పొరపాటు అభిప్రాయంలోనే వుండిపోయేం. మేమింక చదువుకి కూర్చుండబోతూన్నామనగా తలుపుచప్పుడయింది. పోస్టు

జవాను కవరఒకటి ఇచ్చిపోయేడు. బొగాటరీవు దానినిచింపి దీపం దగ్గర చదువుకున్నాడు. అదిపూర్తిచేసేక కుర్చీలో చదికిలబడి నాకేసి ఏలాగోచూసి మళ్ళీ చదవడం ఆరంభించేడు. అదిపూర్తి చేసేక ఏదో అద్భుతమైనవిషయం కనిపెట్టినట్లు, ఒక్కగంతులో మేరియాదగ్గిరికి వెళ్లేడు. ఆఅవస్థలో ఆతవిని చూచినవారెవ్వరూ ముసిలివాడనుకోరు. మేరియా హడావిడిగా జాబుకోసం చేయి జాపింది. బొగాటరీవు జాబు ఆమెకి అందకుండా చేయి వెనక్కి లాగుకున్నాడు. ఉత్తరం జేబులో కూరుకొని పకపకానవ్వేడు.

"అబ్బే! ఇది ఇవ్వనోయ్! ఇదిచదివేవా నవ్వలేక చచ్చిపోతావు. నీతోటిఇంకా చాలాకాలం కాపురం చేద్దాం అనుకుంటున్నా."

మేరియా చాలాసేపు మనసు బిగపట్టుకొని కూర్చుంది. కాని ఆఖరుకి కోపం పట్టలేక చర్రున లేచినిలబడింది.

"ఈలాగ ఈయవోయి, ముసిలితొక్కా!"

బొగాటరీవు అదిరిపడి వెనక్కి తగ్గేడు. ఇంక మేరియా తానింతకాలంనుంచి అణచిపెట్టిన కోపాన్నంతనీ తిట్లరూపంలో వెలిబుచ్చడం ఆరంభించింది.

"ఓముసిలినక్కా! నన్ను మళ్ళీ ఏడిపించడం ఆరంభించేవూ? నీహృదయంలో కనికారంలేదు. వట్టిరాపాషాణం. నన్ను ఏడిపించి ఈబ్రదుకుకంటె చావు మేలనే స్థితికి తెచ్చేవు."

ఆమెకళ్ళ నీరు కాలువలు కట్టింది. ఇన్నాళ్ళనుంచి పూనివున్న కన్నీరు ఈవేళ విడివడింది.

"అయితే వెనుకటి కథ మళ్ళీ మొదటినుంచీ ఆరంభించేవూ? సరే! మళ్ళీ ఆరంభం. బాగునేవుంది. ఏంచేస్తాం? నీఅంతట నువ్వు పర్దుకోవలసిందేగాని ఎవరుమాత్రం ఏంచేయగలరు?"— అంటూ బొగాటరీవు గొణుగుతూకూర్చున్నాడు.

ఆరోజునరాత్రి ఇంక మాచదువు జరుగనేలేదు. పడుక్కుందుకు వెళ్ళేకకూడా నాకు నిద్రపట్టలేదు. మేరియా ఏడ్పు వింటూ పడుకున్నా. ఆవిడ ఎందుకు ఏడుస్తూందోకూడా నాకు అర్థం కాలేదు. మాఅమ్మా ఈలాగే ఏడుస్తూంది. కాని, ఆఏడ్పు ఎందుకో నాకుతెలుసును. తాతయ్య చేసే గంద్రగోళం, అతని తాగుబోతుతనం, కుర్రి వాళ్ళమైన మాకుకూడా సరిపడినంత తిండిలేకపోవడం, ఇల్లాంటి కారణాలువున్నాయి. కాని, ఈమెకి ఏడవవలసిన పనిఏముంది. రొట్టె—మాంసం—ఛాకొలెటుబొమ్మలు, ఆహారపదార్థాలు నిలువచేసిన డబ్బాలు, మిఠాయిలు, ఒకటేమిటి తినదలుచుకుంటే సమస్తమూ వున్నాయి. పైగా ప్రతీనెలా కొంచెమో—గొప్పో—బ్యాంకులో డబ్బు కూడా నిలువచేస్తూంది. అయినా ఏడ్పు మానలేదు. తమాషాఅదది మాత్రం అవును. నేను 'పందులదొడ్డి' కథఅంతా చెప్పి ఆవిడకి బుద్ధిచెప్పుదామనుకున్నాను. కాని, ఈచీకట్లో ఆకథలు విని జడుసుకుంటుందేమో నని పస్తాయించేను.

తెల్లవారింది. మేరియా మంచంమీద లేచికూర్చుంది. అటూ—ఇటూ మాకేసి పరకాయించిచూసింది. తరువాత నిద్రపోతూన్న మగనిమీదికి వొంగి, జేబులన్నీ తడిముతూంది. బొగాటరీవు పడు

క్కొ-నేముందు గుడ్డలు మార్చుకోలేదు.

"జాబుకోసంకాబోలు"-అనుకున్నాను.

విజమే! కొద్దిసేపటిలోనే గలగలలాడుతూ ఆమెచేతులో ఒక కాగితం వుంది. గట్టిగా ఊపిరితీస్తే మగడు లేస్తాడేమోనని ఆమె జంకుతూంది. భయంతోటీ-అనుమానంతోటీఒక్క-నిముషం కళ్ళు మూసుకుంది.

నేను నిద్రపోతూన్నట్లు నటిస్తూన్నా ఇదంతా గమనిస్తూనే యున్నాను. ఆవిడకి చదువు బాగారాదని నాకు తెలుసును. అయినా ఏంచేస్తుందో చూద్దామనే దృష్టితో ఊరుకున్నాను.

ఆవిడ నెమ్మదిగా మంచందిగి నాపక్క-దగ్గరికి వచ్చి భుజం తట్టుతూ-"అబ్బాయి! నన్యా! కాస్త ఇది చదివిపెడుదువుగాని లేవ్వోయి."-అంటూ పిలిచింది.

మహా నిద్రపోతూన్నవాడిమాదిరగా మూలిగి, నీలిగి, కళ్లుతెరిచేను.

ఆగుడ్డివెలుగులోనే 'ఆల్మానీయా'-ఆమె పుట్టినవూరు-నుంచి వచ్చిన ఆజాబును చదివివినిపించేను. ఆల్మానీయా డాన్‌నదీతీరాన వుంది. ఆరోగ్యకరమైనగ్రామమట. పువ్వులతోటలు అధికమట.

జాబు:-

"ప్రియమైన నాన్నకి:

మీదగ్గరనుంచి జాబువచ్చినప్పుడల్లా మాకు మంచి హుషారుగా వుంటుంది. మీబావ అల్గ్జాండరుకి విన్ననే మీవద్దనుంచి వచ్చిన

జాబు చదివేక నవ్వలేక పొట్ట ఉబ్బిపోతూంది. అందులో-"నేను ప్రొద్దుటే లేచేటప్పటికి ఏదో పునర్జన్మ ఎత్తినట్లే అనిపిస్తూంటుంది. నాకు గడ్డం మొలవనేలేదనీ, నాది బట్టతలగాక ఉంగరాలజుట్టుఅనీ, అనిపిస్తూంటుంది"-అంటూ వ్రాసినవాక్యాలు చదివి ఉక్కిరి-బిక్కిరి అయిపోతూన్నాడు. శేషాకి ఏమీ సిగ్గులేదు. నాన్నా! అదిచదివేక ఏమన్నాడో తెలుసునా?-"నాన్న బాగా పడుచువాడు అవుతూన్నాడు. మేరియా చాలదు. ఆమెగారిని వదిలేసి తప్పకుండా మళ్ళీ పెళ్ళిచేసుకుంటాడు చూడండి."-ఈమాటలే ఆమెగారికి జాబువ్రాస్తే ఏమనుకుంటుంది అంటావు? నువ్వువ్రాసిన జాబులలో ఏదీ ఇంత నవ్వు కలిగించలేదు. ఒకజాబులో -కొలియములదగ్గరకీ-'ట్రెపెకా-హెర్త్స'ల దగ్గిరికీ తగినంత జనం లేరనీ, మమ్మల్ని మాగ్నిటోగోరస్కుకి వచ్చేయమనీ, వ్రాసేవు.

"మేమూ, ఆండ్రీ, ఆలోచించేము. రావడానికే నిశ్చయించుకున్నాం. అతడు వెళ్ళి వర్కుషాపుపార్టీకమిటీతో మమ్మల్ని అందర్నీ 'ఉరల్సు'కి పంపించమంటూ అడిగేడు.

"ఇప్పుడే మేము బండీ యెక్కేము. స్టేషనులోనిజనం అంతా మమ్మల్ని సాగనంపడానికి 'ట్రెయిను'దగ్గిరికి వచ్చేరు. నువ్వు వ్రాసేవే-'మీరంతా మాగ్నిటోగోరస్కుకి రాండి. మీచేతులమీద ఈప్రపంచాన్ని ఉద్ధరించండి. ప్రపంచంలోకెల్లా గొప్పదయిన ఈనిర్మాణాన్ని పైకి తీసుకురాండి'-అంటూజాబు!-అది ఆండ్రీ వారందరికీ చదివి వినిపించేడు. బ్యాండు ఆగింది. మావర్కుషాపు

మిత్రులంతా సద్దుమణిగి ఆంద్రీని మాటలాడమన్నారు. ఆంద్రీ బండి గుమ్మంలో నిలబడి –'మాకుటుంబంలో ఒకతరంవారంతా పునర్జన్మ కోసం మాగ్నిటోస్ట్రాయికి పోతూన్నా'–మని చెప్పేడు. ఇంతలో మీస్నేహితుడు లేడూ–ఆగుడ్బుడ్రైవరు–'ఫియోదోర్–ఛెర్నుసోవు'- అతడు కూతకొట్టి, బండికదిపేడు. మేమంతా బహు ఉత్సాహంతో ఆల్మానియా వదిలేము."

జాబుకు అడుగునా ప్రక్కన చాలాసంతకాలున్నాయి.

ఆంద్రీ, కోల్కా, లీనా, స్టీఫెన…………

నేను కిటికీలోంచి బ్లాస్టుఫర్నేసులవంక చూస్తూ నిలబడ్డాను. ఉదయకాంతులలో మిలమిలలాడుతూ వానిగొట్టాలు ఆకాశంతో రహస్యాలు ఆడుతూన్నాయి. ఆప్రకృతిసౌందర్యం గమనిస్తూ మేరియా అక్కడవుందనే విషయంకూడా మరిచిపోయేను.

ఆవిడ ఇంక ఎక్కడికీ బయలుదేరవలసిన పనేమీలేదు. ఇంత కాలం ఎవరికోసం 'ఆల్మానియా' వెళ్ళిపోదాం అనుకుంటూందో వాళ్లే ఇక్కడికి వచ్చేస్తూన్నారు.

## ముప్ఫైమూడో ప్రకరణం.

నేను బొగాటరీవుమ వదిలి మరొకరివద్ద పనిచేయడానికి వెళ్ళడం అదేమొదటిమారు. మాఇంజను మరమ్మతులో వుంది. మరొకబండి చూసిరమ్మని నన్నుపంపేరు.

ఒకఇంజను పెట్టెలవరసలు తగిలించుకొని నిలబడివుంది. అంతవరకూ పనిచేసిన వంతువాళ్ళు పనిలోంచి పచ్చేస్తున్నారు. కొత్తగా వచ్చిన డ్రైవరు వట్టి అసమర్థుడు. కుళ్ళుకుక్కలాదగ్గి తెగ ఉమ్మివేస్తున్నాడు.........నేను నాస్థానంచేరుకుందుకు ఇంజను ఎక్కబోతూన్నాను. ఇంక ఆయనగారు వేళాకోళం వెలిగిస్తాడు. ఒకసుత్తి నానెత్తిమీదికి ఎత్తి—"ఎవరునువ్వు? ఇల్లావస్తా వెక్కడికి? ఫో! చంపేస్తా నేమనుకున్నావో?"—అని అరిచేడు.

నాకు ఈమాదిరి హాస్యంఅంటే మహాఅసహ్యం. ముక్త సరిగా —'నేను అసిస్టెంటుని'—అనేసి బండీఎక్కి నాపని నేను చూసుకోసాగేను. ప్రతిమరలోనూ నూనెపోసేను. సుత్తితోకొట్టి చాయసీలలు పరీక్షించి, బేరింగుల నిండుగా నూనెపోసి, నీరు-బొగ్గు చూసుకొని, 'పంపు' నీటిలోదింపి బోయిలరుకి ఎక్కించడం ఆరంభించేను.

డ్రైవరు సిలెండర్లలోకి ఆవిరి వదిలేడు. తానుతొడుక్కొన్న జాకెట్టుతీసి కొంకికి తగిలించి, చొక్కాగుండీలుతీసుకొని కుర్చీలో చదికిలబడి వాగడం ఆరంభించేడు.

"ఓహో! అసిస్టెంటు?........అహోహ! అ-సి-స్టె-ం-టు! అయితే ఏదిచూద్దాం. గరిటెతీయి. పొయ్యిలోకి బొగ్గులు విసరగల వేమో చూద్దాం."

"నీతెలివి తగులబడిరి. మూడుమార్లు బహుమతులు సంపాదించిన బొగాటరీవుఇంజనులో నేను అసిస్టెంటుని. మాగ్నిటో స్ట్రాయిలోకల్లా నేనే సమర్థుడనైన అసిస్టెంటునని నాకు 'సర్టిఫికెటు, కూడా వుంది."— అనుకుని ఈచవటతో మాటయేమిటని ఊరుకున్నాను.

కొద్దిసెకండ్లలోనే ఇంజనుపొయ్యిలో తెల్లని మంటలు లేచేయి. కాని. డ్రైవరుకి సంతుష్టిలేదు.

"ఓరి! చవట. లేకపోతే నువ్వుపనేమిటి? ఇప్పుడే అరక వదిలి వచ్చినట్లుకనిస్తూంది. ఆ! లే! ఇల్లాపేయాలి, బొగ్గులంటే చూపిస్తాను. ఉండు."

డ్రైవరు గరిటె ఊపిఊపి బొగ్గులు పొయ్యిలో వేయబోతే అవి బోయిలరుచక్రానికి కొట్టుకొని, 'కేబిన్' అంతాచెదిరేయి.

అతడికి ఎంతేనా కోపం వచ్చింది.

'ఓరి! దొంగా! పొయ్యికి అడ్డం పెడతావేం?"

ఆవేశంతో మూంగాళ్ళమీద లేచి, నా మొగంమీదికంటా వొంగి, ఏమిటేమిటో తెగగొణిగేడు. నోరంతా పాడువాసన.

"ఏమిటా ఈవాసన?"—అని ఆలోచిస్తూ నాపని చూసుకుంటున్నా. 'సిగ్నల్' ఇచ్చేరు. బండి కదిలింది.

ఏమి టంతవేగం? పోనియని బండీకూడా ఏమంత పెద్దది కాదు. చిన్నదీకాదు లెండి. ఈ మాత్రపుబండీనయితే నేనూ బొగాటరీవూ—ఎంతో సున్నితంగా నడిపించి వుండేవాళ్ళం. కాని ఈతడు పెద్ద 'వాల్వు' లోని 'రెగ్యులేటరు' ను పూ_ర్తిగా తెరిచేసి, సామానుబండిని ఎక్స్ప్రెసువేగంలో నడపడం ఆరంభించేడు.

మాగ్నిటోస్ట్రాయిలో వేయబడిన 'లైన్' లు అన్నీకొత్తవే. వాటిలో చాలవరకు తాత్కాలికోపయోగం కోసమే వేసేరు. ఈకర్మాగారాల నిర్మాణం పూ_ర్తిఅయిపోగానే వాటిని తీసేస్తారు. తాత్కాలికోపయోగంకోసమే వేయబడడంచేత, పొడూగునావున్న గుట్టలమీదా—మెట్టలమీదా దారి ఎక్కుతూ—దిగుతూ ఎగుడుదిగుడుగా వుంటుంది.

దారి ఏలావుంటుందనే విషయం డ్రైవరు ఆలోచించనేలేదు. వెనక్కీ—ముందుకీ ఊగుతూ కుర్చీలో కూర్చున్నాడు. బయటికి చూచి 'సిగ్నలు' అందుకోవాలనే జ్ఞానమేలేదు! కాని, గొడ్డులా అరవడంమాత్రం మానలేదు.

"ఎర్రగా....కణకణలాడిపోవాలి. భేష్!—,అదీవరస. ఇదిగో అబ్బాయి! ఇకముందునుంచి నాదగ్గిరికే వస్తూండు. నిన్ను ఏలాగ తయారు చేస్తాననుకొన్నావు? మాటలాడవేం? కోపం వచ్చిందా?.... కాస్త ఒకగుక్కెడు పుచ్చుకుంటావా?"—

డ్రైవరు వోడ్కా సీసా నాకేసి జాపేడు.

కాళ్ళక్రింద చక్రాలు ఒకపల్లంలోకి పోతూన్నాయని తోచింది.

రెగ్యులేటరు మూయాలి. బ్రేకులు వేయాలి. ఇంతకంటేనూ పెద్ద పల్లం ముందరవుంది. దానిదగ్గరికి వచ్చేసేం. ఆపల్లంలో చక్రాలకి వేగం దొరికిందంటే ఇంక వాటిని ఆపడం ఎవ్వరితరమూకాదు. ఒక్కక్షణంలో బండీలోమిగిలేది బొగ్గులూ—బూడిద మాత్రమే. కాని డ్రైవరుకి ఈదృష్టి లేనేలేదు. ఏమిటో వాగుతూ నామీద పడుతూన్నాడు.

పల్లం వచ్చేసింది. బండికి వేగం అందుకుంది. బండిబండంతా త్రాగినవాడికిమాదిరిగా తెగకుదిలిపోతూవుంది. మహావేగంతో ముందుస్టేషనులోకి జొరబడి బళ్ళన్నింటినీ విరగగొట్టి. 'లైౝ' అంతా ధ్వంసంచేసి, కొలిములవద్దకి ఒక్కరాయిగాని, వీసెడు ఇనుముగాని, అందదు. ...అరరే!....మీదికి వస్తూన్న డ్రైవరు మెడపుచ్చుకొని ఒక్కమూలకి గిరాటువేసేను. ఆతడు ఉండచుట్టుకొని మూలకి అంటిపెట్టుకుపోయేడు. వాడిచేతిలోని వోడ్కాసీసా ముక్కు—ముక్కలయిపోయింది.

డ్రైవర్ను ఒకమూలకి పారవేసేక నేను పరుగెత్తివెళ్లి 'రెగ్యులేటరు' మూసేసేను. వెంటనే కిటికీలో తలపెట్టి బయటచూసేను. దూరంగా చీకట్లో ఎర్రనిచుక్క కనబడుతూంది. 'సెమాఫెర్'!.... స్టేషను వచ్చేసింది. బండి వాయువేగంలో నడుస్తూంది. బ్రేకులు వేసేను. కాని, ప్రయోజనంలేదు. చక్రాల క్రిందినుంచి నిప్పురవ్వలు లేస్తూన్నాయి. ఇనుముకాలిన వాసనవేస్తూంది. వేగం ఏమీతగ్గలేదు. 'రిజర్వు'బ్రేకులుపయోగించేను. ఇంజను ముందుకి పోతూంది.

చక్రాలు ఈడిగింబడుతూన్నాయి. వెనకవైపునుంచి బరువుబళ్లు గెంటుకువస్తూన్నాయి.

'సెమాఫెర్' దూరానవుండగానే ప్రమాదాన్ని సూచిస్తూ సంజ్ఞలు ఇచ్చివేసేను. కాని,సిగ్నలుస్తంభంలో దీపం ఎర్రగానేవుంది. ఇదేమిరా అనుకుంటూంటే బండి స్తంభంప్రక్కకి వచ్చింది. పైన ఆకుపచ్చదీపం మినుకుమనడం చూసేను. ప్రాణాలు కొంచెం కుదుటబడ్డాయి. ఇంక సిగ్నలు దేవులాటలేదు. సుత్తి తీసుకొని, బోయిలరువైపు పరుగెత్తేను. మొట్టమొదటిపని ఇసుకపెట్టెల మూతులు వదులుచేయడం. కాని, ఇంజనులో ఏభాగమూ క్రమస్థితిలోలేదు. అన్నిభాగాలూ దెబ్బతిన్నాయి. ఒకటీ పనిచేయదు. రెక్కలు నెప్పులు పుట్టేలాగ కుదిలించినా తగినంత ఇసక రాలడంలేదు. బండివేగం కొద్దిగా తగ్గినట్లు తోస్తూంది. ఇప్పుడు నక్షత్రాలేవో టెలిగ్రాఫ్ స్తంభాలేవో గుర్తుతెలుస్తోంది. అయినా స్టేషనుదగ్గరయినా బండిఆగుతుందనే ఆశలేదు.

తుపానుగాలిలా విసురుకుపోతూన్నాం. స్టేషనుదగ్గర ఎర్రదీపాలు చేతబట్టుకొని జనం హడావిడిగా పరుగెత్తుతూండడం ఓరగంట గమనించేను. ఈలలు—చప్పట్లు—వినిపిస్తూన్నాయి. మళ్ళీ చీకట్లోకి వెళ్ళిపోయేం. నేను ఇసకపెట్టెలు గట్టిగా కుదిపేను. గొట్టాలమీద సుత్తితో గట్టిగా బాదేను. కండక్టర్లకి బ్రేకులు వేయమని సంజ్ఞలిచ్చి, రెగ్యులేటరు పూర్తిగా వెనక్కితిప్పేను. బండి వేగం తగ్గుతూన్నట్లు తోచింది. నెమ్మదిగా...,నెమ్మదిగా....వీం

బడింది.

బండి ఆగగానే నేను ఇంజనులోంచి వురికి చక్రాలూ—ఇంజనూ—బేరింగులూ—పరీక్షించిచూసేను. అన్నీ కరిగి ముద్దఅయి పోయి వుంటాయనీ, అన్నిభాగాలూ చెడిపోయివుంటాయనీ,ఊహించేను. కాని, అటువంటి ప్రమాదంఏమీ జరగలేదు. బయలుదేరే ముందు వానినిండా నూనె పోసేను. సీలలు గట్టిపరచేను. అవే బండినిలవడానికి ఆస్కారం ఇచ్చేయి. అంతా సరిగావుంది. నేను బండిలోకిఎక్కి రెగ్యులేటరు తెరిచేను.

బండి స్టేషనులో విలబడింది. మాకోసం స్టేషనులో ఒకమూల తెరలుకట్టి సిద్ధంచేసేరు. అంబులెన్సు సిద్ధంగా వుంది. 'ప్రమాద రక్షణసంఘం' తయారుగావుంది. ఇంజన్లు డీకొని, జనం గాయపడి, చావడానికి సిద్ధంగా వున్నప్పుడు కావలసిన సాధనసామగ్రి తయారుగావుంది.

స్టేషనుమాస్టరు ఇంజనుకేసి పరుగెత్తివచ్చి నాచేతులు రెండూ పట్టుకున్నాడు. అతడు విలువునా వొణికిపోతూన్నాడు.

"మాంచి తెలివైనవాడివి. ఇంత చిన్నవయస్సులో ఎంత గొప్ప'ఇంజనీరు'వి అయేవు? సెభాష్!ఈవరకంలో వళంతప్పిన బండీఏదీ ఇంతవరకు క్షేమంగా రాలేదోయి!"

ఆసమయంలో నేను 'ఇంజనీరు'నుకాననీ, 'అసిస్టెంటు'ను మాత్రమేననీ తెలియబరచడానికి మనసొప్పలేదు. నామనసులో 'ఇంజనీరు'కావడానికి అంతకోరికవుంది?

ముప్పైనాలుగో
ప్రకరణం.

కాలియున్న తొట్టెలలోకి మంచినీరులా కరిగియున్న ఇనుము ప్రవహిస్తూంటే చూడడానికి ఎంతసరదాగావుండేది. నిజంగా ఉద యిస్తూన్న సూర్యుడికేసి చూస్తే కలిగినంత ఆనందమూ కలుగు తుంది. ఆదృశ్యంతో పోల్చదగినది మరొకటి లేనేలేదు. ఆప్రవ హిస్తూన్న లోహంవంక ఎంతసేపుచూసినా, ఎన్నిమార్లుచూసినా, తనివితీరదు. తలతిప్పకుండా—రెప్పవాల్చకుండా దానివైపు చూస్తూ కూర్చుండమంటే ఎన్నిరోజులయినా అలాకూర్చుండగలను. కను రెప్పలు నెప్పులుపుట్టి, గుడ్లనీరుగ్రమ్మేదాకా అలాగే చూస్తూండే వాడిని కూడాను. గంభీరంగా—తేజోమయంగా వుండే ఆతరంగా లలో ఎంతశక్తి – ఎంతదార్ఢ్యం వుంది? నేనుఆతొట్టెలదగ్గిరికి ఇంజను నడుపుకొని పోతాను.

దానిని చూడడంవలన కలిగిన ఆనందాన్ని నేను దాచుకొన పనిలేదు. అటువంటి ఆనందాన్ని అనుభవిస్తూన్నవాడిని నేనొక్కణ్ణే కాదు. నేనేమొదటివాడినికూడా కాదు.

శతాబ్దాలనుంచి కర్రుమొగంఎరగని ఆప్రదేశాన్ని మొట్టమొదటి మారుగా త్రవ్విన బోరిసోవు ఈమాదిరి ఆనందాన్నే అనుభవించేడు.

బ్లాస్టు—ఫర్నేసుల్ని తయారుచేసి పనికి సిద్ధంచేసినప్పుడు ఫిట్టర్లుకూడా........

ముడియినుముతోనింపిన మొదటిబండిని తీసుకువచ్చినప్పుడు బొగాటరీవు.........

క్రామరింకో.........

అమెరికను కొలుములు తయారయి రోజుకి ఇరవైరెండు వందలటన్నులు లోహం కరిగించగల అవకాశాలు చిక్కినపుడు ఆతడుకూడా ఆటువంటి ఆనందమే అనుభవించేడు.

కరిగిన ఇనుముతో తొట్టెలు నిండేటంతవరకు కనిపెట్టుకొని వుండి, తరువాత వానిని పోరింగ్—మిషనుకి తీసుకుపోయి వప్ప చెప్పాలి. నేను బండికిటికీలో వంగి ఆప్రవాహంవంక రెప్పవాల్చ కుండా చూస్తున్నాను. పర్వతాలమీదనుంచి చల్లనిగాలి విసురు తూంది.........

నాకు ఇప్పుడు ఆసిస్టెంటుగావుంటూన్న 'బోరిసోవు' నాభుజం మీదుగా వొంగి ఆదృశ్యాన్ని చూసి ఆనందిస్తూన్నాడు.

"మేము ఈకొలుములపని అరంభించినది శీతాకాలంలోనే, సన్యా! ఆఏడాది ఎంతచలి అనుకున్నావు. ఉమ్మివేయబోతే పెదవు లలోనే గడ్డకట్టిపోయేది. —"మీరు ప్రకృతికి విరుద్ధంగా ఏమీ చేయలేరు. శీతాకాలం పోనీండి"— అంటూ అమెరికను ఇంజనీర్లు సలహాయిచ్చేరు. చలికి నీరుగడ్డకట్టి పైపులు బద్దలయిపోయేవి. వాటికోసం భూమి తవ్వవలసివచ్చేది. అబ్బే గోరీ తవ్వినట్లే. వానిముందమోయ! గొట్టాలుమార్చి వానికి చలితగలకుండా మేము తొడుక్కున్న చర్మపుకోట్లు, కాన్వాసు ఓవరాలులు కప్పేవాళ్ళం.

మొత్తంమీద సాధించేము. వేసుకున్న అంచనాకంటె అధికమైన పనినే చేయగలిగేము. చూడు ముత్యంలాగ ఎంతస్వచ్ఛంగా వుందో."

కొలిమికిదగ్గరగానే కొలిమిపనివాళ్ళు, స్మెల్టర్లు, మేస్త్రీలు నిలబడిచూస్తూన్నారు.

మూడువేలక్యూబిక్‌మీటర్ల తుపానుగాలిలో కొలుములు భగ భగామండుతూన్నాయి. పనివాండ్రంతా ఎంతోశాంతంగా పని చేస్తూన్నారు. వాళ్ళలో హాస్యంలేదు. కోపంలేదు. తాపంలేదు. గాలిపోసుకొని మండుతూన్న కొలిములకేసి, ఎంతోజాగ్రత్తగా చూస్తూన్నారు.

నాకు ఇంజనుడ్రైవర్ల సర్టిఫికేటు ఇచ్చేరు. పరీక్షలో ప్యాస య్యేను. కొత్తగానే విదేశాలనుంచి తెప్పించిన ఇంజనునొకదానిని నాకు ఇచ్చేరు. ముడియినుముతోనిండిన బళ్ళు నడపడం. బోరి సోవుకి పనినేర్పడము, ఇవి నేచేస్తూన్న పనులు. కరిగి ప్రవహి స్తూన్న ఇనుముపంక చూస్తూ బోరిసోవు అమాయికానందాన్ని అనుభవించేవాడు.

"సన్యా! ఈప్రదేశాన్ని తవ్వి మన్ను పెట్టెలలోకెత్తి ఈ మైదానంగుండా ఈడ్చేనంటే ఆలోచించు. రెల్లుదుబ్బులలోవున్న పక్షిగూళ్ళు నాకాళ్ళక్రిందపడి ఎన్ని నలిగిపోయినాయో."

చీకటిపడబోతూంది. కొలుములవద్దజనం ఎందుకో కంగారు పడుతూన్నారు.

ప్రవహిస్తూన్న ఇనుమునీరు తొట్టెలునిండి పొంగిక్రిందపడి నాలుగుమూలలకీ మిణుగురులు చెదిరేయి. గురితప్పి పెద్దపెద్ద ధ్వనులతో, నిప్పులు చిమ్ముకుంటూ ఆఅగ్నిప్రవాహం తడినేలమీద పడి గడ్డకట్టిపోతూంది.

కరిగినఇనుము మరీఎక్కువగావుంటే అదినింపడానికి తగినన్ని తొట్టెలు లేవు. కాని, ప్రస్తుతం ఉన్నవి చాలు. ఉన్నలోపం ఏమిటంటే ఇంజన్లువాటిని సరిగా ప్రవాహపుగొట్టాలక్రిందికి తేలేకుండా వున్నాయి. అంతే. కారణం ఇంజన్లు మంచివిగాకకాదు. అవిఅన్నీ సరికొత్తవి. పేరుప్రఖ్యాతులుగన్న జర్మనుకంపెనీ సప్లయిచేసింది, వాటిని. వాటిమీది మెరుగైనామాయలేదు. కాని, వున్నలోపం ఏమిటంటే వాటిని నడిపేవారికి ఆయంత్రభాగాలయొక్క శాస్త్రీయజ్ఞానంలేదు.

వేలకొలదిపనివాళ్ళ పరిశ్రమనంతనీ ధ్వంసంచేస్తూ ఇనుము నేలబడిపోతూంది.కాని,డ్రైవర్లు ఏమీ చేయలేకుండావున్నారు. ఒక్క ఇంజనులోనూ 'బ్రేక్ షూ'లు— లేవు వాటిని తేవడం మరిచేరు.

మాసిపోయి బొంతురేగిన టోపీ లాగేసి జుట్టుపీకుకుంటూ డ్రైవర్లని దొంగలనీ— ముష్కులనీ తిడుతూ, వాళ్ళమీద కారాలూ మిరియాలూ నూరుతూ పరుగెత్తివస్తూన్న బ్లాస్టు—ఫర్నేసు అధికారి కనపడ్డాడు.

ఆతడు నాఇంజను ప్రక్కనుంచే పరుగెత్తేడు. కాని, మీస కట్టయినా రాని నేను ఆతనిని నాశక్తివిషయంలో నమ్మించలేక

పోయేను.

నావంతువచ్చింది. రెగ్యులేటరు తెరిచి పూర్తివేగంతో బండి నడిపేను, ఆఅగ్నిగుండంలోకి. మిగిలినవానికన్న నాఇంజను ఏమంత మంచిదికాదు. దీనికి లేవు, 'బ్రేక్–షూ'లు. ఆఇంజనుని ఈవేళనే నాచేతపెట్టేరు.

బండిని పరుగెత్తిస్తూనే 'సిగ్నలు' ఇస్తూ కూతవేసేను. క్లిష్టతరంగావుండే యంత్రరహస్యాలను ఎరుగుదునన్న గర్వాన్నీ, నాబాధ్యతను నిర్వహించగలననే ధైర్యాన్నీ, వేలకొలదికూలీల అభినందనాలను పొందగలననే ఆనందాన్నీ, కొలుములు ప్రవహింపజేస్తూన్న ఆజీవప్రవాహాన్ని భరించగలననే ధైర్యాన్నీ, ఒకపెద్ద కూతలో కప్పిపుచ్చేను.

ఎంతోజాగ్రత్తగా బండిని ఆతుపానుమధ్యకితీసుకొనిపోయేను. ఇంజనుముందుభాగం అప్పుడే మంటలమధ్యవుంధి. అచ్చటగాలి చాలావేడిగావుంది. నాతలవెండ్రుకలన్నీ చెమర్చేయి. ఆప్రదేశంలో నిప్పుపుల్ల పనిలేకుండా సిగరెట్టు వెలిగించుకో వచ్చునన్నట్లుగా వుంది. తొట్టెలతో గొట్టాలు కలపడంకోసం నిరీక్షిస్తూన్నాను.

బ్లాస్టు–ఫర్నేసులనుంచి వినబడే పెద్దపెద్దధ్వనులమధ్య 'ఆటోమాటిక్–కప్లింగ్'లు పెట్టెలకు తగుల్కొన్న సన్ననిధ్వని వినిపించింది. ఇప్పుడింక ముందు–ముందుకి ఒక్కొక్క అంగుళం చొప్పున జరగాలి.

తొట్టెలకివున్న సన్నని మూతులలో సరిగ్గాపడాలి ఆఅగ్నివా

ప్రవహిస్తూన్న ఇనుమునీరు తొట్టెలునిండి పొంగిక్రిందపడి నాలుగుమూలలకీ మిణుగురులు చెదిరేయి. గురితప్పి పెద్దపెద్ద ధ్వనులతో, నిప్పులు చిమ్ముకుంటూ ఆఅగ్నిప్రవాహం తడినేలమీద పడి గడ్డకట్టిపోతూంది.

కరిగినఇనుము మరీఎక్కువగావుంటే అదినింపడానికి తగినన్ని తొట్టెలు లేవు. కాని, ప్రస్తుతం ఉన్నవి చాలు. ఉన్నలోపం ఏమిటంటే ఇంజన్లువాటిని సరిగా ప్రవాహపుగొట్టాలక్రిందికి తేలేకుండా వున్నాయి. అంతే. కారణం ఇంజన్లు మంచివిగాకకాదు. అవిఅన్నీ సరికొత్తవి. పేరుప్రఖ్యాతులుగన్న జర్మనుకంపెనీ సప్లయిచేసింది, వాటిని. వాటిమీద మెరుగైనామాయలేదు. కాని, వున్నలోపం ఏమిటంటే వాటిని నడిపేవారికి ఆయంత్రభాగాలయొక్క శాస్త్రీయజ్ఞానంలేదు.

వేలకొలదిపనివాళ్ళ పరిశ్రమనంతనీ ధ్వంసంచేస్తూ ఇనుము నేలబడిపోతూంది.కాని,డ్రైవర్లు ఏమీ చేయలేకుండావున్నారు. ఒక్క ఇంజనులోనూ 'బ్రేక్‌షూ'లు— లేవు వాటిని తేవడం మరిచేరు.

మాసిపోయి బొంతురేగిన టోపీ లాగేసి జుట్టుపీకుకుంటూ డ్రైవర్లని దొంగలనీ— ముష్కులనీ తిడుతూ, వాళ్ళమీద కారాలూ మిరియాలూ నూరుతూ పరుగెత్తివస్తూన్న బ్లాస్టు—ఫర్నేసు అధికారి కనపడ్డాడు.

ఆతడు నాఇంజను ప్రక్కనుంచే పరుగెత్తేడు. కాని, మీసకట్టయినా రాని నేను ఆతనిని నాశక్తివిషయంలో నమ్మించలేక

పోయేను.

నావంతువచ్చింది. రెగ్యులేటరు తెరిచి పూర్తి వేగంతో బండి నడిపేను, ఆఅగ్నిగుండంలోకి. మిగిలినవానికన్న నాఇంజను ఏమంత మంచిదికాదు. దీనికీ లేవు, బ్రేక్-షూ'లు. ఆఇంజనుని ఈవేళనే నాచేతపెట్టేరు.

బండిని పరుగెత్తిస్తూనే 'సిగ్నలు' ఇస్తూ కూతవేసేను. క్లిష్ట తరంగావుండే యంత్రరహస్యాలను ఎరుగుదునన్న గర్వాన్నీ, నాబాధ్యతను నిర్వహించగలననే ధైర్యాన్నీ, వేలకొలదికూలీల అభి నందనాలను పొందగలననే ఆనందాన్నీ, కొలుములు ప్రవహింప జేస్తూన్న ఆజీవప్రవాహాన్ని భరించగలననే ధైర్యాన్నీ, ఒకపెద్ద కూతలో కప్పిపుచ్చేను.

ఎంతోజాగ్రత్తగా బండిని ఆతుపానుమధ్యకితీసుకొనిపోయేను. ఇంజనుముందుభాగం అప్పుడే మంటలమధ్యవుంధి. అచ్చటగాలి చాలావేడిగావుంది. నాతలవెండ్రుకలన్నీ చెమర్చేయి. ఆప్రదేశంలో నిప్పుపుల్ల పనిలేకుండా సిగరెట్టు వెలిగించుకో వచ్చునన్నట్లుగా వుంది. తొట్టెలతో గొట్టాలు కలపడంకోసం నిరీక్షిస్తూన్నాను.

బ్లాస్టు-ఫర్నేసులనుంచి వినబడే పెద్దపెద్దధ్వనులమధ్య 'ఆటో మాటిక్-కప్లింగ్'లు పెట్టెలకు తగుల్కొన్న సన్ననిధ్వని వినిపిం చింది. ఇప్పుడింక ముందు-ముందుకి ఒక్కొక్క అంగుళం చొప్పున జరగాలి.

తొట్టెలకివున్న సన్నని మూతులలో సరిగ్గాపడాలి ఆఅగ్నివా

హిని. ఆమిణుగురులమధ్యన నెమ్మదిగా పాకుతూన్నా. గట్టిగా ఊపిరి తీయడానికికూడా సాహసించలేకున్నాను. నాకళ్ళు రెండూ ఆప్రవాహంమీదనే వున్నాయి. దానిలోంచి ఒక్కబిందువు చిందుతే నాశరీరరక్తం కారినట్లే బాధపడుతూన్నాను.

పొగమంచు దట్టంగావుంది. అతినిపుణతతో నిర్వహించబడు తూన్న నాపనిని చూడడానికి మెట్లమీద అనువైనచోటు సంపాదించడానికై ఫోర్మనులు, కొలిమిపనివాళ్లు, కూలీలు, ఊరికే పోటీపడుతూన్నారు. వారంతా క్రిందనిలబడి చెవులురిక్కించి ఇనుముసీరు తొట్టెలలోకి ప్రవహించేధ్వని వినడానికి తంటాలుపడుతూన్నారు. నెమ్మదిగా ఒక్కొక్క ఊపుతో జరుగుతూన్న బండిచక్రాలవంక చూస్తూ 'క్రామరింకో' ఆమూల నిలబడియున్నాడు. అతనికి వెను వెంటనే అతని అసిస్టెంటు 'వేస్నిక్' పరుగెత్తివస్తూన్నాడు. బ్లాస్టు ఫర్నేసుఅధికారి—అతనివెనుక కొందరు మేస్త్రీలు—కొందరు స్మెల్టర్లు—పరుగెత్తివచ్చేరు. ఆపైన నాకు కనబడడంలేదు. తొట్టెలు ప్రమాదకరమైన వాతావరణమధ్యానికి వచ్చింది. తుపానుదానిని పూర్తిగా ముట్టడించింది. నాఇంజనుప్రక్కలకి ఏవోవచ్చి కొట్టు కుంటున్నాయి.

కొలిమివాళ్ళు—స్మెల్టర్లు, చప్పట్లు కొడుతూన్నారు.

నేనిప్పుడు వెనక్కి పోవాలనుకున్నా. వాళ్ళందర్నీ చూడాలనీ, వాళ్ళు చెప్పుకొనే మాటలు వినాలనీ, చల్లనిగాలి అనుభవించాలనీ, అనుకున్నాను.

ఈచీకటిలోంచీ–ఈమాటలలోంచీ దాటిపోవడానికి లివరు వెన కకి తిప్పబోతూన్నాను. ఇంతలో శాంతంగా ప్రవహిస్తూన్న ఇనుము కంటబడింది. లివరుమీది చేయి తీసేను.

'కౌపర్ల'సీడలో ఇంజను నిలిచింది. లోహబిందువులు దాని అంచులమీదపడి గట్టిపడిపోతూన్నాయి.

నేను చాలా సిగ్గుపడ్డాను. ఇంతసేపూ వారంతా నాఇంజను మీద వెర్రినమ్మకం కలిగివున్నారు. అదివట్టి నిరుపయోగం అనీ, జరుగవలసిన ప్రమాదం, వారుచేసిన సహాయంవలసనే తప్పింధనీ, చెబుదామనుకున్నాను.

బ్లాస్టు–ఫర్నేసు-అధికారి ఏదో అనడం నాచెవినిపడింది. అతడు నన్ను పొగుడుతూన్నాడని నిశ్చయించేను. అతని కట్టుడు పళ్ళకేసీ; కాల్పుల మచ్చలతోనిండిన మొగంకేసీ, కుడిబుగ్గమీద నున్న గాయపుమచ్చకేసీ, పరీక్షగా చూచేను.

నేనాతనిని గుర్తించేను. మానాన్న స్నేహితుడు–అనాటి 'ఆర్మర్డు–ట్రెయిన్' కమాండరు–గార్బజే ఈతడు. అతనికి నన్ను ఎరుకపరచుకుందా మనుకొనేలోపుననే పరుగెత్తిపోయేడు.

నేనాతని వెనక బయలుదేరే లోపుననే 'క్రామరింకో' నాబండి పక్కనే నడిచివచ్చి, ఇంజనుకేసి వొంగివొంగి చూచేడు.

"మంచి ఇంజను. నీకు దీని అనుపానులన్నీ తెలుసును. బాగుంది. దీనిని జాగ్రత్తగా చూచుకో. అవసరం వచ్చినప్పుడు ఉట్టిపడాలి."

"మీకొలిపాగాంౢడు ప్రమాదాలకి తావీయకపోతే నేనువచ్చి వాలవలసిన అగత్యమే వుండదుకాదుః"

"నువ్వుండాలి. సన్యాః ఇల్లాచూడు. మనం ఒక ఖరారు చేసుకుందామాః కొలిములు నీవయినట్లే బాధ్యతతో నువ్వుచరించాలి. ఈఇంజను మాదిగానే మేము సంచరిస్తాము. పరస్పరంబాధ్యతలు వహించుదాము. ఏమంటావుః"

మావంతు పూర్తిఅయినాక జనసమ్మర్దంగా వున్న ఆఫీసుగదిలో ఖరారునామా మేము సంతకాలు చేసుకున్నాము.

మరునాడు జిల్లాలోని పత్రికలన్నీ మా 'ఖరారునామా'కి ఒక పుటనంతనీ ప్రత్యేకించి ప్రకటించేయి. నాపేరు అందులో చూచుకొనేటప్పటికి భయమూ-నిర్విణ్ణతా పొందేను. అబ్బః ఎంతస్పష్టంగా వ్రాసేరు. సన్యాః పైకి వచ్చేవు. పడిపోకుండా కాచుకో.—

| ప్రపంచ కార్మికులారా! ఏకముకాండి!<br><br>**2000 టన్నులు**<br><br>ఒక్క ఔన్సు కూడా తగ్గకూడదు! | కమ్యూనిష్టు పార్టీ ట్రేడ్ యూనియన్ కమిటీశాఖ — వారి యొక్కా, బ్లాస్టు — ఫర్నేసు మానేజిమెంటు వారియొక్కా పత్రిక. సం. 285. పి. 19-'33 |
|---|---|

# పదినిముషాలలో 'పోరింగు-మిషన్ల'కి ఇనుము అందియాలి.

నెం-20. రు ఇంజను డ్రైవర్లూ — కొలిమి పనివాళ్ళూ చేసుకొన్న సోషలిస్టు ఖరారునామా.

రైల్వేకూలీలు! కొలిమిపనివాళ్లు!

2000 టన్నులు ముడిఇనుము తయారుచేయండి!

కొలుములు - ఇంజన్ల విషయంలో పరస్పరం సోషలిస్టు బాధ్యత వహిస్తూ చేసుకొన్న ఖరారునామా.

1. 20 నెంబరు ఇంజనులో డ్రైవరు — అసిస్టెంటు అయిన నేనూ భోరిసోవూ కొలుముల పని పోరింగు-మిషనుల పనిని ఏమాత్రం ఆలస్యం— అభ్యంతరం కలగకుండా మాయంత్రం

ద్వారా నిర్వహించగలమని నమ్మచెబుతూన్నాము. మా షాక్-బ్రిగేడ్ యొక్క కర్తవ్యం అయిన ఇనుమును తెచ్చి ఈయడమే గాకుండా, కొలుములవద్ద ఏమాత్రపు ప్రమాదము ఆలస్యము కలిగినా మేము మీసహాయానికి వస్తాము పదినిముషాలలో ఇనుము నీటిని పోరింగ్-మిషన్లకి సప్లయిచేయడానికి పూచీపడుతూన్నాము. రెండు కొలుముల వద్దనూ పది నిముషాలలో గొట్టాలన్నిటిక్రిందా తొట్టెలు అమర్చగలమనీ, ఆతొట్టెలను 3-5నిముషాలలో పోరింగ్ మిషన్లకి అందచేయుటకూ పూచీపడుతూన్నాము. చిట్లము తీసివేయడంలో ఒక్కత్రాటినైనా తెంపమనీ, ఏవిధమయిన ఆలస్యము చేయమనీ, వాగ్దానం చేస్తూన్నాము.

(2 కొలిములకీ - పోరింగ్ మిషన లకీ మేస్త్రీలమయిన ఉదోవిస్కీ - క్రైనోవు - కృపాలోవు లనేమేము ఇంజనును గూర్చీ, దాని పనిని గూర్చీ పూర్తిగా బాధ్యత వహిస్తూన్నాము. ఒక్క క్షణంకూడా ఆలస్యం కానీయమనీ, మాశక్తులన్నీ వినియోగించి పనిచేస్తామనీ, వాగ్దానం చేస్తూన్నాము. ఇంజనులో ఏవయినా విరిగిపోయినా, అవసరములైన మరమ్మతులు వచ్చినా దానిని 'డిపో'లోకి పంపక మేము బాగుచేసి ఇస్తామని మాటఇస్తూన్నాము.

సంతకాలు:—

అడయంకో .... ఇంజను డ్రైవరు.

జిరాస్పిమోవు .... నెం 2. రు కొలిమికి మేస్త్రీ.

ఉదోవిస్కీ .... నెం 1 రు కొలిమికి మేస్త్రీ.

కృపాలోవు..పోరింగ్ మిషనుకి మేస్త్రీ....

## ముప్పైఆయిదో

## ప్రకరణం...

మంచి పేరుప్రఖ్యాతులుగల జర్మనీదేశపు లోకోమోటివ్–కర్మాగారం ఒకటి మాగ్నిటోగోర్‌స్కుకి కొత్తహాదిరి ఇంజన్లు నూరింటిని సప్లయిచేసింది. వానితో అవసరంఅయిన సలహాలు ఈయడంకోసం 'హాంస్' బ్రూడ్' అనే ఇంజనీరునికూడా పంపించేరు. ఇంజన్లు అమర్చి, వప్పచెప్పి లేచి రావడమే ఆతనిపని. ఆతడెన్నడూ పొరపాటున అయినా తనకవసరంలేనివానిలో కలగచేసుకొని మాటలాడలేదు.

ఇంజన్లు ఏలాగపనిచేస్తూన్నాయో అడుగుదామని ఆతడొకరోజున నాదగ్గిరికి వచ్చేడు. బండిచుట్టూ తిరిగి పరీక్షగా పరిశీలించేడు. ఆపట్టీలు–ఈమరలు–బఫర్లు పరీక్షించి తలపంకించేడు.

కొంచెం ఎండుమన్ను పెల్లతీసి దెబ్బతిని వార్నీషుపోయిన ఒకభాగంమీదపెట్టి తెల్లని జేబురుమాలుతో రుద్దిచూసేడు.

ఆటుతర్వాత ఇంజన్–కేబిన్‌లోకి ఎక్కివచ్చేడు. బోయిలరు ఫిట్టింగులు వేగిపోయిన చవిటిబూడిదతో నిండివున్నాయి. అది చూచి మొగంఇంతచేసుకొని, బంగారపువుంగరంతొడిగిన వ్రేలితో ఆభాగంచూపుతూ ఏమిటో అన్నాడు.

నాకు జర్మనీభాష తెలియదు. అయినా ఆతనికి అంతఉద్రేకం ఎందుకు కలిగిందో నాకు తెలుసును. అంతఅందమైన ఇంజను

దెబ్బతిని, బూడిదకొట్లాడుతూవుండడం చూస్తే అతనికి కోపం ఆగిందికాదు.

ఇంజను అలాంటిస్థితిలోవుండడం నాతప్పుకాదనీ, ఆరోజు ననే బోయిలర్లు కడగదోతూన్నామనీ, అతనికి తెలియచెప్పాలని సంకల్పం కాని, నామాట అతనికి తెలియకం ఏలాగ?

బ్రూట్ వెళ్ళిపోతూ రెండువేళ్ళు పైకెత్తేడు.

"రహస్యములు యంత్రాలకి దండంపెట్టవలసిందేగాని, అతిక్లిష్టమైన ఆరహస్యాల్ని ఎరిగి నిగ్రహించలేరు."

పైమాటలు పూర్తిచేయకుండానే సగర్వంగా అడుగులు ఎత్తి ఎత్తివేస్తూ దిగిపోయేడు.

ఆతనిమాటలు జ్ఞాపకం పెట్టుకొన్నాను.

సాయంకాలం పనిలోంచి వెళ్లేటప్పుడు 'నిర్మాణకార్యాలయం' వారి విదేశాంగశాఖకి వెళ్లి 'బ్రూట్' మాటలకి అర్థం అడిగేను. ఆమాటలు విన్నమీదట కలిగినకోపోద్రేకంతో ఎదుటనున్నవాడు 'మబాసీ' యనే జ్ఞానంకూడాలేక ఆతనిని కొట్టబోయేను.

"ఓరి దొంగపీనుగ! వెధవతుట్టపెదవులూ వీడూ వీడికీ నీళ్లు వొంటపట్టేయి. నేను అనాగరికుడినా? నేను! బొగాటరీటవుకూడా? వాళ్లపారిశ్రామికనాగరికతని మేము దుర్వినియోగం చేస్తూన్నామా? ఉండవోయి! వేలుచెవులవెధవ! మజా చూపిస్తాం."

ఇంజన్ల బాగుకోసం ఇంతతొందరపడడానికి ఈజర్మనీవాడు కారణంకాదు. కొలిములవాళ్లతో మేముచేసుకొన్న ఖరారునామా

నిర్వహించుకొనడంకోసం మేము అన్నీ సిద్ధం చేసుకోవలసి వచ్చింది.

'డిపో' లోకి తీసుకుపోయి ఇంజనును తుడవడం ఆరంభిం చేము.

మా 'షాక్-బ్రిగేడ్' లోనిసభ్యుల్ని పిలిచి, 'బ్రూడ్' అన్న మాటలు వాళ్ళకి చెప్పేను.

"కామ్రేడ్స్! ఈలాగ చూడండి! ఈఇంజనును మనంతట మనమే మరమ్మతు చేసుకోవాలి."

మాపని చురుకుగా జరగడంకోసం ఒక 'గోడపత్రిక' ప్రకటిం చాలని నిశ్చయించి సంపాదకీయవర్గాన్ని ఎన్నుకున్నాం. ప్రొద్దుటే పిట్టర్లు 'స్క్రూ'లు వదులుచేయడం ఆరంభించేసరికల్లా మాపత్రిక మొదటిసంచిక ఇంజనుని వ్రేలాడుతూంది. ఆసంచికలోని ప్రతి వ్యాసమూ మాగ్నిటోస్ట్రాయిలోవి ఇంజను లన్నింటిలోకీ మాఇంజ నును ఆదర్శప్రాయంగా తయారుచేయాలనే వాంఛ ప్రకటించబ డింది. ప్రతిడ్రైవరు, ప్రతి అసిస్టెంటు, ఇంజనులోని కొంతకొంత భాగాన్ని బాగుపరచడానికి నిశ్చయించి బాధ్యతవహించేము.

మూడురోజులదాకా మాలో ఎవ్వరూ బారక్సుకి పోవనేలేదు. ఇంజనుకి నూతనజీవంపోసి సరికొత్తగా-మంచిబలంగా తయారు చేయడంలో అంతా మునిగివున్నాం. కొలిమిపనివాడయిన 'క్రామ రింకో'కూడా మాపనిలో సాయంచేయడానికి వచ్చేడు. ఇంక రేపు దీనిని పనిలోకి తీసుకుపోవాలి. వేళలేదు. ఆవిరిగొట్టం, ఎలక్ట్రిక్

తీగలు, అమర్చడం ఇంకామిగిలేవుంది. దురదృష్టవశాత్తూ మాకా ర్ఖానాలోవున్న ఎలక్ట్రిక్–ఫిట్టరు ఒక్కడూ చేతులుకాలి హాస్పిట లులో పడివున్నాడు. అతడు వచ్చేదాకా పని నిలపనైనా నిలపాలి. లేదా కిరసనాయిలు దీపాలతో పనిజరుపుకోవాలి. ఏమిటి చేయడం?

వెంటనే గోడపత్రిక ప్రకటించేము. ప్రస్తుతపు పనిలో వచ్చిన అభ్యంతరాన్ని జ్ఞాపకంచేస్తూ, దాన్ని తప్పించుకొనే ఉపాయం సూచించవలసిందని మా'షాక్–బ్రిగేడ్'సభ్యులకి దాంట్లో హెచ్చ రికచేయబడింది. ఆరోజున నేను బయటికి వచ్చేటప్పటికి విసుగు దలను సూచించేమొగాలతో మా'బ్రిగేడ్' సభ్యులు కొందరు పత్రిక చదువుతూండడం గమనించేను. వాళ్ళమధ్య'రొయ్యపీత'గాడు నిల బడి ఊగుతూ ఏవో చిందులు తొక్కుతూన్నాడు. అక్కడ ఏదో తమాషా జరుగుతూందని వింటూ నిలబడ్డాను.

"మేము రాతిమనుష్యులమా ఏమన్నానా? –అని అడుగుతా. మూడురోజులనుంచి కన్నయినా మూయడంలేదే. ఏమంటా వోయ్!"

'రొయ్యపీతగాడి'వి ఈమాటలు. చేపలు పట్టడంలో వాడికి గలసరదాని చూసి, పిల్లలు ఈనామకరణం చేసేరు.

అతడిమాటలకి ఎవ్వరూ సమాధానం ఈయలేదు.

"ఉండదలచుకున్నవాళ్ళు ఎవరైనా వుంటే ఉండనీయండి. మనమట్టుకు ఇంటికి పోదాం. రాండి."

నాకు వెర్రిఆవేశం కలిగింది. చర్రున కేబిన్‌లోకి దూరబడి

రొయ్యపీతగాడిని చూపిస్తూ.

—"కామ్రేడ్స్! అదిగో అనాగరికుడు మనమధ్యనే వున్నాడు. ఇంజనువిషయంలో తనకేమీ బాధ్యతలేదనుకొనే రష్యను వీడే. ఈలాంటివాళ్ళే మన అందరికీ అనాగరికులనే తలవంపులు తెచ్చి పెడుతూన్నారు."—అని అరిచేను.

'రొయ్యపీతగాడు' తరుచుగా నిషామీదనే వుంటాడని నాకు తెలుసు. బండి నడపడానికి పోయేటప్పుడుకూడా గేలం తీసుకు వెడతాడు. నల్లగా కనుచూపు మేరవరకూ కనిపించే ఆనరస్సుకేసి వెర్రిచూపులు చూస్తూంటాడు. మిగిలిన వ్యవహారం అందరికీ చెప్పకుండానే తెలుస్తుంది. ఒకరోజున త్రాగి అల్లరిచేసి ఇంజనులో చాలాభాగాలు విరగకొట్టేడనీ. ఆవిషయం ఎవరితోనైనా చెబితే చంపేస్తానని అసిస్టెంటుని బెదరించేడనీ, ఈవేళనే మావాళ్లు చెప్పేరు.

విద్యుత్సమస్యని పరిష్కరించడానికి అందరం పూనుకున్నాం.

మళ్లీ ఇంకో రాత్రి నిద్రలేదు.

తెల్లవారేటప్పటికి ఇంజను సిద్ధంగావుంది. నాఅసిస్టెంటు బోరిసోవు 'సిలండర్ల'లోకి ఆవిరివదిలేడు. చంద్రబింబాలలాగ వెలిగిపోతూన్నాయి. ఇంజనుదీపాలు. పగటిపూట. మబ్బుకూడాలేదు. సూర్యుడు బాగా ప్రకాశిస్తూన్నాడు. దీపాల అవసరంలేదు. అయినా మాశక్తి ఏలాపనిచేసిందో చూచుకుందుకు 'లైట్లు'వేసేం. వానికి ఎదురుగా నిలబడి మేము ఏడుగురమూ ఆమాయికానందాన్ని

అనుభవించేము.

కొద్దిరోజులు పోయేక దూరాన 'బ్రూడ్' కనిపించేడు. నేను జేబురుమాలువిసిరి ఆతనిని పిలిచి ఇంజనువైపు చూడమన్నా. ఏమిటో ఆశ్చర్యంగా నామొగంకేసి బండి నెంబరుకేసీ, చూస్తూ నిలబడ్డాడు. ఆతనికేమి అర్థంకాలేదు. ఆఇంజనును ఆతడసలు గుర్తేపట్టలేదు. నేను కేబిను దిగివచ్చి క్రిందటిసమావేశాన్ని జ్ఞాపకంచేసి ఇంజనును పరిశీలించమన్నాను. ఆతడు ప్రతిభాగమూ చాలా నిశితంగా పరీక్షించేడు. వ్రేలితోముట్టుకొనిచూసేడు. తెల్లని పట్టుజేబురుమాలుతో రుద్దేడు. ఎక్కడాడాగుఅయినా అంటలేదు. అప్పుడు నావద్దకువచ్చి ఏదో చెప్పబోయేడు. కాని నోటమాటరాలేదు. కంగారు తగ్గేవరకూ ఒక్కనిముషం ఊరుకొని తరువాత మాటలాడేడు. ఈమారు నాకు దుబాసీలపనిలేదు.

'హాంస్-బ్రూడ్' తానన్న పొరపాటుమాటకి క్షమార్పణ చెప్పుకున్నాడు.

## ముప్ఫైఆరో...
## ప్రకరణం.

ప్రొద్దుటినుంచీ....కాదు-కాదు. నిన్నసాయంకాలంనుంచే నామనస్సులో ఒకవిధమైన ఆరాటం బయలుదేరింది. నెత్తిమీదికంటా దుప్పటీ ముసుగులాగుకొని, ఒండిగిలా పడుకొని ఆలోచిస్తూన్నాను. ....కానయితే విశేషం ఏమీలేదనుకోండి. బాధ్యత నేత్తిమీద గలవారందరికీ కలిగేదే ఆఆరాటం. మిగిలినవాళ్లంతా ఇంతబాధ్యతనీ గుర్తించేరా అవిబాదపడుతూన్నాను.పొందితే పొందనూవచ్చు. కాని, నేనూ-కొలిమివాండ్రూచేసుకొన్న ఖరారు సాధారణమైనదికాదు. కొలిమికూలీల సామర్థ్యాసామర్థ్యాలకి బాధ్యత నేనువహించాలి. ఆకొలుములవద్ద వాళ్లపనిచేస్తూన్నారోలేదో నేనింతవరకు చూడనైనాలేదే. వాళ్లకి నేనేమి సహాయంచేయగలను? సామాన్యపుకూలివానికంటె అధికంగా నేనేమీ సహాయంచేయలేనే.

అదేమీ పనికిరాదు. నేనువట్టి ఇంజనుడ్రైవరునే! అయినా నా ఇంజనును ఆదర్శప్రాయంగా తయారుచేయడానికి మాటయిచ్చేను. కరిగినఇనుమును తీసుకుపోవడంలో ఏమాత్రమూ ఆలస్యం కానీయనని మాటఇచ్చేను. ట్రక్కు-కూలీలు- కొలిమిపనివాళ్లూ-ఎవరు ఆలస్యంచేసినా ఆఅపకీర్తి నానెత్తినే చుట్టుకొనిపోతుంది.నామాట నిలబెట్టుకొలేను.

తప్పకుండా నిద్రపోవాలని మంచం ఎక్కి దీపం ఆర్పేను. ఇంకతెల్లవారడానికి ఆట్టేసేపులేదు. ఇంజనులోకి పోవడానికి మూడుగంటలుమాత్రమే వ్యవధివుంది. నేనున్నప్రదేశంఅంతా కటిక చీకట్లలో మునగియున్నా కళ్లుమాత్రం మూతలుబడడం లేదు.కను గుడ్లు ఎర్రగా చింతనిప్పులమాదిరిగా వున్నాయి.

వెల్లకిలాపడుకొని దొర్లేను. మెత్తనికంబళీ ముళ్లలాగ తగిలింది.

అల్లాగపడివుండడానికి తోచిందికాదు. లేచేను. వ్యాయామంచేసుకొని ఒళ్లుమర్దనాచేసుకొన్నాను. సాధారణంగా ప్రతిరోజూ పావు గంటకి తెమిలేది. నేడుఅరగంటసేపు పట్టింది. ఈఅధిక పరిశ్రమ మనసులోని ఆరాటాన్ని అణచిపెట్టేటందుకే.

కాని, అదేమీ ప్రయోజనకారికాలేదు. గదిలోంచి బయటికి రాగానే ఆతురత-ఆవేగం మళ్లీ నామనసును ఆవరించేయి.

మొన్నటిచలిగాలికి బిగిసి కొయ్యబారిపోయిన మంచుగడ్డల మీద దబ్బు-దిబ్బుమంటూన్న అడుగులచప్పుడు వింటూ నడచి పోతూన్నాను.

రాత్రివంతులోయున్న 'రొయ్యిపీత' గాడు నేనంతబ్రొద్దుటేరావడం గమనించి కంగారుపడి ఇంజనుదిగి వెళ్లిపోయేడు. నావెనక్కాలనే 'బోరిసోవ్' వచ్చేడు.

నేనేమీ మాటాడలేదు. 'బోరిసోవ్' వచ్చినదికూడా గమనించనట్లు బుగ్గలు విమురుకుంటూ ఊరుకున్నాను. కాని, నేనంత పెం

దలకడనే ఏలవచ్చిందీ ఆతనికి తెలుసు. ఆతనుకూడా ఖరారునామామీద సంతకం పెట్టినవాడే కాదు?

బోరిసోవు ఒకచేతలాంతరు పట్టుకున్నాడు. రెంతోచేతరెంచీ నూనెడబ్బాపుచ్చుకున్నాడు. మెట్లుదిగుతూ-ఇదేకాదు చేయవలసిన పని?-"అని అడుగుతూన్నట్లు నాకేసితిరిగి చూసేడు.

సామానులపెట్టెలోనుంచి సుత్తి తీసుకొని నేనాతని వెనక్కాలనే బయలుదేరేను. ప్రతిఇరుసూ పరీక్షించేను. బలహీనంగావున్న భాగాలేమయినా వున్నవేమోనని వెదికేసేను.

బోరిసోవు బేరింగులు పరీక్షించి చిక్కని ఆకుపచ్చనూనె వాటినిండా పోసేడు. తొట్టెలలో ఎంతనీరుందో చూసుకున్నాడు. బొగ్గునిలవలో ఎంతవుందో లెక్క చూసుకున్నాడు. 'ఇంజనుబొయ్యి' శుభ్రంగా వుందో-లేదో, పంపులు పనిచేస్తూన్నాయో-లేదో సరిచూసుకున్నాడు.

మేముబండిని కదిపినాకగాని దానిలోయున్న లోపాలు బయటపడలేదు. ఇరుసుసీలలు చక్రాల్ని కదలనీయడం లేదు. చాలా దుర్బలంగా వున్నాయి. ఉంజనులోపల 'జాయంట్లు' వదులయిపోయేయి. 'బ్రేక్-షూ'లు చింపివేయబడ్డాయి. ఒక్కటీనిలువలోలేదు. ఆవిరిపెట్టెలు సరిగా అమరకపోవడంవలన ఆవిరి బుస్సున పైకి పోతూంది.

ఏలాగమాటదక్కుతుంది.

రాత్రి నామనసు అంత ఆరాటం ఎందుకు పొందిందో తెలి

సింది.ఆ'రొయ్యపీత'గాడు చేసినపనిఇదిఒక్కరాత్రిలో మంచియావ
నంలోవున్న ఇంజనును నిరుపయోగం చేసివేసేడు.

తీరాపనిలోకి వెళ్లేముందుగాక, ఈవిషయం ఇప్పుడేచూసుకో
వడం కొంతమెరుగని సంతోషించేము.

ఇంజనుకు కలిగిన నష్టాన్నీ-నాబలశక్తుల్నీ ఒక్కమారు అం
చనా వేసుకున్నాను. నేనయితే చక్రాలమరమ్మతు చూసుకుంటాను.
కాని, 'జాయంట్ల'మాట ఏమిటి? నేనొక్కమనిషినీ ఆరెండుపనులూ
చేసుకోలేనుగదా?

మాదైనికపత్రికయైన 'సిరిణా'కి నేనూ బోరిసూ సంపాదకులం.
వెంటనే మేము పత్రికకి కొత్తసంచికని వెలువరచేము.

ఇంజనుడైరక్టరుహోదాతో నేను ఇంజనును బాగుచేసేటందుకు
ఒక 'పద్ధతి'వేసి మా బ్రిగేడ్‌లోని ఎనమండుగురికీ పని పంచేను.

కొలిమివాళ్లతో పోటీ ఆరంభించిన మొట్టమొదటిరోజున
మాకార్యక్రమం అవిఘ్నంగా ఆరంభం అయింది.

గాలి తీవ్రంగా విసురుతూంది. ఉత్తరాన్నుంచి మంచుబిందువు
లు గాలిలో ఎగిరివస్తూన్నాయి.

ఇంజను మంచులో మునిగిపోయింది. కాలుతూన్న బోయిల
రు సహితమూ మంచుబిళ్లలతో మూసుకుపోతూంది. చక్రాలమీద
నుంచి గొలుసుకత్తుగా మంచుబిళ్లలు వ్రేలాడుతూన్నాయి. నూనె
నిండా మంచుముక్కలే. ఆఖరుకి 'కిరోసిణా'లోకూడా మంచే.

మా బ్రిగేడు ఇంజనును యథాస్థితికి నేనుకొనిరావడానికి ఉపక్ర

మించింది. ఎవరిపనివారు చేసుకొంటూన్నారు. 'రొయ్యపీత'గాడు ముక్కు-మీదికంటూ ముసుగు లాగుకొని ఇంజనుగదిలో ఒకమూల కూర్చుని సాధిస్తూన్నాడు.

"పక్షులుకూడా బయటికి రావడానికి జంకే పుండులాంటి ఈ శీతాకాలంలో మేము ఇంజన్లని శుభ్రంగా వుంచితీరాలని ఏకూలీర క్షణశాసనంలోనైనా వుందా? ఊపిరాడకచస్తూంటే ఇంజనుకి మెరుగులా?"

'రొయ్యపీత'గాని వంతుపనికూడా మానెత్తినే పెట్టుకున్నాం. వాడు పట్టి అభాగ్యుడు. —అంతే! వాడిని అనవలసిన పనిలేదు. మేమే కిరసనాయిలు -గుడ్డపీలికలు తీసుకొని ఆమూలకి వెళ్లేము.

మొట్టమొదట చక్రాలపని పట్టేము. మంచుగాలికి చల్లబడిపోయిన కిరసనాయిలు వొంటికి తగిలేటప్పటికి చుర్రుమంటూంది. చేతులు కొంకర్లు పోతూన్నాయి. చేతివ్రేళ్లలో గుడ్డలు నిలవడంలేదు. బోరిసోవూ-నేనూ ఇంజనులోకి పరుగెత్తి పొయ్యిలో చేతులు దోపేము. చేతులకి వేడి తెలియచ్చేటప్పటికి ప్రాణంలేచివచ్చింది. ఆవిరులు మొగానికి తగిలి ఒకవిధమయిన మగతకమ్మింది..... ఇద్దరం మళ్లీ పనికి ఉపక్రమించేము.

బోరిసోవు వ్రేళ్లకొనలు తెల్లబడిపోయినాయి. కిరసనాయిలు చుక్కలు వానిమీద నిలబడడంలేదు. అయినా అతడు పనిమానలేదు. అలాగే రుద్దుతూ వున్నాడు. పెదవులు బిగించేడు. పళ్లుగిట్టకరుచుకొనిపోయినట్లున్నాయి. మధ్యమధ్య కనుబొమ్మలెత్తి నాకేసిచూస్తూ

సింది. ఆ 'రొయ్యపీత' గాడు చేసినపని ఇది ఒక్క రాత్రిలో మంచియావ నంలో వున్న ఇంజనును నిరుపయోగం చేసివేసేడు.

తిరాపనిలోకి వెళ్లేముందుగాక, ఈ విషయం ఇప్పుడే చూసుకో వడం కొంత మెరుగని సంతోషించేము.

ఇంజనుకు కలిగిన నష్టాన్నీ-నా బలశక్తుల్నీ ఒక్కమారు అంచనా వేసుకున్నాను. నేనయితే చక్రాలమరమ్మత్తు చూసుకుంటాను. కాని, 'జాయంట్ల' మాట ఏమిటి? నేనొక్క మనిషినీ ఆరెండుపనులూ చేసుకోలేనుగదా?

మా దైనికపత్రికయైన 'సిరిణా'కి నేనూ బోరిసూ సంపాదకులం. వెంటనే మేము పత్రికకి కొత్త సంచికని వెలువరచేము.

ఇంజను డ్రైవరు హోదాతో నేను ఇంజనును బాగుచేసేటందుకు ఒక 'పద్ధతి' వేసి మా బ్రిగేడ్‌లోని ఎనమందుగురికీ పని పంచేను.

కొలిమివాళ్లతో పోటీ ఆరంభించిన మొట్టమొదటి రోజున మా కార్యక్రమం ఆవేశంగా ఆరంభం అయింది.

గాలి తీవ్రంగా విసురుతూంది. ఉత్తరాన్నుంచి మంచుబిందువులు గాలిలో ఎగిరివస్తున్నాయి.

ఇంజను మంచులో మునిగిపోయింది. కాలుతూన్న బోయిలరు సహితమూ మంచుబిళ్లలతో మూసుకుపోతూంది. చక్రాలమీద నుంచి గొలుసుకట్టుగా మంచుబిళ్లలు వ్రేలాడుతూన్నాయి. నూనె నిండా మంచుముక్కలే. ఆఖరుకి 'కిరోసిన్' లో కూడా మంచే.

మా బ్రిగేడు ఇంజనును యథాస్థితికి నేను కొనిరావడానికి ఉపక్ర

మించింది. ఎవరిపనివారు చేసుకొంటూన్నారు. 'రొయ్యపీత'గాడు ముక్కుమీదికంటూ ముసుగు లాగుకొని ఇంజనుగదిలో ఒకమూల కూర్చుని సాధిస్తూన్నాడు.

"పక్షులుకూడా బయటికి రావడానికి జంకే వుందులాంటి ఈ శీతాకాలంలో మేము ఇంజన్లని శుభ్రంగా వుంచితీరాలని ఏకూలీర క్షణశాసనంలోనైనా వుందా? ఊపిరాడకచస్తూంటే ఇంజనుకి మెరుగులా?"

'రొయ్యపీత'గాని వంతుపనికూడా మానెత్తినే పెట్టుకున్నాం. వాడు వట్టి అభాగ్యుడు. —అంతే! వాడిని అనవలసిన పనిలేదు. మేమే కిరసనాయిలు -గుడ్డపీలికలు తీసుకొని ఆమూలకి వెళ్ళేము.

మొట్టమొదట చక్రాలపని పట్టేము. మంచుగాలికి చల్లబడిపోయిన కిరసనాయిలు వొంటికి తగిలేటప్పటికి చుర్రుమంటూంది. చేతులు కొంకర్లు పోతూన్నాయి. చేతివ్రేళ్ళలో గుడ్డలు నిలవడంలేదు. బోరిసోవ్-నేనూ ఇంజనులోకి పరుగెత్తి పొయ్యిలో చేతులు దోపేము. చేతులకి వేడి తెలియచ్చేటప్పటికి ప్రాణంలేచివచ్చింది. ఆవిరులు మొగానికి తగిలి ఒకవిధమయిన మగతకమ్మింది..... ఇద్దరం మళ్ళీ పనికి ఉపక్రమించేము.

బోరిసోవు వ్రేళ్ళకొనలు తెల్లబడిపోయినాయి. కిరసనాయిలు చుక్కలు వానిమీద నిలబడడంలేదు. అయినా అతడు పనిమానలేదు. అలాగే రుద్దుతూ వున్నాడు. పెదవులు బిగించేడు. పళ్లుగిట్టకరుచుకొనిపోయినట్లున్నాయి. మధ్యమధ్య కనుబొమ్మలెత్తి నాకేసిచూస్తూ

న్నాడు. ఆసమయంలో మినహాగా ఇతర సమయాలలో మొగం కూడా కనబడనంత క్రిందికివొంచుకున్నాడు,

ఆతనిని హెచ్చరించడంకోసం నవ్వబోయి నిలువునా వణికి పోయేను. చల్లగాలి పళ్లలోదూరి ఇగుళ్లు సలుపుపెడుతూన్నాయి. "ఇంజనులోకి పోయి కాచుకుని వద్దాం. రా."—అన్నమాట నాలిక కొసకి వస్తూంది. కాని, మొట్టమొదట్లో ఆమాట మనం అనడం ఏమిటి అనే అభిమానం పీడిస్తూంది. బోరిసోవుకూడా అదే ఊహిస్తూన్నాడు, పైకి అనడానికి అభిమానపడుతూన్నాడని ముఖకదళికవి పట్టి సులభంగా తెలిసిపోతూంది. ఇద్దరం పని మానలేదు.

పని పూర్తి అయ్యేదాకా ఇద్దరం కదలలేదు. అది అయినాక పొయ్యివద్ద కాచుకోనే వుద్దేశ్యంతో ఇద్దరం ఒకేమారు క్రిందికి వురికేము. కాని, వెంటనే అటువెళ్ళలేదు. ఇంతకష్టపడి సరిచేసిన ఈమహాయంత్రాన్ని నాలుగుమూలలనుంచీ చూడాలని కోరికకలిగింది. సగర్వంగా ఇంజనుచుట్టూ తిరిగి చిరునవ్వు నవ్వుకున్నాం.

మాఇంజను ముందరభాగాన తోరణం—ఆతోరణంలో రాగిఅక్షరాలు ఉదయసూర్యుని లేయెండలో మిలమిలలాడిపోతూన్నాయి.

"ఈఇంజను కొలిమివారితో పోటీ చేస్తూంది."

—"ఒక్క నిముషం ఆలస్యం కూడదు—"

స్టేషనులోవుండేవారంతా ఇంజనువైపు ఎంతో ఆశ్చర్యంతో చూసేరు. ఇంజనుపైభాగాన కనపడే నలుపుమచ్చలకేసి చూసి 'అయ్యో! అక్కడ మకిలివుండిపోయిందే'— అనుకుంటూన్నారు.

నిజానికి అవిమచ్చలుగావు. నీడలుమాత్రమే. నీడలుకూడ కనబడే ంత స్వచ్ఛంగా తయారుచేసేము ఇంజనుని.

మూడు తొట్టెలతో కొలిములవద్దకి బయలుదేరేము. ఆతొట్టెలు నింపుకొనడానికి రెండునిముషాలకంటె ఎక్కువ పట్టగూడదని మాసోషలిష్టుఖరారునామాలో ఒకహంశం.

నేను బయలుదేరడంతోనే రైల్వేకూలీలుకూడా బయలుదేరేరు. తమతమపనులలోకి పోతూన్నట్లు నటిస్తూన్నా వారు నాపను పరీక్షించడానికి ఆమూలకే వస్తూన్నారు.

నిగనిగలాడిపోతూన్న ఇంజనుమీద ఒకవైపున బంగారుఅక్షరాలలో దాని సంఖ్య మిలమిలలాడుతూంది—No. **20.**

మేస్త్రీలు–కొలుములవాళ్లు –మిగిలినకూలీలు ముడియినుము గడ్డలమీదనిలిచి రేలింగులమీదికి వొంగి నావైపు తొంగి–తొంగి చూస్తూన్నారు. బొంతరేగిపోయిన టోపీ చేతబట్టుకొని దానిమీద వేళ్ళతో దువ్వుతూ క్రామరింకో నాపెదవులకేసి–ఇంజనుచక్రాలకేసి, "రెగ్యులేటరు'మీదనున్న నాచేతికేసి మార్చిమార్చి చూస్తూన్నాడు.

ఆతనికంగారుచూచి –'భయపడకయ్యా! ఇన్నాళ్లూ ఈపని సాధించడం ఏలాగా అనే ఆలోచిస్తూన్నాను. నాకు ఉపాయం తట్టింది. చేయవలసిన పనంతా నాకళ్ళకి కట్టినట్లున్నంది చూస్తూ వుండు!"–అనుకున్నాను. ఇనుముప్రవహించే గొట్టాలు ఎంత దూరం వున్నాయో కళ్ళతో కొలుచుకున్నాను. ఒక్క అంగుళం వెసిగిపోకుండా తొట్టెలుసరిగా వానిక్రింద నిలపాలి. బ్రేకులువదల

కుండానే దూరంచూసుకుంటూ రెగ్యులేటరు కొంచెంకొంచెం తెరుస్తూ ముందుకువచ్చేను. ఆపడానికి 'సిగ్నలు'ఇచ్చేరు. వెంటనే బ్రేకులువేసి, ఆవిరి కట్టేసి ఇంజనును నిలబెట్టేను. అది బుస్సు మంటూ రాయిలా నిలబడిపోయింది.

రెండువందలయాభై టన్నుల ఇనుపసీరును భరించగల తొట్టెలు రెండునిముషాలలో అమర్చబడ్డాయి. అంతక్రితం ఈపనికే అధమపక్షం పదిహేనునిముషాలు పట్టేది.

పైకి ఎవ్వరూ నన్ను అభినందించకపోయినా వాళ్ళమొగాలలో నామీదగల ఆదరం వ్యక్తం అవుతూంది. వారిపెదవులమీది చిరునవ్వులే ఆవిషయాన్ని వ్యక్తంచేస్తూన్నాయి.

ఇంతవరకు జరిగినాకనైనా నాఆతురత తగ్గుతుందనుకుంటే ఆలాగజరగలేదు. ఎందుకోగాని మనసు కంగారుపడుతూనేవుంది. తొట్టెలలో ఇనుము నిండేలోపున సిలెండర్లలో ఆవిరినింపుకొన్నాను. బోయిలరులో నీరునింపుకొని, పొయ్యిలోకి బొగ్గులు వేసేను. నామనసులోని అదటును ఆదికూడా పంచుకుంటూ వున్నట్లు ఇంజను వణుకుతూ తొట్టెల ప్రక్కన నిలబడియుంది.

'సిగ్నల్' ఈయగానే ఈలకొట్టి, ఆవిరివొదిలి, బండిని కదిపేను. స్టేషనుఈవలనున్న 'లైట్-సిగ్నల్' దగ్గిరికి వచ్చేటప్పటికి మూడునిముషాలే పట్టింది. ఇదివరకు ఆదూరం నడవడానికే పది నిముషాలు పట్టేది. ఒక్కొక్కప్పుడు అరగంటదాకా సిగ్నలుకోసం అక్కడ కూర్చోవలసివచ్చేది. ఇప్పుడుకూడా అంతే జరగదుకదా

యని కిటికీలోంచి తొంగిచూచేను. ఎరుపుదీపం? ఔను.రక్తపుచుక్క వంటి ఎరుపు. ఆగమని సంజ్ఞ! చచ్చేం! ఎంత తొందరపడ్డా ఆలస్యం తప్పిందికాదు.

ఇంక ఏడేనిముషాలు. కర్మాగారంలో ఆమూల వందలకొలదీ కూలీలు నారాకకోసం ఎదురుచూస్తూ నిలబడతారు. నేను వెళ్ళేటప్పటికి తొట్టెలు చప్పగా చల్లారిపోతాయి. 'క్రేన్'వచ్చి తొట్టెల్ని అచ్చులమీదికి వంచేలోపుగానే ఇనుమంతా బిగిసి గడ్డకట్టిపోతుంది.

ఇంజనును బోరిసోవు స్వాధీనంలోవుంచేసి నేను స్టేషనువైపుకు పరుగెత్తేను.

ఆఫీసులోవున్న గుమాస్తా చెడత్రాగి— కాళ్లు మేజామీదికి బారచాపుకొని తాను మాటలాడుతూ—మాటలాడుతూ ఒక్కగుక్కలో సిగరెట్టు ఊదివేయగలనని కోతలు కోస్తున్నాడు. డ్యూటీలోవున్న మనిషి గుడ్డిఈగలు దూరేలాగ నోరుతెరచి, ఆశ్చర్యంతో ఆకథుర్లు వింటూ రైలు సంగతే మరిచి పోయేడు.

నేను వాడిమీద విరుచుకుపడ్డాను. ఆకోపంలో వాడిదవడ ఎగరకొట్టేవాడినే. కాని, పనిఅవసరం గుర్తించి కొంచెం వస్తాయించి, వాడిచేతిలోనుంచి 'అధికారచిహ్నం' లాగుకొని వెనకకి పరెగెత్తేను.

అయిదునిముషాలలో మాబండి 'క్రేన్'క్రింద నిలబడింది. మొత్తం ఈపనులన్నీ జరగడానికి ఎనిమిదినిముషాలు పట్టింది; స్టేషనువద్ద ఆలస్యంఅయిన మూడునిముషాలూ కలుపుకుంటే.

తెల్లగా అలలుకొడుతూన్న ఇనుమునీటిని అచ్చులలోకి మర లుస్తూ, కూలీలు ఇన్నిమార్లు పత్రికలలో చూచినా ఏమీ జ్ఞాపకం లేనట్లు— ఎంతో ఆశ్చర్యంతో నాఇంజనునెంబరును పునశ్చరణ చేస్తూన్నారు.

....వారిలో ఉత్సాహం అంతకంతకి హెచ్చింది. ప్రతిపనివా నికీ— ప్రతిమేస్త్రీకీ— ప్రతిఇంజనీరుకీ— నాఇంజనునెంబరు మనస్సుకి పట్టిపోయింది. కొలిముల పెద్ద ఇంజనీర్లు నేనుకనపడ్డప్పుడు చిరు నవ్వుతో—'విశేషాలేమిటి?'—అంటూన్నారు. నేనుకూడా వారితోసమా నఫాయావారితో మాటలాడినట్లే మాటలాడుతూన్నాను. అటువంటి ఉత్తమస్థితికి తెచ్చిపెట్టిన నా శ్రమని నేను లెక్కచేయలేదు.

ఇనుమునీరు అచ్చులకి మరలించే కూలీలు నావద్దకివచ్చి. తమకి కాస్త సహాయం చేయమనీ, లేకుంటే పని మొండిపడిపోతుం దనీ కోరేరు. వారికి నామీద అంతనమ్మకం.

నేను ఇంజనును తొట్టెలవద్దకి తీసుకొనిపోయి, క్రిందికిదిగి తొట్టెలలో వేడి కొలుచుకొని, ఇనుము ఏమయినా దిగబడిందేమో చూసేను. తరువాత త్రాడు ఇంజనుకి తగిలించడంలో సాయంచే సేను.

అంతా సిద్ధం అయింది. కాని, నాకెవ్వరిమీదా ఆఖరుకి నామీ దనే నమ్మకంలేదు. స్వయంగా అన్నీ చూసుకొన్నాను.

'రెడీ'—అన్నారు కూలీలు.

ఇప్పుడు ఇంజను వెనకకి నడిపితే తొట్టెలు తిరగబడతాయి.

రెగ్యులేటరు తెరిచి గొలుసు లాగుకున్నాను. చిక్కని చిట్లపు ప్రవాహం 'లావా'మాదిరిగా భయంకరంగా తొట్టెలలోనుంచి ప్రవహించింది. ఆ'లావా' రైలుకట్టమీదపడి, పెద్దధ్వనితో ఆమంచుమీద నాలుగుమూలలకీచింది, ఎర్రని సంధ్యారాగంలో చీకట్లమాదిరిగా కళ్లు జిగాలుమంది.

తొట్టెలు శుభ్రంగా నిగనిగలాడుతున్నాయి. ఇంక నిశ్చింతగా కొలుములవద్దకి పోవచ్చును.

మాస్టోషలిస్టుఖరారారులోని ఆఖరుహంశంకూడా ఈవిధంగా నెరవేరింది. కాని, నామానసికోద్రేకం ఏమాత్రం తగ్గలేదు,

ఆరోజు సాయంకాలం పనిలోంచి ఇంటికి పోతూన్నాను. నాలుగోనెంబరు ఇంజనుప్రక్కనుంచి పోతూ డ్రైవరూ—అసిస్టెంటూ మోకాళ్ళమీదపడి ఇంజనుతుడిచి, మెరుగుపెట్టి, సుత్తితో టకటకా కొట్టి గట్టిపరుస్తూ పాడైనయంత్రానికి నవజీవం పోయడానికి తంటాలుపడుతూన్నారు.

వెంటనే నేను వారివద్దకుపోయి, దానిని బాగుచేయడానికి వారు చేస్తూన్నప్రయత్నాలలో సహాయపడ్డాను.

## ముప్ఫైఏడో
## ప్రకరణం

పెద్దముల్లు పన్నెండు అంకెను సమీపించబోతూంది. అది చూడగానే మనస్సుకు ఆరాటం—భయంకలిగింది. సరిగ్గా రెండు ముళ్లూ ఒకదానిపైకి మరొకటి చేరగానే కొలిముల వద్ద 'డ్యూటీ' లోయున్న ఇంజనీరు ఇనుమునీరును కాలవలలోనికి వదలడానికి ఆజ్ఞలిస్తాడు. కాని, అనుకున్నప్రకారం ఏవీ సిద్ధంగావుండవు. లోహం సిద్ధం అవదు. ఇంక క్రామరింకో సిగ్గుతో తలఎత్తలేక — "కాలవలు—కందకాలు తయారుకాలేదు. కనుక ఇనుము అప్పుడే వదలడానికి వీలులేదు." —అని పెదవులు చప్పరించవలసిందే.

ఆలాగే జరుగుతే ఇంజనీరుకి క్రామరింకోమీద ఏమయినా గౌరవం వుంటుందా? సంగిచూపులు చూసే ఆతాంబేలు బొమ్మక్రింద ఆతని బంటానెంబరు వ్రాస్తారు. ఆబ్రిగేడు వెనకబడిందని పత్రికలకి ఎక్కిపోతుంది.

అదే జరుగుతే ఇంక ఏమయినా వుందా? క్రామరింకోబంటా వారి పనికి నేనుపూచీపడ్డాను. పరస్పరసహాయాన్నిగురించి మేము ఖరారుచేసుకోలేదు?

ఇంజనుమరమ్మత్తులలో క్రామరింకో మాబ్రిగేడుయొక్క సహాయానికి వచ్చేడు. ఈవేళ కొలిములపని తెమలకుంటే నేను వెళ్ళవద్దు? ఈఅవమానం మాబ్రిగేడుకే కలుగుతూన్నట్లు నేను బాధపడు

తూన్నానా?-కాని, క్రామరింకోకి ఆవిషయం పట్టినట్లేలేదు. ఒక మూలనున్న రాతిస్తంభానికి జేరబడి ఏమిటోగాని తొంగిచూస్తూ న్నాడు. ఇనుమునీరు ప్రవహించవలసిన కాలువలనిండుగా చెత్త-చెదారం నిండివుంది. కాని, క్రామరింకో ఆవైపయినా చూడడం లేదు. ఆడపిల్లలాగ కనురెప్పలరమోడ్చి, కనుబొమ్మలెత్తి, సిగ రెట్టుచుట్టుకుంటూ హడావిడిగా ఉన్నట్లుమాత్రం కనిపిస్తూన్నాడు.

ఒకగంటక్రితమే 'బాబిన్' తనవంతు పూర్తిచేసుకొని పని వొప్పచెప్పివెళ్ళిపోయేడు. అప్పటికే కాలవలనిండా చెత్త-బూడిద చేరుకొనివుంది. గట్లు ఒక్కొక్కచోట చాలాబలహీనంగా వున్నాయి. ఈకాలవలగుండా నూటయేభైటన్నులదాకా యినుము ప్రవహించాలి. వీనిని బాగుచేసి గట్టిపరచకుండానే ఇనుము వదిలితే ఇంకనేమయినా వుందా? నెరియలు పగలగొట్టుకొని ఆప్రవాహం ముడిఇనుము నిలువచేసిన తొట్టెలలోకీ, రైలుబద్దెల మీదికీ ప్రవహించి వాటినన్నిటినీ ఒకేఒకదిమ్మగా మార్చేసి, కొలిమలపని నిలువబెడుతుంది.

ఈకొలిములన్నీ చల్లబడవలసిందేనా? 'కౌపరుష్టౌవు'ల పెద్ద పెద్ద పొగగొట్టాలు సమాధిరాళ్ళలాగ ఆకాశంకేసి చూస్తూనిశ్శబ్దంగా వుండవలసిందేనా? కూలీలంతా దిగాలుపడి అటూ ఇటూ తిరుగవలసిందేనా?

కొంతసేపటికి క్రామరింకో తలఎత్తేడు. కనుబొమ్మలు ముడివేసి చుట్టకొసకొరికి పుగాకు ఉమ్మివేస్తూహడావిడిగా బోదెలపైపునడిచేడు.

అతడు పనిలోకే వెడుతూన్నాడని నాకుతెలుసును. మంచిపే గంగా ఇనుముప్రవహించేటప్పుడే వాటిని సరిచేయాలని అతని అభిప్రాయం. కాని, ఆపనిచేయడానికి మనిషికి చాలాస్థైర్యం అవసరం. సగంశిథిలంఅయిన గట్లు బాగుచేయడానికి ఇనుపప్రవాహందగ్గిరిగా వెళ్ళాలి. సన్నగావున్న 'ఫైర్‌ప్రూఫ్' గోడల్ని పగులకొట్టుకొని ఆప్రవాహం ఏసమయంలోనైనా మీదవురకవచ్చును.

క్రామరింకో రెండుగునపాలు తీసుకొని, ఒకటినాకూ—ఇంకొకటి అసిస్టెంటయిన 'లెస్నికు' కూ ఇచ్చేడు. తాను బల్లెలాంటిది ఒకటితీసుకొని గట్లలో అవుకుగావున్న ప్రదేశం కనిపెట్టడానికి పొడవబోయి, ఎందుకోగాని, వెర్రిచూపుచూసి, బల్లెం వెనక్కి తీసుకున్నాడు.

అతడు మోకరిలబడిపోయి, నెత్తిమీదటోపీతీసి, చెమటలకి తడిసిని జుట్టు పవరాలు కొంగుతో తుడుచుకొంటూ కంగారుగా లేచినిలబడి పొగచిమ్ముతూన్న తనకాలిక్రంద మడమబూటుకేసి చూచుకొన్నాడు.

చాలాకాలంక్రితంనుంచీ నాకూ క్రామరింకోకీ పరిచయం వుంది. 'క్యూబాన్'నదీతీరాన, ఆతరువాత 'యూక్రెయిను'లో, ఇప్పుడు 'ఉరల్సు'లో ఇద్దరం ఒకేచోట వుంటూన్నాం. ఆరోజులలో అతగాడికి 'మూర్ఛరోగి' అనిపేరు. ఒకవిధంగా ఆతడికి మాదొంగ జట్టులో మంచిపేరేవుండేది. దొంగతనంచేస్తూండగా ఎవ్వరయినా చూచినట్లయినా మామూలుగా అందరిలాగా పారిపోవడానికి ప్రయ

త్నించేవాడుకాదు. గభీమని నేలమీద కుప్పకూలిపోయి, గట్టున పడ్డచేపలా గిలగిలా కాళ్ళుచేతులూ కొట్టుకొనేవాడు. జనంఅందరూ చుట్టూచేరి ఎంతోసానుభూతిచూపేవారు. మెత్తనిమనసువాళ్ళయితే ఆదృశ్యం చూడలేక కళ్ళుమూసుకొని పొయేవారు. కొంచెం గుండె నిబ్బరం గలవారు వెంటనే ఆతడిని హాస్పిటలుకి చేర్చేవారు.

ఆసుపత్రికి వెళ్ళేక క్రామరింకోకి తెలివివచ్చేది. లేచి నాలుగు మొగాలూచూచి, డాక్టరుకి ఒకసలాముకొట్టి, తనపూర్వపువృత్తి సాగించడానికి మళ్ళీ స్టేషనుకి చేరుకొనేవాడు.

ఈఅభినయంలో ఆతడికిగల చాకచక్యం మాఅందరికీ అసూయకలిగించింది. ఈయుక్తి పన్నగలగడంచేతనే ఆతడు ఎన్నడూ జైలుకి పోలేదు. పోలీసుగూఢచారులముందు చేతులు నలుపుకోలేదు. రిఫర్మేటరీస్కూలు సంగతి గ్రహించవలసిన అగత్యమూ కలగ లేదు.

మిగిలినవారుకూడా ఈయుపాయం అవలంబించడానికి ఎత్తులు వేసేరు. కాని, కుదరలేదు. ఆతనికిమాదిరిగా పెదపులు నల్లబరచి, నురగలుకక్కడం చేతకాలేదు. ఆఏడ్పులు-పెడబొబ్బలు పట్టుబడ లేదు. మధ్యలో కొన్ని ఏళ్ళపాటు ఆతడూ నేనూ ఒకచోటలేము. ఈ'ఉరల్సు'లోనే ఏదో 'శరణాలయం'లో ఆతడు చేరేడు.

మేము మళ్ళీ మాగ్నిటోగ్స్టార్యిలోనే కలుసుకున్నాం.

నేను సరాసరి నడిచివెళ్ళి బోదిగట్టున నిల్చున్న క్రామరింకోని సమీపించి ఒకసిగరెట్టు ఇచ్చేను. ఆతడు ఎంతో ఆప్యాయంగా తీసు

కున్నాడు. ఆతనికేసి చూసేటప్పటికల్లా వెనుకటిరోజులు, నల్లబడి పోతూన్న ఆమొగం జ్ఞాపకానికి వచ్చింది.

అసిస్టెంటు 'లెస్నికు' కంగారుపడుతూ అక్కడ నిలబడి యున్నాడు. ఆతడికి ఏమిచేయడానికి తోచడంలేదు. వట్టినే చూస్తూ కూర్చుండడానికి మనసువొప్పడంలేదు.

"ఏమిటి చేయమంటావయ్యా: క్రామరింకో!"

క్రామరింకో తానున్న చోటునుండి ఈవలికి ఉరికి సిగరెట్టు విసిరేసి మట్టిముద్దలు, పారలు, గునపాలు, తెమ్మనమన్నాడు.

"కదలండి: కదిలిరాండి."

ఒకమట్టిముద్దఎత్తి బోదెగట్టుమీద చరిచేడు. నేనాతనికి వెనక వైపున నిలబడి సాయంచేస్తూన్నాను. 'లెస్నికు'ఒక్కడే నిర్భయంగా నిలబడి మన్నుముద్దలు మెత్తుతూన్నాడు. నుదుటినుంచి చెమటలు ప్రవహిస్తూన్నాయి. తుక్కు—తుటారముతోనిండిన బోదెలోనుంచి ఏక్షణానైనా అగ్నిప్రవాహం విరుచుకొనిపడవచ్చు. కాని, ఆతనికి ఆదృష్టేలేదు. అక్కడనున్న అపాయం ఏమిటోకూడా ఆతనికి తెలియదనుకుంటాను. అందుచేతనే ఆనిర్భయం.

లెస్నిక్ వయస్సు ఇరవైమూడు ఏళ్లు. ఇంతకాలమూ సైబీరియన్ మైదానాలలో గొఱ్ఱెల్ని కాచుకొని బ్రదికేవాడు.

ఆతడు ఈకార్ఖానాలోకి వచ్చి ఎన్నోనెలలుకాలేదు. వచ్చిననాడు చూడాలి, ఆతనివేషం. వదులుగా, నేలనిఈడ్చుకుంటూన్న షరాయి చిరిగిపోయినజోళ్లు తొడిగేడు. తలదూరిపోయే పెద్దకిర్గిజ్‌టోపీ

పెట్టుకున్నాడు. ఎంతో బెదురుతూ: ఎంతో భయపడుతూ కనిపిం చినవారందరినీ నిలిపి కొలుములకి దారికనుక్కుంటూ వచ్చేను. రాగానే ఆతడికి అందులో పనిదొరికింది.

క్రామరింకో ఈకొత్తవానికి యంత్రాలయంఅంతా తిప్పిచూపిం చేడు ఇద్దరికీ మంచిస్నేహం కలిసింది. 'లెస్నికు' ఆతని వైపుకి బాగా ఆకర్షితుడయ్యేడు.

క్రామరింకో తానున్నచోటువదలి బోదెకి దగ్గరగా నిలబడి ఆనల్లనిగట్లవైపు ఎంతోదీక్షగా చూసేడు. ఎక్కడా అపాయ సూచనలులేవు. ఆతనికి ధైర్యం చిక్కింది. నెమ్మదిగా ముందుకి వచ్చి విరిగిపోయిన చక్రం బాగుచేయసాగేడు.

నేను చిట్లపుగడ్డలు తీసివేసి, కొత్తమన్నుతెచ్చి, కొలిముల వైపుకి చూడకుండా వెనుతిరిగి పనిని ఆరంభించేను.

లెస్నికు కాళ్లు ఎడగలగాపెట్టి నిలదొక్కుకొని వొంగిపని చేస్తూన్నాడు. నడ్డి ఎత్తడమేలేదు. బట్టలన్నీ బూడిదకొట్లాడుతూ న్నాయి. ఆలాగవొంగునే చిరునవ్వుతో మట్టిముద్దలు విసిరికొడుతూ మెత్తుతూన్నాడు.

లెస్నికు నిర్భయంగా నిలబడిపనిచేయడం, నేను ఇనుప గొట్టాలచాటున నక్కివుండడం నాకే సిగ్గుగావుంది.

కొంతసేపటికి క్రామరింకో నడ్డియెత్తి మండియినుమున్న తొట్టెలవైపూ, గడియారపు ముళ్ళవైపూ, నీరసంగా చూసి మనసు లోని ఆరాటాన్ని తగ్గించుకుందుకు ప్రయత్నిస్తూన్నట్లు —'సన్యా!'-

అన్నాడు.

ఆతనికంఠం అవసరమైనదానికన్న పెద్దగా వినిపించింది.కాని అంతలోనే సర్దుకొని చిరునవ్వుతో—"ఒకసిగరెట్టు ఈలాగ ఈయవోయి!"—అన్నాడు.

సిగరెట్టుపొగ వదలడానికి బదులు పెదవులు మూసుకొని మింగేసేడు. దగ్గనైనా దగ్గలేదు. ఒకపీల్పు పీల్చి కొలుములవైపు పరిశీలించేడు. ఎత్తుగా పొగలుచిమ్ముతూ నిలబడియున్న పొగగొట్టాలు ఆకాశాన్ని ధరిస్తూన్నాయా అనిపిస్తూన్నాయి.

మన్నుతోమెత్తిన బోదెగట్లని 'లెన్నికు' ఎఱ్ఱని 'కోకు'తో గట్టిపరుస్తూన్నాడు. క్రామరింకో అటుచూస్తూ నిలబడ్డాడు. కూలీలు కందకాలలోంచి చిట్లం లాగివేస్తూన్నారు. ఎనభయ్యేసిటన్నులు బరువున్న తొట్టెలని లాగితెచ్చి ఇంజనులు, గొట్టాలక్రింద అమరుస్తూన్నాయి.

గునపాలు దబ్బు—దిబ్బుమంటూన్నాయి. కూలీలు తమ ఫెల్టు టోపీలు మొగంమీదికంటా లాగుకొని పనిచేస్తూన్నారు. నీలిరంగు అద్దాలు ధరించిన మేష్త్రీ హడావిడిగా అటూయిటూ తిరుగుతూన్నాడు.

బోదెలు బాగుచేయమని తనఅసిస్టెంటుకి పప్పచెప్పి, క్రామరింకో తాను 'బ్రోషియస్— టా—ప్— మిషనుపైపు వెళ్ళేడు. ఆతడుమొదట్లో పనినేర్చుకున్నది ఏయంత్రసహాయములేని కొలుముల వద్దనే. అయినా ఇప్పుడు ఈకొత్తయంత్రాల్ని ఉపయోగించడానికి

ఏమాత్రమూ భయపడడంలేదు. ఏమంటే ఇక్కడికివచ్చిన మూడే ళ్లలోనూ, ఎంతో శ్రద్ధగా వాటినిగురించి చదివేడు. స్వయంగా చూసి నేర్చుకున్నాడు. తెలియనివి ఇంజనీర్లని అడిగి తెలుసుకున్నాడు. అతనికి అందులోవున్న ప్రతిచిన్నసీలను గురించీ అవగతం అయిపోయింది.

ఈకొలుములనుగూర్చి తెలు.కొనడానికీ—వాటిని సరియైన దారిలో పెట్టడానికీ అతడు ఎంతో కాలము, ఎంతో శ్రమ, వినియోగించేడు.

కాని, అదంతా ఇప్పుడు నిరుపయోగం అయిపోయినట్లు, దురవస్థలోయున్నట్లు; కనబడింది. 'ఏమిటాలోపము?'—అని జాగ్రత్తగా పరిశీలించి ఆలోచించేడు.

పరీక్షఆరంభించేడు. 'వాల్వులు' తెరిచి సిలెండర్లలోనికి ఆవిరి వదిలి వాటిని పరీక్షించేడు. కొలుములు చల్లారినాయేగాని, సరిగ్గానే పనిచేస్తూన్నాయి. తొట్టెలలోకి వదలిన ఇనుముసీరు చిరుఅలలు వేస్తూ బోదెలలో పరుగెడుతూంది.

క్రామరింకో శ్రద్ధగా పరిశీలించుకుంటూ తొట్టెలు నింపుతూ వాకేసితిరిగి— 'సన్యా! నువ్వూ— లెస్నికూ' పట్టిచవటలుగా తయారయ్యేరు. ఎవ్వరిపనివారు ఒకరిపేక్ష్యంలేకుండా చేసుకొనే తెలివేలేదు."— అన్నాడు.

వాకుమాత్రం చాలాఆవేశంకలిగింది. అతనితో వెడుతూన్నానని చెప్పనైనా చెప్పకుండానే బయలుదేరేను.

నేను కొద్దిఅడుగులు వేసి వెనుతిరిగిచూసేను. బోదెలుపొంగి ఇనుము నేలబడిపోవడం కనపడి, గబగబా కటకటాలమీదినుంచి ఉరుకుతూ అడ్డంగా ఆవైపుకి పరుగెత్తేను.

తొట్టెలునిండిపోయి ఇనుము నేలబడిపోతూంది. మేస్త్రీగార్బజు—ఇతరకూలీలు, ఆప్రవాహానికి ఇనుపరేకులుఅడ్డంపెట్టి 'రిజర్వు'లలోకి మళ్ళించడానికి తంటాలుపడుతూన్నారు.

నేనొక పారచేతిలోపట్టుకొని గార్బజు పార్శ్వాన నిలబడ్డాను. నాకు ఒకవైపున కొలిముులతో పదిహేనేళ్ల పరిచయంవున్న గార్బజు, మరొకవైపున గోవులుకాచుకొన్న 'లెన్నికు' నిలబడియున్నారు. మేము ముగ్గురము ఆఅగ్నితో చెరలాడుతూన్నాం. మధ్యమధ్య ఆనీరుచింది మాబూట్లవైపు, మొగంవైపు ఎగురుతూన్నాయి.

అది చూచేటప్పటికి మానాన్న పనిచేసిన కొలిములు జ్ఞాపకం వచ్చేయి. అబ్బ! ఎంతకాలం అయింది? —ఒకరోజున ఇదేమాదిరిగా అక్కడా జరిగింది. కరిగినయినుము గోడలు పగులకొట్టుకొని, బయటపడింది. కూలీలంతా ఎంతోసంతోషపడుతూ దూరంగా పరుగెత్తిపోయేరు.

కాని, ఇప్పుడు? పసులకాపరిదనంలోపెరిగిన 'లెన్నికు' నిర్భయంగా ఆప్రవాహాన్ని ఎదుర్కొని, దానిమార్గం మళ్లించడానికి తంటాలుపడుతూన్నాడు. ఆతనికి ఒకప్రక్క-ఇంజనీరు— నేనూను— కొలిములవద్ద కుటుంబాన్నంతనీ పోగొట్టుకొన్న నేనూను— నిల

బడ్డాము.

మాకష్టం ఫలించింది. లోహప్రవాహం ఇసుకతెరలమీద ఏమీ అల్లరిచేయకుండా ప్రవహించిపోతూంది. ఇప్పటికి నాకు క్రాము రింకో మాటలకి కలిగిన కోపంకూడా తగ్గింది. అతడు కుళాయి లికట్టేసి, ఒకపెద్దపొడుగాటిగొట్టంగుండా మన్నుముద్దలు తుపాకీ గుండ్లమాదిరిగా విసురుతూ వాటిద్వారాలు మూసివేస్తున్నాడు.

మాతండ్రి తనజీవితకాలంలో అనుభవించినశ్రమ క్రామురిం కోకిలేదు. ఇకముందు ఉండదు. ఏమంటే ఈతనికాలంనాటికి యంత్రాలు బాగా ఉపయోగంలోకి వచ్చేసేయి. ఇతగానికి గునపంబరువు తెలియదంటే ఆశ్చర్యంలేదు.

నేను అతనిదగ్గిరికివెళ్లి "ఏమోయి! ఇంకా మేమిద్దరమూ అప్రయోజకులమే అనే అంటావా?"— అనిఅడిగేను.

ఆతడుమాత్రం ఏమనగలడు. సిగ్గుపడ్డట్టుగా కొంచెం వెనకకి తగ్గి— కుళాయిదగ్గిర వొంటిని పట్టుకొన్న బూడిదనీ, కాలినచొక్కానీ, శుభ్రంచేసుకుంటూన్న 'లెన్నికు' వంక ఎంతోప్రేమతో చూసేడు.

## ముప్పైఎనిమిదో
## ప్రకరణం.

నగరసోవియటునుంచి ఒకదూతవచ్చి మేరియాగ్రిగరోనాకి ఒకనోటీసు అందించేడు. దానిమీద ఆమె సంతకంపెట్టి ఈయాలి. ఆమెదానిమీద గుర్తులుపెట్టి, చదవమని నాచేతికిచ్చింది. ఆదినాన జరగబోయే నగరసోవియటుసమావేశానికి మేరియాకూడా రావలెనని ఆనోటీసు.

ఆమె కంగారుపడింది, ఆవార్తవినగానే, కొంచెం ఆశ్చర్యం కూడాకలిగింది. —"వాళ్ళకి నాతో పని ఏంవుంది చెప్మా! అక్కడికి ఏలాగపోవాలో మార్గంకూడా నాకు తెలియదే."

ఆమె కంగారుగా కూర్చుంది. పిల్లివచ్చి కాళ్ళనిపెట్టి ఒరుసుకుంటూన్నా గమనించడంలేదు. ఈమధ్యని ఆమె దానివైపే చూడడంలేదు. దానివొంటిమీది బొచ్చుఅంతా రేగి బురదకొట్టుకొనివుంది. దానికి ప్రొద్దుటిపూట పాలు సాయంకాలం తిండి, పెట్టడానికి ఆమెకి జ్ఞాపకమే వుండడంలేదు.

ఆపిల్లి తనతిండి తానే చూసుకోవాలసి వస్తూంది. దానికళ్ళలో నిత్యమూ ఆకలిమంట ప్రజ్వరిల్లుతూవుంది. అదినిత్యమూ రాత్రి పూటవేటకి బయలుదేరవలసివచ్చింది. బయలుదేరుతూందికూడాను. నిన్నరాత్రి మంచంక్రిందదూరి నాలుగుకోడిపిల్లల్ని తినేసింది. కాని, మేరియాకి ఈగొడవేపట్టడంలేదు, ఆవిడకోడివిషయం చూడడం

లేదు.దావగామిగిలిన కోడిపిల్లలకిగింజలువేసి నీళ్లుపెట్టవలసినబాధ్యత బొగాటరీవుమీదనే పడింది. అప్పుడప్పుడు బోరిసు ఆపనిచూడడం వుండేది. కాని, అది చాలాఅరుదు.

ఈమధ్య బోరిసు తరుచుగా కనపడడమేలేదు. కొలుములకి ఇనుము సప్లయిచేయవలసిన పనిఅతనికికూడా వొప్పచెప్పబడిం దేమో ఇంక ఇరవై నాలుగుగంటలూ ఇంజను వదలడమేలేదు. ట్రక్కులలోంచి సరుకు దింపుకొనే కొద్దిసేపూ ఏబోయిలరుప్రక్క నో పడుకొని నిద్రపోతూన్నాడు. అంతే. ఇక్కడనున్న ఇంజను డ్రైవర్లలోకల్లా ఏడాదిపాటయినా అనుభవంగలవాడు అతడొక్కడే. మిగిలినవారం అంతా ప్రారంభకులం ఆతనికి తనఇంజనుమీద వెర్రి అభిమానం.

ఒకరోజున ఆతడు జ్వరంతో మంచంమీద పడుకున్నాడు. ఏలావున్నాడో తెలుసుకుందామని నేను ఆతనివద్దకు వెళ్ళేను. ఆతనిగుండెలు ఆరిపోయివున్నాయి. చేతులు వచ్చగావున్నాయి. ముఖాన జ్వరతీవ్రత స్పష్టంగా కనిపిస్తూంది.

"బోరిసు....బోరిసు."

ఎంతోకష్టంమీద గుంటలుపడిపోయిన అనల్లనికళ్ళతో నావై పుతిరిగి చూసేడు. కళ్లు వీలాలు క్రమ్మినట్లుగా వున్నాయి. నోట వెంట ఒకపలుకయినా ఆడలేదు. కాని, ఆచూపులే నీకేం ...లా వున్నట్లున్నాయి.

నేనేమీఎత్తుకోలేదు. చల్లగాపోయి మేరియాగ్రిగనాతో

ప్రసంగించి, రోజూ కోడిగుడ్లు కలిపిన పాలు ఆతనికి ఇచ్చేలాగ ఒప్పించేను.

కాని, ఆమె తనవాగ్దానం నిలుపుకొనలేకపోయింది. పాలదు కాడానికి పరుగెత్తితెచ్చి, కాచి నేనే ఈయవలసివస్తూంది. బోరిసు ఈమూడురోజులనుంచీ మంచంపట్టి లేవలేనిస్థితిలో వున్నాడు.

ఇంక మేరియా ఇంటిపట్టున వుండడమేలేదు. తనబాధ్యత లన్నీ కొత్తగా ఇంటికివచ్చిన తనవారికి వొప్పచెప్పి, గదులకి గిలా బాచేయడం, రంగులువేయడం, నేర్పుతూ బారక్సులో ఏదోమూల వుండిపోతూంది.

..... .. మైదానంమీదినుంచి వెచ్చవెచ్చని, పరిమళవంతము లయిన వసంతవాయువులు వీస్తూన్నాయి. మంచుమెత్తబడి నేల యంతా బురదఅయిపోవడంచేత బారక్సునిండా బురదే. వసంత వాయువులు పౌజలకి తమస్వగ్రామాలవిషయం జ్ఞాపకానికి తెస్తూ న్నాయి. సాయంకాలంపూట తరుచుగా వుండివుండి అకార్డియన్ మీద పాటలు వినబడుతూన్నాయి. ఇళ్ళకిబయలుదేరిన మిత్రుల నుంచి సెలవు తీసుకొనేటప్పుడు, వారిజట్టువారు వాయిస్తూన్న వాద్యాలు అవి.

బొగాటరీవు ఆజట్టునాయకునివద్దకువెళ్ళి మాగ్నిటోస్ట్రాయి వదలవద్దని కోరేడు.

పీటుగా పూటీలేకుండా గీసినగడ్డం అతడూ ఆజట్టునాయకుడు చేతిలోని పుస్తకం చప్పుడయ్యేలాగ మూసి బల్లమీద గిరాటుపెట్టి

మాటలకి అందుకున్నాడు. చేతలో అంత దురుసుతనం కనపడ్డా ఆతని పలుకు ఎంతో శాంతంగా వుంది.

"బాగానేవుందిగాని, 'మైకేల్ నికోలాయీవిచ్!' ఇదిగో ఇల్లా గవిను: నేను పల్లెటూరినుంచేవచ్చేను. అయినా నేనూ మనిషినే అనేవిషయం మరిచిపోబోకు. ఈఏడాదిలోనూ మాకు కలిగిన సౌకర్యాలు ఏమిటి? ఇదేమయినా తేనెపట్టుగాని, మనుష్యులుండే 'బారక్సు'లావుందా? గోడలుచూడు. కాపురంవుండే యిళ్లే శుభ్రంగా వుండకపోతే మేమిక్కడ ఎందుకు వుండడం?"

వెంటనే బొగాటరీవు ఆతనిమాటల్ని ప్రత్యాఖ్యానం చేసేడు.

"జికిన్! నీవు చైతన్యంగల కార్మికులలో ఒకడివి. అగునా కాదా? ఇప్పుడు ఆరంభించు. ఇక్కడ ఎన్ని ఇళ్ళు, ఎన్ని బారక్సు వున్నాయో ఉజ్జాయింపుని చెప్పు. అధమం ఏభై వేలయినా వున్నాయి ఒక్కొక్క ఇంటిని గిలాబాచేసి రంగువేయాలంటే అధమం పదేసిమందయినా వుండాలా? అంటే కొంతకాలంపాటు ఈగిలాబాలకోసం కార్ఖానాలన్నీ మూసెయ్యాలి అక్కడికీ చాలరు. పాఠశాలలలోనుంచి పసిబిడ్డల్నికూడా లాక్కురావాలి. అంతేనా?"

........ఈసంభాషణకి ఫలితంగా మాపార్టీసమావేశంలో ఒక తీర్మానం చేయబడింది. ఇళ్లుబాగుచేయాలి.

ఆపనికి మొట్టమొదట మేము ముగ్గురమే —బోరిసు—బొగాటరీవు—నేను మాత్రమే—మిగేము. మన్ను, ఆడుసు, సున్నం, అవసరములయిన ఇతర పరికరాలు తయారుచేసుకున్నాము. ఆటుతరువాత

జట్టునాయకుడు 'జింకిణ' తనవారిని వెంటబెట్టుకొని మాకు సాయ పడడానికి వచ్చేడు.

బొగాటరీవు పదునైన తొళ్ళకతో గోడలపైమన్ను గోకి వేసేడు. మేము మెత్తడం ఆరంభించేము. కాని, ముద్దలకి ముద్దలు మన్ను రాలిపోనారంభించింది.

........మేరియా చూస్తూ ఊరుకోలేక బట్ట ఎగకట్టి, తాను పనిలోకి సిద్ధం అయింది.

"ఏమిటాపని? మీతలకాయ! చెక్కపేళ్ళలా చేతులూ మీరూ పనేమిటి? ఇల్లా నెమ్మదిగా చరిచి మెత్తాలి."

మొదట్లో మాకు పని నేర్పడంకోసమే ఆమె బురదలో దిగి-నా సాయంకాలంవరకూ మళ్ళీ కదలలేదు.

........మాబారక్కు పనిపూర్తి అయింది. మాచుట్టుప్రక్కలఇళ్ల ఆడవాళ్ళు గిలాబాచేయడంలో సిద్ధహస్తులమనే అభిప్రాయంతో తమరికికూడా పనినేర్పమనీ, తమఇళ్ళకూడా బాగుచేసిపెట్టమనీ వెంటపడ్డారు. బొగాటరీవు వాళ్ళకి మేరియాను చూపించేడు.

మేరియా వాళ్ళవంక ఆశ్చర్యంతో పరిశీలించిచూసి, చీవాట్లు పెట్టడం ఆరంభించింది. కాని, వాళ్ళువదలలేదు. తమకు ఆపని చేసిపెట్టాలని కూర్చున్నారు.

"మీకు చేతనైన పనివాళ్ళువచ్చి గిలాబాచేసిపెట్టాలనే అభిప్రాయంవుంటే చాలాకాలం ఈలాగే కనిపెట్టుకొని ఉండవలసి వస్తుంది. అందుచేత మీఅంతమీరే బట్టలు ఎగకట్టి పనిలోకి

విగండి, మరి." అనిసలహా ఇచ్చింది.

వచ్చిన ఆడవాళ్ళందరికీ ఆపని నేర్పడానికి ఆమె పూనుకుంది. త్వరలోనే 'రైల్వేకాలనీ'అంతటా ఆమేపేరు వ్యాపించిపోయింది. అన్నిమూలలనుంచీ ఆమె సహాయంకోసం కబుర్లు రాసాగేయి. స్థానికపత్రికలు ఆమె చేస్తూన్న పనిమీద పేజీలకి పేజీలు నింపుతూన్నాయి.

........ఈరోజున ఆమె తన కార్యవేదికని నగరసోవియటు సంఘంఎదుట ఈయడంకోసంకాబోలు పిలువనంపేరు.

నేను బట్టలువేసుకొని ఆమెని నగరసోవియటుకార్యాలయానికి తీసుకొనిపోయేను. అధ్యక్షుని ఆఫీసుగదిలో సమావేశం జరుగుతూంది. లోపల ఏమిజరుగుతూన్నదీ వినాలని నేను ద్వారంవద్ద నిలబడ్డాను. కానితలుపులు దళసరిచెక్కలతో చేయబడడమేకాకుండా, తోలుకూడా ముడిచివుండడంచేత లోనిమాటలు బయటికి వినబడేటందుకు అవకాశాలులేవు. మధ్యమధ్య వినబడిన ఒకటిరెండు మాటలవలన ఆమె నివేదికను కమిటీవారు తీసుకొని, నగరసోవియటులోని స్త్రీశాఖకి ఉపాధ్యక్షురాలినిగా ఎన్నుకున్నారని గ్రహించేను.

మూడురోజులుపోయేక సోషలిష్టునగరంలో ఒకయింట్లో నాకు బసకి ఒకగది ఇచ్చేరు. అమరునాడే బోరిసూ–నేనూ మకాం మార్చివేసేము.

## ముప్ఫైతొమ్మిదో

## ప్రకరణం...

ఒకకల........

..........పరిచితమైన మధురస్వరంఒకటి 'లౌడ్—స్పీకరు' యొక్క నల్లని ముఖంనుంచి బయలుదేరి కుశలం ప్రశ్నించింది. వెంటనే నాకు తెలివివచ్చింది.

"కుశలమా? కామ్రేడ్స్" రాత్రి బాగా నిద్రపట్టిందా? నిద్రలో భయంవేయడం—చెడుకలలురావడం ఈలాంటిది ఏమీలేదుగదా? రాత్రి బాగా నిద్రపట్టకపోతే మొదటి అంతస్థులోవున్న డాక్టరుగదికి వెళ్ళి ఆయన సలహా తీసుకోండి."

అవసరంలేదు. నాకు డాక్టర్లతోపనిలేదు. నేను మాంచి ఆరోగ్యంతో ఆనందంగా కాలంగడుపుతూన్నాను. రాత్రిదుస్తులతోవున్న నేను కప్పుకున్న దుప్పటీ తొలగించి గభీమని మంచందిగేను.

డాబాముందర కుండీలతో పెట్టబడిన పువ్వులమొక్కలతీగలు బిగిబిగిగా అల్లుకొని, పందిరిమీదికి ఎక్కినాయి. వాటిక్రింద పక్క పరుచుకుంటే ఉద్యాన[illegible]ంలో వున్నట్లేవుంది. చూరుకివేసిన సున్నపుపట్టీలపై[illegible]ుగునా దళసరి గాజుపెట్టెలు అమర్చబడి, ఒక 'ఆక్వేరియం' తయారుచేయబడింది. వానిలో అనేకరకాల రంగు రంగుచేపలు ఈదులాడుతూన్నాయి. దూరాన్నుంచి చూస్తేనల్లని

ఆకాశానికి రంగురంగుపువ్వులు అద్దినట్లుగా కనిపిస్తున్నాయి ఆ చేపలూ—ఆతొాటైలు.

రాత్రి పడుకోబోయేముందు నిలువెడేసి కిటికీలమీద దళసరి తెరలు దింపి, ఊదారంగుబల్బుస్విచ్ నొక్కి మంచంచేరేను. పైన కప్పులోవున్న అద్దంలోనుంచి నీలాకాశం, మిలమిలలాడుతూన్న నక్షత్రాలతో నావయిపు చూస్తూంది ఆక్వేరియంలోని బంగారురంగు చేపలు అడుగుకిచేరి కదలకుండా ఊరుకున్నాయి. పరిసరాలన్నీ చూస్తే సముద్రతరంగాలమధ్యనున్న ఒకఎత్తయిన పర్వతంమీద పూవులతోటలమధ్య పడుకున్నానా అనిపించింది. వినీలాకాశం తన విశాలకాయాన్ని నాపైన పరిచింది.

నేనులేచేటప్పటికి సముద్రతరంగాలలోని దీప్తి, పర్వతాల ఔన్నత్యం, ఆకాశంయొక్కస్వచ్ఛత నాప్రతినరంలోనూ పొంగుతూన్నట్లు అనిపించింది. ప్రతివుదయం మంచందిగేటప్పుడు అటువంటిఆనందాన్నే అనుభవిస్తూన్నాను.

ప్రతిరోజూమాదిరిగా ఈరోజునా అదే అనుభవం.

రాత్రిదీపం ఆర్పేసేను. కిటికీమీద జార్చిన తెరలుఎత్తి సూర్యకాంతికి గదిలో ప్రవేశం ఇచ్చేను. పక్కచుట్టివేసి అలమారులో పెట్టేసి, స్నానపుగదికి చేరుకున్నాను.

ఒడలంతా దళసరితువ్వాలుతో రుద్దుకుంటూ స్నానంపూర్తి చేసేను. 'ఎలక్ట్రిక్‌డ్రైయ్యరు' క్రింద జుట్టు ఆరబెట్టుకొని, తాలింఖానాలోకివెళ్లి మాస్కో-బ్రాడ్-కాస్టింగు స్టేషనునుంచి ప్రచారంచేసే

పద్ధతులననుసరిస్తూ కసరత్తుచేసేను. తాలింఖానాలో జనంఅంతా చిన్న వారే వారిలోకల్లా నేనొక్కడినే వయసువచ్చినవాడిని. కాని, నాకు వయస్సుతో పనిలేదు. దానిని, మరిచిపోయి చాలాకాలం అయింది.

భోజనశాలకి చేరుకొనేటప్పటికి గుమ్మందగ్గరనే లౌడ్—స్పీకరులోంచి డాక్టరుగారి సలహాలు వినబడ్డాయి.

"ప్రతిరోజూ మీరు తింటూన్న పదార్థాలేమిటి? నిన్నను ఏమిటి తిన్నారు? రోజూ మాంసంతించే ఆరోగ్యంచెడుతుందనేవిషయం మరచిపోకండి, పొద్దుట పాలు—కోకో, తీసుకుంటూ వుండండి. బాగా ఉడకపెట్టినగుడ్లు మంచిపుష్టిని ఇస్తాయి. పళ్ళు అధికంగా తినాలి. పండ్లరసం జఠరదీప్తిని కలిగిస్తుంది. ఆకలితగ్గిందంచే వెంటనే తగుజాగ్రత్తతీసుకొనండి."

"ప్రొద్దుటిభోజనం అయినాక నీకిష్టమయిన పదార్థాలు మధ్యాహ్నానికి పురమాయించడం మరిచిపోబోకు."

భోజనం అయింది. తరువాత 'సాంఘికసేవాకార్యాలయం' లోకి వెళ్ళడానికి 'లిఫ్టు'నెక్కేను. అక్కడ క్షౌరం చేయించుకొని కొత్తస్యూటు వేసుకొని ప్రొద్దుటిపత్రికలు చదువుకొని, రాత్రినాటకానికి టిక్కట్లు తీసుకొని, 'లిఫ్టు' దిగేను.

నేను నడుస్తూన్న రోడ్డు 'బెల్జియన్ అడవుల' వైపుగా పోతుంది. ఆఅడవులన్నీ నేడు ఉద్యానవనములుగా మార్చబడిపోయినాయి. రోడ్డు చాలాశుభ్రంగా— నున్నగావుంది. అప్రక్క—ఈప్రక్కన చెట్లు నీడకలిగిస్తూన్నాయి. ఆపార్కులకి కుడివైపుగా

పోషలిస్టునగరం వుంది. ప్రతియింటికీ చుట్టూ పువ్వులతోటలు—పొదరిళ్ళు—ఆటస్థలాలూవున్నాయి. దానికి ఎడమవైపున 'బ్లూ—నది' స్వచ్ఛమైన నీటితో ప్రవహించిపోతూంది.

ఇక్కడనే నామకాం. నామకాంమీద నాకు చాలాఅభిమానం సుమండీ. నేనీప్రదేశానికి బాగా అలవాటుపడిపోయేను. ఈనగరంలో మొట్టమొదట పుట్టినవాడు నాకొడుకే. ....కాని, ఈప్రదేశంలో ఒకనాడు గతించిన వ్యక్తులయొక్క, ఆనాటి చరిత్రయొక్క స్మృతియెన్నడూ నామనస్సులోనుంచి తొలగదు.

ఆనాడు పనిలోకివెళ్ళడానికి ఇంకా ఒకగంటపైగా విరామం వుంది. అందుచేత ఈలోపుగా ఒక'చక్కర్' కొట్టివద్దామని బయలుదేరేను. వెళ్ళేటప్పుడు మోటారుతీసుకొని బయలుదేరలేదు. ఆనగరముయొక్క పూర్వచరిత్రనంతనీ జ్ఞాపకానికి తెచ్చుకుంటూ నడిచిపోతూన్నాను.

ఎదురుగా ఒకమెట్టమీద సిమెంటుతోకట్టిన ఫ్యాక్టరీవంటశాల పెద్దది ఒకటివుంది. కిటికీతలుపులకున్న అద్దాలు సూర్యకాంతిలో మిలమిలలాడిపోతూన్నాయి. పూర్వం కసాయిదుకాణం ఇక్కడనే వుండేది. ఆదుకాణంలోనుంచి వచ్చిన మురుగునీరు అంతా 'పందులదొడ్డి' వీధులమీదప్రవహించేది.

కొంచెందూరములో అదిగోఆమూల ప్నానాలకి చెరువులు, ఆటప్రదేశాలు, వున్నాయి. వాటిప్రక్కన ఆతెల్లగా కనిపించేదే హాస్పిటలు. సరిగ్గా ప్రదేశంఏదో చెప్పలేనుకాని, —ఈనాడు ఆపవీ్క్ష

గుర్తించేస్థితిలో లేవులెండి— సుఖరోగాలకీ—గర్భపాతాలకీ మందు లిచ్చే ముసిలి'బందూరా' ఆప్రాంతాలనేవుండేది.

ఒకప్పుడు అగనెసోవ్వుయొక్క—పానశాల—వ్యభిచారగృహము ఉన్నచోట నేడు రంగురంగులచలువరాళ్ళతోకట్టిన 'విజ్ఞానమందిర' శిఖరాలున్నాయి. దానిప్రక్కనే సోవియటుకార్యాలయం. దానితరువాత శాస్త్రప్రవీణుల మందిరాలు.

ఈమూలనే ఎక్కడనో 'బురదగుంట'వుండేది. ఫిట్టర్లు—మైనర్లు—ఫర్నేస్‌మెన్—వగైరాజనం నివసించే ఆమట్టిగుడిసెల ప్రక్కనే నగరంయొక్క మురికినంతనీ తెచ్చిపోసేవారు. ఆరోజులలో గనివున్న ప్రదేశానికి పదిమైళ్ళలో 'సూర్యంకా' వ్యర్థంగా ప్రవహించిపోతూండేది. ఇప్పుడు దాంట్లోంచి ఒకపెద్దకాలువ తవ్వి బురదగుంటలోకి తీసుకు వచ్చేము. దీనినే 'బ్లూ' నది అంటాము. ఆకాలవవలన నగరానికి ఎంతోఅందము ఎంతో కాంతి వచ్చింది.

నేను ఆనదిగట్టుననే కొంతదూరం నడిచేను. అతినికృష్టములు—హేయములునైన పూర్వకాలంనాటికూలీజీవితాన్ని వ్యక్తపరిచే వస్తువుల్ని ప్రదర్శించడానికై అక్కడ ఒకమ్యూజియం కట్టేరు. సోషలిస్టునగరాన్ని నిర్మించేముందే సోవియటుకమిటీవారి ఆదేశం ప్రకారం 'బురదగుంట'లో మొట్టమొదటిమారు కాపురానికివచ్చిన 'నికనేరు'యొక్క మట్టిగుడిసె ముట్టుకోనకుండా అలాగే వుంచివేసేరు.

నేను గుడిసెలోపల అడుగుపెట్టేటప్పటికి 'పందులదొడ్డి' వాసనలకి తలతిరిగిపోయింది. హృదయంలో చెప్పజాలని బాధ ఒకటి బయలుదేరింది. అబ్బ! ఈప్రదేశంలో రోజ_స్తమానమూ ఏలాగ వుండగలిగేవాడినో? ఆకుంటి బల్లచుట్టూ ఆకలికి నకనక లాడుతూ ఏలాగ కూర్చుండేవారమో?

నేడుఆబల్లమీద కొన్నిఅక్షరాలు వ్రాయబడియున్నాయి.

"మాంసం—పాలు— ఏలాగవుంటాయో ఈబల్ల ఎన్నడూ చూడలేదు. నాటా—నూటామాత్రం రొట్టె—దుంపలు—కాబేజీ—ఉప్పులో ఊరబెట్టిన 'హెర్రింగు'లూ చూసింది. అంతే.''

ఒకమూల నికనేరు తాతయ్య జీవితంచాలించిననాటి కొయ్య మంచం, దానిమీద నల్లగావున్న బల్లచెక్కలు వున్నాయి. గరుకుగా వున్న ఆబల్లల పైభాగాన రెండుచిన్నమాటలు.

"గనిలో చేసిన అధికశ్రమకారణంగా నికనేరుకి మొట్టమొదటిమారు మూర్ఛవచ్చినది ఇక్కడనే. మతిచెడి పక్షవాతంతో తీసుకు—తీసుకు చచ్చినదికూడా దీనిమీదనే."

గోడకి ఒకమేకున రెండుచిరిగిపోయినబూట్లు. వాటికి ఒక కాగితం వ్రేలాడుతూన్నాయి. దానిమీద.—

"నికనేరు కుటుంబం అంతటికీవున్న ఒకేఒక బూట్సుల జత."—

పొగచూరి నల్లబడిపోయిన ఆపెద్దఆవం ఒకమూలగావుంది. దానిమీద పెద్దపెద్ద అక్షరాలతో కొన్నిమాటలు.—

"ఈచీకటికోణంలోనే నికనేరుమనమలు నిద్రపోయేవారు. వాళ్ల ఈచీకటిలోనేబ్రదికేరు. ఒకరోజుప్రొద్దుటే వాళ్ళు చచ్చిపడి వుంటే తీసి పారవేసేరు.''

కరడుగట్టిన రక్తపుమరకలతో ఎర్రనినక్షత్రపు గుర్తుగల టోపీఒకటి ఒకమూల వేల్లగట్టబడింది.

"బురదగుంటలోని కూలీలని తిరుగదీసి, కోమా షాహుకార్లు నివసించే 'సన్నీ-సైడ్' మీదికి దాడిబయలుదేరేడు. ఆతనిని కోవక్కసిపాయీలు చంపేరు."

ఒకమూల మాసిపోయిన ఫోటోగ్రాపుఒకటి వ్రేలాడుతూంది. దానిక్రిందనున్న వివరణం ఇది.

యజమానులు వీధిపాలుచేసిన కూలీకుటుంబంలో ఆఖరువాడు. ఆతడు తరువాత ఒకదొంగగా మారేడు. బహుశా తన మిత్రులచేతులలోనో- లేకుంటే ఏదయినా తప్పుచేసేటందుకు ప్రయత్నించేటప్పుడో చంపబడివుంటాడు."

అబ్బ! ఘోరం. ఆగుడిసెలో వుండలేను. వెళ్ళిపోవాలి. రక్తం తలకి ఎక్కిపోయింది. ఒకప్రక్కని గోడకి జేరబెట్టబడియున్న బొక్కెనగొళ్లెం చేతబట్టుకున్నా. దీనితోటే ఒకప్పుడు మాయమ్మ తాతయ్య వ్రేలికణపులమీదకొట్టింది. ఆస్మృతిఅంతా నామనస్సును బాధిస్తూంది. ఈమట్టిగుడిసెని-ఆబల్లలు, బొమ్మలు- విరిచి, ధ్వంసంచేసి నాలుగుమూలలకీ విసిరివేయాలన్నంత బాధకలుగుతూంది.

—హఠాత్తుగా వీధిద్వారంవద్ద పదేపదే కొడుతూన్న మోటారు హారన్ చప్పుడికి తెలివివచ్చింది.

నలభయ్యో...

ప్ర క ర ణ ం..

ధ్వనినిబట్టి డైరక్టరుది ఆకారు అని గుర్తించి వెంటనే తలు పుతెరిచేను. ముగ్గురుమనుష్యులు గదిలో ప్రవేశించేరు. యంత్రశాల డైరక్టరు, బ్లాస్టు–ఫర్నేసు అధికారి గార్బజు, కొలుములవద్దపనిచేసే క్రామరింకో.

గార్బజు గదిలో అడుగుపెడుతూండగానే సంభాషణకి ఆరం భించేడు. ఉదయకాంతులలో ఆతని బంగారుకట్టుడుపళ్ళు మిలమిల లాడుతూన్నాయి.

"సన్నా! ఇనుములేదు. రెండురోజులనుంచి, కొలుములపని నిలచిపోయింది."

గార్బజుమాట ముగియకుండానే డైరక్టరు అందుకున్నాడు.

"లైన్లన్నీ మంచుతో కప్పడివున్నాయి. నిన్నటిప్రమాదం జరిగినాక ఒక్కడూ కొండక్రిందికి బండితీసుకొనిరావడానికి అంగీ కరించడంలేదు. వాళ్ళ తప్పులేదనుకో. కాని, కొలుములకి కొద్ది పాటిఇనుమయినా లేకుండావచ్చింది."

డైరెక్టరు ఆతురతతో మోకాళ్ళు బల్లనిపెట్టి కొడుతూన్నాడు కాని, నేనాతనికి వెంటనే సమాధానం ఈయలేకపోయినాను. నామనస్సులో నిన్నటి ఘటనావిశేషాలు పరుగులు పెడుతూన్నాయి. ఏమంటే నిన్నటిప్రమాదానికి పాల్పడ్డవాడు స్వయంగా బొగాటరీవే

ఇంజను వశం తప్పింది. రైలుబద్దెలన్నీ మంచులో పూడిపోయివున్నాయి. బండికి వెర్రివేగం అందుకుంది. బ్రేకులుకూడా ఉపయోగించలేదు. గాలిబొమ్మలాగ విసురుకువచ్చి ఆబండి స్టేషనులోవున్న పెట్టెలమీదపడి వాటిని విరిచి ముక్కలుచేసింది ఆతనికిగల ముప్ఫైయ్యేళ్ళ అనుభవమూ గవ్వకికూరలేదు. బద్దెలుతొలిగిపడిపోయినఇంజనుకి ఇరవైగజాల దూరంలో నోటమాటలేకుండా బొగాటరీవు పడిపోయేడు.

వెనుకటిరాత్రి బండినడపడానికి పంపించేరు, ఆతనిని. మాకెవ్వరికీ ఆట్టే అనుభవమూలేదు. అటువంటి మంచుగాలిలో ఇంతవరకు బండినడపనూలేదు. ఆదికూడా నేర్చుకోవాలని చూస్తూన్నాం. ఇంతలో బొగాటరీవు ప్రాణాలతో బయటపడ్డాడు.

ఆవార్త వినగానే ఆతనిని చూడడానికి పరుగెత్తేను. కాని, ఆతడు నాకేసి చూడడానికే చాలాసిగ్గుపడుతూన్నట్లుతోచింది. గోడవైపుకి మొగ్గం తిప్పుకుందుకు ప్రయత్నించేడు. కాని, వీలుపడక బాధతో మూలిగేడు. నాకు ఆతని సామర్థ్యంలో విపరీతమయిన నమ్మకం వుండడంచేత, ఆఅవస్థలోవుండగా నావయిపు చూడడానికికూడా సిగ్గుపడాడు.

అటువంటిది ఇప్పుడు ఈడైరక్టరు—ఇంజనీరూ ఆ స్థానం నన్ను తీసుకోమంటూన్నారు.

నేను గోడబెల్లులు గోళ్ళతో గిల్లుతూ, దిక్కులుచూస్తూ నిల బడ్డాను. గార్ఫజుతొడిగిన తోలుకోటుయొక్క కిరకిరలు, డైరక్టరు పొగాకుపైపు పీల్చేటప్పటి 'ప్చ్—ప్చ్' ధ్వనితప్ప ఏవిధమైనధ్వనులూ వినబడడంలేదు.

అంతవరకు నిశ్శబ్దంగా నిలబడియున్న క్రామరింకో సాగుండె లమీదతట్టి.

"ముసుగులో గుద్దులాట ఎందుకు? స్పష్టంగా మాటలాడు కొనక? కొలుములవద్ద పనికి పూటపడుతూ వ్రాసికొన్న ఖరారునా మాసంగతి మరచిపోకు. ఏమంటావు? ఇనుము తెచ్చియిచ్చి నీమా టనిలుపుకో"—అన్నాడు.

నేను అటువైపుకి తిరిగి వారిమొగాలు చూడలేకపోయేను. ఇందాకటి కల జ్ఞాపకానికివచ్చింది.

హడావిడిగా డైరక్టరుపైచేయిజాపి నాఅంగీకారం సూచిం చేను. మిగిలినవారికి మార్గం చూపాలనే అభినివేశం కలిగింది. కాని, ఒక్కనిముషం బొగాటరీవుతో మాటలాడితీరాలి, ముందు. కనుక నన్నుకారులో అక్కడికి తీసుకొనిపొమ్మనికోరేను.

గదిలోనుంచి బయటికివస్తూనేబట్టలువేసుకున్నాను.

మేము వెళ్ళేటప్పటికి బొగాటరీవు మేలుకొనేయున్నాడు. నేను నెమ్మదిగా ఆతనిమంచందగ్గిరికి చేరుకున్నాను. నాకుకావల

సిన విషయాల్నిగురించి ఏవిధంగా అడగాలో నాకే తెలియడంలేదు. నన్ను చూచి వెనుకటిమాదిరిగా ఆతడు సిగ్గుపడక నాకేసితిరిగి వచ్చిన పనిచెప్పమన్నట్లు చూసేడు.

నేను తలవొంచుకున్నాను.

"మామయ్యా! కొండనించి ఇనుము తీసుకొనిరావడానికి పోతూన్నా."

బొగాటరీవు తనగాయాలు, నొప్పుల, విషయం మరిచిపోయి, ప్రక్కమీద లేచికూర్చుని నాభుజాలు పట్టుకొని కూర్చుండబెట్టుకున్నాడు.

"ఏమిటి అంటూన్నావు?"

ఆతనిస్వరంలోగల మార్దవం నాభయాన్నీ—సంకోచాన్నీ పోగొట్టింది. ఫరవాలేదు. ఇంక శాంతంగా వచ్చినపని చూసుకోగలను.

"ముడియినుము కొలిములకి చేర్చడానికి వెడుతూన్నా."

ఆతడు నాభుజాలమీది చేతులు తీయకుండా ఎంతోసేపు నిశ్శబ్దంగా నామొగంలోకి చూసేడు. కొంచెంసేపటికి బెరడుకట్టిన ఆపెదవులు విప్పి —"మేరియా! సన్యాకి కొంచెం వేడిటీ తెచ్చిపెట్టు"—అని పురమాయించేడు.

ఆతనిచేయి వదిలింపించుకొని సిగరెట్టు తెచ్చుకొని వచ్చేను.

బొగాటరీవుకి ఏమిమాటలాడడానికీ తోచడంలేదు. వెంటనే పక్కగదిలో ఏదోపనిచేసుకుంటూన్న లీనాని పిలిచేడు.

అందమైన పెద్దతలకట్టుగల ఒక యువతి గదిలోప్రవేశించి

వాలభివందనాన్ని తలవంపుతోగ్రహించి, డాక్టరుసలహాని అనుసరించకుండా లేచికూర్చున్న తండ్రిని కోపపడడానికి అవయిపుగావెళ్ళింది. నెమ్మదిగా అతనిని పండుకోపెట్టి నడ్డికొంచెంఎత్తి పక్కముడతలు సరిచేసింది.

"లీనా! డిపోలోని ముసిలిటర్నరులకి ఏవిధం బుద్ధిచెప్పేవో సన్యాకి చెప్పేవా?"

ఆమె నాకేసి ఎందుకో చురచురాచూసింది. తండ్రి వొంటిమీద దుప్పటీ సరిగాకప్పి తెల్లని దువ్వెనతో జుట్టు దిద్దుకొననారంభించింది.

ఆమెతలకట్టే, ఆగదికి ఒకనూతనసౌందర్యాన్నీ, జీవాన్నీ, ఇచ్చిందని నానమ్మకం. ఆఅర్థరాత్రివేళ ఆనిశ్శబ్దానికి జీవము-చలనము నిచ్చినది ఆమెజుట్టే.

ఆపెద్దతలకట్టు, వ్రేళ్ళసందులలోనుంచిదూరి, ముడిపడిన కనుబొమ్మలమీద- కదులుతూన్న పెదవులమీదుగా భుజాల్ని కప్పింది.

బయట 'హారన్' వినబడింది. వెంటనేలేచి ద్వారంకేసి వేగంగా అడుగులువేసేను. కాని, ద్వారంవరకూ వెళ్ళేటప్పటికి బొగాట లీవు ఎంతోఆదరంతో-ప్రేమతో వెనక్కి పిలిచేడు. నేను అంత వేగంగానూ వెనక్కివచ్చేను. మంచంలో పరుండే తనపొడుగు చేతులతో నామెడ కాగలించుకున్నాడు. అతనితల నాపెదవులకి తగులుతూంది. నేను నెమ్మదిగా అతనిని వదిలిపించుకొని పడుకో

బెట్టి నీలాకాశంలో నక్షత్రాలమాదిరిగా మెరుస్తూన్న ఆయువతికళ్ళ వేపుచూస్తూ ద్వారంకేసి పరుగెత్తేను.

ద్వారందగ్గిరికి వెళ్లేటప్పటికి బొంగురుపోయిన గొంతుక వినబడింది.

—"'టాపు'లకి రబ్బర్లు చూసుకో."

రైల్వేజంక్షనులోకి వెళ్లేవరకూ ఆమాటలు నాచెవులలో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

'చియాకినో' 'మౌంటెజా—జంక్షను'లో సెర్జియో—స్టారోడబు కనపడ్డాడు. స్టారోడబుకూడా డ్రైవరే. కాటుకవర్షంకురుస్తూన్నట్లుగా వుంది, చీకటి. మబ్బులతో నిండిన ఆకాశం భూమిని సమీపించి నట్లుగా కనిపిస్తూంది. ఆకటికి చీకట్లో రైలుబద్దెలూ లేదు—ఏమీ లేదు. అన్నింటికీ తెరగట్టినట్లేవుంది.

ఆచిన్నస్టేషనులో జనంచాలమంది ప్రోగుపడ్డారు. ప్లాట్ఫారం మీద్ది లాంతరుఅద్దాలమీద పడిన ప్రతివర్షపుచినుకూ—గడ్డకట్టి పోవటంవలన దీపాలు వెలుగుతూన్నా నిష్ప్రయోజనంగానేవున్నాయి. రైల్వేకూలీలంతా 'స్టారోడబు' చుట్టూచేరి ఆతనిని ఏలాగయినా బయలుదేరతీద్దామని తంటాలుపడుతూన్నారు. వాదిస్తూన్నారు, ఆతనితో.

"సెర్జీ! భయపడకు. లే."

డ్రైవరు వినిపించుకోనే లేదు.

"కామ్రేడ్! ఇల్లాచూడు.వెళ్ళకతప్పదు.కొలిములవద్ద ఇనుము

లేకుంటే ఎట్లాగమరి? చెప్పు."

'సెర్జీ' మాటలాడలేదు.

"నువ్వుఅసలు ఇంజనీరువు ఏలాగ అయేవో అర్థంకాదు. రెగ్యులేటరు పట్టుకోవడంకంటె ఎద్దులకి "తోకపుబుసు' పెట్టడానికి పనికివస్తాయి నీచేతులు."

అయినాసరే ఆతడు లెక్ఖచేయలేదు. బళ్ళవరసలెక్క_పెట్టి-పదోమారు- తలవూపేడు.

"నాకు చేతకాదు."

ఆతనిస్వరంలో పూర్తిగా అసహాయత కనిపిస్తూంది. పదిహే నుపెట్టెలతో బయలుదేరాలి, మరి. .సాధారణంరోజులలోకూడా మాడుపెట్టెలకంటె ఎక్కువవేయరు. కాని, ఇప్పుడు హద్దుబ పెట్టుగుంటూకూర్చుంటే సాగదు మూడింటికంటె ఎక్కువవేయ నంటే అక్కడ 'బంకర్ల' లో ఇనుముఏది? కొలుములు ఆగిపోవ డమేనా? నిలవచేసినది ఈరెండురోజులూ వాడేసేరు. మొన్నను ఏమి తెచ్చేరో- అదేతేవడం. మళ్ళీ ఒక్కబండీరాలేదు. పదిహేను విండుబళ్ళూ ఈడ్చుకుపోవలసిందే. ఒక్కటికూడా తగ్గించడానికి లేదు.

పల్లంఅంటే సామాన్యమైనదా? నలభై మూడు మీటర్లవాలు. స్టేషనులో నిలబడిచూస్తే బద్దెలు ఏదోఅగాధంలోకి అంతరించినట్లు కనబడతాయి. అడుగున ఎక్కడో 'మాగ్నిటోగోర‌స్కు' దీపాలు మిలమిలలాడిపోతూన్నాయి.

తీసుకుపోవలసినవి పదిహేను బరువుబళ్లు. 'స్టారోడబు' ఆలో చిస్తూన్నాడు. భయం అతని హృదయంలో ప్రవేశించింది. తగుల బడుతూన్న బళ్లు–విరిగిపడిన ఇంజను, దానిప్రక్కన ఈప్రపంచం లో తనకి అతిప్రియమైన శరీరముయొక్క శిధిలాలు, గబగబా అ తనికళ్లలో మెదిలేయి.

మంచుతో కప్పబడిన బద్దెలు దూరాన క్రింద కనిపిస్తూన్న దీపాలు, నల్లని చీకటి, చూసి అతని ప్రాణం హడిలిపోయింది.

"నేను వెళ్ళను."

ఆసమయానికి సరిగ్గా నేను స్టేషనులో అడుగుపెట్టేను. స్టేష నుమాష్టరు కాళ్ళుఈడ్చుకుంటూ నావద్దకువచ్చి ఏలాగయినా పెట్టె లు కొలుములువద్దకి లాగుకొనిపొమ్మన్నాడు.

డిపోలో అందరూ నాకంటెరెట్టింపు వయసువాళ్లేననీ, అంద రు డ్రైవర్లలోకీ చిన్నవాడిని నేనేననీ అతడెరుగును . కాని, కేవలం విరాశతో ఎవ్వరికివి అడగడానికీ కనపడక ఎంతో సందేహంతో నన్ను అడిగేడు.

బహుశా నేనంగీకరంచనని అతడు సందేహించేడు. అతని స్వరంలోని సందేహసూచనకి నామనస్సు చివుక్కుమంది....నేను మాటలాడక పూరుకున్నాను.

మనసులోనున్న ఉద్రేకం అపుకోలేక చేతిలోని సుత్తెతో టక టకా దేనిమీదనో కొట్టేను. బోరిసోవు నావరస చూసి ఆశ్చర్యపడి చేతితోనే స్టేషనుమాస్టరుకి సంజ్ఞచేసి ఇంజనుకదిపేడు.

నేను మనసులో ఆరాటపడుతూనే 'ఆటోమాటిక్–బ్రేకులు' పరిచూసుకున్నాను. ప్రతి సీలమీద రబ్బర్లు గట్టిగావున్నదీ లేనిదీ చూసుకుంటూ వుంటే నామనసులో చాలాభయంకరము–సిగ్గుపడ వలసినదియైనభావం బయలుదేరింది.

"బొగాటరీవు రబ్బర్లు చూసుకోమన్నాడే– తాను మరచిపోయి నాడాయేం? మొన్నటిప్రమాదానికి కారణం అదేనా? వెనక 'అర్మర్డు–ట్రెయిన్' పడిపోవడానికీనా?"

నాగర్విష్ఠితనానికి నేనే సిగ్గుపడి బండిలోకి పోయేను.

ట్రెయిను బయలుదేరడానికి సిద్ధంగావుంది. కొలిముఖదగ్గర ఏంజరుగుతూందోననుకుంటూ నేనుకిటికీలోంచి బయటచూసేను. పైన ఒకనక్షత్రం పడుచుపిల్ల కన్నుమాదిరిగా మెరిసిపోతూ కవ్విస్తూన్నట్లు కనబడింది. ఆభావనకలిగేక మనసు కలగబారింది. ఒక్క–నిముషంసేపు ప్రయాణం ఆపి క్రిందికిదిగుదా మనిపించింది. కాని, బోరిసోవుకళ్ళకేసి చూసి, ఆప్రయత్నం మానుకున్నాను.

నేను చెవులుఘడియలు పడేలాగ కొట్టిన కూతకి ఆలోయ, ఆసరస్సు, పర్వతాలు, మైదానం, అన్నీ మారుమ్రోగేయి.

నామనసు నిలకడ పడింది. రెగ్యులేటరు తెరిచి బండిబయలు దేరతీసేము. మళ్ళీ ఏలాగో అనిపించింది. పెద్దఅగాధంలోకి దొర్లి పోతూన్నా మనిపించింది. కాని, అంతలో గుండె దిటవుపరచు కొన్నాను. స్టేషనుబయట 'డిస్టెంటు–సిగ్నలు'స్తంభము దాటగానే రెగ్యులేటరు మూసివేసేను. వరకం ఇక్కడనుంచే ఆరంభంఅవు

తుంది.

ట్రెయిను నెమ్మదిగా పోతూంది. 'ఫిష్–ప్లేట్లు' న్నచోట దుముకుతూన్నట్లు చప్పుడవుతూంది. నేను గుండెలు–తల కిటికీ కమ్మిమీద ఆనించి బయటచూస్తూన్నాను. మంచువర్షం మొగంమీద కొడుతూంది. చెవులన్నీ కొయ్యబారి ఎర్రబడ్డాయి. ఊపిరితీయడం కూడా ఎంతోకష్టంగా వుంది. పోనీయని లోపలికి వచ్చివేయడానికి ఇష్టంలేదు. నేలకేసిచూస్తూ దానివేగం పరీక్షించాలని తలపు. బండీ ఏమాత్రమూ వేగంఅందుకోనీయడం నాకు ఇష్టంకాదు. అదేగనక జరిగిందంటే జారుడుగావున్న బద్దెలమీద జరజరా వెర్రివేగంతో పాకిపోయి. ఆగోతులోపడిపోదూ?

మూర్ఛలోనున్నవాడు పట్టుకున్నట్లు టాపునేలని గట్టిగా పట్టుకొని వదలడంలేదు. వేళ్ళక్రింద ఏదోవేడితోచింది. ఏదోఆరాటంతో హృదయం మండిపోతూవుంది. వెర్రికేక నాలుకకొసకంటా వచ్చింది. కాని, ఖాళీగావున్న రెండోచేతితో నోరునొక్కుకొని, నెత్తిటోపీ మొగంమీదికంటా లాగుకొని, కళ్ళుమంటలు మండేవరకూ రెప్పకూడా మూయకుండా అలాగే నేలకేసి చూస్తూన్నాను.

నామనసులో బెరుకు ఏమాత్రమూ మిగలలేదు. వ్రేళ్లు కొంకర్లుపోవడంచేత పనిచేయడంలేదు. టావ్ తిప్పివేసి బ్రేకులు వేయాలని వూహ. కాని, తిరగదేం? ఎవరైనా బిగకొట్టేసేరా? నేను దాని మీదపడి తంటాలుపడి కొంచెం కదిపేను. బండి గతుక్కుమంది. ఇంజను కొంచెం ఈడిగలబడింది.

బ్రేకుసిలండరు వదిలిపెట్టడానికి నాకు చాలా భయంగా వుంది. ఇంజను నాచెప్పుచేతలలోనుంచి జెసిగిపోతుందేమోనని భయం. బండి నెమ్మదిగా లోయలోకి దిగుతూంది.

నేనువదిలిపెట్టిన 'చియాకినో' స్టేషనుదీపాలుమాత్రం దూరాన కనబడుతూన్నాయి. నాకు దగ్గరలోనే మలుపు. అక్కడనే పెద్ద పల్లం. దానిక్రింద కొద్దిదూరంలోనే మాగ్నిటోస్త్రాయిలోని కొలిములు!

నాకుధైర్యం చిక్కింది. ఇంక ఇంతజాగ్రత్త అనవసరం అని పించింది. నిన్నటివంటి ప్రమాదం ఇంక జరగదనే ధైర్యం చిక్కింది. నెమ్మదిగా బ్రేకులు వదిలిపెట్టేను. బండీ ఇంతసేపూ ఈయవకాశంకోసమే ఎదురుచూస్తూందా యన్నట్లు, వేగంచిక్కిం చుకుంది. వెంటనే మళ్ళీ బ్రేకులు వేసేను. కాని, సమయందాటింది. చక్రాలు గబగబా దొర్లిపోతూన్నాయి. బండి స్వాధీనం తప్పింది.

నేల కనపడడంలేదు. తుద—మొదలులేని పెద్దమట్టిముద్ద ఏదో కంటిఎదుట జరిగిపోతూంది. నేను ఆంద్రీ—బోరిసోవు వంక ఒకమారు చూసేను. అతనిలో ఏవిధమైన ఆతురత లేకపోవడం సరికదా నాకంగారెందుకాయని ఆలోచిస్తూన్నాడు.

నాకంగారు అధికంగా అతనికి తెలియపరచడం ఇష్టంలేక మనసు నిలదొక్కుకొని, శాంతంగా బ్రేకులు సరిచేయనారంభిం చేను.

ఆంద్రీ—బోరిసోవు ఎదుట వుండడంవలన మనసు చెదిరిపో

కుండా వుంచుకున్నాను. దీనివలన అనవసరమైన ఆవేశంతో బ్రేకు లకి ఎక్కువ ఒత్తిడికలయడం, అవి కరిగిపోవడం జరగలేదు. బ్రేకు లనేవి మధ్యమధ్య నెమ్మదిగా ఉపయోగించవలసినదేగాని, వేరు గాదు.

.........కిటికీలోంచి బయట చూడడానికి లేకుండా గాలి తలని నెట్టేస్తూంది.

కొలిములు సమీపిస్తూన్నాయి. వానిమంటలు హెచ్చుతూ-తగ్గుతూ-సుడితిరుగుతూ- సరిగ్గా బండిక్రిందనున్నట్లే కనబడుతూ న్నాయి. ట్రెయిన్ నావశంతప్పి ఆమంటలలో పడిపోతూన్నట్లు పరుగెత్తిపోతూంది. కాని, ఇప్పుడుకూడా ధైర్యం చిక్కబట్టేను.

.........నేనేమాత్రమూ కంగారుపడకూడదు. టాప్ చాలా శాంతంగా తిప్పాలి. 'ప్లాట్-ఫారమ్' సమీపిస్తూన్నాము. అదిగో మలుపు. 'సెమాఫెర్' అదిగో, దానితర్వాతనే 'స్విచ్-బోర్డు'.... స్టేషను. డైరక్టరు, మానాన్న స్నేహితుడయిన గార్బజు, కొలిమి పనివాడు క్రామరింకో, అక్కడ నారాకకోసం కనిపెట్టుకొని వుంటారు. క్రామిరింకో కొలిమిపనివాళ్ళందరితోటీ ఈజనుము తెచ్చి నది నేనని చెప్పుతాడు.

స్టేషనులోకి వచ్చి సిలెండర్లు 'బుస్సు'మన్నాయి. నానరాలన్నీ బిగిసిపోయినట్లున్నాయి. ఒక్కనిముషం కుర్చీలో జేరబడిపోయేను. అంతలో సిగరెట్టుకాల్చాలని బుద్ధిపుట్టి, లేచినిలబడ్డా. ఎదురుగా నున్న బోరిసోవు భుజాలమీద చేతులువేసి —"అంద్రీ వచ్చి చేరుకు

న్నామోయి! ఆఖరికి"—అని సంతృప్తి తెలిపేను.

అతడు నావంక ఆశ్చర్యంతో చూసేడు.

"ఏమి? రాలేమనుకున్నావా?"

నేను ఇంజనుఛార్జీ వప్పచెప్పినవెంటనే బొగాటరీవును చూడడానికి పరుగెత్తేను. అతడు కిటికీకి ప్రక్కన మెత్తలమీద కూర్చుండివున్నాడు. ఆతనికళ్లు ఎంతో తేజస్సు ఒలుకుతూవున్నాయి. నన్ను చూడగానే చేయిపట్టుకొని, వెనక్కి మంచంమీదికి వాలేడు. నావార్త విన్నాక ఆతడు ఒకటిరెండుమాటలుదప్ప మారుమాట వుచ్చరించనేలేదు; ఆఉదయం.

"నన్నా! ఆటువంటి సుఖసంవాదాలు కథలలోమాత్రమే విన్నామోయి!"

నల్లభైఒకటో...

ప్రకరణం.

బోరిసు మంచంమీద నిలువునా పడివున్నాడు. పన్నెండుగంటల దగ్గరనుంచీ అదేపడక. మధ్య—మధ్యగుసక— దగ్గుమూలంగా కదులుతూన్నాడు. నేను పనిలోనుంచి రావడం సాయంకాలం పాఠశాలకిపోయి రెండు ఉపన్యాసాలు వినిరావడంకూడా జరిగిపో

యింది. నాఆనందవార్త ఆతనితో చెబుదామని నేవస్తే ఈతడింకా నిద్రలేవనేలేదు.

ఈమధ్య బోరిసు తరుచుగా కనపడడమేలేదు. ఆతనిపక్క మీదిదుప్పటీ మార్చి నెలపైగా అయినా అదిమాయలేదు. ఎప్పుడయినా ఆతడు దానిమీద పడుకుంటేనా? ఆతనిఆరోగ్యం విషయంలో నేను తీసుకుంటూన్నశ్రద్ధఅంతా బూడిదపాలయింది. ఆతనికోసం తయారుచేయించిన పాలు ప్రతిమారూ పారబోయడమే అవుతూంది. ఆతని తెలివితక్కువదనానికి నేను విచారించని రోజంటూ లేదు. కొలిమిలకి ముడియినుము తేగలవారం నేనూ—ఆతడే. అయినా ఆతనికి సంతృప్తిలేదు. ఒక్కక్షణంఅయినా ఇంజను వదలడే.

అంతా అయిపోయినిట్లు బోరిసు మంచంమీద పడివున్నాడు. ఆతనిముక్కు సన్నగా పొడుచుకువచ్చినట్లుంది. చప్పిదవుడలు పడిపోయేయి. కళ్ళు గుంటలు పట్టేయి.

నామనసుకి ఏదో భయం తట్టింది. నాపెదవులు వొణికిపోయినాయి. చిరకాలస్నేహితుడు—సోదరునివంటివాడు అయిన ఆతని మీదబడి కౌగలించుకున్నా. ఇంక ఈతడిని మాటలతో వొదలకూడదని నిశ్చయించుకున్నాను.

"బోరిసు—బోరిసు"

ఆతడు ప్రక్కకిదొర్లి శూన్యదృష్టులతో నాకేసిచూసేడు. కాని, చాలాసేపటివరకూ నన్ను గుర్తించనే లేకపోయేడు. నేవొకగ్లాసెడు

పాలుతెచ్చి ఆతని నోటికి అందించేను. అవిత్రాగివేసినాక మరికొంచెం కావాలన్నాడు. ఒకగిన్నెతోపాలు, ఇంతవెన్న—రొట్టె ఎదుట పెట్టేను.

లేచికూర్చుని గోడకి జేరగిలబడ్డాడు, ఏదోకాస్త కడుపులో పడ్డాక మనిషిలో కదలిక కలిగింది. ఆతనిలో ఆకలిపుట్టిందేయని నాకు సంతోషంకలిగింది. ఆతడు కాస్త స్తిమితపడినాక నాసంతోష వార్తలు ఆతని చెవిని వేసేను.

నేను కొద్దికాలంక్రితమే ఒక సాయంకాలపు పాఠశాలలో చదవడానికి చేరేను. పరీక్షలుజరిగేయి. స్కూలుకమిటీ అడిగిన ప్రశ్నలన్నీ నాకు వచ్చినవే. నేను చులకనగా, చెప్పివేసేను. నన్ను 'వాఙ్మయం' చదువుకుందుకు పైతరగతులకి పంపించేరు. మొదటి ఉపన్యాసంవినగానే ఫ్యాక్టొరీస్కూలులో చదువుకొన్ననాటికీ—నేటికీ చాలావిషయాలు తెలుసుకోగలిగేనని గ్రహించేను.

నేను నాపనిగంటలని సరిగ్గా విభజించుకున్నాను. ఎనిమిదిగంటలకిపైగా ఒక్కనిముషంకూడా ఇంజనువద్ద ఉండదలచుకోలేదు-మాజట్టువాళ్ళమీద నాకా నమ్మకంవుంది. మేమందరంకలిసి ఇంజను యొక్క అభివృద్ధికోసం పనిచేసి దానిని మంచిస్థితిలోకి తెచ్చేము-ఆవిధంగా ఉత్పత్తికితోడ్పడేపని ఎనిమిదిగంటలు అయిపోయిందా? ఇంక బట్టలు వేసికొనడం, వ్యాయామం, స్నానం, గోడపత్రిక—ప్రచురించడం, వీటన్నిటికీ రెండుగంటలు. భోజనానికి మూడుపూటలూ కలిపి రెండుగంటలు. చదువుకి పాఠశాలకి నాలుగు గంటలు.

మిగిలిన ఎనిమిదిగంటలూ!... నిద్ర?

ఈఎనిమిదిగంటలలో కొంతభాగం తగ్గించవలసిందే. నాలుగు గంటలయితే కష్టం. చాలదు. ఇంజను నడవలేను. నరాలు దుర్బలం అవుతాయి. పాఠాలదగ్గర ఆవలింతలు వస్తాయి. పత్రిక చెడిపోతుంది. ....పడుచువాడికి ఆరుగంటలనిద్ర చాలు. అంతే. ఆమిగిలిన రెండుగంటలూ పాఠాలు తయారుచేసుకొనడానికి ఉపయోగిస్తుంది. సెలవురోజులలో నాటకాలు, సినీమాలు చూడవచ్చును. పర్వతాలమీదికి షికార్లు కొట్టవచ్చు.

ప్రతిరోజూ రెండుగంటలసేపు ఫిజిక్సు-కెమిస్ట్రీ-లెక్ఖలకీ వుపయోగిస్తూన్నాను. భిన్నాలలో లవ-హారాలని సమచ్ఛేదంతో పరిష్కరించవలసివచ్చినపుడుగాని, వర్గమూలాలని(Square root)మరొకదానితో పరిష్కరించవలసివచ్చినపుడుగాని, బుర్రవెళ్ళక పుస్తకం మూసేసి నాస్నేహితురాలయిన 'లీనా-బోగాటరీవు'ను వెదుక్కుంటూ బయలుదేరుతూంటాను. ఆమె ఈమధ్యనే ఫాక్టొరీస్కూలులో డిగ్రీ పుచ్చుకుంది.

ఆవిడేనాకు 'ఆల్జీబ్రా' పాఠాలుకూడా చెప్పేది.

"ఒకభిన్నాన్ని హ్రస్వం చేయాలంటే దానియొక్క లవాన్నీ-హారాన్నీకూడా అపవర్తనంతో (Common factor) విభజించవలసియుంటుంది."

ఎంతకఠినమైన లెక్ఖనైనా లీనా చాలాసున్నితంగా చెప్పేది. ఆమెతో మాటలాడివెళ్లేక లెక్ఖలు గంద్రగోళపెట్టేవికావు.

మేమిద్దరమూ నాగదిలోకూర్చుండి కెమిస్ట్రీ చదివేవాళ్ళం. ఫిజిక్సులోను-కెమిస్ట్రీలోనుగల చిన్న చిన్న పరిశోధనలు సాగించే వారం. మిషన్లషాపులో ఫిట్టరుగా వుంటూన్న 'అనాటోల్-స్టెఫనోవు.' ప్రచారకదళంలోని 'కాష్కలోవు'కూడా అప్పుడప్పుడు మాతోవస్తూండేవారు.

రాత్రిపూట దీపం ఆర్పనీయడు. బోరిసు. తెల్లవార్లూ పుస్తకం చేతిలో పట్టుకొని అలాగే పడుక్కుంటాడు. తరుచుగా పుస్తకం కేసిచూడక కళ్ళువిప్పి సరంబీకేసేచూస్తూంటాడు. కర్మంజాలక మనమెవ్వరమైనా. —

—"ఏమిటోయి అలాగ చూస్తూన్నావు?"— అన్నామా —"అబ్బే! ఏమీలేదని పుస్తకంకేసితిరిగేవాడు. నిజానికి ఇతడు దేనినీ గురించి ఆలోచించడంలేదు. అతనిబాధ ఆలోచనలు ఎక్కువయ్యే గాదు. శరీరదౌర్బల్యంచేతనే.

కాస్త నిద్రపోదామనుకుంటాడా దగ్గుతెరవస్తుంది. ఊపిరితిరగక గిలగిలలాడిపోతాడు.

తెల్లవారేటప్పటికి అతనికళ్ళు త్రాగినవాడికిమల్లే వుండేవి. మొగం ఏలాగోవుండేది. కాని, ఆస్థితిలోకూడా ఇంజనుకేసి వెళ్లడం మానలేదు.

కొద్దిరోజులక్రితం మాట. ఒకరోజున మంచంమీదలేచికూర్చుని దుప్పటీమీద తలగడ్ల ఎర్రనిమరక చూసేడు. చూడడంతోచే ఇంక మనిషి స్తంభించిపోయేడు. నేను నిద్రపోతూన్నట్లు నటిస్తూ

ఇవన్నీ చూస్తూనేవున్నాను.

వణుకుతూన్న చేతులతో ఆతడు దుప్పటీలాగి కిటికీ దగ్గిరికి తీసుకుపోయి, సూర్యకిరణాలవెలుతురులో ఆమరకను పరీక్షించ సాగేడు. అయినా ఆతనికి నమ్మకం చిక్కలేదు.

నరాలపట్టులేక ఆతనిచేతులలోనుంచి దుప్పటీజారిపోయి కాళ్ళ దగ్గిరపడిపోయింది. మడతలకిపైన చెడిపోయిన ఆతనిఊపిరితిత్తుల నుంచి వెలువడిన ఆప్రవి రక్తపుమరక స్పష్టంగా కనిపిస్తూంది.

బోరిసు తలవొంచుకున్నాడు. ఆతనిపొంటి కండలన్నీ వొదు లు–వొదులుగా వున్నాయి. హఠాత్తుగా చలితగిలినట్లు వణకడం ఆరంభించేడు. ఆతనికళ్లు డోక్కుపోయినట్లుగా వున్నాయి. నేనింక ఆదృశ్యం చూస్తూ ఊరుకోలేకపోయేను. విచారంచేత–బాధచేత నాగొంతునుంచి ఒకవింతధ్వని బయలువెడలింది. గభీమని మం చంమీదినుంచివురికి చిన్నపిల్లవాడికిమల్లేవున్న ఆతని దండ దొరక పుచ్చుకొని, —"బోరిసు! బోరిసు!! ట్రిత్రాముపామా! విన్నునువ్వే తినేస్తూన్నావేం? వెంటనే మందు పుచ్చుకో. తప్పదు. ఏలాగవున్నా వో చూసుకున్నావా?"–అని అరిచేను.

ఆతడు తలఎత్తి ఏదో ఆలోచిస్తూన్నట్లు నావైపుచూసేడు. విచారపూరితాలయిన. ఆకళ్ళల్లో నీరుతిరిగింది. ఎంతో ప్రయత్నిం చేడుగాని. నవ్వురాలేదు. ఆస్వరంగూడా ఎంతోక్షీణంగా గుర్తించ రాకుండా వుంది.

"ఏమీలేదు. లేదు: నన్నా!"

'గబగదా బట్టలు మార్చుకొని అతడు వెళ్లిపోయేడు. ఈమాదిరి సంభాషణే అతనికి నచ్చడంలేదు.

మరునాడుప్రొద్దుటేకమ్యూనిస్టుయువజనకార్యనిర్వాహకసమితి ముందు 'బోరిసు—కూడల్'కు వెంటనే విశ్రాంతినిచ్చితీరాలనీ, ఏదయినా శానిటోరియంకి అతనిని పంపించాలనీ తీర్మానంపెట్టేను. ఆవిషయాన్ని బోరిసే నిరాకరించేసేడు.

ఆసభఅయినాక నేను అతని ఇంజనువద్దకి వెళ్లేను. అది 'పరమానోవు' వంతుసమయం. ఆతడుతనపని చేసుకుంటూన్నాడు. బోరిసు చేతిలో''ఒకఆయిలుకేను' పట్టుకొని, దానిని కిరసనాయిలుతో కడిగి దానిమీది మకిరి గోళ్ళతో తీస్తూ, చేతిలోయున్న పనిముట్టును క్రిందనున్న ఇనుపపట్టీమీద అద్దంమీద పెట్టినంత జాగ్రత్తగానూ వుంచేడు. ఏదయినా గీతపడుతుందేమోనని భయంకాబోలు. అతని వాలకం చూసి, చాలా విచారించేను.

నిష్కారణంగా ఇంజనుకోసం చచ్చిపోతూన్నాడు. నిక్షేపంలాంటి ఆరోగ్యం దానికోసం తగులపెట్టుకుంటూన్నాడు. అతిసున్నితమైన తనశరీరం చూసుకోనక్కరలేదు? దానిని ధ్వంసంచేసేడు. దానిలోని ప్రధానభాగాలు చితికిపోయేయి. ఇంకా ఆవిషయం గుర్తించదే.

నాకు ఒళ్లుమండింది. వాడిచేతిలోవున్న పనిముట్లు లాగుకొని పారేసి రెక్కపుచ్చుకొని 'రా'—అన్నాను. గుమ్మందాకావచ్చి అక్కడనాతో కలబడ్డాడు. మాఇద్దరికీ స్నేహంకలిసేక ఆతడు నామీద

చేయిఎత్తడానికి ఇదేమొదలు.

మేము చాలాసేపు పోట్లాడుకున్నాం. తానుచేస్తూన్న పాడు పని నలుగురితోటీచెప్పి చీవాట్లుపెట్టిస్తానని బెదిరించేను.

ఆతడు మరునాడు ప్రొద్దుటే మళ్ళీవచ్చేడు. నిన్నటి పేచీమరిచిపోయి మాటాడుకున్నాం. ఆతడు నన్ను డిపోకార్యాలయానికి తీసుకుపోయి ఒకగోడపత్రిక, కొన్ని 'పోస్టర్లు,' ఒక 'రిజల్ట్సు—బోర్డు' చూపించేడు. రెండునెలలక్రితం అతని ఇంజను నూరింట అరవై పాళ్లుమాత్రమే తనవంతుపని నిర్వహించింది. కాని, నేడు నూట నాలుగుపాళ్ళు పూర్తిచేసింది. ఆతడు తనసెక్షనులోని నాలుగుఇంజన్లని ఓడించేసేడు.

బోరిసు ఇంకోకాగితం తీసేడు. కాగితం మధ్యన ఒకసున్న. దానిలో బోరిసుఇంజనునెంబరు. ఆసున్నమీదినుంచి బయలుదేరి ఏవోవంకరగీతలు అటూ—ఇటూపోయేయి.

కొంచెందూరంలో నిలబడి నాకాగీతల అర్థం అవగతం అయ్యేవరకూ ఊరుకున్నాడు.

"అంతేలే. సున్నలో విశేషంలేదు. అదిచెరిపేస్తే గీతలన్నీ కలుస్తాయి. అది."

మేము ఇంటికి బయలుదేరేము. దారిలో తానుచేసినపని సరియైనదేనని ఒప్పించడానికి ప్రయత్నం ఆరంభించేడు.

"సన్యా! మనం అందరం వున్నామే, అను. రోజురోజుకీ క్రొత్తవాళ్లు పనిలోకి వస్తూన్నారే, యను. అయినా మనబీదతనం

ఇంకా తగ్గలేదు. చూసేవుకాదు? మనలో విపరీతమైన అస్త్ర–శక్తి వుంది. అయితేనేం మనకి యంత్రబలం తక్కువ. అందుచేతనే మనపనివిషయంలో ఏమాత్రమూ హద్దులు పెట్టుకోకూడదు."

ఆమాటలు వినేటప్పటికి నాఅరికాలిమంట నెత్తికి ఎక్కింది.

"నీకు కళ్ళున్నాయా? మూర్ఖుడా? యంత్రాలు తక్కువా? నీఉద్దేశ్యం ఏమిటి? మాగ్నిటో స్ట్రాయిలోనేనా? ఏం? జారిస్టురష్యా అంతటా ప్రోగుచేసినా నేడు మాగ్నిటోస్ట్రాయిలోవున్నన్ని యంత్రాలు లేవని ఎరగవు?"

మళ్ళీ ఇంకోమారు ఇద్దరం పోట్లాడుకున్నాం.

నలభై రెండో...

ప్రకరణం..

ఉదయం అయిదు అయిపోయేటప్పటికి అలారంగడియారం గణగణలాడుతూ లేపుతుంది. అదే నా దైనికజీవితానికి ఆరంభం. గడియారంమీది కంచుగిన్నె ఇంకా 'కంగు' మంటూవుండగానే నేను లేచేస్తాను. లేస్తూనే ప్రక్కదుప్పటీ కిటికీకి ఎదురుగా దండెం మీద పడేసి, పక్కచుట్టేసి, స్నానపుదుస్తులు వేసికొని, చల్లని నీటితోనింపిన తొట్టెలోదిగి స్నానం పూర్తిచేసుకుంటాను. స్నానం అయినాక కసరత్తు.

సంధ్యారాగంలా నాశరీరం ఇప్పుడు ఎఱ్ఱగాను-వెచ్చగాను వుంటూంది. కసరత్తు చేసుకొనగానే రాత్రి తయారుచేసివుంచిన ఒకకప్పు చల్లనికాఫీ కడుపులోపోసి పనిలోకి బయలుదేరుతాను.

కార్ఖాణం ఎత్తైన పర్వతాలమధ్య వుంది. అక్కడికి యంత్రా[illegible] పొగ సోకకుండా ఎత్తుగాపెరిగినచెట్లు, చల్లని గాలులు, కాపలాకాస్తూంటాయి.

నేను సామాన్యంగా యంత్రాలయంవరకూ నడచే పోతూం టాను. నాకు దూరపు నడకఅంటే బహుసరదా. పరిశుభ్రమైన చల్లని గాలిని అనుభవించవచ్చును. మంచి అందమైన జుట్టు, మొగ్గలలాంటిపెదవులు, వెచ్చనిశరీరమూగల ఆపడుచుతోడిపొత్తును గూర్చి, సావకాశంగా ఆలోచించుకుంటూ పోవచ్చును.

నాతోకూడా వెనకా-ముందూ అనేకమంది కూలీలు నడిచి వస్తూన్నారు. వాళ్ళనడకతీరూ, మొగాలతీరూ చూస్తే నాలాగే వాళ్ళు కూడా తమప్రియురాండ్రనిగూర్చి కలలుకంటూన్నారని తోచింది. ఇందుకోసమేనేమో వాళ్లబస్సుకాని, రైలుగాని, ఎక్కివుండరు.

నాకుముందర కొంచెందూరంలో లీనా నడుస్తూంది. నెత్తికి రంగురంగుల జేబురుమాలు ఒకటిచుట్టుకొనివుంది. కొంచెందూరం నడిచేక వేడితోచిందికాబోలు, తలగుడ్డ తీసివేసి దానితోమొగంమీద విసురుకుంటూ నలుదిక్కులూ గమనించింది. నేనూ కనబడగానే చిరునవ్వు నవ్వింది. ఆనవ్వు- అరుణోదయమే దానికి పోలిక.

ఒకరిభుజాలమీద ఒకరం చేతులు పెనవేసుకొని అననుభూత

యౌవనులమయిన మేమిద్దరము ఏవేవో చెప్పుకుంటూ వేవేగంగా నడిచిపోతూన్నాం. ఊరబెట్టిన కర్రల వాసనవేస్తూన్న ఓవరాలు తొడిగిన ముసిలి రంపపుకోతవాళ్లు వెనకబడిపోయేరు. ఎర్రని ఇనుముతుప్పుతో నిండిన బట్టలూ వాళ్లూ కొలిమిపనివాళ్లు, నల్లని దుస్తులువేసుకొన్న ఫిట్టర్లు వెనకబడిపోయేరు. మేము గభాగబా నడిచివస్తూంటే గడ్డాలు నెరిసినవారంతా దారితొలగి మాకేసి చూస్తూ నిలబడ్డారు.

"ఏమోయి! అబ్బాయి! ఆచేయి ఆమెనడుముచుట్టూ పోనీయ"—మని వారిలో ఒకడు సలహా.

కొంతదూరంవచ్చేక మేమిద్దరమూ విడిపోవలసిన చోటు వచ్చింది. లీనా నిలబడి తన చేతులు రెండూ నాగుండెలకి అని, ఆచల్లని—మెత్తనిపెదవులు నాకనురెప్పలమీద అనించి, తనషాపుకి వెళ్ళిపోయింది. ఇంజనునడపడానికి స్టేషనుకేసి నేనుబయలుదేరేను.

నేను వెళ్ళేటప్పటికప్పుడే 'అంద్రీ—బోరిసోవు' నాకోసం ఇంజనువద్ద కనిపెట్టుకొని యున్నాడు. మేము పనికి ఆరంభించే ముందు, ఇంజనులోని ప్రతిటాపును, ప్రతిభాగాన్నీ పరిశీలించి పరీక్షించి, సరిగ్గా వున్నదీ—లేనిదీ— చూచుకున్నాము.

ప్రొద్దు ఎక్కివచ్చేలోపుగానే రాత్రిపూట చక్రాలమీద పేరుకున్న నూనెమడ్డి తుడిచివేసి, నికిల్‌పూసినభాగాలకి మెరుగుపెట్టి, వార్నీషుపూయబడియున్న బండిని అద్దంలా నిగనిగలాడేటట్లు తయారుచేసేం.

కొ త్తగా అప్పుడే కంపెనీనుంచి వచ్చినట్లు సుందరంగా—గంభీరంగా వున్న మాఇంజను ఇనుముతోనిండిన పెట్టెలు లాగు కొనిపోవడానికి సిద్ధంగా నిలబడివుంది. సూర్యకాంతి దానియొక్క సౌందర్యానికి ఆకర్షించబడిపోయినట్లుగా దానిపైభాగాన తడుము తూంది.

కొంచెం ఆయాసపడినట్లుగా మేమిద్దరమూ ఆసౌందర్యానికి ముగ్ధులమై తోలుముడిచినకుర్చీలలో జేరగిలబడిపోయేము.

మావంతుసమయంలో ఇనుముతో నిండిన బరువుబళ్ళు లాగిస్తూ, ఎన్నోవేలటన్నులఇనుము అటూ—ఇటూ త్రిప్పేను. ఇంచుమించు ఏడుగంటలకాలం కన్నుఆలా తిప్పడానికికూడా వీలు లేదు. ఇంతసేపూ ఆఅగ్నిప్రవాహంవంక కళ్ళుతెరచి చూసు కుంటూ వుండవలసినదే. ఎచ్చటనైనా ప్రమాదసూచనలు కనబడి, మేస్త్రీ గంటవాయించేదంటే ఇంజనుతోసహా నేనా అగ్నిగుండం లోకి పరుగెత్తవలసిందే.

మా ఏడుగ్గంటలపనీ అయిపోయినాక తరువాతిజట్టుకి ఇంజను వప్పగింత పెట్టి, తూలితూలిపడుతూ నేలకిదిగేము. బోరి సోవు 'వెడుతూన్నా న' ని చెప్పి ఇంజనుడ్రైవర్లకోసం పెట్టిన సాయం కాలపు పాఠశాలలో ఉపన్యాసాలువినడానికి వెళ్ళిపోయేడు. నేను ఇంటికేసి బయలుదేరేను.

ఆయాసంచేత తలతిరుగుతూంది. కాస్తపొడినేల చూసుకొనికి చదికిలబడి, కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాను.

ఇంటికి రాగానే బట్టలు మార్చుకొని, స్నానపుదుస్తులు వేసుకొని, గుట్టలవెనక్కానున్న చెరువుదగ్గిరికి వెళ్ళేను. నేను కూర్చుందుకు అభిమానపడే ప్రదేశాలన్నింట జనం నిండిపోయేరు. కొంచెం సేపు ఈదుకొని, ఒకరాతిమీద క్రామవింకోను కొంచెంజరగమని చోటుచేసికొని కూర్చుండి ఒళ్ళు ఆరబెట్టుకున్నాను.

సేనుపడిన ఆయాసం నాశరీరాన్ని విడిచి లేచిపోతూన్నట్లుగా తోచింది. అక్కడా—అక్కడా కండరాలలోమాత్రం కొంచెం పట్టు పడుతూంది.

కొద్దిసేపు వ్యాయామం చేసేటప్పటికి ఆభారంకూడా తొలగిపోయింది.

ఇంకా బాగా జుట్టు తడిఆరకుండానే సాయంకాలపుపాఠశాలకి బయలుదేరేను. గుమ్మంవద్ద 'లీనా బొగాటరీవు' కనబడింది. నన్ను చూడగానే ఆమెఎంతో ఉత్సాహంతో నావద్దకువచ్చి, ఆప్యాయంతో నాభుజంమీద చేయివేసి, నాజుట్టులో చిక్కుకొనియున్న పెద్దనీటిబిందువును దులిపేసింది. మెత్తని పెదవులమధ్యనుండి తెల్లని పళ్ళుకొంచెం బయటపడుతూన్నాయి.

పాఠంవద్ద ఇద్దరమూ ఒకేచోటకూర్చున్నాము. పాఠం వింటూన్నంతసేపూ ఆమెపెదవులు తెరుచుకోలేదు. కళ్ళు తీక్ష్ణంగా వున్నాయి.

విరామసమయంలో 'క్లాసు' లోని పిల్లలం అందరమూ కిటికీలవద్ద నిలబడి పాటలు పాడేము.

మాకంఠాలు పర్వతాలకి ఎగబ్రాకి, సరస్సుమీదుగా ఫ్యాక్టొరీలు-గనులుచేరి ఎన్నోరెట్లుపెద్దగా ప్రతిధ్వనించేయి. పర్వతాలమీదనున్న బాలికలు, చెరువులలో డింగీలలోయున్న జనం, కొత్తగా నాటబడిన పార్కులలో విహారానికి వచ్చినవారు, మాపాటల్ని అందుకొని, చప్పట్లు కొట్టేరు.

ఉపన్యాసాలు అయినాక ఇద్దరమూ ఇంటికి పోయేము.

వేలకొలది నక్షత్రాలతో మిలమిలలాడుతూన్న నీలాకాశం కిటికీలలోనుంచి మాలతీతీగలమీదుగా మాగదిలోకి తొంగి, చూస్తూంది.

లీనా కిటికీవైపు నడ్డితిప్పి దీపానికి దగ్గరగా జరిగి కను బొమ్మలు ముడిచి పుస్తకంమీద మనసు నిలపడానికి ప్రయత్ని స్తూంది.

కాని, చాలాసేపు చదవడంచేత ఆయాసపడిన కనురెప్పలు అరమోడ్చి, సిగ్గుపడుతూన్నట్లు చూస్తూ —"అబ్బ! ఈవేళకి చాలు లేద్దూ!"—అంది.

నాచేతిలోని పుస్తకం తొడలమీద బోర్లించుకొని, చిరునవ్వు నవ్వేను. సాయంకాలం ఎవరెక్కువసేపు చదువుతారోనని పందెం వేసుకున్నాము మేము. కాని, ఆమె సిగ్గుపడి తలవొంచుకుంది. వెంటనే నేను పుస్తకం మూసివేస్తూ, —"మానివేద్దాం. ఈచదివినది, చాలును. లేమరి."— అన్నాను.

ఇద్దరమూ నవ్వుకున్నాం. పుస్తకాలు బల్లమీద పడవేసి, ఒకరి

భుజాలమీద ఒకరం అనుకొని బయలుదేరేము. ప్రక్కగదిలో 'మేరి యా గ్రిగరోనా' బల్లవద్ద దీపంముందు కూర్చుండి ఏవో కాగితాల కట్టలు తిరగవేస్తూంది. ఆమె తొడిగిన జాకెట్టు బొత్తాము ఊడి, గుండెల్ని బయటపెడుతూంది. గౌను వదులువదులుగా వుంది.

మేము ద్వారంకేసి రావడం ఆమె చూసింది. ఇద్దరమూ ఒకరిప్రక్కన ఒకరు నడుస్తూ చెరువుగట్టువైపు షికారు బయలు దేరడాన్ని గమనిస్తూ ఆమె వరాండాలో నిలబడిపోయింది. చాలాసేపు.

నలభైమూడో.

ప్రకరణం.

కొలిములు ఎన్నడూలేనంత విజృంభణగా మంటలు చిమ్ము తూ గర్జిస్తూన్నాయి. రోజువారీ అంచనాకంటె ఆరోజున ఎన్నోవం దలటన్నులు ఎక్కువ ఇనుము కరిగింది. తొట్టెలప్రక్క నాఇంజను నిలుపుకొని వున్నాను. కరిగినఇనుము గొట్టాలలోనుంచి తొట్టెల లోకి ప్రవహిస్తూ అరుణోదయకాంతివంటి ఎర్రనివెలుతురుతో 'ఉర ల్సులకాశాన్ని' దీపింపచేస్తూంది.

ఆరోజురాత్రి పని చాలారద్దీగా వుంది. ప్రతిఒక్కక్షణమూ ఎంతో విలువయైనదిగా కనబడుతూంది. కరిగిన ఇనుమును ఎవిమి

దేసి నిముషాలలో 'బోరింగ్– మిషన్ల'కి అందించుతూన్నాను.

తొట్టెలు ఇనుముతో నిండేయి. వాటిని నాఇంజనుతో కలి పేరు. ఈమూడుతొట్టెలు వప్పచెప్పి నావంతు పూర్తిఅయ్యేలో పుగా మరొకతోవ తిరుగుదామనే వుద్దేశ్యంతో బయలుదేరేను.

అప్పుడప్పుడే తూర్పుదిశని తెలిరేకలు తోస్తూన్నాయి. కాని, సరస్సుమీదుగా పొగమంచు తెరలు రైలుబాటమీదికి జరుగుతూ న్నాయి. ఆపొగమంచు దూదిపింజెలమాదిరిగా రైల్వేలైనునంతనీ కప్పివుంది. మావృత్తినిర్ణయం ప్రకారం ఇటువంటి వాతావరణం లో బండినిచాలా నెమ్మదిగా నడపాలి. నాకావిషయం బాగా తెలు సును. కాని, కాలంమాట? అంతవిలువయైన సమయాన్నీ వ్యర్థం చేయడమేనా? కొలుములపని అంతా నావేగంమీద ఆధారపడివుంది. అవి ఈతొట్టెలకోసం ఎదురు చూస్తూన్నాయి.

మార్గం అంతా సరిచూడబడినదే. నాబండి 'గంయ్'మని పెద్ద గా ఈలకొడుతూ ఆపొగమంచుతెరలని చీరుకుంటూ, పోతూంది. హఠాత్తుగా ఇంజను ఏకారణంచేతనో మరీవేగంగా పోతూన్నట్లు గ్రహించేను.

పల్లంలోకి దిగుతూన్నామా? లేదు. ముందుమలుపులోనుంచి కాదూ పల్లం?

పెట్టెలతో సంబంధం విడిపోయిందికాబోలు ననుకున్నా.కాని, ఏమిచేసేది. చేయి దాటిపోయింది,

పర్వతాలలావున్న పెట్టెలు 'బఫర్ల' మీద ధమ్మున మోదు

కున్నాయి. ఇంజను ఫిరంగిగుండులా పల్లంలోకి పోతూంది.

ఆఅదురుకి దీపాలు ఆరిపోయేయి. నేను బొగ్గుగుట్టలమీద వెల్లకితలా బడ్డాను. చేతివేళ్ళు నలిగేయి. నేను ఆచీకటిలోనే బ్రేకులకోసం చేతులు జాపేను. కాని, అవిదొరకలేదు.

వెంటనే భయంతో బోరిసోవును పిలిచేను.

"ఆంద్రీ! నీరుసంగతిచూడు. త్వరగా."

పోరింగ్‌మిషన్ల దగ్గిరికి వచ్చివేసేం. అక్కడితో ఆబద్దెలు ఆఖరవుతాయి. అక్కడతో 'సైడింగ్' ఆరంభంఅవుతుంది. వచ్చేసేం. ప్రవాహంక్రిందనున్న తొట్టెల్ని తోసివేసుకొని, 'క్రేను' యొక్క కొంకీలు విరిచేసి, స్తంభాలు- దూలాలు మెరితిప్పేసి, కొలిముల‌కీ,పోరింగ్- మిషన్లకీ చాలారోజులదాకా పనిలేకుండా చేసిపారేసేలాగవుంది, నాఇంజను.

బోరిసోవు పలకలేదు. నేనే తలఎత్తేను. ఆచీకటిలోనే ఇనప బద్దెలు పట్టుకొని దేకి, నెమ్మదిగా బ్రేకులుదగ్గిరికి చేరేను. వాటిని ముట్టుకొనేటప్పటికి చేతులు చుర్రుమన్నాయి. -"ఎందుచేతచెప్మా? నాబండికి మంచి 'ఆటోమాటిక్-కప్లింగు'లుండాలే" -అనుకుంటూ వెర్రిబలంతో బ్రేకులుపయోగించేను.

అంతూ-పొంతూలేవి ఆగాధంలోకి ఎక్కడికో పడిపోతూన్నా ననిపించింది.

..................నాకుస్మృతి రాగానే చుట్టూకనబడిన స్నేహితులని అడిగిన మొదటిప్రశ్న-"అలా గెందుకు జరిగింది."

నాప్రశ్నతో 'ఆంద్రీ–బోరిసోవు' మొగం జేవురించింది. ఎవరి మీదికో ఉరుకుతూవున్నట్లు ఆవేశంతో లేచినిలబడ్డాడు.

"బందీకదిలేక "రొయ్యపీతగాడు బ్రెయినుతో సంబంధం తప్పించేడు నీటండి కూలదోయడం కోసం."

"రొయ్యగాడు? రొయ్యపీత?"

"సనూ! ఆరోగ్యం త్వరగా సంపాదించు, వాడిని విచారణ చేయబోతూన్నారు. ఆకేసులో ప్రధానసాక్షివినీవే. నీకోసమే అంతాఆగింది."—అది బోరిసుగొంతుక అనుకున్నాను. కాని,కాదు. ఆమాటలాడినది బొగాటరీవు.

నాఆరాటం తగ్గింది. నాపొరపాటవలన ఆప్రమాదం జరగ లేదనే విషయం తెలుసుకున్నాక కలిగిన మహదానందంతో వారం దరినీ కౌగలించుకోవాలన్నంత ఉత్సాహం కలిగింది.

"ఆయితే, బోరిసు ఏడి? పనిలోకి పోయాడనుకుంటాను. అబ్బ! ఎప్పుడూపనే."

అక్కడనున్నవారంతా నాప్రశ్నకి సమాధానం చెప్పక తల వంచుకొని వెళ్ళిపోయేరు.

ఆతనినిగురించి అడుగుతే వారెవ్వరూ ఎందుకు సమాధానం చెప్పలేదో నాకు తెలియదు.. నాకు ఆశ్చర్యమే కలిగింది.

గదిలో చిందరవందరగా పడివున్న సామానంతా హడావిడిగా సర్దేసి మేరియా చిన్నపిల్లవాడికి తినిపించినట్లుగా ఎర్రని ఆపిలు పండు నోటపెట్టింది

.........సరిగ్గా రెండువారాలకి మంచం వదిలిపెట్టేను. నాగా యీలు మానేయి. హాస్పిటలునుంచి ఇంటివరకూ దిగబెడతామన్న వారిని వద్దని చెప్పి కాలినడకనే బయలుదేరేను. ఏవిధమయిన సూచనా ఈయకుండా ఇంటికివెళ్లి బోరిసును దంగుపరచాలని వూహ. నారాకకి అతడు చాలా సంతోషిస్తాడు. నాకుతెలుసును. కాని, ఆతడు నన్ను విచారంలోముంచి. అదృశ్యుడైపోయేడని నాకేమితెలుసును?

గదిలోకి వెళ్ళడంతోటే అతనిని కౌగలించుకొని, ఒకచోట కూర్చోబెట్టి వెనకటిసంగతులన్నీ ఆమైదానాలు-కమ్యూనుయొక్క తెల్లనిభవంతి-ఆరాతిసింహాలు, మాప్రథమస్నేహం- జ్ఞాపకంచేసు కుంటూ ఆరోజు కులాసాగా వెళ్లదీయాలనీ. భావించుకుంటూ గదికి చేరేను.

తలుపులు మూసివున్నాయి. నిరుత్సాహంతో ద్వారంవద్ద నిల బడ్డాను. —"అప్పుడే ఇంజనుకోసం పోయేడా? ఒక్కనిముషం కూర్చోడుగదా?"—అనుకుంటూ, ప్రక్కయింటిఆవిడను సమీపించి, "బోరిసు పనిలోకి పోయి చాలాసేపుఅయిందా?"— అని అడిగేను. ఆమె కళ్ల నీరుపెట్టుకొని నాకేసి ఆశ్చర్యంతో చూసింది. అటు తరువాత విచారదృష్టులతో వీధివైపుచూస్తూ —"అవును. ఆతడు పోయి చాలారోజులే అయింది. వాళ్లంతా ఆతనిని మోసుకు పోయేరు."—అంది.

.........గంటలతరబడి ప్రపంచం ఎరగకుండా అలాగే మంచం

మీద పడివున్నాను. నాకు కాలం గుర్తు తెలియలేదు. చీకటిపడుతూంది. ఒకమూల పరుపులేని ఆతనిమంచం వాల్చివుంది. ఒక చిలకకొయ్యని పాములాగ మెలికలుపడి ఆతనిచొక్కా వ్రేలాడుతూంది. ఆహా! ఆతడున్నప్పుడు ఆచొక్కా ఎంత అందంగా మెరిసేది?

అడుగడుగికీ ఆతనినే జ్ఞాపకంతెచ్చే ఆగదిలోవుంటే విచారంతో ఉక్కిరి—బిక్కిరిఅయిపోతానేమో ననిపించింది. వెంటనే ఉరల్‌నదీతీరానికి బయలుదేరేను. ఎత్తుగాపున్న పోతగట్టువెంబడినే నడుస్తూ, పరిచితములయిన బోరిసుయొక్క ఇంజనుకూతలు విన్నాను. ఆకూతలు నన్నుపిలుస్తూన్నాయా అనిపించింది. వెంటనే దానిని చూడడానికి స్టేషనువైపు బయలుదేరేను. నావూహ ఏమిటంటే—బోరిసుపోయేక దానిమొగం చూసేవారు ఉండరనీ, బూడిద కొట్టాడుతూ, మడ్డివోడుతూ వుంటుందనీ, వూహించేను.

కాని, అది బోరిసు వున్నప్పు డేలాగవుండేదో అంత శుభ్రంగానూ వుంది. బోయిలరు మెరసిపోతూంది. ఇంజనుయొక్క అన్నిభాగాలు మిలమిలలాడుతూన్నాయి.

నామనసులోని విచారాన్ని మరచేటందుకై జనమధ్యాన తిరగడం ఆరంభించేను. వాళ్ళలో బొగాటరీవు కనపడ్డాడు. ఆతడు ఆరోజుననే పార్టీకి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు.

నన్నుచూడగానే బొగాటరీవు నవ్వి నాచేయిపట్టుకొని డిపో గోడకి అంటించిన పెద్దపోస్టరు దగ్గరికి తీసుకువెళ్లేడు.

ఆగష్టు. ౮. న- ఈవేళనే

# మాగ్ని టోగోరస్కీరుబు

నెం 20, 100, 2455, ర. మొదలగు ఇంజనుడ్రైవర్లు
పార్టీలోకి తీసుకోబడతారు.

విదేశీఇంజన్లని బాగా నడిపించగల మాత్రిగేడులోని వారంతా మీటింగుకి వచ్చేరు.

బొగాటరీవు పొడుగుపాటి ఒకబల్లవెనక నిలబడి కళ్ళజోడు మీదినుంచి సమావేశంలోనివారిని పరీక్షగా చూసి, చేతిలోయున్న నాదరఖాస్తును గాలిలో వూపుతూ మాటలాడడం ఆరంభించేడు.

"కామ్రేడ్స్! ఇదిగో ఒక ఇంజనుడ్రైవరు ఇచ్చినదరఖాస్తు. ఈదరఖాస్తుదారుడు తన జీవితచరిత్ర వ్రాసుకుంటూ తాను దొంగ తనాలు చేసుకొని, జీవించేవాడిననీ, 'కొకెయిను' పీల్చేవాడిననీ, జైలుకు ఎన్నోమార్లు పోయివచ్చేననీ, వ్రాస్తున్నాడు."

సభ్యులంతా నేలమీద చూపులు నిగుడ్చి వింటూ కూర్చున్నారు. తెరచివుంచిన కిటికీలోంచి ఇంజనులకూతలు వినిపిస్తున్నాయి. గోడని తగిలించిన పోస్టరు గాలివిసురుకు తటతటాకొట్టుకుంటూ సభ్యుల మనస్సులకి కొంచెం ఆలోచనావిరామం కలుగచేస్తూంది.

'గార్కుష్' అనే ఇంజనుడ్రైవరు గంభీరంగా లేచినిలబడ్డాడు. తిన్నగా బల్లదగ్గిరికి నడిచివెళ్లి చొక్కాకి బొత్తాలు బిగించి, నెరిసినతల విమురుకుంటూ, సావకాశంగా సంభాషణ సాగించేడు.

"నేను సోవియట్లు వచ్చేక పదిహేను ఏళ్ళనుంచి డ్రైవరుగా పనిచేస్తూన్నాను. అంతకుపూర్వం ఒకపాతికఏళ్ళకి పైగా డ్రైవరుగానేవున్నాను. ఆముప్పైయ్యేళ్ళకాలమూ నేనూ దొంగతనాలు చేసినవాడినే. డిపోలోనుంచి చేతికి దొరికినదల్లా ఎత్తుకుపోయి అమ్ముకొనేవాడిని. ఇంజనులోకి తెచ్చినబొగ్గు, ఇతరకలప, దాచేసి నేను వాడుకున్నంత వాడుకొని, మిగిలినది అమ్ముకొనేవాడిని. కాని, అలాగచేసినందుకు నాకేమీ సిగ్గుపడ పనిలేదు. ఏమి? ఎందుకు సిగ్గుపడాలి? నాకడుపు దహించుకుపోతూండేది. నాకుసాయం ఒక పెద్దసంసారం. రైల్వేకంపెనీ కుడిచేత్తో ఇచ్చినజీతం ఎడమచేతితో తీసుకొనేది. నేను ఉండడానికంటూ ఇచ్చిన ఇంటికి అద్దెపేరుచెప్పి కొంత, దీపము–నీటిసప్లయి పేరుచెప్పి కొంత, లాగివేసేవారు. అటువంటప్పుడు నేను దొంగని అనడానికి ఎవరికి గుండెలున్నాయంటాను. ఎవ్వడూ అనలేదు. కాని, ఆదొంగతనం ఇప్పుడు మాత్రం ఎందుకు చేయకూడదు? దీనికి సమాధానం చిన్నకుర్రాడు కూడా చెప్పగలడు. ఎంతతెలివితక్కువవాడూ తనదితాను ఎత్తుకుపోవడానికి యత్నించడు!"

బొగాటరీవు దీనికేమీ సమాధానం చెప్పలేదు. 'గార్కుష్' తరువాత నాతోడిపనివాడయి 'ఫెదొరోవు' లేచేడు.

"నేను ఏపార్టీకీ చెందను. నాకు సన్యాతో ఏడాదిపైగా పరిచయం వుంది. ఇంజన్లనుగూర్చిన ప్రతివిషయమూ నేర్చుకొనడంలో ఆతడుచూపిన పట్టుదలకీ–నాయసమర్థతకీ తరుచుగా విచార

పడుతూంటాను.

ఫెదొరోవు తరవాత 'అంద్రూషా బోరిసోవు' లేచి చాలా ఉద్రేకపూరితంగా మాటలాడేడు.

"కామ్రేడ్స్! నేనిచ్చటికి వచ్చినప్పటికి ఒకమామూలు కూలి వాడినే. కాని, అటువంటివాడిని నేనిప్పుడు ఇంజనుడ్రైవర్ల పరీక్షకి కూర్చోబోతూన్నా. ఈచలువఅంతా సన్యాదే. అతనీవిషయంలో నాకు చేస్తూన్న సహాయం సామాన్యంకాదు".

బోరిసోవు మాట పూర్తికాకుండానే 'గార్కుష్' చేయిఎత్తి —"ఇక్కడనున్నవారము అందరమూ నిన్ను పార్టీలోకి పంపుతూన్నాము. సన్యా! తెలివిగా పనిచేయి!"—అన్నాడు.

కమ్యూనిష్టు యువజనసంఘం కార్యదర్శి, డిపోప్రధానాధికారి, ఒకడ్రైవరు, ఇంకా కొందరు అసిస్టెంట్లు బల్లవద్దకివచ్చి వరసపెట్టి మాటాడుతున్నారు. వాళ్ళుచెప్పేవి వినటానికి సరదాగానే వుంటుంది. కాని, అన్నిపొగడ్తలూ వింటూ కూర్చోడం చాలాబాధ అనిపిస్తుంది. కాని, ఆఖరుదాకా వుండకతప్పదు. అక్కడి పద్ధతి అది. ఈవేళ నావంతు వచ్చింది. రేపు ఒకడిని గురించి నేను ఈలాగే మాటాడ వలసిరావచ్చు.

బొగాటరీవుకి తనకళ్ళజోడుకో నిమిత్తం లేకపోయిందనుకుంటాను. వాటిని వ్రేలికి తగిలించి ఊరికే తిప్పుతూన్నాడు. మధ్య మధ్య చెవికి తగిలిస్తూంటాడు. గ్లాసుమీద టకటకలాడిస్తూంటాడు. ఒక్కనిముషం శాంతంగా నోరుమూసుకొని, కదలకుండా వుందా

మని ఊహిస్తూంటాడు.

ఇంతలో ఎవ్వరో—"వోటుకి పెట్టండి" అని అరిచేడు.

బొగాటరీవుకి ఆసమయంలో తాను చేయవలసినపని అవగతం అయింది. వోటింగుతీసుకొనేముందు పార్టీమెంబర్లుమాత్రమే వోటు చేయవలసియుంటుందని చెప్పడం మరిచేడు. నిబంధనలకి వ్యతిరేకంగా పార్టీలోలేనివారు, కమ్యూనిస్టుయువకులు, అందరూకూడా తమతమ సమ్మతులనిచ్చేరు.

నక్షత్రాలుగో...

ప్రకరణం...

వారంనాడు సెలవురోజు వచ్చినప్పుడల్లా లీనా-నేనూ 'హాట్-సరస్సు' నదివొడ్డున పర్వతాలలో దేవదారుతోటలలో కట్టబడిన శానటోరియానికి షికారుపోయేవాళ్ళం.

తెల్లవారకుండానే ఆమెను లేపేను. ఇన్నిపూవులు ఏరితెచ్చి నిద్రపోతూంటే ఆమెమీద చిలకరించేను.

ఉదయాన్నే మంచుతో తడిసిన ఆమైదానంలో ఒకరిప్రక్క ఒకరం నడిచిపోతూన్నాం. మంచుబిందువులు చిరుచలి కలిగిస్తూన్నాయి. వేసవిదుస్తులలో 'లీనా' నీలారుణమైన సూర్యోదయ సమయాకాశంమాదిరిగా కళ్ళు మిరుమిట్లు గొలుపుతూంది. ఆసౌంద

ర్యానికి ముగ్ధుడనై ఆమెనుకౌగలించుకున్నా. అసన్నవివలిపెం లోనుంచి బయటికిచిమ్ముతూన్న ఆమె శరీరపువేడికి మైకం గమ్మినట్లయింది.

లీనా పరవశతతో

"జీవితం ఎంతసుఖదాయకం."—అంది.

మేమిద్దరమూ కొండకొమ్ముకి చేరుకొనేటప్పటికి సూర్యోదయం అయింది. సరస్సు దగ్గిరికి వచ్చేక నీటిలోకి మొగ్గలువేస్తూ ఉరకడం నేర్పుతానంది.

"కండరాలు బిగపట్టు. శరీరంఅంతా రాయిమాదిరిగా బిగించు. ఇప్పుడు దుముకు. సై."

రెండుచేతులతోటీ వేణినో పట్టుకున్నట్లుగా పిడికిళ్ళుబిగించి లీనా 'సై' అనగానే ఒక్కగంతువేసేను. నీటిలోకి కదుతూన్నప్పుడు చలనంలేని ఆనీటిలో పర్వతాలయొక్క నీలాకాశంయొక్క ప్రతిబింబాల్ని చూసేను. బోరిసోవు, బొగాటరీవు, వగైరాలంతా దూరంగా నిలబడి చూస్తూన్నారు. వారిచేతులలో చెరువులో అప్పుడేపట్టుకొన్న 'క్రషియన్' చేపలు మిలమిలా మెరిసిపోతూన్నాయి.

విశ్చలంగావున్న సరస్సునీటిని చీరుకొని కొంతదూరం అడుగుకి వెళ్లేను. గట్టుమీద నిల్చున్న లీనా —'పెభాష్'—అంది. చేపలుపట్టేవాళ్లు గేలాలు వదిలిపెట్టి చప్పట్లుకొట్టేరు.

జనం అంతా నేను గెంతడంచూసి ఆనందిస్తూన్నారు.

నేను నీటిలోనుంచి మళ్ళీ గట్టుఎక్కి లీనావద్దకు వచ్చేను.

తొడలనిండా చారికలుపడ్డాయి. నాగుండెలమీద నీటిబిందువులు మెరుస్తున్నాయి. లీనా నాకాళ్లదగ్గిరకూర్చుండి తన కళ్ళలోని ఆనందాన్ని కప్పిపుచ్చడానికై తలవంచుకొని నాకండరాలమీద వెచ్చనిచేతులతో రుద్దుతూంది.

"సన్యా! సన్యా!"

సాయంకాలం అయింది. మేము ఇంకా పర్వతాలమీదనే వున్నాము. నక్షత్రాలతో నిండిన నీలాకాశం మాదిరిగా దూరాన మాగ్నిటోగోరస్కులోయ కనబడుతూంది. బ్లాస్టుఫర్నేసులలోని మంటలు నీలమేఘాలలో ప్రతిబింబించి సూర్యోదయభ్రమ కలిగిస్తూన్నాయి. మేము రాతిబండలమీద కూర్చున్నాం. చంద్రుడు మామీద తెల్లని కాంతివర్షం కురిపిస్తూన్నాడు.

ఎన్నియుగాలయినా అలాగే కూర్చోవాలనిపించేప్రదేశం అది.

జనసమ్మర్దంగావున్న బీచివొడ్డునే నడిచి మేము శానటోరియంలోకి వచ్చేము. ఒండొరులమెడచుట్టూ చేతులువేసికొని కళ్ళలో అంతరికానందం ప్రతిబింబిస్తూండగా నడిచిపోతూన్న మమ్మల్ని చూసి జనం నివ్వెరపడ్డారు.

రాత్రి మామాటలకి విడిపోవలసిన సమయం వచ్చినపుడు లీనా తనచేతితో నాజుట్టు దువ్వుతూ కళ్ళుఆరితెరిచి —"సన్యా! ఇంకముందు నేను కొండలమీదికి షికార్లు రాకూడదు"— అంది.

మొదట్లో నాకామెమాట అర్థంకాలేదు.

ఆమె నామీదికి వొంగి. తనపేదవులు నాచెవిచెంత

చేర్చింది.

"సన్యా! మనకు పుట్టబోయే పిల్లవానికి నాకంటె ఎక్కువగా ప్రేమించాలిసుమీ."

లీనా ఆమాటలు అంటూనే ఒక్క ఉరుకులో గదిదాటి చలవ రాతి మెట్లమీదుగా శానటోరియంలోని 'స్త్రీశాఖ' లోకి వెళ్ళిపోయింది.

నేను మగవారిభాగంలోకి బయలుదేరేను. ముసలిబొగాటరీవును నాకొత్తస్నేహితుడయిన కోల్యాబొగాటరీవును, కౌగలించుకున్నా. అద్దంలో నారూపం పదేపదే చూచుకున్నా. పరుపుమీద దొర్లేను. 'రేడియో' ఊరుకుంటే బాగుండుననిపించింది.

శానటోరియంలో జనం అంత నిద్రాప్రయత్నాలు చేస్తున్నారు. నేను గార్బుజుకోసం బయలుదేరేను. నన్ను చూడగానే అతడు నాచేయి తనచేతులలోకి తీసుకొని నవ్వేడు.

"అర్థం అయింది. నాయనా! మంచిది; సుఖపడు. వెళ్ళి పడుకో."

# విశ్వసాహిత్యమాల.

## ము ం గ ం డ.

అంబాజీపేట, తూ. గోదావరి.

ఆంధ్రభాషలో అతిచౌకలో ఉత్తమోత్తమము లయినరాజకీయ గ్రంథాలను ప్రకటించే గంథ్రమాల ఇదిఒక్కటే.

| | |
|---|---|
| * 1. టాల్‌స్టాయి. | 0—3—0 |
| * 2. హిందూదేశము: | |
| క్రైస్తవ ప్రభుత్వనిర్మాణ తత్వము | 0—8—0 |
| 3. ఇటలీ. | 0—4—0 |
| * 4. ఫాసిజం: కమ్యూనిజం: స్త్రీలు | 0—4—0 |
| * 5. సందేశం. | 0—2—0 |
| ‡ 6. మార్క్సుఉపదేశాలు. | 0—6—0 |
| 7&8. సోషలిజంఎందుకు? | 1—0—0 |
| 9. నారష్యాయాత్ర. | 0—8—0 |
| 10. సోవియటు కమ్యూనిజం. | 0—6—0 |
| ‡ 11. రష్యావిప్లవం. | 0—6—0 |
| 12. లెనిన్‌ఉపదేశాలు. | 0—6—0 |
| 13. పారిస్‌కమ్యూన్ | 0—6—0 |
| 14. నాడు–నేడు. | 1—4—0 |
| 15. సమిష్టివ్యవసాయ పద్ధతి | 0—1—0 |

* ప్రతులులేవు.

‡ నిషేధించబడింది.

# విశ్వసాహిత్యమాల.

పుస్తకములు ఈ క్రిందిచోట్లదొరకును.

| | |
|---|---|
| వెంకటగిరి: | బీరంరామనాథం. న్యూస్ఏజంటు. |
| తెనాలి: | సామల శీతారామయ్య. ,, |
| గుంటూరు: | డాక్టరు N. V. శాస్త్రి. క్షీరసముద్రం ఫార్మసీ (బ్రాంచి), మెయిన్ రోడ్డు. |
| ఏలూరు: | నేషనల్ న్యూస్ మార్టు. |
| రాజమండ్రి: | శ్రీనివాస్ పబ్లిషింగ్ హౌస్. |
| కాకినాడ: | డాక్టరు M. V. వీరయ్య. గాంధినగరం. |
| హైద్రాబాదు: | శారదామందిరం, సుల్తాన్ బజార్. |
| సికింద్రాబాదు: | శ్రీరామా బుక్‌డిపో, 4000, మార్కెటువీధి. |

# నవశక్తి.

(ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పత్రిక)

## బెజవాడ.

కార్మిక — కర్షక సమస్యల్ని శాస్త్రీయంగా— వివరించే ఉత్తమ వ్యాసాలతో—

ప్రపంచపరిస్థితుల్ని భారతీయస్వాతంత్ర్యవిప్లవోద్యమ వివరాల్ని, వివరించే చక్కని రచనలతో—

ఘాటైన సంపాదకీయాలతో—

ఆంధ్రంలో వెలువడే—సోషలిస్టు వారపత్రిక ఇది ఒక్కటే.

చందా ఏడాదికి 3—0—0

విడిప్రతి 0—1—0

---

# "The National Front"

**65. E. Girgaon Road - - BOMBAY.**

ఆంగ్లభాషలో — వెలువడే మార్క్సిస్టు వారపత్రిక.

చందా ఏడాదికి 4—0—0

6 నెలలకి 2—0—0

---

# "The New Age"

**270, Triplicane High Road - MADRAS.**

ఆంగ్లభాషలో — వెలువడే మార్క్సిస్టు మాసపత్రిక.

చందా ఏడాదికి 1—8—0

విడిప్రతి 0—2—0